# బడదీదీ

[ శరత్ బాబు ]

అనువాదం:

నీలకంఠం

శరత్ గ్రంథమాల, విజయవాడ

# బడదీదీ

ఈ పృథ్విలో రెల్లుగడ్డిలాంటి మనుష్యులు వున్నారు. వాళ్ళు గప్పున మండగలరు, చప్పున చల్లారగలరు. వాళ్ళ వెనకాల ఒకమనిషి ఎంతో అవుసరం. ఎందుకంటే అవుసరం వున్నప్పుడు కొంత రెల్లు ప్రోవుచేసి యిచ్చేందుకు.

కుటుంబంలోని స్త్రీలు దీపారాధన చేసేప్పుడు మట్టి ప్రమిదలో నూనె, వత్తివేసి, దానికితోడు ఒక పూచికపుల్ల కూడా వేస్తారు. దీపకాంతి తగ్గుతున్నప్పుడు ఆ పూచికపుల్లతో వత్తిని కొంచెం పైకి జరుపుతూవుంటారు. ఆ పూచికపుల్ల లేకుంటే—నూనె వత్తీ, వున్నప్పటికీ దీపం వెలగదు.

సురేంద్రనాథుని ప్రకృతికూడా సరిగ్గా యిటువంటిదే! అతనిలో బలం, బుద్ధీ, ఆత్మవిశ్వాసం అన్నీ వున్నయ్! కానీ ఏ పనికూడా వంటరిగా పూర్తిచేయలేడు. ఏ విధంగా కొంత పనిని ఉత్సాహంగా చేస్తుంటాడో. ఆవిధంగానే, మిగిలిన పనిని నీరసంగా వదలి వూరికే కూచుంటాడు–అటువంటప్పుడు ఆ పని పూర్తిచేయమని పురికొల్పేందుకు అతనికి ఒక మనిషి అవుసరం.

సురేంద్రుని తండ్రి దూరదేశమైన పడమటిదేశంలో వకీలు పనిచేస్తున్నారు. బెంగాలుదేశంతో ఆయనకు యెక్కువ పరిచయంలేదు. అక్కడే సురేంద్రుడు తనఇరవయ్యోయేట, తన స్వంతశక్తితో కొంతా. సవతితల్లి బలవంతాన కొంతా ఎం.ఎ. ప్యాసయ్యాడు. ఈ విధంగా తన సవతితల్లి ప్రోద్బలం

కలిగిస్తూ అతన్ని అంటిపెట్టుకొని వున్నా —తనకు కూడా కొంత స్వతంత్ర శక్తివున్నదా ? లేదా ? అని తెలుసుకోలేక పోయేవారు. సురేంద్రుడనే పేరుగల స్వతంత్రజీవి ఈ జగత్తులో వున్నాడా......? అంటే లేదు- ఈ సవతితల్లి వాంఛలే ఒక మనిషాకారం ధరించి, పని పాటలూ - తిండీ - తిప్పలూ చదువూ- -సంధ్యలూ, పరీక్షలు ప్యాసవడమూ మొదలైనవన్నీ చేయిస్తూంది. ఈ సవతితల్లి తన సంతాన విషయంలో కొంత ఉదాసీనంగా వున్నప్పటికీ, సురేంద్రుని మాత్రం, అంతులేని అదుపులో వుంచుతూ వుంటుంది. చివరకు ఉమ్మి వేయడం దగ్గడంకూడా ఆమెను అతిక్రమించి జరిగేదికాదు. ఈ కర్తవ్యపరాయణి అయిన స్త్రీ శాసనాల్లో వుండి, సురేంద్రుడు వూరికే చదువూ సంధ్యలు నేర్చుకున్నాడు. కాని, ఆత్మనిబ్బరాన్ని మాత్రం నేర్చుకోలేదు. అసలు తన మీద తనకే నమ్మకంలేదు. ఏపనన్నా తనవల్ల సర్వాంగ సుందరంగా నెరవేరుతుందనే విశ్వాసంకూడా లేదతనికి? ఎప్పుడు యే వస్తువు అవుసరమో ! ఎప్పుడు యేం చేయాలో! అందుకు కూడా ఒక మనిషిమీద ఆధారపడి వుండేవాడు. ఒక్కొక్కప్పుడు తనకు నిద్రవస్తుందో లేదో ఆకలివేస్తుందో—లేదో యీ సంగతికూడా తెలుసుకోలేక పోయేవాడు. అతనికి వూహ తెలిసినప్పటి నుంచీ, ఈ పదిహేనేండ్ల వరకూ...సవతితల్లిమీద అధారపడి వున్నాడు. అందువల్ల అతని పనులు యెన్నో చేసిపెడుతూవుండవలసివచ్చేది. యిరవైనాల్గుగంటల్లో యిరవైరెండు గంటలు తిరస్కారమూ, అనురాగమూ, తిట్లూ, దీవెనలూ—మాలతి విరు

పులు మొదలైనవి యెన్ని వున్నప్పటికీ, యింకా పరీక్షలకు సంవత్సరం ముందునుంచే రాత్రంతా మేలుకుని వుండడానికి ఆమె నిద్రసుఖంకూడా వదులుకోవల్సివుండేది. యింకొక రైతే సవితిబిడ్డకు యిన్ని సేవలు ఎవరు చేస్తారు. యిరుగు పొరుగువారు ఆమెను ఎంతో మెచ్చుకునేవాళ్ళు.

సురేంద్రునిమీద ఆమెకున్న ఆంతరంగికమైన ప్రేమలో, లోపం జరిగేదికాదు. తిరస్కారాలూ, తిట్లూ దీవెనలు అయాక, సురేంద్రుని కళ్ళూ ముఖం యెర్రబడిపోయేవి. సవతితల్లి అది జ్వరానికి పూర్వలక్షణమని గ్రహించి మూడు రోజులవరకూ సగ్గుజావ కాసి యిచ్చేది. మానసిక ఉన్నతీ-శిక్షా, దీక్షల్లో ఆమె యింకా తీవ్రమైన దృష్టితో వుండేది. సురేంద్రుని వంటిమీద పరిశుభ్రమైన బట్టలుగాని, ప్రస్తుత కాలాని కనుగుణ్యంగా వుంటున్న దుస్తులుగాని కనపడగానే, అతనికి షోకులు కావాల్సివచ్చాయని, బాబుగారిలా వుండా లనుకుంటున్నాడని తలచి, అప్పటి కప్పుడే, రెండు మూడు వారాలవరకూ చాకలికి బట్టలు వేయడం మానివేసేది.

ఈ విధంగా సురేంద్రుని రోజులు నడుస్తున్నయ్! యిటు వంటి స్నేహపూర్వకమైన శిక్షణలో పెరుగుతూ వుండ డంవల్ల, అప్పుడప్పుడూ — అతని మనసులోజీవితంమీద విరక్తి కలిగేది. అయినా ఒక్కొక్కప్పుడు అందరూ యిలాగే జీవిత ప్రభాతాన్ని గడుపుతున్నా రేమో ననుకునే వాడు. కాని మధ్యలో అప్పుడప్పుడూ ఆ చుట్టుప్రక్కలవాళ్ళు అతడి వెంటబడి, అతనిబుర్రలో కొన్నిరకాల అభిప్రాయా లను ఎక్కించే వాళ్లు.

ఒకరోజున అదే జరిగింది. ఒక స్నేహితుడువచ్చి—"నీలాంటి బుద్ధిగల కుర్రాడు విదేశాలకు వెళ్ళి చదువుకున్నట్లయితే. భవిష్యత్తులో మంచి వున్నతి పొందేందుకు అవకాశముంది. ఆ తరువాత స్వదేశం తిరిగివచ్చి, తోటి మానవులకు ఎంతో ఉపకారం చేయవచ్చు." అని సలహా చెప్పాడు. ఈ సంగతేమీ చెడ్డదికాదని సురేంద్రునికి తెలుసు! అడవుల్లో స్వేచ్ఛగా విహరించే పక్షికన్నా పంజరంలో బంధింపబడిన పక్షి ఎక్కువగా కొట్టుకుంటూ వుంటుంది. సురేంద్రుని కల్పనా దృష్టిలో ఒక స్వచ్ఛందవాయువు ఒక స్వాధీనతా ప్రకాశం కనుపించింది. అందువల్ల అతని పరాధీనమైన ప్రాణం, ఉన్మత్తునిలా పంజరంలో నాలుగు వేపులా కొట్టుకుంటూవుంది.

అతను తిన్నగా తండ్రివద్దకు వచ్చి నివేదించుకున్నాడు—"ఎలాగైనాసరే నన్ను విదేశాలకు పంపే ఏర్పాటుచేయండి! అన్నివిధాలుగా నాకేదో గొప్ప ఔన్నత్యం రాబోతూందనిపిస్తూంది."

"సరే-చూస్తాను-" అని తండ్రి చెప్పాడు.

కానీ యింటి యజమానురాలి అభిప్రాయం విరుద్ధంగా వుంది. ఆమె ఆ తండ్రీ కొడుకుల మధ్య తుపానులా వచ్చి పడింది. తండ్రీ కొడుకులిద్దరూ స్థంభించిపోయారు. "నన్ను కూడా విదేశాలకు పంపండి-లేకుంటే అక్కడ సురేంద్రుని ఎవరు చూస్తారు? వాడికి ఎప్పుడు యేది తినాలో - యెప్పుడు యేది కట్టుకోవాలో తెలవదు. అటువంటివాణ్ణి ఒంటరిగా విదేశాలకు పంపుతారా? వీడిని విదేశాలకు పంపడం ఇంట్లోని గుర్రాన్ని విదేశాలకు పంపడంవంటిదే. గుర్రంగానీ, ఎద్దు

గానీ తమకు ఆకలివేస్తుందో లేక నిద్రవస్తుందో, ఆ సంగతి వాటికి తెలుస్తుంది. కాని మీ సురేంద్రుడు అంతమాత్రం కూడా గ్రహించలేడు” అని ఆమె నవ్వింది.

ఈ హాస్యంలోని ఆధిక్యత చూసి రాయ్ మహాశయుడు సిగ్గుపడ్డాడు. సురేంద్రనాథుడు కూడా ఇటువంటి అఖండనీయమైన యుక్తికి విరుద్ధంగా ఏ ప్రకారంగానూ ప్రతివాదం చేయలేదు. విదేశాలకు వెళ్ళే ఆశ వదలుకున్నాడు. అతని స్నేహితుడు యీసంగతి విని చాలా దుఃఖించాడు. కాని విదేశాలకు వెళ్ళేందుకేమైనా మరోవుపాయం వుందో లేదో చెప్ప లేకపోయాడు. కాని చివరకు అతను “యిలా పరాధీనంగా బ్రతికేకన్న భిక్షం అడుక్కుని తినడం చాలా మెరుగు. అయినా నీ వంటి ఎం. ఎ పాసైనవాడు పొట్టకోసం అంత అవస్థపడ వలసినపని వుండదు.” అని చెప్పాడు.

యింటికి వచ్చి సురేంద్రుడు ఆసంగతినిగురించే ఆలోచిస్తున్నాడు. ఎంత దూరం ఆలోచించినా తన స్నేహితుడు చెప్పిందే యదార్థమని తోస్తూంది మనసుకు. అడుక్కుని తినడమేమంచిది. అందరూ విదేశాలకు వెళ్ళలేనిమాట నిజమే. కాని చావు – బ్రతుకుల మధ్య వుంటూ అందరూ కాలం వెళ్ళబుచ్చలేరు.

ఒక నాటి గంభీరమైన రాత్రిసమయాన అతను స్టేషనుకు కలకత్తాకు టిక్కట్టుకొని రైలెక్కి కూర్చున్నాడు. ఆ తరువాత ఉత్తరంద్వారా తండ్రికి – తను కొంతకాలం యిల్లు వదిలి వెడుతున్నాననీ, వ్యర్థంగా తనను వెదకడంవల్ల లాభం లేదనీ,

ఒకవేళ తన జాడ తెలిసి వచ్చినా తను తిరిగి యింటికి రావడం జరగదనీ, తెలియచేశాడు.

రాయ్‌గారు ఆ వుత్తరాన్ని భార్యకు చూపించి అన్నాడు- "సురేంద్రుడు యిప్పుడు పెద్దవాడయాడు. చదువు_సంధ్యాలు నేర్చుకున్నాడు. ఇప్పుడు వాడికి రెక్కలు వచ్చినయ్! ఒక వేళ యిప్పుడు ఎగరలేకుంటే యింకెప్పుడు యెగురగలడు?"

అయినప్పటికి ఆయన అతన్ని వెదికించాడు. కలకత్తాలో వున్న పరిచయస్తులందరికి కబురుచేశాడు. కాని ఫలితమేమీ కనుపించలేదు. సురేంద్రునిజాడ దొరకలేదు.

## 2

జనసందోహంతో కోలాహలప్రపూరితమైన కలకత్తా వీధుల్లోకి వచ్చాక, సురేంద్రనాథుడు భయపడ్డాడు. ఇక్కడ తనను దభాయించేవాళ్ళూ, తిరస్కరించేవాళ్ళూ ఎవరూ లేరు. తనను రాత్రింబగళ్ళు శాసనాల్లోవుంచేవాళ్ళుకూడా లేరు. ముఖం వాడిపోయినా తన వేపు యెవరూ చూడలేదు. ముఖం విచారంగా వున్నా ఎవరూ గమనించలేదు. యిక్కడ తనను తానే చూచుకోవాలి. యిక్కడ భిక్షంకూడా దొరుకుతుంది. దయకుకూడా స్థానముంది. ఆశ్రయంకూడా దొరుకుతుంది. కాని తను ప్రయత్నించాలి. ఇక్కడ ఎవరూ తమంతట తాము వచ్చి తన సంగతి తెలుసుకోరు.

తాను ఆశ్రయం కోసం, వెదకాలనీ, నిద్ర భోజనానికి కొంచెం భేదం వుందనీ, మొట్టమొదటిసారిగా యిక్కడికి వచ్చాకనే గ్రహించాడు.

అతను యిల్లు విడిచి కొద్దిరోజులైంది. వీధివీధి తిరగడంవల్ల శరీరం శిథిలమైంది. దగ్గరున్న డబ్బు కూడా ఆఖరైంది. వస్త్రాలన్నీ మాసిపోయినయ్! రాత్రులు పడుకునేందు కాశ్రయం ఎక్కడా లేదు. సురేంద్రునికళ్ళంట నీళ్ళు కారినయ్? యింటికి వుత్తరం వ్రాయడానికి మనసొప్పలేదు. చాలా సిగ్గు వేస్తుంది. పైగా ప్రేమతో కఠినంగావుండే సవతితల్లి ముఖం గుర్తుకొచ్చేసరికి, యింటికి వెళ్ళే ఆశ, ఆకాశకుసుమంలా కనుపడింది. ఒకప్పుడు అక్కడ తను వున్నాననే సంగతి తలంపుకు వచ్చినా భయం వేసింది.

ఒకనాడు అతను తనలాంటి దరిద్రుడు తనదగ్గరుండడము చూసి అడిగాడు. "ఏం తమ్ముడూ, మీరంతా ఇక్కడ ఏ విధంగా తింటున్నారు?"

వాడు కూడా ఓ మూర్ఖునిలావున్నాడు. లేకుంటే సురేంద్రుని ఉడికించేవాడే!— "నౌకరీ చేసుకుంటూ తింటున్నాము. కలకత్తాలో పనికేం తక్కువ!"

"నాకూ ఏమన్నా నౌకరీ యిప్పించగలవా?"

"నీకేం పని వచ్చు?"

సురేంద్రునికి పనిపాట లేమీ తెలవవు. అందువల్ల మెదలకుండా వూరుకున్నాడు.

"అయితే నువ్వు పెద్దవంశస్థుడివా?"

"అవును," అని తల ఆడించాడు.

"మరి యింతవరకు చదువూ, సంధ్యలు యెందుకు నేర్చుకోలేదు?"

"నేర్చుకున్నాను."

ఆ మనిషి కొంచెం ఆలోచించి చెప్పాడు. "అయితే యీ పెద్ద భవనంలోకి వెళ్ళు. యిందులో పెద్ద జమీందా రుంటున్నాడు. ఆయన యేమన్నా చూడగలడు." అని చెప్పి వెళ్ళిపోయాడు.

సురేంద్రనాథుడు గేటు దగ్గరకు వెళ్ళాడు. కొంచెంసేపు అక్కడ నిలుచున్నాడు. మళ్ళీ తిరిగి వెనక్కి వచ్చాడు. ఆనాడు యేమీ చేయలేకపోయాడు. ఆ మరునాడు కూడా యిలాగే గడిచాడు. ఈ రెండురోజుల్లో ధైర్యం పోగుచేసుకుని, లోపలకు ప్రవేశించాడు. అక్కడ ఒక నౌకరున్నాడు. వాడు అడిగాడు– "ఏంకావాలి?"

"బాబుగారితో..."

"బాబుగారు యింట్లో లేరు!"

సురేంద్రుని ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. అత నొక కష్టకార్యంలోంచి విముక్తుడయ్యాడు. బాబుగారు యింట్లో లేరు. తన నౌకరీ సంగతి, తన దుఃఖగాథ వినిపించ నవసరం లేదు. అదే అతని ఆనందానికి కారణము. అప్పుడు ద్విగుణీకృత ఉత్సాహంతో తిరిగివచ్చి కడుపునిండా భోజనం చేశాడు. కొంచెంసేపు సంతోషంగా అటూ-ఇటూ షికార్లు చేశాడు. రేపు ఏవిధంగా మాట్లాడితే తనకు నౌకరీ దొరుకుతుందో ననే విషయంమీద ఆలోచిస్తున్నాడు.

కాని, ఆమరునాడు అంతగా ఉత్సాహంలేదు. ఆ భవనాన్ని సమీపించేకొద్దీ వెనక్కి వెళదామనే ఆత్రుత ఎక్కువైంది. గేటుదగ్గరకు వచ్చి హఠాత్తుగా ఆగిపోయాడు. యిప్పు డతని కాళ్ళు లోపలికి వెళ్ళేందుకు వెనకాడినయ్! తనకోసమే

తాను యిక్కడికి వచ్చినట్లు ధ్యానమే లేదు. ఎవరో బలవంతంగా తన నిక్కడకు పంపించారని అనుకున్నాడు. కాని గేటు దగ్గర ఎంతోసేపు ప్రతీక్షించకుండా లోపలికి వెళ్ళాడు. తిరిగి ఆ బంట్రోతే కనుపించి అన్నాడు. "బాబుగారు యింట్లో వున్నారు. చూస్తారా?"

"అవును."

"అయితే పదండి."

అయితే ఈ వెళ్ళడం మహాకష్టం. జమీందారుగారిభవనం చాలా పెద్దది. విదేశీపద్ధతిలో అలంకరించివుంది. గదుల నానుకుని గదులూ, పాలరాతి మెట్లూ-ఎర్రటి తివాచీలతో గదులన్నీ శోభిస్తున్నయ్! గోడలకు పెద్దపెద్ద అద్దాలు, ఎన్నో పటాలు, ఎన్నో ఫొటోలు వున్నయ్! ఈ వస్తువులన్నీ యితరులకు ఎలావున్నా-సురేంద్రునికి కొత్తకావు. ఎందుకంటే సురేంద్రుని తండ్రియిల్లుకూడా దరిద్రులకొంపకాదు. అంతే కాదు. తనుకూడా దరిద్రుడైన తండ్రిఆశ్రయంలో పెరిగి యింత పెద్దవాడవలేదు. తను యిప్పుడు చూడబోతున్న మనిషివద్ద అనునయవినయాలు ఎలా చూపించాలి? ఆయన ఏమని ప్రశ్నిస్తారు? తను ఏమని జవాబుచెప్పాలి? ఇదే అతని ఆలోచన.

కాని అంతగా ఆలోచించవలసిన పని లేకపోయింది. యజమాని ఎదురుగానే కూచున్నాడు. సురేంద్రనాథునితో-"ఏం పని కావాలి?" అని అడిగాడు.

ఇప్పటికి మూడురోజులనుంచీ ఇదే ఆలోచిస్తున్నాడు. కాని యిప్పుడివన్నీ మర్చిపోయాడు...'నేను...నేను'అన్నాడు.

బ్రజరాజలాహిరి వయసుమళ్ళిన జమీందారు. ఆయన తల మీద నాలుగైదు వెంట్రుకలుకూడా పండిపోయినయ్! అవి కూడా అసమయంలో కాదు. సరైన వయసులోనే పండినయి! పెద్దమనిషి! అందువల్ల ఆయన చటుక్కున సురేంద్రనాథుని సంగతి గ్రహించి "ఏంకావాలి?" అని అడిగాడు.

"నాకేదో ఒక"

"ఏమిటి?"

"నౌకరీ."

బ్రజరాజలాహరిబాబు కొంచెం నవ్వి—"నేను నౌకరీ యివ్వగలనని నీతో ఎవరు చెప్పారు?" అని అడిగాడు.

రోడ్డుమీద వకమనిషి కనుపించాడు. వాడిని అడిగాను. వాడు తమ విషయం..."

"సరేగాని మీ యిల్లెక్కడ?"

"పడమటిదేశం.?"

"అక్కడ నీ కెవరున్నారు? మీ తండ్రి ఏంచేస్తుంటాడు?"

ప్రస్తుతం తనున్న అవస్థలో సురేంద్రనాథుడు ఒక కొత్త పద్ధతి నేర్చుకున్నాడు. కొంచెం బెదురుతూ.. బెదురుతూ చెప్పాడు.. . "ఏదో మామూలు నౌకరి చేస్తున్నాడు."

'అయితే దానివల్ల జరుగుబాటులేక నువ్వుకూడా సంపాదించాలనుకుంటున్నావన్న మాట?"

"అవునండి."

'ఇక్క డెక్కడ వుంటున్నావు?'

'నిర్దిష్టమైన చోటంటూలేదు. ఇక్కడా–అక్కడా.'

వ్రజబాబుకు దయకలిగింది? సురేంద్రనాథునిదగ్గర కూచో పెట్టుకుని 'నువ్వింకా కుర్రాడివి. ఈ వయసులోనే యిల్లు విడిచి వచ్చినందుకు నాకెంతో విచారంగావుంది. అయినా స్వయంగా నేనేమీ పనిచూపించలేను. కాని ఏదో ఒకటి దొరికే వుపాయం చూపుతాను.'

'సరే' అంటూ సురేంద్రనాథుడు బయలుదేరడం చూసి, వ్రజబాబు అతన్ని వెనక్కి పిలిచి అడిగాడు 'యింకేమీ అడిగేదిలేదా?'

'లేదండీ.'

'ఇంతటితోనే, నీ పని అయిపోయిందా ? నేను నీకేమి వుపాయం చెపుతానో-అదెక్కడో కూడా తెలుసుకునే అవుసరం లేదా?''

సురేంద్రుడు వెనక్కితిరిగి వచ్చి నిలుచున్నాడు. వ్రజబాబు నవ్వుతూ. 'యిప్పుడు యెక్కడికెళతావు?' అని అడిగాడు.

'ఏదో ఒక దుకాణం దగ్గరకు...'

'అక్కడే భోజనం చేస్తావా?'

"అవును. రోజూ అలానే చేస్తున్నాను."

'నువ్వెంతవరకు చదువుకున్నావు?'

'ఏదో కొద్దిగా.'

'మా అమ్మాయికి చదువుచెప్పగలవా?'

సురేంద్రుడు సంతోషించి. 'చెప్పగలను' అని చెప్పాడు.

వ్రజబాబు మళ్ళీ నవ్వాడు. దుఃఖంవల్లా, దరిద్రంవల్లా, మనసు సరైనస్థితిలో లేదని గ్రహించాడు. ఎవరికి చదువు చెప్పాలో, ఏమిచదువు చెప్పాలో అడక్కుండానే సంతోషిం

చడం వట్టి పిచ్చితనమనుకున్నాడు. ఆయన–‘ఒకవేళ బి.యె. చదువుకున్నానని వాడంటే, నువ్వు ఏవిధంగా చదువు చెప్ప గలవు?’’

సురేంద్రుడు కొంచెం ఆలోచించి గంభీరంగా –‘ఏదో ఒకవిధంగా పనిచేయగలను’ అని చెప్పాడు.

ఈమారు వ్రజబాబు ఏమీ అనలేదు. నౌకరును పిలిచి. ‘బంకూ! వీరు వుండేందుకు ఏర్పాటుచేయ్! భోజనానికీ, స్నానానికి కూడా ఏర్పాటుచేయ్.’ ఆ తరువాత సురేంద్రుని వేపు చూసి –‘సాయంకాలం మళ్ళీ నిన్ను పిలుస్తాను. ఈ యింట్లోనే వుండు! ఎంతకాలం నౌకరీదొరకదో అంతవరకూ ఇక్కడ సరదాగా వుండవచ్చు’ అని చెప్పాడు.

మధ్యాహ్న భోజనానికి వెళ్ళినప్పుడు వ్రజబాబు తన పెద్ద కూతురు మాధవిని పిలిచి చెప్పాడు ‘అమ్మాయీ! ఒక దరిద్రునికి యీ యింట్లో వుండేందుకు అనుజ్ఞ ఇచ్చానమ్మా.’

‘ఎవరతను నాన్నా?’

‘బీదవాడు, అంతకంటే నా కింకేమీ తెలుసుకునే అవు సరం కలగలేదు. చదువుసంధ్యలు కొంతవరకు తెలుసను కుంటాను. ఎందుకంటే మీ అన్నయ్యకు చదువు చెప్పా లన్నాను. అతను అందుకు వొప్పుకున్నాడు. ఎవరైతే బి. ఎ. క్లాసు కుర్రాడికి చదువు చెప్పేందుకు సిద్ధమయ్యాడో ఎంత లేదన్నా నీ ప్రమీలకు చదువుచెప్పగలడు. అతన్ని ప్రమీ లకు మాష్టరుగా వుంచుదామనుకున్నాను.’

అందుకు మాధవి అభ్యంతరం ఏమీ చెప్పలేదు.

సాయంకాలం వ్రజబాబు సురేంద్రుని పిలిచి ఈ సంగతి చెప్పాడు. ఆ మరునాటినుంచీ ప్రమీలకు చదువుచెప్పడం మొదలుపెట్టాడు.

ప్రమీల వయసు ఏడు సంవత్సరాలు. ఆమె మొదటి తరగతి పుస్తకం, 'బోధోదయ' చదువుతూంది. తన పెద్దక్కవద్ద ఇంగ్లీషులో మొదటి పుస్తకంలో 'కప్పకథ' వరకూ చదువుతుంది. ఆపిల్ల కాపీపుస్తకాలూ, పలక, బలపం, బొమ్మలూ, చాకలెట్లూ అన్నీ తీసుకునివచ్చి చదువుకునేందుకు కూచుంది.

'డు నాట్ మువ్' సురేంద్రనాథుడు–'అంటే కదలవద్దు' అని చెప్పాడు.

ప్రమీల చదువుతోంది. 'డు నాట్ మువ్' 'కదలవద్దు'

ఆ తరువాత సురేంద్రనాథుడు అన్యమనస్కుడై ఆమెదగ్గర నుంచి పలక లాక్కుని, బలపంతో లెక్కలు వేస్తూ కూచున్నాడు. ప్రాబ్లమ్ మీద ప్రాబ్లం సాల్వ్ అవుతూంది. అటు గడియారంలో ఏడు తరువాత ఎనిమిది. ఎనిమిది తరువాత తొమ్మిది అవుతూంది. ప్రమీల కాసేపు అటూ యిటూ జరిగి బొమ్మల పుస్తకాలను తిరగవేస్తూ కొంతసేపూ, ఒకప్పుడు పడుకునీ, ఇంకొకప్పుడు లేచికూచుని, ఒకప్పుడు చాకలెట్లు తింటూ పాపం కప్పబొమ్మమీద సిరా పులుముతూ చదువుతూంది. 'డు నాట్ మువ్' "కదలవద్దు" అని.

'మాష్టరుగారూ లోపలికి వెళ్ళమంటారా?'

'వెళ్ళు.'

ఉదయం యీవిధంగా గడుస్తూ వుంటుంది. కానీ మధ్యాహ్నం పని యింకొక విధంగా ఉండేది. ఉద్యోగంకోసం వ్రజబాబు కొంతమంది మిత్రులకు ఉత్తరాలు రాసి, అవి సురేంద్రుని కిచ్చి వారివద్దకు తీసుకుని వెళ్ళమని చెప్పేవాడు. సురేంద్రనాథుడు ఆ వుత్తరాలు జేబులో పెట్టుకొని బయటికి బయలుదేరేవాడు. జాడకనుక్కొని వాళ్ళింటి ముందుకు వచ్చేవాడు. అక్కడ ఆ యిల్లు ఎంతపెద్దదో-దానికి తలుపులు ఎన్నో, కిటికీలు ఎన్నో, బయటివేపు ఎన్ని గదులున్నయ్యో, యిల్లు రెండంతస్థులా, మూడు అంతస్థులా, దాని కెదురుగా దీపపుస్తంభ ముందా లేదా చూసి, చివరకు చీకటి పడక ముందే యింటికి చేరుకునేవాడు.

కలకత్తా వచ్చాక సురేంద్రనాథుడు కొన్ని పుస్తకాలు కొన్నాడు. అంతేగాక యింటినుంచి కూడా కొన్ని పుస్తకాలు తీసుకుని వచ్చాడు. ఇప్పుడు ఎలక్ట్రిక్ లైటు వెలుతుర్లో అవి చదువుతున్నాడు. వ్రజబాబు ఎప్పు డన్నా ఉద్యోగం సంగతి ప్రస్తావించినప్పుడు మెదలకుండా వూరుకునేవాడు. లేదా వాకు కలనలేదని చెప్పేవాడు.

## 3

నాలుగేళ్ళక్రితం వ్రజబాబు భార్య చనిపోయింది. వృద్ధాప్యంలోని యీ దుఃఖం, ముసలివాళ్ళకే అర్థమవుతుంది. ఈ సంగతి అటుంచుదాము. తన ముద్దుల పెద్దకూతురు మాధవీదేవి పదహారు సంవత్సరాల వయసులోనే భర్తను పోగొట్టుకుంది. అందువల్ల వ్రజరాజబాబు శరీరంలోని సగం రక్తం ఎండిపోయింది. ఆయన ఎంతో వుత్సాహంతో, తన

కూతురువివాహం ఎంతో గొప్పగా చేశాడు. ఆయన ధని కుడు. ధనసంగతి ఎత్తలేదు. అసలు కుఱ్ఱవాడు డబ్బుగల వాడా లేదా అని చూడలేదు. చదువూ, సంధ్యలూ, అంద చందాలు, గుణగణాలు మాత్రం చూశాడు. ఈ విషయం మీాద శ్రద్ధతీసుకుని ఆయన మాధవివివాహం చేశాడు.

పదకొండేళ్ళప్పుడే మాధవివివాహం చేశాడు. మూడేళ్ళ వరకూ ఆమె తన భర్తగారిదగ్గరుంది. ఆదరం, స్నేహం, ప్రేమ అన్నీ ఆమె పొందింది కాని యోగీంద్రనాథుడు బ్రతక లేదు. మాధవిజీవితంలోని, తపశ్చర్యను తుడిచివేసి, వ్రజ రాజబాబు గుండెలో శూలంగ్రుచ్చి, ఆయన స్వర్గం చేరు కున్నాడు. అతను చనిపోయేముందు మాధవి ఎంతో ఏడ్చింది. అప్పు డాయన ఎంతో కోమలంగా – "నిన్ను యిప్పుడు వదలి పెట్టి పోతున్నానేదే నాకు పెద్ద దుఃఖం మాధవీ! చనిపోవ డంవల్ల నచ్చిన నష్టమేమీాలేదు. కాని, నువ్వు జీవితాంతం అనుభవించవలసివస్తుందనే సంగతి నన్ను వ్యాకులపరుస్తోంది. నేను నిన్ను ఆదరించలేకపోయాను" అన్నాడు.

ఆ తరువాత యోగీంద్రనాథుని క్షీణించిన వక్షస్థలంమీాద కన్నీళ్ళధారలు ప్రవహించినయ్! మాధవి ఆ కన్నీళ్ళను తుడిచి అన్నది –"నేను తిరిగి మీా పాదాలముందుకు వచ్చినప్పుడు ఆదరించండి."

యోగీంద్రుడు—"మాధవీ, నువ్వు ఏ శరీరాన్ని నాసుఖం కోసం అర్పితంచేశావో—ఆ శరీరాన్ని సర్వజనుల సుఖానికి అర్పించు! ఎవరిముఖం కష్టాలతో ఉదాసీనంగా ఉంటుందో— వాళ్ళసుఖాన్ని ప్రఫుల్లంచేయడానికి ప్రయత్నించు.

యింకేమి చెప్పను మాధవీ!" అశ్రువులు రాల్చాడు. మాధవి వాటిని తుడిచింది.

'నువ్వు సత్ప్రవర్తన కలిగివుండు. నీపుణ్యంవల్ల తిరిగి నిన్ను పొందుతాను.'

అప్పటినుంచి మాధవి సంపూర్ణంగా మారిపోయింది. క్రోధం, హింసా, ద్వేషం మొదలైనవన్నీ ఆమె భర్తచితిలోని బూడిదతోపాటు ఎప్పటికీ గంగలో కలిపింది. యీ జీవితంలో ఎన్నో ఆకాంక్షలు వున్నయ్! విధవ అయినప్పటికీ అవన్నీ పోలేదు. అయినా భర్త చెప్పిన మాటను గుర్తుకు తెచ్చుకునేది. ఆయన లేనప్పుడు యివన్నీ యెందుకు? యింకెందుకు యితరులను హింసపెట్టాలి? ఎవరికోసం ఇతరుల కళ్ళంట అశ్రువులు తెప్పించాలి? ఇటువంటి హీనమైన ప్రవృత్తులు ఎప్పుడూ ఆమెలో లేవు. ఆమె గొప్పవారి బిడ్డ. హింసా ద్వేషాలు ఆమె ఎప్పుడూ నేర్చుకోలేదు.

ఆమెతోటలో చాలా పూలు వికసించేవి. మొదట ఆమె ఆ పూలనన్నింటినీ దండలు గుచ్చి భర్త మెడలో అలంకరించేది. కాని యిప్పుడు భర్త లేడు. అందువల్ల ఆమె ఆ పూల చెట్ల నన్నిటినీ నరికించలేదు. యిప్పుడు కూడా వాటిపూలు వికసిస్తూనే వున్నాయ్? కాని అవి రాలి క్రిందపడి వాడిపోతున్నయ్! యిప్పుడామె పూలను దండలుగా గుచ్చడం లేదు. కాని వాటినన్నిటినీ ప్రోగుచేసి, దీనులకూ— దుఃఖితులకు పంచిపెడుతూంది. లేనివాళ్ళకల్లా యిస్తూంది. యిందులో కృపణత్వం కొంచెంకూడా లేదు. కొంచెంకూడా మూతి విరుపు లేదు.

వ్రజబాబు భార్య చనిపోయినప్పటినుంచీ, ఈ సంసారంలో క్రమపద్ధతిలేదు. అందరూ తమ తమ గొడవల్లో వుండేవారు. ఒకరిసంగతి ఒకరు పట్టించుకునేవారుకారు. ఒకరు ఒకరివేపు చూచుకునేవారుకారు. ఒకొక్కరికీ, ఒక్కొక్క నౌకరున్నాడు. ఆ నౌకరులంతా ఎవరి యజమానిపని వాళ్ళు చేసేవాళ్ళు. వంటింటిలో వంటవాళ్ళు వంటలు చేసేవారు. పెద్ద అన్నసత్రంలోలా. అందరికీ విస్తళ్లు వేసేవారు. ఎవరు తిన్నారు? ఎవరు తినలేదు. ఈ విషయం ఎవరూ అడిగేవారూ లేరు. చూసేవారూ లేరు.

కాని ఏనాడు మాధవి భాద్రపదమాసంలో నిండుగా ప్రవాహించే గంగానదిలా, రూపంతోనూ, స్నేహంతోనూ మమతతోనూ, తన తండ్రిగారింటికి తిరిగి వచ్చిందో ఆనాటినుంచీ ఆ యింట్లోకి ఓ కొత్తవసంతం వచ్చినట్లయింది. యిప్పు డందరూ "పెద్దక్కయ్యా" అని పిలిచేవాళ్ళు. అందరూ "మాధవి" అని పిలిచేవాళ్ళు. ఆ యింట్లో పెరిగే కుక్క సహితం సాయింకాలం ఒక్కసారి "పెద్దక్కయ్యా"ను చూడవలసిందే! యింతమందిలో ఆమె ఒక్కతే స్నేహమయిగానూ, ప్రేమమయిగానూ కనుపించింది దానికళ్ళకు. యింటి యజమాని మొదలు, గుమాస్తా—దాస దాసీలు అంతా "పెద్దక్కయ్యా"ను గురించి తలచేవారు. అందరూ ఆమెమీద భారం వేసేవాళ్ళు. ఏ కారణంచేతనైనాసరే, ఈ 'పెద్దక్కయ్యా' మీద హక్కు వుందని అందరూ అనుకునేవాళ్ళు.

స్వర్గలోకంలో వుండే కల్పతరువు మనం చూడలేదు. చూస్తామో లేదోకూడా తెలియదు. అందువల్ల ఆ సంగతి

చెప్పలేము. కాని వ్రజబాబుయింటిలోనివాళ్ళందరూ ఒక కల్పవృక్షాన్ని మాత్రం పొందగలిగారు. ఆ వృక్షంక్రిందకు వెళ్ళి చేతులు చాపేవాళ్ళు, నవ్వుతూ తిరిగి వచ్చేవాళ్ళు.

ఇటువంటి కుటుంబంమధ్యలో వుండి సురేంద్రనాథుడు ఒక కొత్తపద్ధతిగా జీవితాన్ని గడిపే దారి చూశాడు. ఎప్పుడైతే అంతా తమ భారాన్ని ఒకే వ్యక్తిమీంద వేశారో-తనుకూడా అలానే చేయసాగాడు. కాని ఇతరులకన్నా అతని ధారణ భిన్నంగా వుండేది. అతను అనుకునేవాడు..."బడదిదీ"అనే జీవపదార్థం యింట్లో వుంది. అందర్నీ చూస్తూవుంటుంది. అందరిమాటలు వింటూవుంటుంది. అందరి గారాబాలన్నీ సహిస్తుంది. ఎవరి కేవస్తువు కావాలో, అది వారికి దొరుకుతుంది. కలకత్తావీథుల్లో తిరుగుతూ, తన విషయం తనే ఆలోచించుకునే సంగతి తెలుసుకున్నాడు.

చొక్కాలూ, పంచెలూ, చెప్పులూ, గొడుగూ, కర్ర మొదలైన కావలసిన వస్తువులన్నీ హాజరైనయ్! తన కోసం ఎవరో రుమాలు కూడా ఆదరంతో సిద్ధంచేసి వుంచేవారు. మొదట్లో కుతూహలంకొద్దీ అడిగేవాడు—"ఇవన్నీ ఎక్కడ నుంచి వచ్చినయ్?" అందుకు జవాబు "పెద్దక్కయ్య" పంపిందని వచ్చేది. ఫలహారపు పళ్ళెం చూడగానే దానికి "పెద్దక్కయ్య" స్పర్శ తగిలిందని తెలుసుకునేవాడు.

ఒకనాడు లెక్కలు వేయడానికి కూచుని గీత గీయటానికి కంపాసు కావలసివచ్చింది. ఆయన ప్రమీలతో-"ప్రమీలా! పెద్దక్కయ్యను అడిగి కంపాసు పట్టుకునిరా"అని చెప్పాడు.

పెద్దక్కయ్యకు కంపాసుతో పనివుండదు. అది ఆమెవద్ద లేదు. కాని ఆమె వెంటనే మనిషిని బజారుకు పంపింది. సాయంకాలం షికారునుంచి వచ్చి కంపాసు టేబులుమీద వుండడం చూశాడు. ఆ మరునాడుదయం ప్రమీల వచ్చి "మాష్టరుగారూ! నిన్న పెద్దక్కయ్య యిది పంపించింది—" అని చెప్పింది.

ఆ తరువాత యిటువంటివే ఒకటి రెండు వస్తువులు అడుగుతుండేవాడు వాటికోసం పెద్దక్కయ్య చాలా యిరకున పడేది. ఎంతో ప్రయత్నంచేసి వాటిని అతనికి పంపించేది. అయినప్పటికీ "లేదు" అని చెప్పేదికాదు.

అంతేకాదు. అప్పుడప్పుడు హఠాత్తుగా ప్రమీలతో పెద్దక్కయ్య నడిగి అయిదారు పాతగుడ్డలువుంటే పట్టుకురా! అడుక్కునేవాళ్ళకిద్దాం" అనేవాడు. పాతవీ, క్రొత్తవీ అనే విచక్షణ మాధవికి యెప్పుడూ వుండేదికాదు. ఆమె తనకున్న ధోవతులు నాలుగైదు యిచ్చి పంపి—మేడమీదున్న కిటికీలోంచి చూస్తూవుండేది. నలుగురైదుగురు మనుష్యులు తృప్తిగా పొగుడుతూ వెళ్ళడం చూచేది.

సురేంద్రనాథుడు చేసే యిటువంటి చిన్న-పెద్ద అత్యాచారాలను నిత్యమూ మాధవి సహిస్తుండేది. క్రమక్రమంగా మాధవి యీ పనులకు అలవాటుపడింది. తన యింట్లో ఓ క్రొత్తమనిషి వచ్చి, నిత్యమూ—ఏదో ఒక అత్యాచారంచేస్తున్నాడనే తలంపే ఆమెకు లేదిప్పుడు.

కేవలం అంతేకాదు. ఈ క్రొత్తవ్యక్తికోసం, ప్రస్తుతం మాధవి ఎంతో సతర్కంగా వుండవలసివచ్చింది. ఎంతో

వెదకవలసివస్తూంది. ఒకవేళ అతనికి కావాల్సిన వస్తువుల్ని అడిగి పుచ్చుకుంటే మాధవికి కష్టంవుండేదికాదు. సగంపరి శ్రమ తగ్గిపోయేది. కాని విచారించాల్సినదేమంటే తనకోసం అతను ఏమీ అడిగేవాడు కాదు. మొదట సురేంద్రనాథుడు అన్యమనస్కప్రవృత్తి కలవాడని తెలుసుకోలేకపోయింది. ప్రాతఃకాలపు "టీ" చల్లబడిపోతున్నా త్రాగేవాడు కాడు. ఫలహారం ముట్టుకుందామనే ధ్యాసకూడా వుండదు. అప్పుడప్పుడూ కుక్క వచ్చి యెత్తుకొనిపోతూవుండేది. భోజనానికి కూచున్నప్పుడు అన్నానికీ దేనికీ వ్యత్యాసం గమనించేవాడు కాదు. ఒక ప్రక్కకు త్రోసివేసి క్రిందపెట్టి దాచేవాడు. ఏవస్తువూ అతనికి రుచించనట్లుండేది. నౌకరులూ, చాకరులూ వచ్చి—"మాష్టరుగారు వట్టి పిచ్చివారు. ఆయన వేటినీ చూడరు, ఏమీ తెలవదు. పుస్తకాలు మాత్రం ముందు వేసుకుని కూచుంటాడు." అని అనేవాళ్లు.

మధ్య మధ్యలో బ్రజబాబు వచ్చి నౌకరి దొరికే సూచన లేమైనా కనుపించాయా లేదా అని అడుగుతూండేవాడు. సురేంద్రుడు ఏదో సమాధానం చెప్పేవాడు. మాధవి ఈ మాటలన్నీ తండ్రివల్ల విన్నది. మాష్టరుగారు నౌకరీకోసం రవ్వంతకూడా ప్రయత్నంచేయడంలేదు. అది ఆయనకు అసలు యిష్టంలేదు. దొరికినదానితోనే పరమసంతోషంగా వున్నాడు.

ఉదయం పదిగంటలవగానే "పెద్దక్కయ్య"వద్దనుంచి స్నానానికీ, భోజనానికీ కబురువచ్చేది. భోజనం సరిగ్గా చేయకుంటే పెద్దక్కయ్య తరఫున ప్రమీల బ్రతిమలాడు

తుండేది. ఎక్కువరాత్రివరకు పుస్తకం తీసుకుంటే, నౌకర్లు వచ్చి దీపం ఆర్పేవాళ్ళు. అందు కాయన అడ్డుచెప్తే - "పెద్ద కయ్య హుకుం" అని చెప్పేవాళ్లు.

ఒకనాడు మాధవి తండ్రితో నవ్వుతూ–"ప్రమీల ఎంతో దాని మాష్టరుగారు కూడా అంతే నాన్నా " అన్నది.

"ఎందుకనమ్మా?"

"ఇద్దరూ పసిపిల్లలే. ఎప్పుడు తన కేది అవసరమో, ఎప్పు డేం తినాలో ఎప్పుడు పడుకోవాలో ఎప్పుడు ఏంచేయాలో ప్రమీల కేవిధంగా తెలియదో . మాష్టరుగారికి కూడా అంతే! ఆయన కేం కావాలో ఏమీ తెలియదు. పైగా సమ యంకాని సమయంలో అవీ-యివీ కావాలంటాడు. కొంచెం జ్ఞానంకలవాళ్ళైనరూ అలా అడగరు."

వ్రజరాజబాబుకు అర్థంకాక మాధవిముఖంలోకి చూస్తుం డేవాడు.

మాధవి నవ్వుతూ ."మీ అమ్మాయికి ఎప్పుడు ఏది అవుసరమో తెలుసా?"

"దానికి తెలియదు."

"సమయంకాని సమయంలో మారాంచేస్తుందా!"

"అవును! చేస్తుంది."

"మాస్టరుగారూ కూడా అలానే చేస్తుంటారు."

వ్రజబాబు నవ్వుతూ–"చూస్తుంటే అతను పిచ్చివాడులా వున్నాడు." అన్నాడు.

"కాదు... గొప్పయింటివారనుకుంటాను."

వ్రజబాబు చకితుడై...."ఎలా తెలుసుకున్నావు?" అని అడిగాడు.

మాధవికి తెలియదు. కాని అలానే అని అనుకుంది. సురేంద్రనాథుడు ఏ పనీ తను స్వయంగా చేసుకునేవాడు కాడు. ఎల్లప్పుడూ యితరులమీద ఆధారపడి వుండేవాడు. తన పనులు యితర్లు చేస్తే చేస్తారు. చేయకుంటే అలానే వుండిపోయేవి. ఆ అక్షమతే అతన్ని మాధవికి పట్టియిచ్చింది. ఇవన్నీ అతని పూర్వపు అలవాట్లని అనుకుందాం. విశేషించి ఆహారవిషయంలో నూతన పద్ధతి ఆమెను చకితురాల్ని చేసింది. ఏ ఖాద్యపదార్థమూ అతని మనోయోగాన్ని ఆకర్షించలేకపోయింది. ఏ వస్తువునూ తృప్తిపూర్వకంగా తినేవాడుకాడు. ఏవస్తువునూ ముట్టుకునేవాడుకాడు. అతని యీ ముసలివాళ్ళలాంటి వైరాగ్యం, బాలకుల్లాంటి సరళత్వం— పిచ్చివానిలా వుపేక్షాభావం. ఎవరైనా తనను తినమనియిస్తే తింటాడు. యివ్వకుంటే తినడు. యిదంతా ఆమెకు ఒక రహస్యంలా తోచింది అందువల్లనే ఓ కరుణదృష్టి ఈ అజ్ఞాత మాష్టరుగారిమీద వేసివుంచింది, ఆమె ప్రత్యక్షంగా చూడకపోవడం సిగ్గుపడికాదు. అదేం కాదు. ఆమెకు అంత అవుసరం రాలేదు కనక చూడలేదు. కాని అవుసరం వచ్చినప్పుడు సమయాసమయాలు ఏవీ అడ్డురావు. ఒక్కసారే పెద్దక్కయ్య దగ్గరకు అర్జీ వచ్చిపడుతుంది. మాధవి నవ్వి యీ మనిషి శత్రు పసివాడు అనుకునేది.

# 4

మనోరమ మాధవికి చిన్నప్పటి స్నేహితురాలు. ఈసారి చాలాకాలంవరకూ వుత్తరమేమీ రాయలేదు. ఉత్తరం లేకపోయేసరికి ఆమెకు చాలా కోపంవచ్చింది. ఇవాళ మధ్యా

హ్నాం తరువాత కొంత వీలుచేసుకుని మాధవి వుత్తరం రాయాలని కూచుంది. ఆ సమయంలో ప్రమీల వచ్చి.

"పెద్దక్కయ్యా!" అని పిల్చింది.

మాధవి తలయెత్తి. "ఏమిటి?" అని అడిగింది.

'మాష్టరుగారు కళ్ళజోడు ఎక్కడో పోగొట్టుకున్నారు. ఒక జోడు యివ్వు.'

మాధవి నవ్వుతూ. "నేను కళ్ళజోళ్ళదుకాణం పెట్టుకో లేదని మీ మాష్టరుగారితో చెప్పు" అన్నది.

ప్రమీల పరుగెత్తుకుని వెళ్ళబోతూవుంది.

మాధవి ప్రమీలను వెనక్కిపిలిచి - "ఎక్కడికి వెళు తున్నావు?" అని అడిగింది.

"మాష్టరుగారితో చెప్పడానికి."

"అంతకంటే వెళ్ళి మానేజరుగారిని పిలుచుకునిరా."

ప్రమీల వెళ్ళి గుమాస్తాను పిలుచుకుని వచ్చింది. మాధవి ఆయనతో—"మాష్టరుగారి కళ్ళజోడు పోయిందట, ఒక మంచిజోడు ఒకటి కొనుక్కొనిరాండి!" అని చెప్పింది.

గుమాస్తాగారు వెళ్ళాక మనోరమకు ఉత్తరం రాసేం దుకు కూచుంది. ఆమె ఆ వుత్తరం చివరలో ఇలా వ్రాసింది.

"ప్రమీల చదువుకోసం, నాన్న ఒకమాష్టరును కుదిర్చారు. అతణ్ణి మనిషని అనవచ్చు. పసిపిల్లవాడని కూడా అనవచ్చు. అంతకుముందు అతనెప్పుడూ యింటినుంచి బయటికి, కాలు కదిపినట్టు లేదు. ప్రపంచమంటే ఏమిటో ఇంకా సరిగ్గా తెలి యదు. అతణ్ణి మాటక పోయినా—అతణ్ణి కనిపెట్టుకుని వుండవ

కాలం దానితో సరిపోతుంది. అటువంటప్పుడు నీకు ఉత్తరం ఎప్పుడు రాయగలను.? ఇక్కడికి నువ్వొకసారివస్తే ఆ అసమగుణిని నీకు చూపిస్తాను. ఇటువంటి అసమగుణి-అన్యమనస్కుని నీవు జీవితంలో ఎప్పుడూ చూసివుండవు. తింటానికేదైనాయిస్తే తింటాడు, లేకుంటే ఉపవాసముంటాడు. రోజల్లా వూరుకుంటే అతనికి భోజనంచేసిందీ లేనిదీ అతనికే తెలియదు. ఒక్కనాడు కూడా తనపని తాను చేసుకోలేడు. ఇటువంటివాడు యిల్లు వదలిపెట్టి యేలావచ్చాడా అని ఆలోచిస్తున్నాను. అతనికి తల్లి దండ్రీ అంతా వున్నారనికూడా విన్నాను. కాని వాళ్ళహృదయాలు రాతివని అనుకుంటాను. నేనైతే అలాంటివాణ్ణి కను చాటుకానిచ్చేదాన్ని కాదు."

ఆ వుత్తరానికి మనోరమ గమ్మత్తుగా జవాబుయిచ్చింది - "నీ వుత్తరంవల్లా-సమాచారంవల్లా నాకు తెలిసిందేమంటే, మీ యింట్లో ఒక కోతిని పెంచుతున్నావని అనుకుంటున్నాను. నువ్వు దానికి సీతాదేవివయ్యావు......అయినప్పటికి తగిన జాగ్రత్తలోవుండు. ఇంకా—ఇంకా—నీ మనోరమ."

ఆ వుత్తరం చదివేసరికి మాధవికి కొంచెం ముఖం ఎర్రబడింది. ఆమె యింకొక వుత్తరంలో - "నువొక మాడు ముఖందానివి. అందుచేత ఎవరితో హాస్యమాడాలో - ఎలా హాస్యమాడాలో కూడా తెలవదు" అని రాసింది.

ఒకనాడు మాధవి ప్రమీలను పిల్చి - "సినా మాష్టరు గారి కళ్ళజోడు ఎలావుంది?" అని అడిగింది.

"బాగానేవుంది"

"ఎలా తెలిసింది?"

"మాష్టరుగారు ఆ కళ్ళజోడుతో చాలా బాగా చదువు తున్నారు. అది చూసి బాగుందనుకున్నాను."

"ఆయన స్వయంగా ఏమీ అనలేదా ?"

"లేదు, ఏమీ అనలేదు."

మాధవిముఖం ఎప్పుడూ ఆనందంగావుండేది. ఇప్పుడు కొంచెం మాడిపోయింది. కాని ఆ వెంటనే నవ్వుతూ– ఈ జోడుకూడా పారవేసుకోవద్దని మీ మాష్టరుగారికి చెప్పు" అన్నది.

"సరే చెపుతాను."

'ఛత్ - పిచ్చిదానా? అలా చెప్పేవు? ఏమన్నా అనుకోగలడు.'

"అయితే ఏమీ చెప్పవద్దా?"

"వద్దు"

శివచంద్రుడు మాధవిఅన్న. ఒకనాడు మాధవి అడిగింది – "ప్రమీలమాష్టరుగారు రాత్రింబగళ్ళు ఏం చదువుతుంటారో తెలుసా అన్నయ్యా?"

శివచంద్రుడు బి.ఎ. చదువుతున్నాడు. చిన్నచిన్న క్లాసులు చదువుతుండే ప్రమీలచదువూ – ఆమెమాష్టరు అతని దృష్టిలోలేరు. అతను ఉపేక్షాభావంతో. "ఏదో నాటకాలూ. నవలలూ చదువుతుంటారు. యింకేమి చదువుతారు?" అని అన్నాడు.

కాని ఈ మాటమీద మాధవికి విశ్వాసం కలగలేదు. ఆమె ప్రమీలతో సురేంద్రుడు చదువుతుండే పుస్తకం ఒకటి యెవరికీ తెలియకుండా తెప్పించింది. అది అన్నగారి కిచ్చి – . "యిది నాటకం— నవల కాదని నాకు తోస్తూంది" అంది.

శివచంద్రుడు ఆపుస్తకాన్ని అటూ యిటూ కొన్ని పేజీలు తిరగవేసి చూశాడు. కాని ఏమీ అర్థంకాలేదు. కాని ఇందు లోని ఒక్క అక్షరంకూడా తనకు తెలియలేదనీ యిదేదో గణితమనీ గ్రహించాడు.

కాని చెల్లెలి ఎదట తన గౌరవం పోగొట్టుకోవడం అతనికి యిష్టంలేదు. అందువల్ల "యిది గణితపుస్తకం స్కూళ్ళలో చిన్న తరగతులకు చెప్తారు" అన్నాడు.

ఎంతో విచారంగా మాధవి అడిగింది "అయితే పెద్ద తరగతిదికూడా కాదన్నమాట? కాలేజీపుస్తకంకూడా కాదా?"

శివచంద్రుడు శుష్కంగా జవాబు చెప్పాడు - "కాదు"

కాని ఆనాటినుంచీ శివచంద్రుడు బుద్ధిపూర్వకంగా సురేంద్రనాథుని యెదుటకు వచ్చేవాడు కాదు. అతనికి భయం కలిగింది. ఆయన ఏమైనా అడిగినట్లయితే తాను సమాధానం చెప్పలేనప్పుడు తండ్రిగారి ఆదేశానుసారంగా ప్రమీలతో పాటు తానుకూడా ప్రొద్దున్నే పెన్సిలు -పుస్తకంతో మాష్టరుగారిదగ్గర కూచోవాలి.

కొన్నిరోజులు గడిచాక మాధవి తండ్రిగారితో అన్నది - "నాన్నా! నేను కొంతకాలం కాశీ వెళ్ళి వుంటాను"

వ్రజబాబు చాలా విచారంతో —"యిదేమిటమ్మా? నువ్వెళ్ళినట్లయితే ఈ కాపురం ఏమైపోవాలి?" అని.

"తిరిగి వస్తానుగా నాన్నా! ఒక్కసారే వెళ్ళిపోవడం లేదుగా!"

తండ్రిగారి కళ్ళలో నీళ్ళు గమనించి మాధవి నవ్వింది. తను అలా చెప్పటం అనుచితమేనని కూడా అనుకుని - తన

మాటను సంబాళించుకునేందుకు అన్నది—"కొద్దిరోజు లుండి తిరిగి వస్తాను."

"అయితే వెళ్ళమ్మా ! కాని కాపురం జరగదు."

"నేను లేకుండా కాపురం జరగదా?"

"ఎందుకు జరగదు? జరుగుతుంది. కాని, చుక్కాని విరిగి నప్పుడు నావ ఏవిధంగా పోతూవుంటుందో. అలాగే పోతూ వుంటుంది కాపురం."

కాని, కాశీ వెళ్ళడం అత్యంతఅవసరం. అక్కడ ఆమె విధవ ఆడబిడ్డ తన కొడుకుతో వుంటూంది. వాళ్ళను ఒకసారి చూసి రావాలి.

కాశీ వెళ్ళేరోజున ఆమె ఒక్కొక్కరినే పిల్చి గృహభారం నప్పగించింది. వృద్ధదాసీని పిల్చి — తండ్రినీ, అన్ననూ, ప్రమీలలను జాగ్రత్తగా చూస్తూవుండమని చెప్పింది. కాని మాష్టరుగారి విషయం ఎవరికీ చెప్పలేదు. అంటే మర్చిపోయి కాదు. అంతా తెలిసివుండే చెప్పలేదు. ఇప్పుడు ఆయనమీద ఆమెకు కోపంగావుంది. మాధవి అతనికి ఎన్నోపనులు చేసి పెట్టింది. కాని దానికి తగినట్లుగా అతను కృతజ్ఞతా సూచకంగా ఒక్కమాటకూడా నోటినుంచి బయటకు రానీయలేదు. అందువల్ల తను పరాయిదేశంపోయి, ఈ అసమర్థునికి, ఈ ప్రపంచజ్ఞానహీనునికి, ఉదాసీనంగా వుండే మాష్టరుకు తానుకూడా వున్నానని తెలియచేయాలనుకుంది. కొంచెం హేళనచేస్తే తప్పేముంది. ఆమె లేనప్పుడు మాష్టరుగారికి కాలం ఎలాగడుస్తుందో చూడాలనుకుంది. అందువల్ల ఆమె వెళ్ళేప్పుడు సురేంద్రుని సంగతి ఎవరికి ఏమీ చెప్పలేదు.

సురేంద్రనాథుడు ప్రాబ్లం సాల్వ్ చేస్తున్నాడు. అప్పుడు ప్రమీలా వచ్చి–"పెద్దక్కయ్య కాశీ వెళ్ళింది మాష్టరు గారూ" అని చెప్పింది.

ఈ మాట అతని చెవుల్లో దూరలేదు. ఆయన ఆమాట మీద ధ్యాస వుంచలేదు. కాని మూడురోజు లయాకకూడా భోజనానికి ఎవరూ వేధించలేదు. ఒక్కొక్కరోజు ఒకటీ రెండు గంటలయేది. స్నానమయాక బట్ట విడవా లనుకున్నప్పుడు అప్పటిలా వుతికిన బట్టలుండేవికావు. రాత్రులు లైటు తీసి వేయడానికి ఎవరూ వచ్చేవారుకాదు. చదువుతూ కూచుంటే ఒక్కొక్కరోజు – రెండు మూడు గంటలయేది. నిద్రమెల కువవచ్చేదికాదు. లేవడం ప్రొద్దెక్కుతూంది. పగలంతా నిద్రమత్తుగా వుండేది. శరీరమంతా బరువుగా వుండేది. అప్పుడు యీ యింట్లో కొంచెం పరివర్తనం కలిగిందని వూహించాడు. మనుష్యులు వుక్కగా వున్నదని అనుకున్న ప్పుడే వినవకర్రకోసం వెదకుతాడు.

ఆయన పుస్తకంమీదనుంచి చూపులు మళ్ళించి అడిగాడు –"ఏం ప్రమీలా! పెద్దక్కయ్య యిక్కడ లేదూ?"

"ఆమె కాశీ వెళ్ళింది,"

"ఆ...అందుకనే..."

ఆ తరువాత రెండు రోజులయాక ఒకనాడు చటుక్కున ప్రమీలను అడిగాడు "పెద్దక్కయ్య ఎప్పుడు వస్తుంది?"

"ఒక నెలాయక."

ఆ తరువాత సురేంద్రనాథుడు పుస్తకంలో లీనమయాడు. యింకా అయిదురోజులు గడిచినయ్! సురేంద్రనాథుడు

పెన్సిల్ పుస్తకంమీద పెట్టి - "ఒక నెలకు యింకా ఎన్ని రోజు లున్నాయ్?" అని అడిగాడు.

"చాలా రోజులు"

పెన్సిల్ చేతపట్టుకొని - కళ్ళద్దాలు తీసి తుడిచి - మళ్ళీ పెట్టుకొని పుస్తకం వేపు చూస్తున్నాడు.

ఆమరునాడు ఆయన అడిగాడు - "ప్రమీలా: నువ్వు పెద్దక్కయ్యకు వుత్తరం రాయవా?"

"ఎందుకు రాయను?"

"తొందరగా రమ్మని రాయలేదూ?"

"లేదు ."

సురేంద్రనాథుడు ఒక్క నిశ్వాసం విడిచి—"అందుకనే" అన్నాడు.

ప్రమీల అడిగింది. "మాష్టరుగారూ! పెద్దక్కయ్య వస్తే బావుంటుంది కదూ?"

"అవును. బాగానేవుంటుంది"

"రమ్మని రాయనా?"

"రాయ్"

"మీ విషయంకూడా రాయనా?"

"రాయ్—"

వుత్తరం రాయమని చెప్పడానికి ఏవిధమైనసంకోచం కలగ లేదతనికి. ప్రపంచంలోనిపద్ధతులూమర్యాదలూఅతనికి తెలవ్వు. పెద్దక్కయ్యనురమ్మనమని కోరడంలో అతని కేవిధమైన అసంగతమనికూడా తోచలేదు. వినడానికి సొంపుగా లేదనికూడా తెలవదు. ఎవరు లేకుంటే తనకు కష్టమో—ఎవరు లేనిదే తన

పనులు జరగనో—అటువంటి ఆమెను గమ్మునమని ప్రార్థించడం తప్పుగా కనుపించలేదు. ప్రపంచంలో కుతూహలం తక్కువగా వుండేవాళ్లు సాధారణంగా మనుష్య సమాజానికి కొంచెం వెలపల వుంటారు. సాధారణ మనుష్యులు తిరిగే సమాజంలో వాళ్ళకు పొత్తుకుదరదు. సాధారణ మనుష్యుల అభిప్రాయాలతో వాళ్ళ అభిప్రాయాలు కలవవు. సురేంద్రుడు కుతూహలపడే స్వభావం కలవాడు కాదు. తనకు ఎంత వరకు అవుసరమో అంతవరకే తెలుసుకుంటాడు. ఆ పైన ఒక్క అడుగైనా ముందుకు వేయడు. అందుకు తీరుబడికూడా వుండదు. అందుచేత అతను పెద్దక్కయ్య విషయంలో అతను అనభిజ్ఞుడు. ఈ యింట్లో యింతకాలం గడిచిపోయింది. ఈ మూడు నెలలూ తన భారమంతా పెద్దక్కయ్య మీద పెట్టి అతను పరమసుఖం పొందాడు. కాని ఆమె ఎటువంటిదో తెలుసుకోవాలని, ఎంత పెద్దదో – ఎంత వయసో–చూడ్డానికి ఎలా వుంటుందో – గుణాలు యెటువంటివో తెలవదు. తెలుసుకోవాలని కోరికా లేదు. పైగా అతనికి ఆవూహా ఎప్పుడూ కలగలేదు. అందరూ పెద్దక్కయ్యా అంటారు. గనుక, తాను పెద్దక్కయ్య అని పిలుస్తున్నారు. అందరూ ఆమె ఆదరాల్ని పొందుతున్నారు. కనుక తానూ పొందుతున్నాడు. ఆమెవద్ద ప్రపంచంలోని విశ్వభాండారముంది. యెవరు కోరుతారో వాళ్ళకు దొరుకుతూంది. సురేంద్రుడు కూడా తీసుకున్నాడు, యిందులో ఆశ్చర్య మేమీలేదు. సుఖాలపని సృష్టించడం! పెద్దక్కయ్యపని అందర్నీ ప్రేమించడం– ఆదరించడం. కష్టం కుసుసున్న పనులు చేయిచాపి గోరిపిల్లలైనా కూడా

పెద్దక్కయ్యవద్దనే చేయిచాపితే . . కోరినవస్తువు దొరుకుతుంది. మేఘంలానే ఆమె గ్రుడ్డిది. వాంఛకూడా ఆకాంక్షాహీనం! ఆమెనుగురించి ఒకవిధంగా యిదే అభిప్రాయానికి వచ్చాడు. యిప్పుడుకూడా అలాగేవుందా అభిప్రాయం? ఆమె కాశీ వెళ్ళినప్పటినుంచీ — పెద్దక్కయ్య లేనిదే తాను ఒక్క క్షణం కూడా గడపలేనని తెలుసుకున్నాడు.

అతను తన యింటిదగ్గరున్నప్పుడు తండ్రినీ, సవతితల్లినీ ఎరుగును. వాళ్ళ కర్తవ్యమేమిటోకూడా తెలుసు? కాని పెద్దక్కయ్య అనేవారితో ఎవరితోనూ పరిచయంకాలేదు. పరిచయమైనప్పటినుంచి యిలాగే వుంటుందని గ్రహించాడు. కాని మనిషిని యెరుగడు. గుర్తించలేదు. పేరుమాత్రం తెలుసు? పేరు గుర్తించగలడు. కాని మనిషితో నిమిత్తం లేదు. పేరే సర్వస్వమూ!

లోకులు ఏవిధంగా దేవతలను చూడలేరో . కేవలం పేరు వ్రాసుకుని—సుఖాల్లోనూకష్టాల్లోనూ తమహృదయాన్ని విప్పేసి మోకరించి,కరుణాభిక్షఅడుగుతారు.కళ్ళల్లోనీళ్ళువచ్చినప్పుడు వాటిని తుడుచుకుని—శూన్యంగా ఏదో చూడాలని ప్రయత్నిస్తారు. కాని ఏమీ చూడలేరు. అప్పుడు అస్పష్టంగా ఏదో ఉచ్చరించి ఆగిపోతారు. సరిగ్గా ఆవిధంగానే సురేంద్రనాథుడు దుఃఖంచెంది అస్పష్టంగా 'పెద్దక్కయ్యా' అని ఉచ్చరించాడు.

## 5

అప్పటికి యింకా సూర్యోదయం కాలేదు. కాని తూర్పు దిక్కు ఎర్రబడింది. ప్రమీలవచ్చి నిద్రపోతూన్న సురేంద్ర

నాథుని మెడను చుట్టేసుకుని అన్నది. "మాష్టరుగారూ"

నిద్రమత్తుతో వున్న రెండుకళ్ళను కొంచెం యెత్తి-"ఏమిటి ప్రమీలా?" అని అడిగాడు.

"పెద్దక్కయ్య వచ్చింది."

సురేంద్రనాథుడు లేచి కూచున్నాడు. ప్రమీలచేయిపట్టుకుని-"పద చూచి వద్దాం" అన్నాడు.

ఇలా చూచివద్దామనే ఆలోచన అతనికి యెలా కలిగిందో తెలియదు. అతను కళ్ళు నలుపుకుంటూ ప్రమీల చేయి పట్టుకుని ఎందుకు లోపలికి వెళ్ళాడో తెలియదు. అతను లోపలికి వెళ్ళి మెట్లుఎక్కి పైకి వెళ్ళాడు. మాధవిగదిముందు నిలుచుని "పెద్దక్కయ్యా" అని పిలిచాడు.

పెద్దక్కయ్య ఏదో పనిచేసుకుంటూ పరధ్యానంగా "ఏమిటే ప్రమీలా?" అని అడిగింది.

"మాష్టరుగారు."

అప్పటికే యిద్దరూ గదిలోకి వెళ్లారు. మాధవి గాభరా పడుతూ లేచి తలమీదకు ముసుగులాక్కుని ఒక మూలకి వెళ్ళి నిలుచుంది. సురేంద్రనాథుడు అన్నాడు "పెద్దక్కయ్యా! నీ మూలాన నేను చాలా కష్టం..."

మాధవి ముసుగులోంచే సిగ్గుతో నాలుక కరుచుకుని-'ఛీ ఛీ' అని అనుకుంది!

"నువ్వెళ్ళిపోయాక..."

మాధవి మనసులోనే అనుకుంది—'ఎంతసిగ్గుచేటు?' ఆ తరువాత కోమలంగా ప్రమీలతో అంది "ప్రమీలా! మాష్టరుగారిని బయటికి వెళ్ళమని చెప్పు?"

ప్రమీలా చిన్నపిల్లే. కాని పెద్దక్కయ్య ముఖం చూసి తాము చేసినపని మంచిదికాదని తెలుసుకుని మాష్టరుగారితో- "పదండి మాష్టరుగారూ" అన్నది.

కొంచెంసేపు సురేంద్రుడు అప్రతిభుడై నిలుచుని-ఆతరు వాత-'పద' అన్నాడు. అతని కతిగా మాట్లాడంచేతకాదు. ఎక్కువగా మాట్లాడాలనికూడా అనుకోడు. కాని పగలంతా మేఘాలచాటునవుంటే, ఆవేపు అంతా ఎలా చూస్తుంటారో- తరువాత సూర్యుని చూడకూడదు, చూస్తే కళ్ళకు బాధకలుగుతుందని ఒక్కక్షణం అనిపించదో-అలాగే ఒక నెలరోజులు మేఘాచ్ఛన్నమైన ఆకాశంక్రింద వున్నాక - మొట్టమొదటి సారిగా సూర్యోదయాన్ని ఎంతో ఆహ్లాదంగా చూద్దామని వెళ్ళాడు. కాని ఫలితం యిలా జరుగుతుందని వూహించలేదు. అప్పటినుంచి ఆదరంలోనూ అన్నిటిలోను కొంచెం తగ్గుదల కనుపించింది. మాధవి కొంచెం సిగ్గుపడిందికూడా! ఎందుకంటే బిందుమతి అనే దాసి ఒకసారి అతణ్ని ఎగతాళిచేసింది. సురేంద్రనాథుడుకూడా కొంచెం చిన్నబుచ్చుకున్నాడు. అంతులేని పెద్దక్కయ్య భాండారంలో ఏదో హద్దుఏర్పడినట్లు గ్రహించాడు. సోదరిప్రేమ తల్లివాత్సల్యం అతణ్ని స్పర్శించడంలేదు. కొంచెం దూరదూరంగా తొలగిపోతున్నాయ్!

ఒకనాడు ప్రమీలతో. "పెద్దక్కయ్యకు నామీద కోపం వచ్చిందికదూ?" అని అడిగాడు.

"అవును."

"ఎందు కబ్బా?"

"మీ రానాడు అలా యింట్లోకి ఎందుకు వెళ్ళారు?"

"వెళ్ళకూడదుకదూ? అంతేనా?"

"అలారావచ్చా మరి? అక్కకు చాలాకోపంవచ్చింది."

సురేంద్రనాథుడు పుస్తకం చూస్తూ—'అదే-' అని అనుకున్నాడు.

ఆతరువాత ఒకనాడు మధ్యాహ్నం వర్షంకురుస్తూంది. వ్రజరాజబాబు రెండు రోజుల్నుంచి యింట్లోలేడు. తన జమీందారీ చూసుకోవడానికి వెళ్లాడు. మాధవిచేతిలో పనేమీ లేదు. ప్రమీలకూడా చాలా గోలచేస్తూంది. మాధవి అన్నది "ప్రమీలా! నీ పుస్తకాలు తీసుకునిరా! ఎంతవరకు చదివిందీ చూస్తాను."

ప్రమీల ఒక్కసారిగా కొయ్యబారిపోయింది.

"పట్టుకురా—" అన్నది పెద్దక్కయ్య.

"రాత్రికి పట్టుకొస్తాను."

"కాదు యిప్పుడే."

ఏడుపు ముఖంతో పుస్తకాలుతీసుకునిరావడానికి వెళ్ళివచ్చి "మాష్టరుగారు నాకు చదువు చెప్పడంలేదు. ఆయనే చదువుకుంటుంటారు."

మాధవి ప్రమీలను కొన్ని ప్రశ్నలడిగింది. మొదటినుంచి. చివరవరకు అడిగింది. ప్రమీల ఏమీ చెప్పలేకపోయింది. అందువల్ల మాష్టరుగారు ఏమీ చెప్పడంలేదని తెలుసుకున్నది. పైగా అదివరకు చదువుతున్నదంతా యీ మూడు నాలుగు మాసాల్లో అంతా మరచిపోయింది. మాధవికి కోపంవచ్చి బిందును పిలిచి చెప్పింది—"బిందూ! ప్రమీలకు సరిగ్గా చదువెందుకు చెప్పడంలేదో మాష్టరుగారిని అడిగిరా"

బిందు వెళ్ళేసరికి మాష్టరుగారు ప్రాబ్లం సాల్వ్ చేయడంలో మునిగి వున్నాడు. బిందు అడిగింది - "మాష్టరుగారు, ప్రమీలకు చదువు ఎందుకు చెప్పడంలేదో పెద్దక్కయ్య కనుక్కొని రమ్మన్నది"

కాని మాష్టరుగారి కేమీ వినిపించలేదు. బిందు ఈ సారి గట్టిగా - "మాష్టరుగారూ!" అని పిల్చింది.

"ఏమిటి?"

"పెద్దక్కయ్య అడగమంది..."

"ఏమని...?"

"ప్రమీలకు చదువు ఎందుకని చెప్పడంలేదు?"

అన్యమనస్కునివలె అన్నాడు. "బాగా వుండడంలేదు"

ఈమాట అంత చెడ్డదికాదనుకుంది బిందు. ఆమె వెళ్ళి యీ మాటే మాధవికి చెప్పింది. మాధవికి యింకా కోపం వచ్చింది. ఆమె క్రిందకు వచ్చి తలుపుచాటుగా నిలుచుని బిందుతో అడిగించింది - "ప్రమీలకు చదువు ఎందుకని చెప్పడంలేదు?"

రెండు మూడుమార్లు అడిగించాక - 'నేను చదువు చెప్పలేను' అన్నాడు.

మాధవి యిలా అంటాడేమో అని ఆలోచించింది.

బిందు అడిగింది - "అటువంటప్పుడు మీ రిక్కడ ఎందుకుంటున్నారు?"

"వుండకుంటే ఎక్కడికి వెళ్ళను?"

"అటువంటప్పుడు చదువు ఎందుకని చెప్పరు?"

సురేంద్రునికి యీసారి స్పృహవచ్చింది. ఆయన బిందు

వేపు తిరిగి కూచుని. "నువ్వు అడిగేదేమిటి?" అని అడిగాడు.

బిందు యింతవరకు చెప్పిందే తిరిగి చెప్పింది. సురేంద్రుడు అన్నాడు. "రోజూ చదువుతూనే వుందిగా?"

"చదువుతున్నదీ లేనిదీ మీరు చూస్తున్నారా?"

"లేదు, నాకు తీరుబడి లేదు."

"మరి యీ యింట్లో యెందుకుంటున్నారు?"

సురేంద్రుడు మాట్లాడలేదు.

"అయితే ప్రమీలకు చదువు చెప్పలేరా?"

"లేదు. చదువు చెప్పడం నాకు జ్ఞాపకముండదు."

మాధవి లోపల్నుంచే అడిగింది–"సరే బిందూ! మరి ఆయన యెందుకు వుంటున్నారో చెప్పమను?"

బిందు ఆ మాట అడిగింది.

ఆ మాట వినగానే సురేంద్రుని ప్రాణం ఎక్కడి దక్కడ యెగిరిపోయింది. ఆయన కొంచెం విచారంగా – "అయితే చాలా పొరపాటయింది." అన్నాడు.

ఆ పొరపాటు నాలుగుమాసాలవరకా?"

"అవును, అలానే అనిపిస్తూవుంది. యీ సంగతి నాకింత వరకూ గుర్తులేదు."

ఆ మరునాడు ప్రమీల చదువుకునేందుకు రాలేదు. సురేంద్రనాథుడుకూడా ఎక్కువ అభ్యాసవుంచలేదు. ఆ మూడోనాడు కూడా రాలేదు. ఆరోజుకూడా అలాగే జరిగిపోయింది.

నాలుగోనాడు కూడా ప్రమీల రాకపోయేసరికి ఒక నౌకరును పిల్చి–'ప్రమీలను పిల్చుకునిరా' అని చెప్పాడు.

నౌకరు లోపలికి వెళ్ళివచ్చి–'యిక ప్రమీల మీ వద్ద చదువుకోదు' అని చెప్పాడు.

'మరి ఎవరిదగ్గర చదువుకుంటుంది?'

నౌకరు కొంచెం తెలివి వుపయోగించి. 'యింకొక మాష్టరు వస్తారు' అని చెప్పాడు.

అప్పుడు తొమ్మిది గంటలవుతుంది. సురేంద్రనాథుడు కొంచెంసేపు ఆలోచించి-నాలుగైదు పుస్తకాలు చంకలో పెట్టుకుని నిల్చున్నాడు. కళ్ళజోడు మడిచి కేసులో పెట్టి టేబులుమీద పెట్టాడు. మెల్లమెల్లగా బయటికి వెళ్ళాడు.

'మాష్టరుగారూ! ఎక్కడికి యిప్పుడు వెళుతున్నారు?' అని నౌకరు అడిగాడు.

'నేను వెళ్ళిపోతున్నానని పెద్దక్కయ్యతో చెప్పు.'

'అయితే యిక రారా!'

సురేంద్రనాథుడు ఆ మాట వినిపించుకోలేదు. జవాబు చెప్పకుండానే గేటుదాటి బయటకు వెళ్ళాడు. రెండు గంటలైంది. కాని సురేంద్రనాథుడు తిరిగి రాలేదు. అప్పుడు నౌకరు వెళ్ళి మాష్టరుగారు వెళ్ళిపోయారని చెప్పాడు.

"ఎక్కడికి వెళ్ళారు?"

"ఆసంగతి చెప్పలేదు. తొమ్మిదిగంటలకు వెళ్ళిపోయారు. వెళ్ళేప్పుడు నాతో "నేను వెళ్ళిపోతున్నానని పెద్దక్కయ్యతో చెప్పు." అని వెళ్ళారు."

"అదేమిటిరా, ఏమీ వినకుండానే వెళ్ళిపోయారా?"

మాధవి ఉద్విగ్నురాలైంది. ఆ తరువాత ఆమె స్వయంగా సురేంద్రనాథుని గదిలోకి వెళ్ళింది. ఎక్కడి వస్తువు లక్కడ వున్నయ్. కళ్ళజోడు కేసులో పెట్టి టేబులుమీద వుంది. కొన్ని పుస్తకాలు మాత్రం లేవు.

చీకటిపడింది. రాత్రయింది. కాని సురేంద్రనాథుడు రాలేదు. ఆ మరునాడు మాధవి నౌకరులను పిల్చి – "మీరు మాష్టరుగారి అంతు తెలుసుకుని తీసుకునివచ్చారంటే పదిపది రూపాయలు బహుమతి యిస్తాను." అని చెప్పింది.

బహుమానంమీది ఆశతో వాళ్ళంతా నాలుగువేపులా పరుగుతీశారు. కాని చీకటిపడుతుండగా వచ్చి – 'ఎక్కడా జాడలేదమ్మా' అని చెప్పారు.

ప్రమీల ఏడుస్తూ "పెద్దక్కయ్యా! మాష్టరుగా రెందుకు వెళ్ళారు?" అని అడిగింది.

మాధవి ఆమెను ప్రక్కకులాగి–'బయటికి వెళ్ళు, ఏడవకు—' అని అంది.

రెండూ, మూడూ, యిలా రోజులు గడుస్తున్నకొద్దీ మాధవి ఉద్విగ్నత ఎక్కువైంది. బిందు–పెద్దక్కయ్యా! ఆయన కోసం యింత యిదిగా వెదకడమెందుకు? ఈ కలకత్తా పట్నంలో యిక మాష్టర్లే దొరకరా?' అని అడిగింది.

మాధవి కోపంచేసి అంది–'అవతలికివెళ్ళు! చేతిలో దమ్మిడీ లేకుండా ఒక మనిషి వెళ్ళిపోయాడు. అటువంటప్పుడు వెతకడం దేనికంటావా?'

"ఆయనదగ్గర ఒక్క దమ్మిడీకూడా లేదని ఎలా తెలుసు?'

'నాకు తెలుసు! అయినా నీకీ సంగతులన్నీ ఎందుకు?'

బిందు మెదలకుండా వూరుకుంది. మెల్ల మెల్లగా ఏడు రోజులు గడిచినయ్. ఆయన తిరిగి రాలేదు. అప్పటినుంచీ ఒక విధంగా మాధవి ఆహారం త్యాగంచేసింది. సురేంద్రనాథుడు ఆకలిగా వున్నాడేమోనని తట్టింది. ఇంట్లోని వస్తువుల్నే అడిగి

తినలేనివాడు. యితరులను అడిగి తినగలడని యెవరనుకుంటారు? సురేంద్రనాథునివద్ద యేదేని కొనుక్కొని తినడానికి దమ్మిడీకూడా లేదని మాధవికి తెలుసు! అడుక్కొని తినే సామర్థ్యంకూడా లేదు. అందుకని అతను యెక్కడో దూరంగా ఒకప్రక్కగా అసహాయ స్థితిలో కూచుని చిన్న పిల్లవానిలా యేడుస్తూంటాడు. లేకుంటే ఏదేని చెట్టుక్రింద పుస్తకాలు పెట్టుకుని పడుకుని వుంటాడు.

బ్రజబాబు యింటికివచ్చి, సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని మాధవితో – "అమ్మాయీ! నువ్వు చేసినపని అంత మంచిదికాదు" అన్నాడు.

మాధవికి ఎంతో కష్టమనిపించింది. కన్నీళ్ళాపుకోలేకపోయింది.

అటు సురేంద్రనాథుడు రోడ్డంట తిరుగుతున్నాడు. నాలుగు రోజులు భోజనం లేకుండానే గడిపాడు. పంపునీళ్ళకు డబ్బెవరూ అడగరు. అందువల్ల ఆకలైనప్పుడు కడుపునిండా నీళ్ళు త్రాగేవాడు.

ఒకరోజు రాత్రి అలసిపోయిన శరీరంతో కాళీఘాటు వేపు వెళుతున్నాడు. అక్కడ భోజనం దొరుకుతుందని ఎవరో చెప్పగా విన్నాడు. చీకటిరాత్రి, పైగా ఆకాశాన్ని మేఘాలు దట్టంగా అల్లుకున్నయ్. చౌరంగీ మలుపులో ఓ గుర్రపుబండి అతని గుండెలమీదుగా పోయింది. బండివాడు ఎంతో బలవంతంగా గుర్రాల వేగాన్ని తగ్గించాడు. అందువల్ల సురేంద్రనాథుని ప్రాణాలు పోలేదు కాని, గుండెకూ, ఊపిరితిత్తులకు పెద్దదెబ్బతగిలి స్పృహతప్పి పడిపోయాడు. పోలీసులు

అతన్ని బండిలో ఆసుపత్రికి చేర్చారు. నాలుగైదు రోజుల వరకూ స్పృహలేకుండానే పడివుండి ఒకనాటిరాత్రి అతను కళ్ళు తెరిచి "పెద్దక్కయ్యా!" అని అన్నాడు.

ఆనాటిరాత్రి మెడికల్ కాలేజీ విద్యార్థి ఒకడు డ్యూటీలో వున్నాడు. ఆమాట విని అతడు దగ్గరకు వచ్చాడు. సురేంద్రనాథుడు అడిగాడు. "పెద్దక్కయ్య వచ్చిందా?"

"రేపు ఉదయం వస్తుంది."

ఆ మరునాడు సురేంద్రనాథునికి స్పృహవచ్చింది. కాని పెద్దక్కయ్యసంగతి యెత్తలేదు. తీవ్రమైన జ్వరంలో పగలంతా కొట్టుకుని, ఆ సాయంకాలం ఒక మనిషిని పిలిచి "నేను ఆసుపత్రిలో ఉన్నానా?" అని అడిగాడు.

"అవును."

"ఎందుకు?"

"మీరు బండిక్రింద పడ్డారు."

"బ్రతుకుతానా?"

"ఆ....."

ఆ మరునాడు గతరాత్రి డ్యూటీలోవున్న విద్యార్థివచ్చి 'యిక్కడ మీకెవరైనా ఆత్మీయులున్నారా?' అనిఅడిగాడు.

"ఎవరూ లేరు."

"మరి ప్రతిరోజూ మీరు రాత్రులు 'పెద్దక్కయ్యా' అని పిలుస్తున్నారు. వారు యిక్కడే వున్నారా?"

"వున్నారు. కాని రాదు. నా తండ్రిగారికి ఈ కబురు పంపగలగా?"

"ఆ...! పంపగలను."

సురేంద్రనాథుడు తన తండ్రి అడ్రసు యిచ్చాడు. ఆ విద్యార్థి ఆనాడే వుత్తరం రాసేశాడు. ఆ తరువాత 'పెద్దక్కయ్య' సంగతి తెలుసుకోవాలని- "ఒక వేళ స్త్రీలు రావాలనుకుంటే యథేచ్ఛగా రావచ్చు. మేము అందుకు తగిన ఏర్పాట్లు చేయగలం. మీ పెద్దక్కయ్యగారి అడ్రసు చెపితే అక్కడికికూడా కబురు పంపగలను." అని చెప్పాడు.

సురేంద్రనాథుడు కొంచెంసేపు ఆలోచించి వ్రజరాజబాబు అడ్రసు చెప్పాడు.

"మాయిల్లు వ్రజబాబుగారింటిదగ్గర్లోనేవుంది. ఇవాళ వారితో మీ స్థితి చెపుతాను. రావాలనుకుంటే చూడడానికి రావచ్చు."

సురేంద్రుడు ఏమీ అనలేదు. పెద్దక్కయ్య రావడం అసంభవమని అనుకున్నాడు. కాని ఆ విద్యార్థి దయామయుడు. వ్రజబాబుకు ఆ సమాచారం తెలియచేశాడు.

వ్రజరాజబాబు త్రుళ్ళిపడి-'బ్రతుకుతాడా?'అనడిగాడు.

'అవును. ఆశ పూర్తిగావుంది.'

వ్రజబాబు యింట్లోకివెళ్ళి కస్తూరితో చెప్పాడు. 'మాధవీ! అనుకున్నట్టే జరిగింది. సురేంద్రుడు బండిక్రిందపడి హాస్పటల్లో వున్నాడు.'

మాధవి అంగ-ప్రత్యంగాలు కంపించిపోయినయ్!

'అతను పెద్దక్కయ్యా' అని పలవరిస్తున్నాడట. మరి చూచేందుకు వెళతారా?'

ఆ సమయంలో ప్రక్కగదిలో ప్రమీల గళ్ళున యేదో పడేసింది. మాధవి అటువేపు పరుగెత్తింది. చాలసేపయాక తిరిగివచ్చి అంది - 'మీరు చూసిరండి? నేను రాలేను.'

వ్రజరాజబాబు విచారభావంతో అన్నాడు—"అతడు అశివి జం పెవ్వులాంటివాడు. అటువంటివాడిమీద కోపం ఎందుకు?'

మాధవి జవాబేమీ చెప్పలేదు. వ్రజరాజబాబు వెంటరి గానే సురేంద్రనాథునిదగ్గరకు వెళ్ళి ఎంతో విచారంగా 'మీ నాన్నకు కబురుచేస్తేయేం?' అన్నాడు.

'కబురుచేశాను.'

'భయమేమీ లేదు. ఆయనరాగానేతగినఏర్పాట్లుచేస్తాను.'

సబ్బు—దస్కంసంగతి ఆలోచించి వ్రజబాబు—'మరి నాకు వాడు అడ్రసు చెపితే మధ్యలో వారు యిక్కడకి రావడానికి అభ్యంతరాలువుంటే వాటిని సరిచేస్తాను' అని చెప్పాడు.

ఈ మాటలు సురేంద్రనాథుడు అర్థంచేసుకోలేక —'నాన్న గారు వస్తారు. ఇందులో యిక అభ్యంతరాలు ఏమున్నయ్?' అన్నాడు.

వ్రజబాబు యింటికివచ్చి సంగతంతా మాధవికి చెప్పాడు.

అప్పటినుంచి వ్రజరాజబాబు ప్రతిరోజూ, సురేంద్రనాథుని చూసేందుకు హాస్పిటల్‌కు వెళుతూనేవున్నాడు. సురేంద్ర నాథునిమీద అతనికి ఒకవిధమైన ప్రేమకలిగింది. ఒకనాడు హాస్పిటల్‌నుంచి తిరిగివచ్చి—'మాధవీ! నువ్వే సరిగ్గా వూహించావు. సురేంద్రునితండ్రి చాలా భాగ్యవంతుడు' అని చెప్పాడు.

మాధవి ఆతురతతో అడిగింది! "మీరెలాకనిపెట్టగల్గారు?"

"అతనితండ్రి గొప్పవకీలు. ఆయన నిన్నరాత్రివచ్చాడు."

మాధవి మాట్లాడలేదు. తండ్రి అన్నాడు—"సురేంద్రుడు యింట్లోంచి పారిపోయివచ్చాడట."

"ఎందుకని?"

"ఇవాళ అతని తండ్రితో మాట్లాడాను. ఆయన సంగతంతా చెప్పాడు. ఈ సంవత్సరం సురేంద్రుడు విశ్వవిద్యాలయంలో ఫస్టున ఎం.ఎ. ప్యాసయ్యాడట. అతడు విదేశాల కెళ్ళాలనుకున్నాడట. ఎప్పుడూ పరధ్యాన్నపుమనిషి కావడం వల్ల అతన్ని విదేశాలకు పంపడం తండ్రికి యిష్టంలేదట. కోపంవచ్చి పారిపోయివచ్చాడట. బాగయ్యాక, యింటికి తీసుకుని వెడతాడట.

మాధవి నిట్టూర్పు ఆపుకుంటూ–వస్తున్న కన్నీళ్ళాపుకుని– "అదే మంచిది" అన్నది.

# 6

సురేంద్రనాథుడు యింటికి వెళ్ళి నాలుగు మాసాలైంది. యీమధ్యలో మాధవి మనోరమకు ఒక్క ఉత్తరం మాత్రం రాసింది. ఆ తరువాత మళ్ళీ రాయలేదు.

దసరాపండుగకు మనోరమ పుట్టింటికి వచ్చి – మాధవిని చూడాలని ఒకనాడు ఆమెయింటికి వెళ్ళి–"నువ్వు స్వకోతిని చూపించు" అని వెంటపడింది.

మాధవి నవ్వి. –"నాకు కోతి ఎక్కడిది?" అని అడిగింది. మనోరమ ఆమె గడ్డాన్ని పుణికి పాటపాడుతూ అడిగింది.

"ఏదమ్మా నీ ఎర్రకోతి?
నా కంత ఆశచూపించావే!
నీ రంజిత పాదములచెంత
అదెంత శోభిస్తుందో"

"కోతేమిటి?" అని మాధవి అడిగింది.

"నువ్వు కొంతకాలం పోషించావే అదే."

"ఎప్పుడు?"

మనోరమ నవ్వుతూ. "గుర్తులేదూ? నిన్ను తప్ప ఇంకెవరినీ యెరుగడుగా" అన్నది.

మాధవి ముందే గ్రహించింది. అందువల్ల ఆమెముఖం కొంచెం కొంచెంగా వివర్ణమవుతూంది. అయినప్పటికీ ఆమె తనను తాను సంబాళించుకొని ."అదా! అతన్ని గురించి అడుగుతున్నావా? అతను స్వయంగా తనే వెళ్ళిపోయాడు" అని చెప్పింది.

"నీ రంజితచరణాలు అతనికి శోభించక నేనా?"

మాధవి ఒకప్రక్కకు తల త్రిప్పుకుంది. కాని జవాబు ఏమీా చెప్పలేదు. మనోరమ ఎంతో ఆదరపూర్వకంగా-ఆమె ముఖాన్ని తన వేపు లాక్కుంది. ఆమె ఏదో పరిహాసమాడుదామనుకుంది. మాధవికళ్ళల్లో నీళ్ళు చూసేసరికి ఆమెకెంతో విచారం కలిగింది. ఆమె ఆశ్చర్యపడి-"యిదేమిటి మాధవీ?" అని అడిగింది.

మాధవి తనను తాను సంబాళించుకోలేకపోయింది. కళ్ళకు పైటకొంగు అడ్డుపెట్టుకుని యేడ్చింది.

మనోరమ ఆశ్చర్యానికి అంతులేదు. ఓదార్చాలంటే ఆమెకు చేతకాకపోయింది. కొంచెంసేపటివరకూ యేడవనిచ్చింది. ఆ తరువాత బలవంతముగా ఆమె ముఖంమీాదున్న పమిటికొంగులాగి ."ఏం చెల్లీ! ఏదో మామూలు వేళాకోళంకూడా సహించలేవా?" అని అడిగింది.

మాధవి కళ్ళు తుడుచుకుని—"అక్కయ్యా! నేను విధవను" అంది.

ఆ తరువాత యిద్దరూ చాలాసేపు మెదలకుండా వూరుకున్నారు. ఇద్దరూ భోరికే యేడుస్తున్నారు. మాధవి యేడుస్తుందనీ, ఆమె విధవఅనీ మనోరమ యేడుస్తూంది... కాని మాధవి యేడవడానికి వేరే కారణం వుంది. మనోరమ ఏమీ తెలుసుకోకుండానే-'అతను నిన్నుతప్ప యింకెవరినీ యెరుగడు.' అన్నది. మాధవి అదే ఆలోచిస్తూవుంది. యీ సంగతి నిజమని కూడా ఆమెకు తెలుసు! చాలాసేపయాక "అయినా మంచిపనికాదు" అని మనోరమ అన్నది.

"ఏ పని?"

'చెల్లీ! అదికూడా చెప్పాలా? నేను అంతా గ్రహించాను'

యిటు ఆరుమాసాలనుంచి, మాధవి ఏసంగతి ప్రాణప్రదంగా దాస్తూ వచ్చిందో – ఆ సంగతి మనోరమనద్ద దాచలేకపోయింది. పట్టుపడ్డాక, ముఖందాచుకుని పసిపిల్లలా యేడుస్తూంది.

చివరకు మనోరమ అడిగింది. "మరి ఆయన ఎందుకు వెళ్ళిపోయాడు?"

"నేనే వెళ్ళమని చెప్పాను."

'మంచిపనిచేశావు. బుద్ధివంతులుచేయవలసినపనేచేశావు.'

మనోరమఅంతా గ్రహించిందని మాధవి అనుకుంది. కాని ఏమీ గ్రహించలేదని తెలుసుకున్నాక – సంగతంతా విడమర్చి చెప్పి—"కాని ఆయన బ్రతక్క పోయినట్లయితే—నేను పిచ్చిదాన్ని అయేదాన్ని" అన్నది.

మనోరమ మనసులోనే "యిప్పుడు మాత్రం పిచ్చి దానికంటే తక్కువా?" అనుకుంది.

ఆనాడు చాలా దుఃఖంతో మనోరమ యింటికి వెళ్ళింది. ఆరాత్రికే కాగితం కలం పుచ్చుకుని భర్తకు వుత్తరం రాసింది.

"స్త్రీలకు విశ్వాసంలేదని మీరనేమాట నిజం. ఇప్పుడు నేను కూడా అలానే అంటాను. ఎందుకంటే మాధవి నాకు యివాళ నేర్పింది. ఆమెను బాల్యకాలంనుంచి నేను యెరుగుదును. అందువల్ల ఆమెను దోషిఅని నేననను అలా అనేందుకు సాహసంలేదు. సమస్త స్త్రీ జాతి జాతిమీద దోషం ఆరోపిస్తున్నాను. విధాతమీదకూడా దోషం వేస్తున్నాను. ఆయన స్త్రీ హృదయాన్ని యింత కోమలంగా–నీటిలాంటి తరళ పదార్థంతో ఎందుకని సృష్టించాడు? ఈ హృదయాలను యింకా కొంచెం కఠోరంగా వుండేట్లు సృష్టించమని ఆ భగవంతుని చరణాలసన్నిధికి విన్నపంచేస్తున్నాను. యిక మీకు నా విన్నపం ఏమంటే— మీ చరణాలమీద శిరస్సుంచి – మీ ముఖం వేపు చూస్తూ చనిపోవాలని కోరుతున్నాను. మాధవిని చూస్తూంటే నాకు గుండెలు పగిలిపోతున్నాయ్! ఆమె నాకున్నటువంటి ఆశలన్నీ తల్లక్రిందులుచేసింది. అందువల్ల నన్ను కూడా మీరు నమ్మవద్దు. తొందరగా వచ్చి తీసుకుని వెళ్ళండి."

ఆమె భర్త అది చదువుకుని వుత్తరం రాశాడు.

"రూపం యెవరిదగ్గరుంటుందో వాళ్ళు చూపిస్తారు. గుణాలు యెవరి దగ్గరుంటాయో, వారు వెల్లడిస్తారు. ప్రేమ యెవరి హృదయంలో వుంటుందో–ప్రేమించగలశక్తి ఎవరి

కుంటుందో - వాళ్లు ప్రేమించగలుగుతారు. మాధవీలత రసాలవృక్షాన్ని అవలంబనంగా కోరుతూవుండడం ప్రపంచంలో చిరకాలంనుంచి వస్తున్న విధానం! యిందులో నువ్వూ నేనూ చేయగలిగిందేమీలేదు. నేను నిన్ను యథాప్రకారం ప్రేమిస్తాను. యిందులో నువ్వేమీ విచారం పెట్టుకోవద్దు."

మనోరమ తన భర్తగారి వుత్తరాన్ని కళ్ళకద్దుకొని నమస్కరించి తిరిగి వుత్తరం రాసింది.

"మాధవి దురదృష్టవంతురాలు. ఏవిధవకూడా చేయనిపని చేసింది. ఆమె మనసులోనే యింకొక మనిషిని ప్రేమించింది."

ఉత్తరం చూసి మనోరమ భర్త నవ్వాడు. ఆ తరువాత ఆయన పరిహాసంచేస్తూ రాశాడు.

"మాధవి దురదృష్టవంతురాలని అనడంలో సందేహము లేదు. ఆమె విధవ అయివుండికూడా మనసులో యింకొకరిని ప్రేమించినందుకు అందుకు మీ కందరికీ కోపంవస్తుంది. సధవలుచేయవలసిన పనిలో విధవ యెందుకు చేయివేసిందా అని-నేను బ్రతికివున్నంతకాలం నువ్వు విచారం పెట్టుకోవద్దు. నీ కున్న అవకాశాలు వదులుకోవద్దు. ఈ కొద్ది అవకాశంలోనే ఆనందంగా యింకొకరిని మనసులో ప్రేమించు. కాని మనోరమా! నువ్వు నన్ను చకితుణ్ణి చేయలేకపోయావు. నేను ఒకసారి ఒకలతను చూశాను. అది ఒక కోసుదూరంవరకూ భూమిమీద అల్లుకునిపోయి ఒక్క వృక్షాన్ని ఎక్కింది. ఇప్పుడు దానికి ఎన్ని ఆకులు, ఎన్నిపూలు, వున్నాయో చెప్ప లేను. నువ్విక్కడకు వచ్చాక ఒకసారి వెళ్ళి చూసివద్దాం!"

మనోరమ కోపంతో యీ ఉత్తరానికి జవాబు రాయలేదు.

కాని మాధవికనుకొలుకుల్లో నల్లదనం ఏర్పడింది. ఎప్పుడూ సంతోషంగావుండే ముఖం గంభీరమైంది. పనిపాటల్లో మనసు లగ్నముకావడంలేదు. ఒక విధమైన నిర్లక్ష్యం ఏర్పడింది. యిప్పుడు కూడా ఆమె అందరినీ జాగ్రత్తగా చూస్తూ ఆదరిస్తూనేవుంది. పైగా అదింకా ఎక్కువైంది. కాని మునుపటిలా ఏవిషయం గుర్తుండడంలేదు. మధ్యమధ్య రుతిమరుపు వస్తూంది.

యిప్పుడు కూడా అందరూ ఆమెను పెద్దక్కయ్యా అని అంటున్నారు. యిప్పుడు కూడా అందరూ ఆకల్పతరువు వేపు చూస్తూన్నారు. చేతులు చాపుతున్నారు. ఫలసిద్ధి పొందుతున్నారు. కాని ఆకల్పవృక్షమంత సరళంగా లేదు. పెద్దవాళ్లు మాత్రం అప్పుడప్పుడూ ఎండిపోతుందేమోనని అనుమానపడుతున్నారు.

మనోరమ ప్రతిరోజూ వస్తూవుంది. ఆ ప్రసంగం ఎత్తేది కాదు. యింకేదో మాట్లాడి వెళుతూవుండేది. అందువల్ల మాధవికి దుఃఖం కలుగుతుందని మనోరమ అనుకుంది. అందువల్ల ఆసంగతులు ఎంత ఆలోచించకుండావుంటే అంతమంచి దనుకుంది. ఒకవేళ యీ అభాగ్యురాలు ఈసంగతి మర్చిపోతుందేమోనని మనోరమ నమ్మకం!

* * * *

సురేంద్రనాథుడు కొంత తేరుకొని తండ్రితో యింటికి వెళ్ళిపోయాడు. సవతితల్లి తన ఆదరాన్ని కొంత తగ్గించింది. అందువల్ల సురేంద్రనాథుని శరీరం కొంచెం విశ్రాంతి పొందింది. కాని సురేంద్రుడు యింకా తేరుకోలేదు. అతని గుండెలో నొప్పిగా వుంటుంది రూపం — యమునా కాంక్షలు

యింకా ఆతనికో ఉదయించలేదు. ఈ సంగతులన్నీ అతను ఆలోచించడు. యిప్పుడు కూడా పూర్వంలాగే అన్యమనసు తోనూ, ఆత్మనిబ్బరంలేని వాడిలా నేవున్నాడు. కాని ఎవరి మీాద ఆధారపడాలో అదికూడా తెలుసుకోలేకపోయాడు. తెలుసుకోలేక, తన పనులుతానే చేసుకునేవాడా? అదీకాదు. యితరులమీాద ఆధారపడివుండేవాడు. మునపటిలా మనసు లగ్నంకావడంలేదు. పనుల్లో ఎక్కడైనా పొరపాటు జరిగి నప్పుడు కొంచెం అసంతోషం చూపించేవాడు. అతని సవతి తల్లి యివన్నీ చూసి, విని–"సురేంద్రుడు ప్రస్తుతం మారిపో యాడు." అని అనేది.

మధ్యలో ఒకసారి జ్వరం తగిలింది. చాలా కష్టంవేసింది. అతని కళ్ళంట నీళ్ళు కారినయ్! సవతి తల్లి దగ్గరే కూచుని వుంది. ఆమె ఒక కొత్తసంగతికనిపెట్టింది. క్షణంలో ఆమె కళ్ళల్లో కూడా నీళ్ళూరినయ్! ఆమె ప్రేమపూర్వకంగా– "ఏమైంది నాయనా?" అని అడిగింది.

సురేంద్రుడు మాట్లాడలేదు. ఆ తరువాత ఆయన ఒక పోస్టుకార్డు అడిగిపుచ్చుకుని దానిమీాద వంకరటెంకర అక్ష రాలతో–"పెద్దక్కయ్యా! మళ్ళీ జ్వరం వచ్చింది. చాలా కష్టంగా వుంటూంది" అని రాశాడు,

కాని ఆ వుత్తరం పోస్టాఫీసుకు వెళ్ళలేదు. మొదట అతని మంచం మీాదనుంచి క్రిందపడింది. ఆ తరువాత గది వూడ్చే మనిషి దానిమ్మ తొక్కలతో బిస్కట్టు ముక్కలతో– ద్రాక్ష చర్మాలతోపాటు ఉత్తరాన్నికూడా వూడ్చి పార వేసింది. సురేంద్రుని హృదయకాంక్ష, మట్టిలోకలిసి గాలికి

ఎగిరి, మంచుకు తడిసి—ఎండకు మోడి ఓ తుమ్మచెట్టుకింద పడివుంది.

మొదట జవాబుగా ఓ సాకారమూర్తి వస్తుందని ఎదురు చూశాడు. కాని ఆతరువాత హస్తాక్షరాలైనా రాకపోతాయా అని చూశాడు. కాని చాలారోజులు గడిచిపోయినయ్! ఏమీరా రాలేదు. సురేంద్రునికి జ్వరంకూడా తగ్గింది. పథ్యంకూడా పుచ్చుకున్నాడు. ఆ తరువాత అతని జీవితంలో ఓ కొత్తసంఘటన జరిగింది. ఈ సంఘటన కొత్తదే అయినా స్వాభావికమైనదే! సురేంద్రునితండ్రి రాయ్‌కి చాలాకాలంనుంచి తెలుసు! ఆయన ఆశిస్తున్నదికూడాయిదే! సురేంద్రుని మాతామహుడు పాబనాజిల్లాలో ఒక మధ్యరకం జమీందారు. యిరవైఅయిదు గ్రామాలకు జమీందారీవుంది. ఆదాయం సంవత్సరానికి యాభైవేలు వుంటుంది. ఒకటి ఆయనకు సంతానంలేదు. పైగా ఖర్చుకూడా చాలాతక్కువ చేసేవాడు. దానిపైన వడ్డీలోభి. అందువల్ల ఆయన తన సుదీర్ఘజీవితంలో చాలాధనం కూడబెట్టి వుంటాడు. ఆయన తరువాత ఆ వైభవాన్ని కంతకూ ఏకమాత్ర దౌహిత్రుడే సర్వాధికారి కాగలడని రాయ్ మహాశయునికి తెలుసు! జరిగింది కూడా అంతే. మామగారు మృత్యుశయ్యమీద వున్నారని రాయ్‌కి సమాచారం అందినది.ఆయన త్వరగా కొడుకుతో పాబనాజిల్లాకు ప్రయాణమయ్యారు! కాని ఆయన చేరకముందే మామగారు చనిపోయారు.

చాలా అట్టహాసంగా ఆయన కర్మచేశారు. అసలు మొదటినుంచి పకడ్ బందీగావున్న జమీందారీ! పరిపక్వ వృద్ధుడైన

వకీలు రాయ్ మహాశయుని కఠిన బందోబస్తువల్ల జమీందారీ ప్రజలంతా భయపడ్డారు. యిప్పుడు సురేంద్రునికి పెళ్ళి కావాల్సి వుంది. వూరంతా పెళ్ళిళ్ళ పేరగాళ్ళతో నిండిపోయింది. యాభై కోసుల దూరంలో ఏ యింట్లోనన్నా అందమైన పిల్ల వున్నదంటే, ఆ ఇంటికి పెళ్ళిళ్ళ పేరగాళ్ళు పరుగుతీసి, తల్లి దండ్రులకు ఆశలు చూపుతున్నారు. ఈ విధంగా అయిదారు మాసాలు గడిచినయ్!

చివరకు సవతితల్లి వచ్చింది. ఆమె బంధువులంతా వచ్చారు. వారితో యిల్లంతా నిండిపోయింది.

ఆ తరువాత ఒకనాడు మేళ తాళాలతో, సురేంద్రనాథుడు పెళ్ళిచేసుకుని వచ్చాడు.

# 7

అయిదు సంవత్సరాలు గడిచినయ్! ఇప్పుడు రాయ్ మహాశయుడు లేడు. ప్రజరాజ లాహిరీకూడా స్వర్గాన్నలంకరించాడు. సురేంద్రుని సవతితల్లి తన భర్తయిచ్చినడబ్బుతో ఆస్తితో పుట్టింటికి వెళ్ళి వుంటూంది.

ప్రస్తుతం సురేంద్రనాథునికి ఎంత ప్రఖ్యాతివుందో అంత అపఖ్యాతి కూడావుంది. కొంతమంది అటువంటి బంధువత్సలుడు, ఉదారుడూ మిత్ర ప్రతిపాలకుడైన జమీందారుని మేమింతవరకూ చూడలేదని అంటారు. యింకా కొంతమంది - యిలా ప్రజలను పీడించుకుని తినే జమీందారు యెక్కడెప్పుడూ పుట్టలేదని అంటారు.

ఈ రెండు సంగతులు నిజమని నాకు తెలుసు! మొదటిది సురేంద్రనాథుని విషయంలో నిజం. యిక రెండోది ఆయన గుమాస్తా మథురనాథ్ బాబు విషయంలో నిజం!

సురేంద్రనాథుని పెద్దహాల్లో ప్రస్తుతం స్నేహితులు సమావేశ మవుతుంటారు. వాళ్ళంతా ఎంతో సంతోషంగా తమ ప్రపంచంలోని వాంఛలన్నీ సరదాగా తీర్చుకుంటున్నారు. ఆకులూ వక్కలూ-హుక్కా, సారాయం - మాంసమూ దేన్ని గురించికూడా వారికి చింతలేదు. అన్ని వస్తువులు వాటంతట అవే నోటిదగ్గరకు వస్తున్నయ్! మేనేజరు మధురబాబుకివంటే మహా సరదా! ఖర్చుకు కావలసిన డబ్బు పోగుచేయడంలో సిద్ధహస్తుడు. కాన అందుకు జమీందారీ ఖాతాలోంచి, తీయవలసిన పనిలేదు. ఆయన చండ ప్రచండ శాసనంతో జమీందారీలోని ప్రజలే వ్యయాన్ని భరించేవాళ్ళు. మధురబాబు దగ్గర ఒక్క దమ్మిడీగూడా బాకీపెట్టడమనేది లేదు. యిళ్లు తగులపెట్టించడంలో ఆస్తులు వేలాలు వేయించడంలో కచ్చేరీ గదుల్లో బంధించడంలోనూ అతని సంతోషానికి మేరలేదు.

ప్రజల ఆర్తనాదాలు మధ్య మధ్యలో శాంతిదేవి చెవుల్లో పడేవి. ఆమె భర్తను బ్రతిమాలుతూ "మీరు మీ జమీందారీని స్వయంగా చూసుకోకుంటే అంతా నాశనమైపోతుంది!" అని చెప్పేది.

సురేంద్రనాథుడు త్రుళ్ళిపడి అనేవాడు. "అదే!అయితే యిదంతా నిజమేనా?"

"నిజంకాదా? దేశమంతా నిందిస్తున్నా మీ చెవిని పడలేదా? యిరవైనాలుగు గంటలు స్నేహితులతో కూచుంటే-యీ సంగతులు మీ చెవికి ఎలా వినపడతయ్? అటువంటి మేనేజరు మనకువద్దు. అతన్ని వెళ్ళగొట్టండి."

సురేంద్రనాథుడు దుఃఖంతో విచారంగా "సరే! రేపటి నుంచి నేనే అంతా స్వయంగా చూసుకుంటాను" అనేవాడు.

ఆ తరువాత కొన్నిరోజులవరకూ జమీందారీని చూసుకునే వాడు. మధురబాబు గాభరాపడుతూ—అప్పుడప్పుడూ గంభీరుడై—"సురేంద్రబాబూ, యీవిధంగానే జమీందారీని నిలుపుకుంటారా?" అనేవాడు.

సురేంద్రుడు నవ్వుతూ—"మధురబాబూ! దుఃఖితుల రక్తం పిండి, జమీందారీ నిలుపుకునే అవసర మేమిటి?"

"అయితే నాకు సెలవుయిప్పించండి? నేనువెళ్ళిపోతాను."

సురేంద్రుడు వెంటనే మెత్తబడేవాడు. ఆ తరువాత జరగవలసిం దేదో అలానే జరిగేది. ఆ తరువాత హాలువదలి బయటికి వచ్చేవాడు కాడు సురేంద్రుడు.

ఈ సంగతి యిలావుండగా యిప్పుడు యింకొక కొత్త ఉపసర్గ వచ్చిపడింది. ఒక తోటను పెంచి, అందులో ఒక బంగళా కట్టించారు. అందులో కలకత్తానుంచి ఎలోకేశి అనే వేశ్యవచ్చి వుంటూవుంది. నాట్యంలోనూ పాటల్లోనూ మంచి ప్రవీణురాలు! చూడ్డాని కంతి చెడ్డగా వుండదు. భగ్నపరిచిన తేనెపట్టునుండ విడిపోయిన తేనెటీగల్లా సురేంద్రుని హాలు వదలిపెట్టి స్నేహితు లంతా తోటకుచేరారు. వాళ్ళ ఆనందానికీ ఉత్సాహానికి అంతులేదు. వాళ్ళంతా సురేంద్రనాథుని కూడా లాక్కుని వెళ్ళారు. ఇప్పటికి మూడు రోజు లైంది. శాంతిదేవికి భర్త దర్శనం దొరకలేదు. నాలుగోనాడు భర్త యింటికి వచ్చాడు. ఆమె గుమ్మానికి ఆనుకుని కూమని అడిగింది— "యిన్నిరోజులు ఎక్కడ వున్నారు?"

"తోటలో"

"అక్కడ మూడుగోజులవరకూ వుండడానికేవమన్నావు?"

"అదే..."

"అన్నిటికీ 'అదే'నా? నేను అంతా విన్నాను" అంటూ శాంతి యేడ్చి—'నేనేఅపరాధం చేశానని. నన్నిలా కాల తన్నుతున్నారు?' అన్నది.

"ఎక్కడ...? నేను..."

"ఇంతకంటే కాలతన్నడమంటే ఏమిటి? మాకు యింత కంటే ఎక్కువ అవమానం యేముంది?"

"అదే...వాళ్ళంతా..."

ఆ మాట వినట్లుగానే శాంతి ఇంకా ఎక్కువగా ఏడుస్తూ అన్నది. "మీరు నాకు భర్త. భగవంతునితో సమానం? నా యిహ పరాలు కూడా మీరే! నేను మిమ్మల్ని గుర్తించలేనా? నేను మీకు ఏమీ కానని తెలుసు? ఒక్క నాడు కూడా నేను మీ మనసు పొందలేకపోయాను. నా బాధ మీ కెలా, యెవరు చెప్పగలరు? మీరు సిగ్గుపడతారు. కష్టపడతారు. అందుకనే నేను యేమీ అనడంలేదు."

"శాంతీ! ఎందుకు యేడుస్తావు?"

"ఎందుకు యేడుస్తున్నానో అది నా అంతర్యామికే తెలుసు? మీరు నన్ను అశ్రద్ధగా చూడరని నాకు తెలుసు? మీ మనసులోకూడా క్లేశంవుంది. మీరింకేమిచేయగలరు?" అని ఆమె కన్నీళ్ళు తుడుచుకుని. 'ఒకవేళ జన్మంతాకష్టాలు అనుభవించినా - నాకు నష్టంలేదు. కాని మీకున్న కష్ట మేమిటో నేను తెలుసుకున్నట్లయితే...' అని ఆగింది.

సురేంద్రుడు ఆమెను దగ్గరకులాక్కుని కన్నీళ్ళు తుడుస్తూ ప్రేమపూర్వకంగా-'అయితేఏంచేస్తావు శాంతీ?' అనిఅడిగాడు.

ఇందుకు జవాబు ఏముంది? శాంతి వెక్కి వెక్కి ఏడ్చింది.

చాలా సేపున్నాక శాంతి అన్నది "ప్రస్తుతం మీశరీరం కూడా బావుండడంలేదు."

"ఇవాళేకాదు. అయిదు సంవత్సరాలనుంచి బావుండడం లేదు. ఏనాడు కలకత్తాలో బండిక్రింద పడ్డానో-గుండెలకూ వీపుకు దెబ్బ తలిగింది. ఒక్క నెలవరకూ మంచంలోవున్నాను. అప్పటినుంచీ శరీరంలో ఏమీ బావుండడంలేదు. ఆ నొప్పి ఇంతవరకూ పోలేదు. ఎలా బ్రతుకుతున్నానో నాకే అప్పు డప్పుడూ ఆశ్చర్యం కలుగుతూంది."

శాంతి తనచేతిని తొందరగా భర్తగారిగుండెమీద వుంచి-

"పదండి, మనం యీవూరు వదిలి కలకత్తా వెళదాం! అక్కడ మంచి మంచి డాక్టర్లుంటారు" అన్నది.

సురేంద్రుడు కూడా చాలుదుక్కన సంతోషించి—"పద వెళ్దాం! అక్కడ 'పెద్దక్కయ్య' కూడా వుంది' అన్నాడు.

"మీ 'పెద్దక్కయ్య'ను చూడాలని నాకూవుంది. ఆమెను తీసుకునిరాగలరా?"

"ఎందుకు తీసుకురాను?" ఆ తరువాత కొంచెం ఆలో చించి—'నేను చచ్చిపోతున్నానని తెలిసినప్పుడు తప్పకుండా వస్తుంది' అన్నాడు.

శాంతి సురేంద్రునినోటికి చేయి అడ్డుపెట్టి—"నేను [illegible] కాళ్ళు పట్టుకుంటాను. అటువంటిమాటలు అనకండి [illegible]"

"ఆమె వచ్చినట్లయితే నాకేమీ కష్టంవుండదు."

అభిమానంతో శాంతిహృదయం పరిపూర్ణంగా నిండిపోయింది. ఇప్పుడిప్పుడే భర్తకు తానేమీ కాదన్నది. కాని సురేంద్రుడు అది ఆలోచించలేదు. తెలుసుకోలేదు. అతనేం చెపుతున్నాడో దానికే సంతోషపడుతున్నాడు - "నువ్వే స్వయంగా వెళ్ళి 'పెద్దక్కయ్య'ను తీసుకునిరా! ఏం...? బావుంటుంది కదూ?'

"అలాగే" అంటూ శాంతి తలూపింది.

ఆ మరునాడు మధురబాబుకు తోటలో ఎవరైతేవున్నారో వాళ్ళను క్షణంలో వెళ్ళగొట్టకుంటే - తన నౌకరీ వూడిపోతుందని చెప్పమని దాసీతో కబురుచేసింది. ఆమె తన భర్తగారితోకూడా-"ఏది ఏమైనా మీరు యిల్లువదలి బయటికి వెళ్ళారంటే నేను తల పగులగొట్టుకు నెత్తురు ప్రవహింపచేస్తాను." అని చెప్పింది.

"అదే...కాని వాళ్ళంతా..."

"నేను ఆ 'కానీ'కి కూడా తగిన బందోబస్తు చేస్తాను." అని శాంతి దాసీని పిలిచి ఆ వెధవల్ని లోపలికి రానీయవద్దని దర్వానుతో చెప్పమన్నది.

ఇక ఉపాయమేమీ లేక మధురబాబు ఎలోకేశీని పంపించాడు. మిగిలినవాళ్ళంతా మాయమయారు. ఆ తరువాత మధురబాబుజమీందారీవ్యవహారాల్లోమనసులగ్నంచేశాడు.

సురేంద్రనాథుడు కలకత్తా వెళ్ళలేకపోయాడు. గుండెలో నొప్పి ఇప్పుడు కొంచెం తగ్గినట్లయింది. కలకత్తా వెళ్ళడానికి శాంతికికూడా అంతగా ఉత్సాహంలేదు. అక్కడేవుండి యథాసాధ్యంగా భర్తగారి సేవా శుశ్రూషలు చేయడానికి

వుపక్రమించింది. కలకత్తానుంచి ఓ మంచి డాక్టరును పిలిపించి చూపించారు. ఆ చికిత్సకుడు అంతా విని - పరీక్షించి ఒక ఔషధం ఇచ్చి, విశేషించి శారీరకంగా గాని, మానసికంగా గాని ఏమీ పరిశ్రమ చెయ్యకూడదని చెప్పి వెళ్ళాడు.

ఈ అవుసరం చూసుకుని మేనేజరుగారు, వ్యవహారాలు చూస్తున్నాడు. అందువల్ల గ్రామగ్రామములో ఆర్తనినాదాలు చెలరేగుతున్నయ్! మధ్యమధ్య శాంతి ఈ సంగతులు వింటూంది కాని, భర్తకు చెప్పడానికి సాహసించలేకపోయింది.

# 8

కలకత్తాలో యిప్పుడు వ్రజరాజబాబుకు బదులు శివచంద్రుడు యజమాని అయాడు. మాధవికిబదులు యిప్పుడు యింటికి యజమానురాలు కొత్తకోడలు మాధవి ఇంకా అక్కడేవుంది. తమ్ముడైన శివచంద్రుడు ఇప్పుడుకూడా ప్రేమాదరణలతో చూస్తున్నాడు, కాని మాధవికి, ఇక ఇక్కడ వుండాలని లేదు. ఇంట్లోని దాసదాసీ లందరూ - గుమాస్తా—మాష్టర్లు మొదలు అందరూ యిప్పటికీ 'పెద్దక్కయ్యా' అని పిలుస్తూనేవున్నారు. కాని పెట్టెతాళాలు మాత్రం ఇంకొకరిదగ్గరకు వెళ్ళిపోయినవనే సంగతి అందరూ యెరుగుదురు. అందుకని శివచంద్రునిభార్య మాధవిని అవజ్ఞతతో-అమర్యాదగా చూస్తోందంటే అదీకాదు. కానీ ఆమె భావాన్నిబట్టి ఈ కొత్తవధువు అనుమతీ, సలహాలేనిదే ఏపని చేయడానికి ఆమె కేమాత్రం వీలులేదని గ్రహించవచ్చు.

అప్పుడు ఇల్లంతా తండ్రిరాజ్యం! ఇప్పుడుతమ్ముడిరాజ్యం అయిపోయింది. అందువల్ల కొంచెం భేదంవచ్చింది. మొదట్లో

ఆదరణావుండేది, పెత్తనమూ చలాయించేది. ఇప్పుడు ఆద రణవుంది కాని పెత్తనంలేదు. మొదట తండ్రిగారి ఆదరణ కారణంగా ఆమె యజమానురాలు. ఇప్పుడు ఆత్మీయులలో లేక, కుటుంబీకులలో ఒకతైపోయింది.

అంటే శివచంద్రుని, అతనిభార్యనూ దోషిగా యెంచా నమీ, తిన్నగా కాక ఇంకొకవిధంగా దూషిస్తున్నాననీ యెవ రైనా అనుకుంటే వాళ్ళు నన్ను పొరపాటుగా అర్థంచేసు కున్నవాళ్ళవుతారు. ప్రపంచంలో వస్తూన్న నీతినియమాలు రీతి-రివాజులుమాత్రం ఇక్కడ చెప్తున్నాను. మాధవి అదృష్టం పడిపోయింది. ఆమె నాది అని చెప్పుకునేందుకు ఏమీలేదు. అలాఅని ఎవరైనా తమ అధికారాలను వదులు కుంటారా? భర్తగారి ఆ స్త్రీమీద భార్యకు ఎంత అధికారం వుండేదీ ఎవరికి తెలియదు? అయితే శివచంద్రుని భార్యకు ఈ సంగతి తెలవదూ? శివచంద్రుడు మాధవికి తమ్ముడే! కాని ఆమె మాధవికి ఏమవుతుంది? ఇతరులకోసం తన అధికారం ఆమె ఎందుకు వదులుకుంటుంది? మాధవికి అంతా తెలుసు. ఏసమయంలో కోడలు చిన్నదిగావుందో ఏ సమయంలో వ్రజబాబు జీవించివున్నాడో-ఆసమయంలో మాధవిదృష్టిలో ప్రమీలా కోడలూకాక ఏంటి?ఇప్పుడా అభిప్రాయాలు కనుపడ డంలేదు. ఆమె మొదటినుంచి అభిమానంగలది. అందువల్ల అందరికి తగ్గివుండేది. మాటబడే ఓర్పులేదు. అందువల్ల ఆమె ఏమీ మాట్లాడేదికాదు. యెక్కడ ఈమెకు బలంలేదో అక్కడ తలెత్తుకునివుండడం తలకొట్టినట్లుగా వుండేది. మనసు కేదైనా బాధ కలిగితే సహించి పూరుకునేది. శివచంద్రునితో

చెప్పేదికాదు. ఆత్మీయతతో అర్థించడం ఈమెకు చేతకాదు. కేవలం యీ ఆత్మీయతాబలంతో-తన అధికారం ప్రతిష్ఠించు కోవాలంటే—ఆమె శరీరం - మనసగా ధిక్కరించేవి. సాధారణపు ఆడవాళ్ళ పోట్లాడునవిధంగా పోట్లాడం ఆమె కెంత అసహ్యమో. ఎంత తిరస్కారమో ఆమెకే తెలుసు.

ఒకనాడు శివచంద్రుని పిలిచి - "అన్నయ్యా! నేను మా అత్తగారింటికి వెళతాను." అని చెప్పింది.

శివచంద్రుడు ఆశ్చర్యపడి. "అదేమిటి మాధవీ! అక్కడ ఎవరూ లేరుగా?" అని అడిగాడు.

చనిపోయిన భర్తగారిని ఉద్దేశించి మాధవి అంది "వారి చిన్న చెల్లెలి మేనల్లుడు కాశీలో వుంటున్నాడు. వాడిని తీసుకుని గోలాపురంలో హాయిగా వుండగలను."

పబనా జిల్లాలోని గోలాపురంలో ఆమె అత్తగారిఇల్లు వుంది. శివచంద్రుడు కొంచెంగా నవ్వి—"అదెలా జరుగుతుంది? నువ్వు చాలా కష్టపడతావు." అని అన్నాడు.

"అన్నయ్యా! కష్టం ఎందుకు కలుగుతుంది? అక్కడ ఇల్లు ఇంకా పడిపోలేదు. పది పదిహేను ఎకరాల భూమికూడా వుంది. వాటితో ఒక విధవకు సరిపోదా?"

"సరిపోక పోతుందనికాదు. డబ్బుకు కూడా యిబ్బంది లేదు. కాని మాధవీ! నీకు అక్కడచాలాకష్టంకలుగుతుంది."

"కష్టమేమీ వుండదు."

శివచంద్రుడు కొంచెంసేపు ఆలోచించి "చెల్లీ! అసలు నువ్వెందుకని వెళుతున్నావు ? సంగతేమన్నా వుంటే నాకు చెప్పు! నేను అంతా సరిచేస్తాను." అన్నాడు.

అంతకు ముందు శివచంద్రుడు తన భార్యవల్ల చెల్లెలికి విరుద్ధంగా యేదో విని వున్నాడల్లేవుంది, అదే సంగతి యిప్పుడు అతనికి గుర్తు వచ్చినట్లుంది. సిగ్గుతో మాధవిముఖం ఎర్రబడింది. అందువల్ల ఆమె "అన్నయ్యా! నేను పోట్లాడి విూ యింట్లోంచి వెళ్ళిపోతున్నానని అనుకున్నావా?" అని అడిగింది.

శివచంద్రుడుకూడా "సిగ్గుపడి-తొందరగా అన్నాడు- "కాదు కాదు. అదికాదు. నే నలా అనను! యీ యిల్లు నీదే! మరి యివాళ ఎందుకని వెళతానంటున్నావు?"

అప్పుడు యిద్దరకూ ప్రేమపాత్రుడైన తండ్రి గుర్తుకు వచ్చాడు. యిద్దరి కళ్ళలో నీళ్ళు కనుపించినయ్! కళ్ళు తుడుచుకుని మాధవి అన్నది—"నేను తిరిగి వస్తాను, నీ కొడుకు వడుగు చేసేప్పుడు నన్ను వచ్చి తీసుకునిరా! యిప్పుడు నేను వెళుతున్నాను."

"అది పదేండ్లనాటి మాట"

"అప్పటికి నేను బ్రతికివుంటే వస్తాను."

మాధవి ఏవిధంగానూ అక్కడ వుండేందుకు యిష్టపడ్డలేదు. ఆమె కొత్తకోడలికి యింటి విషయాలన్నీ విడమర్చి చెప్పింది. దాసదాసీలను పిల్చి ఆశీర్వదించింది. వెళ్లే రోజున శివచంద్రుడు కన్నీళ్ళుపెట్టుకుని "మాధవీ! నీ అన్నయ్య నిన్నెప్పుడూ ఏమీ అనలేదు." అన్నాడు.

"మంచి మాటన్నావు అన్నయ్యా?"

"అదికాదమ్మా ఒకవేళ ఏదన్నా అశుభక్షణంలో— ఎప్పుడన్నా నోటితో ఏమైనా......"

"కాదన్నయ్యా! అటువంటి దేవీమీ లేదు?"

"నిజమేనా?"

"నిజమే."

"అయితే వెళ్ళు. నీ యింటికి వెళ్ళడానికి నిన్ను అడ్డు పెట్టను – నీకు యెక్కడ బావుంటే అక్కడే వుండు. కాని నీ క్షేమసమాచారం మాత్రం అప్పుడప్పుడూ పంపుతూ వుండు."

* * * *

ముందు మాధవి కాశీ వెళ్ళింది. తన చెల్లెలికొడుకుని తీసుకుని సరిగ్గా ఏడు సంవత్సరాల అనంతరం తన అత్తగారిల్లయిన గోలాపురంలోని భర్తగారింటికి వచ్చింది.

అప్పుడు గోలాపురంలోని చటర్జీ మహాశయుడు చాలా యిరుకునపడ్డాడు. అతనికీ యోగీంద్రునితండ్రికీ పెద్దస్నేహం. అందువల్ల చనిపోయేముందు యోగీంద్రుడు తనకున్న కొద్ది భూమీ ఇతనికి అప్పగించాడు. యోగీంద్రు బ్రతికివున్నప్పుడు కూడా అతడే భూమిని చూస్తుండేవాడు. యోగీంద్రుడు పొలంవిషయంలో ఎక్కువ శ్రద్ధపుచ్చుకునేవాడుకాడు. తన మామగారిదగ్గర చాలా డబ్బువుంది. అందుకని తండ్రిగారివల్ల సంక్రమించిన ఈ క్షుద్ర ఆస్తిమీద అతనికి ఎక్కువ మమకారంలేదు. తరువాత ఆయన చనిపోయాక చటర్జీ న్యాయపూర్వకమైన అధికారంతో—ఏ అడ్డంకులు లేకుండా అనుభవిస్తూవస్తున్నారు. యిప్పుడు యింతకాలమయాక మాధవి వచ్చి అడ్డుపడింది. ఇది చటర్జీగారికి అన్యాయంగా తోచింది. మాధవి ఈర్ష్యకొద్దీ ద్వేషంకొద్దీ ఇలా చేసిందని

గ్రహించాడు. ఆయన కోపంతో వచ్చి అన్నాడు— "చూడమ్మాయీ! నీకున్న రెండెకరాలభూమి. పదిసంవత్సరాలనుంచి శిస్తుబకాయి అంతా కలిసి వందరూపాయలు అయింది. అది చెల్లించకపోతే వేలానికి వస్తుంది" అని చెప్పాడు.

మాధవి తన మేనల్లునితో డబ్బుకోసం బెంగ అవసరం లేదని చెప్పించి, వెంటనే వందరూపాయలు పంపింది. ఈ డబ్బు చటర్జీకి ఇంకొకపనికి వుపయోగపడింది.

కాని మాధవి అలా సాధారణంగా వదిలిపెట్టే మనిషి కాదు. మాధవి తన మేనల్లుడైన సంతోషకుమారునితో, కేవలం తన మామగారు రెండెకరాల భూమితో జీవితం గడపలేదనీ, అందువల్ల మిగిలిన భూమి ఎవరిదగ్గర, ఎక్కడ వున్నదీ చెప్పమని కబురుచేసింది.

చటర్జీ చాలా కోపంగా స్వయంగా వచ్చి "అదంతా అమ్మేశాం! ఇంక వున్నది కాస్త కొలులో వుంది. ఈ ఏడెనిమిది సంవత్సరాలనుంచి శిస్తుకట్టకుం టే భూమిఎలావుంటుంది?"

యీ కొంచెం శిస్తు చెల్లించకపోవడానికి ఈ భూమిలో ఏమీ పండడంలేదా? నిజంగా ఒకవేళ అమ్మివుంటే, ఎవరు అమ్మారో. ఎవరికి అమ్మారో చెప్పు! మళ్ళీ దాన్ని కొనడానికి ప్రయత్నించాలి. కాగితాలు అవీ ఎక్కడున్నాయ్?" అని అడిగింది మాధవి.

చటర్జీ ఏదో సమాధానం చెప్పాడు. కాని మాధవికి అర్థం కాలేదు. మొదట ఆ బ్రాహ్మణుడు ఏదో వాగుతూ—గొడుగు వేసుకుని, నడుముకు అంగవస్త్రం బిగించి, ఆపైన ఒక తువాలు కప్పుకుని "లాలతా" గ్రామానికి పయనమయ్యాడు.

ఈ లాలతా గ్రామములో సురేంద్రనాథుని యిల్లూ, మేనేజరు మధురబాబుగారి ఆఫీసు వుంది. ఈ బ్రాహ్మణుడు పడెనిమిది కోసుల దూరం నడిచి, తిన్నగా మధురబాబు దగ్గర కెళ్ళి యేడుస్తూ – "రక్షించండి బాబూ! ఈ బీద బ్రాహ్మణుడు ఇక ఇంటింటా ముష్టెత్తుకునితినాల్సివచ్చింది." అన్నాడు.

'అలా చాలామందికి జరుగుతూందిలే' అని మధురబాబు ముఖంతిప్పి అడిగాడు–'ఏం జరిగింది?'

"నన్ను రక్షించండి బాబూ!"

'అసలు ఏం జరిగింది?'

అప్పుడు విధుచటర్జీ మాధవివద్దనుంచి పుచ్చుకున్న వంద రూపాయలు దక్షిణగా మధురబాబుచేతిలో పెట్టి –'తమరు ధర్మావతారాలు! ఒకవేళ నన్ను రక్షించకపోతే నేను సర్వ నాశనమైపోతాను' అన్నాడు.

'సరే! జరిగిం దేదో విడమర్చి చెప్పు?'

'గోలా గ్రామములోని రామతను సన్యాల్ విధవకోడలు ఇంతకాల మయాక ఎక్కడ్నుంచో వచ్చి,నా ఆస్థంతా దఖలు పరుచుకోవాలంటున్నది.'

మధురబాబు నవ్వుతూ–"ఆమెగారు నీఆ స్తంతాస్వాధీనం చేసుకోవాలంటోందా? లేకుంటే నువ్వే ఆమెఆస్థిని కాజే యాలని చూస్తున్నావా?" అని అడిగాడు.

అప్పుడు బ్రాహ్మణుడు జంధ్యం ముట్టుకుని మధురబాబు చేతులు గట్టిగా పట్టుకుని. "నేను పదేళ్ళనుంచి శిస్తుకడుతూ వస్తున్నాను." అని చెప్పాడు

'భూమిలోపంటపండించుకున్నప్పుడుశిస్తుకట్టనవుసరంలేదా?'

"రక్షించాలి ప్రభువులు."

మధురబాబు బ్రాహ్మణుని ఉద్దేశ్యం గ్రహించి—"విధవను మోసపుచ్చాలనుకుంటున్నావా?" అని అడిగాడు.

బ్రాహ్మణుడు మెదలకుండా చూస్తున్నాడు.

"ఎన్ని ఎకరాల భూమి వుంది?"

"పాతిక ఎకరాలు."

మధురబాబు లెక్క వేసి చూసి—"ఎంత లేదన్నా మూడు వేల ఆస్తివుంటుంది. జమీందారీకి ఏమి యిస్తావు?" అని అడిగాడు.

"తమరెంత ఇవ్వమంటే అంత ఇస్తాను. మూడు వందల..."

"మూడు వందలు యిచ్చి, మూడు వేలు కాజేస్తావా? వెళ్ళు. మావల్ల ఏమీ కాదు."

బ్రాహ్మణుడు శుష్క నేత్రాలతో—"మరి యెంత యివ్వమంటారు?" అని అడిగాడు.

"వెయ్యి రూపాయలు ఇవ్వగలరా?"

తరువాత యిద్దరూ చాలాసేపు రహస్యంగా మంతనాలు చేసుకున్నారు. దాని ఫలితం యోగేంద్రనాథుని భార్యమీద రావలసిన శిస్తుబకాయి పది సంవత్సరాలకూ, అసలు వడ్డీతో కలిపి వెయ్యి రూపాయలకు దావా పడేశారు. సమన్సుకూడా జారీచేశారు. కాని ఆ సమన్సు మాధవివరకూ వెళ్ళలేదు. ఆ తరువాత డిక్రీ అయింది. ఆ తరువాత నెలా పదిహేనురోజులకు శిస్తుబాకీ నిమిత్తం జమీందారు తన ఆస్తినంతా ఇల్లుతో సహా వేలం వేయడానికి నోటీసులు యిచ్చి జప్తు చేశారని మాధవికి తెలిసింది.

మాధవి పొరుగింటావిడను పిలిచి — "అయితే యిదివరకే పిడీ గాళ్ళు జేశమూ?" అని అడిగింది.

"ఏం...ఏం జరిగింది?"

"లేకుంటే యేమిటి? ఒక మనిషి మోసంచేసి నాసర్వస్వం కా జేయాలని చూస్తున్నాడు. మీరు రది చూడడమే లేదే?"

"మేము యేం చేయగలము? జమీందారుగారే వేలం వేయిస్తూంటే బీదవాళ్ళం మేము యేం చేయగలం?"

"సరే జరిగిందేదో జరిగిపోయింది. కాని నా ఇల్లు వేలం అవుతుంటే నాకు కబురుకూడా లేదే! అయితే జమీందారు ఎటువంటివాడు?"

ఆ పొరుగింటావిడ అంతా వివరంగా చెప్పింది—"ఇంతగా ప్రజలను పీడించే జమీందారు, ఇంత అత్యాచారాలు చేసే వాడిని నే నెక్కడా చూడలేదు." అని చెప్పి ఇంకా ఆమె విన్నమాటలు అన్నీ విడమర్చి చెప్పింది.

మాధవి కొంచెం భయపడుతూ భయపడుతూ... "అయితే జమీందారుగారిని స్వయంగా కలుసుకుంటే పని జరగదా?" అని అడిగింది.

తన మేనల్లుడు సంతోషకుమారుడికోసం మాధవి అలా చేయడానికి కూడా వెనకాడలేదు. ఆమె అప్పటికేమీ చెప్ప లేకపోయింది. రేపుదయం తన అప్పకొడుకుదగ్గర సంగతు లన్నీ తెలుసుకుని చెప్తానంది. తన అప్పకొడుకు రెండు మూడుసార్లు లాలతాగ్రామము వెళ్ళి వచ్చాడు. జమీం దారు విషయమంతా అతనికి తెలుసు. చివరకు ఆ రోజున తోటలోని మేడలోవున్న ఎలోకేశి విషయమైజరిగినవిషయం కూడా వినివున్నాడు. తరువాత అతని చిన్నమ్మ అతనితో ఈ విషయం సంప్రదించింది. అప్పు డతను ముఖాన్ని పీలైనంత

గంభీరంగా పెట్టి-"ఈ విధవకోడలువయ సెంతవుంటుంది?"అని అడిగాడు.

"ఇరవై-యిరవై ఒక్క సంవత్సరాలు వుంటయ్"

'అతను తలూపి-చూడ్డానికెలావుంటుందేం?'అనిఅడిగాడు.

"అప్సరసలా వుంటుంది."

అప్పుడతను ముఖాన్ని మార్చి-"చూస్తే పనవొచ్చు. కాని ఆమె యీ రాత్రికే పడవమాట్లాడుకుని, తండ్రిగారింటికి వెళితే చాలా బావుంటుంది." అని అన్నాడు.

"ఎందుకని?"

"చూడ్డానికి అప్సరసలావుంటుందని చెప్పావుగా! అందుకనే-" అని అన్నాడు.

"ఉంటే యేం?"

అంతా అందులోనేవుంది. చూడ్డానికి అప్సరసలావుంటే, సురేంద్రరాయ్‌చేతుల్లోంచి తప్పించుకోలేరు."

చిన్నమ్మనోటిమీద చేయిపెట్టుకుని-"యిలాఅంటావేం?" అని అడిగింది.

అతను చిరునవ్వునవ్వి-"ఆ...అంతే. యీ సంగతి అందరికీ తెలిసింది." అన్నాడు.

'అయితే కలవడం మంచిదికాదంటావా?"

'కాదు. యేవిధంగాకూడ మంచిదికాదు.'

'కాని ఆమె ఆ స్తిఅంతా పోతూంది."

'ఎప్పుడైతే చటర్జీమహాశయుడు ఇందులో వున్నాడో అప్పుడు ఈ ఆస్తి వస్తుందనే ఆశలేదు. పైగా ఆమె గొప్ప వంశానికి చెందినది. అయితే ఆమె నీతినికూడా పోగొట్టుకుంటుందా?'

ఆ మరునాడు ఆమె మాధవికి అంతా చెప్పింది మాధవి సంగతంతా విని ఆశ్చర్యంపొందింది.పగలంతా జమీందారైన సురేంద్రరాయిని గురించే ఆలోచిస్తూవుంది. సురేంద్రరాయి! ఈ పేరు చాలా పరిచితమైనదే! కాని ఆ మనిషితో పోల్చలేక పోయింది. ఈ పేరు ఎన్నోసార్లు తలుచుకుంది. అయిదు సంవత్సరాలనాడు మర్చిపోయిన పేరు ఇంతకాలమయ్యాక తిరిగి గుర్తుకువచ్చింది.

ఆ రాత్రి కలతో మాధవికి నిద్రపట్టలేదు. అనేకసార్లు ఆమెకు పాతసంగతులు గుర్తుకువచ్చినయ్! కళ్ళంట ఎన్నోసార్లు నీళ్లువచ్చినయ్! ఆమెముఖం చూస్తూ సంతోషకుమారుడు భయపడుతూ- 'అత్తయ్యా! నేను అమ్మదగ్గరకు వెళతాను' అన్నాడు. మాధవికూడా ఈ సంగతి కొన్నిసార్లు ఆలోచించింది. ఎందుకంటే ఇక్కడున్న ఆశ్రయం పోయాక ఇక కాశీవాసంకంటే వేరే గత్యంతరంలేదు. సంతోషకుమారుని కొరకైనా జమీందారును తాను చూడాలనుకుంది. కాని అలా జరగలేదు. చుట్టుప్రక్కలవాళ్ళంతా వద్దంటున్నారు. ఆమె యెక్కడికివెళ్ళి వుండామన్నా-ఆమెకు ఇంకొక కొత్త ఉపద్రవం వచ్చిపడింది. అది రూపం! తన యవ్వనం! ఇది కూడా దురదృష్టమే ననుకుంది మాధవి! ఈ ఉపద్రవాలన్నీ యెందు కింకా యీ శరీరాన్ని అంటిపెట్టుకుని ఉన్నయ్! ఇప్పటికి ఏడేండ్లయింది. ఇవన్నీ ధ్యాసలోలేవు. ఈవిషయాలు గుర్తుకు తెచ్చేవాళ్ళుకూడా యెవరూలేరు. భర్త చనిపోయాక తన తండ్రిగారింటికి వచ్చినప్పుడు అందరూ 'పెద్దక్కయ్యా!' అని పిల్చారు. 'అమ్మగారూ' అని పిల్చారు. ఈ గౌరవప్రదమైన సంబోధన ఆమె మనసును మరింత వృద్ధురాలిగా చేసింది.

యొక్కడిరూపం! నుకొక్కడి యవ్వనం! పెద్దక్కయ్యలాంటి పనులు చేసేప్పుడు, తల్లిలాంటి పనులు నిర్వర్తించేప్పుడు ఆమెకు ఇవన్నీ గుర్తుంటాయా? గుర్తులేదు. గుర్తురాగానే విచారం కలిగింది. అందులో ఎక్కువగా యవ్వనాన్ని గురించి దుఃఖం కలిగింది. ఆమె సిగ్గులో మలినంగా నవ్వి-'ఇక్కడి వాళ్ళు గుడ్డివాళ్ళా—పశువులా?' అనుకుంది. కాని మాధవి పొరపడింది. అందరిమనసులూ-ఈ ఇరవై ఇరవైఒక్క సంవత్సరాల్లోనే, తనలా వృద్ధాప్యానికి రావు.

ఆ తరువాత మూడునాలుగురోజులకు జమీందారుగారి దర్వాను ఆమె గుమాస్తాని కేదురుగా కూచుని -అందర్నీ పిలిచి - జమీందారుగారి కొత్త కీర్తిని గురించి చెప్పడం మొదలు పెట్టేసరికి, మాధవి సంతోషకుమారుని చేయిపట్టుకుని దాసీ దానివెనకాల వెళ్ళి పడవలో కూచుంది.

ఆమెఇంటికిదగ్గరగానే నదివుంది. మాధవి పడవవానితో— "సోమరాపురం వెళ్ళాలి. ఒకసారిప్రమీలను చూసిరావాలి" అని చెప్పింది.

గోలాపురానికి పదిహేనుమైళ్ళదూరంలోవున్న సోమరాపురంలో ప్రమీల వివాహమైంది. ఇప్పటికి సంవత్సరంనుంచి అత్తనారింట్లో వుంటూవుంది. బహుశా ఆమె మళ్ళీ కలకత్తా వెళుతుందేమో! కాని అప్పుడు మాధవి ఎక్కడ వుంటుందో! అందుకని యిప్పుడే ఒకసారి వెళ్ళి చూసి రావాలి.

సూర్యోదయానికిముందుగానే పడవవాళ్ళు పడవవదిలారు. పడవ ప్రవాహానికి ఎదురుగా పోతూంది. దానికితోడు గాలి కూడా అనుకూలంగా లేదు. అందువల్ల పడవ మెల్ల మెల్లగా వొడుళ్ళను తప్పించుకుంటూ పోతూవుంది. సంతోషకుమా

రుని సంతోషం పట్టశక్యముకాకుండావుంది. పడవమీాద నిలు చుని వెదురు బెత్తాలను ఆకులను విరవడంలో లీనమై పోయాడు. పడవవాళ్ళు "గాలి తగ్గకుంటే మాత్రం రేపు మధ్యాహ్నందాక సోమరాపురం చేరుకోలేము." అని చెప్పారు.

ఈనాళ మాధవికి ఏకాదశి. కాసీ సంతోషకుమారునికై పడవ ఎక్కడైనా ఆపి వంటచేయాలి. పడవవాళ్ళుమాత్రం "దిస్తే పాడాలో పడవ కట్టేసినట్లయితే చాలాబాగుంటుంది. అక్కడ అన్ని వస్తువులు దొరుకుతయ్. " అని చెప్పారు.

'అలానే చేయండి. పది పదకొండు గంటలకల్లా అబ్బాయి గారికి భోజనం వండిపెట్టాలి.' అని దాసీ చెప్పింది.

## 9

కార్తికమాసం ఆఖరవబోతూంది. కొంచెం కొంచెంగా చలిగాలి వీస్తూంది. సురేంద్రనాథుని మేడమీాది గదిలో కిటికీ లోంచి ప్రాఃతంకాల సూర్యకిరణాలు పడుతున్నయ్. ఆ దృశ్యం ఎంతో ఆకర్షణీయంగా వుంది. ఆ కిటికీదగ్గర్లోనే సురేంద్రుడు కుర్చీలో కూచుని టేబులుమీాదున్న జమా-ఖర్చులూ-ఆదాయం, వసూళ్ళూ బకాయిలూ, అర్జీలు అన్నీ తిరగవేస్తున్నాడు. ఈ విషయాలు అన్నీ చూడడం యిప్పు డాయనకు ఒకవిధంగా అవుసరమైపోయింది. లేకుంటే కాలం కూడా గడవదు. ఇందుకుగాను శాంతితో పోట్లాటలుకూడా జనుగుతున్నయి! ఎంతో ప్రయత్నంమీాద, అక్షరాల వేపు చూచినంత మాత్రంలో గుండెనొప్పి ఎక్కువకాదని, బలవం తంగా తనను అక్కడినుంచి బయటికి తీసుకుని వెళ్ళినందున ఎక్కువ ప్రయోజనం వుండదని, ఎన్నోవిధాల చెప్పి శాంతిని

వొప్పించాడు. విధిలేక శాంతి వొప్పుకుంది. అందువల్ల అవు సరమైనప్పుడు ఆమె భర్తకు సహాయం చేస్తూవుంది.

ప్రస్తుతం ఆమెకు భర్తగారిమీద పూర్తి అధికారంవుంది. ఆమె మాట కాదనడంగాని, ఒప్పుకోకపోవడంగాని, ఎప్పుడూ లేదు. అయిదారు రోజులుమాత్రం ఎవరో దుండగులు శాంతిని దుఃఖపెట్టారు. భార్యమాట కాదని యిప్పుడు సురేంద్రనాథుడు బయటికి వెళ్ళలేదు. శాంతి డాక్టర్లు చెప్పినవిధంగా చికిత్సావిధానం సాగిస్తూవుంది.

యిప్పుడిప్పుడే ఆమె భర్తదగ్గర కూచుని ఎర్రని దారంతో కొన్ని కాగితాలు కట్టలుకట్టింది. సురేంద్రనాథుడు ఒక కాగితంమీదినుంచి చూపులు మళ్ళించి—"శాంతీ" అని పిలిచాడు.

శాంతి ఎక్కడికో వెళ్ళింది. కొంచెంసేపైనాక వచ్చి—"నన్ను పిలిచారా?" అని అడిగింది.

"అవును! నేను కొంచెం ఆఫీసుకు వెళ్ళిరావాలి."

"వద్దు. మీకు కావలసిన దేదో నాకు చెప్పండి! నేను తెప్పిస్తాను."

"ఏమీ అవుసరం లేదు. మధురబాబుతో కొంచెం మాట్లాడాలి."

"అతన్ని పిలిపిస్తాను. మీరు వెళ్ళవలసిన అవుసరంలేదు. కాని యిప్పుడు అతని అవుసరము యేమి కలిగింది?"

"వచ్చేనెలనుంచి పనిలోకి రానక్కర్లేదని చెప్పాలి." 

శాంతి చకితురాలైంది. కాని సంతోషంగానే—"ఇంతకూ అతనుచేసిన తప్పేమిటి?" అని అడిగింది.

"అపరాధ మేమిటో సరిగ్గా చెప్పలేను, కాని చాలా దురుసుగా ప్రవర్తిస్తున్నాడు."

అని కచ్చేరికి సంబంధించిన కాగితాలు కొన్ని చూపించి– "యిదుగో చూడూ! గోలాపురంలోని ఒక విధవ ఆస్తి అంతా చాటుగా వేలం వేయించి కొన్నాడు. నన్ను ఒక్కసారి అడగ లేదు." అని చెప్పాడు.

శాంతి విచారంగా "అయ్యయ్యో! విధవ ఆస్తా! అయితే యీ పని మంచిదికాదు. ఎందుకని వేలం వేశాడు." అని అడిగింది.

"ఆమెమీద పదిసంవత్సరాలశిస్తు బకాయివుందని అసలు, వడ్డీ కలిసి పదిహేనువందలకు దావా వేశాడు."

డబ్బుసంగతి వినేసరికి ఆమె కొంచెం మెత్తబడింది. నవ్వుతూ "యిందులో మేనేజరు దోషం ఏముంది? యింత డబ్బు ఆయన ఎలా వదులుకుంటాడు?" అని అడిగింది.

సురేంద్రనాథుడు అన్యమనస్కుడై ఆలోచిస్తున్నాడు. శాంతి అడిగింది –"యింతడబ్బు వదులు కుంటారా?"

"వదలకుంటే ఒక అసహాయ విధవను యింట్లోంచి వెళ్ళగొడతారా! మరి నీ సలహా ఏమిటి?"

ఈ మాటల్లో దాగివున్న జ్వాల శాంతి శరీరాన్ని తాకింది. ఆమె విచారపడుతూ— "మీ డబ్బును మీరు దానంచేసుకుంటే, నే నెందుకు అడ్డుపడతాను. పైగా ఆమెను యింట్లోంచి వెళ్ళగొట్టమనికూడా చెప్పను" అన్నది.

సురేంద్రనాథుడు నవ్వుతూ–"అదికాదు శాంతి! నా డబ్బు నీదికాదా? నేను లేనప్పుడు నువ్వే యిలా..." అన్నాడు.

"బాగుంది. అవేం మాటలండీ."

"నాకు యిష్టమైనపని నువ్వు చేయవా?"

శాంతికి కళ్ళంట నీళ్ళు వచ్చినయ్! ఎందుకంటే భర్త గారికి శరీరంలో బావుండడంలేదు- "అలాంటి మాటలు ఎందుకు అంటారు?"

"నాకు చాలా బాగుంటాయ్! అందుకనే అలా అంటుంటాను. నువ్వు నా మనసునూ—నా కోరికలను తెలుసుకుని నిర్వర్తించవా శాంతీ?"

శాంతి పమిటచెంగు కళ్ళకు అడ్డుపెట్టుకుని తలూపింది.

కొంచెంసేపాయాక సురేంద్రుడు మళ్ళీ అన్నాడు—

"యిది మా 'పెద్దక్కయ్య' పేరు" అన్నాడు.

శాంతి కళ్ళమీదనుంచి పమిటచెంగు తీసి అతని ముఖంలోకి చూసింది.

సురేంద్రనాథుడు ఒక కాగితాన్ని చూపిస్తూ... "యిదుగో చూడు! యిది మా 'పెద్దక్కయ్య' పేరు" అన్నాడు.

"ఎక్కడ?"

"యిదిగో చూడు. 'మాధవీదేవి'. ఈమె యిల్లే వేలం వేశారు."

క్షణంలో అనేక సంగతులు శాంతికి గుర్తుకు వచ్చినయ్ "అందువల్లనేనా బహుశా యిచ్చివేద్దామనుకుంటున్నారు?"

సురేంద్రుడు నవ్వి "అందుకనే యిచ్చేస్తాను. అంతా! నా సర్వస్వమూ" అన్నాడు.

మాధవి సంగతి విని శాంతి కొంచెం గుసక్షించింది. మనసులో కొంచెం అసూయకూడా కలిగింది — "ఆమె మీ 'పెద్దక్కయ్య' కాదేమో! 'మాధవి' అనే పేరు వుంది. ఒక్క పేరుకే యింతే...."

"అయితే 'పెద్దక్క-య్య' పేరును కొంచెమైనా గౌర వించ లేనా?"

"అలాగే గౌరవించండి! కాని ఆమె స్వయంగా ఏమీ తెలుసుకోలేదేమో?"

"ఆమె తెలుసుకోలేదని—నేను అగౌరవపర్చగలనా?"

"అటువంటి పేర్లు లోకంలో చాలామందికి వుంటయ్."

"నువ్వు దుర్గ పేరు రాసి కాలితో తొక్క-గలనా?"

"ఛీ; అవేంమాటలు? దేవతల పేర్లు తెచ్చి..."

సురేంద్రనాథుడు నవ్వి "దేవతల పేర్లు తీసుకునిరాను! కాని నీకు అయిదు వేల రూపాయలు యిస్తాను. ఒకపని చేయ గలవా?" అని అడిగాడు.

"ఏమిటాపని?" అని సంతోషంగా అడిగింది.

గోడమీద సురేంద్రనాథుని ఫొటో వ్రేలాడుతూంది. ఆ పటం వేపుచూపి "యీ పటాన్ని ఒకవేళ..."అనిఆగాడు.

"ఏమిటి...?"

"నలుగురు బ్రాహ్మణులతో మోయించుకుని వెళ్ళి నది వొడ్డున తగులబెట్టించు."

దగ్గర్లో పిడుగు పడినప్పుడు క్షణంలో శరీరంలోని రక్త మంతా పీల్చుకు పోయినట్లు-సర్పము కాటువేశాక మనిషి ముఖం నల్లబడినట్లు శాంతిముఖంకూడా నల్లబడింది. ఆ తరు వాత మెల్లమెల్లగా ఆమె ముఖంలోకి నెత్తురువచ్చింది. ఆ తరువాత కరుణ దృష్టితో భర్త ముఖంలోకి చూస్తూ క్రిందికి దిగి వెళ్ళింది. పురోహితున్ని పిలిపించి శాంతి విధులు యథా విధిగా జరిపించింది. ఆ తరువాత 'ఈ పెద్దక్క-య్య' ఎవరైనా

గదిలోకివెళ్ళి కన్నీళ్ళుకార్చింది. యిటువంటి మాటలు ఆమె ఇంతవర కెప్పుడూ వినలేదు.

సురేంద్రుడు కొంచెంసేపు మెదలకుండా కూచుని-ఆ తరువాత లేచి కచేరి వేపు వెళ్ళాడు. ఆఫీసులో మధురబాబు కలిశాడు. ముందుగా "గోలాపురంలో ఎవరి ఆస్తి వేలం వేశావు?" అని అడిగాడు.

"చనిపోయిన రామతనుసన్యాల్ విధివకోడలిది."

"ఎందుకని?"

"పది సంవత్సరాల శిస్తు బకాయివుంది."

"ఏదీ ఖాతా చూపించు?"

ముందు మధురబాబుకు మతిపోయింది. ఆ తరువాత—"ఖాతా పుస్తకాలు యింకా ఖజానానుంచి తెప్పించలేదు." అని చెప్పాడు.

"ఆయితే మనిషిని పంపి అవి తెప్పించు! అయినాఆమెకు నిలవడానికి నీడ ఏమన్నా వుందా?"

"లేదనుకుంటాను."

"అయితే మరి ఎక్కడుంటున్నది?"

మధురబాబు కాస్త ధైర్యం తెచ్చుకుని "యిన్నాళ్లూ యెక్కడుంటూవుందో-బహుశా యిప్పుడూ అక్కడే వుండవచ్చు" అని అన్నాడు.

"యిన్నాళ్ళూ ఎక్కడవుంది.?"

"కలకత్తాలో తన తండ్రిగారి దగ్గర."

"తండ్రిగారి పేరు తెలుసా?"

"ఆ విధవపేరు?"

"మాధవీదేవి"

తలవంచుకొని సురేంద్రనాథుడు అక్కడే కూచుండి పోయాడు. ఆయన పరిస్థితిచూసి మధురబాబు భయపడుతూ "ఏమి జరిగింది?" అని అడిగాడు

సురేంద్రనాథుడు అందుకు జవాబు చెప్పలేదు. ఒక నౌకరును పిల్చి చెప్పాడు. "ఒక మంచి గుర్రానికి జీనువేసి తీసుకునిరా! నే నిప్పుడు గోలాపురం వెళ్ళాలి. యిక్కడికి గోలాపురం ఎంతదూరం వుందో తెలుసా?"

"పదికోసులు."

"యిప్పుడు తొమ్మిదైంది. ఒంటిగంటకల్లా అక్కడికి చేరగలనా?"

గుర్రం వచ్చింది. దానిమీద ఎక్కి కూచుని — "ఎటువేపు?" అని అడిగాడు సురేంద్రనాథుడు.

"ఉత్తరంగా వెళ్ళి ఆ తరువాత పశ్చిమానికి తిరగాలి"

ఆ తరువాత కొరడాదెబ్బతిని గుర్రం పరుగు తీసింది,

ఈ సంగతి శాంతివిని, శాకూరు గదిలోకి వెళ్ళి రక్తం వచ్చేట్లు తల కొట్టుకుని "భగవంతుడా! యిదేనా నీ మనసులో వున్నది? యిప్పుడు తిరిగి వారిని పొందగలనా?" అని వాపోయింది.

ఆ తరువాత యిద్దరు రౌతులు గుర్రాలమీద గోలాపురం వేపు పరుగుతీశారు. కిటికీలోంచి వాళ్ళను చూస్తూ శాంతి మెల్లమెల్లగా కన్నీళ్ళు తుడుచుకుంది. "తల్లీ దుర్గాదేవి!

ఆయన్ని నాకు తిరిగి ప్రసాదించు! నేను నా హృదయాన్ని చీల్చి రక్తం యిస్తాను. నీ దాహం తీరినంత రక్తం యిస్తాను తల్లీ!"

గోలాపురం చేరడానికి కింకా రెండుకోసులుంది. గుర్రము గిట్టలవరకూ నురగలు కక్కుతూంది. దుమ్ము రేపుతూ, పొలాలు దాటుతూ, కాలువలు దాటుతూ గుర్రం పరుగెడుతూంది. తలమీద ప్రచండమైన ఎండ!

గుర్రం మీదకూచున్నా-సురేంద్రనాథుని శరీరం వుడుకెత్తిపోతూంది. లోపలవున్న నరాలన్నీ వుబ్బి పైకివస్తున్నట్లున్నాయ్! ఆ తరువాత టప్పుమంటూ రెండు మూడు చుక్కల నెత్తురు దగ్గుతో పాటు ధూళిదూసరితమైన చొక్కామీద పడింది. సురేంద్రనాథుడు చేతితో మూతి తుడుచుకున్నాడు. ఒంటిగంటకు ముందుగానే గోలాపురం చేరుకున్నాడు. అక్కడ ఒక దుకాణదారుని అడిగాడు ."యిదేనా గోలాపురం?"

"అవును."

"శాంతను సన్యాల్ యిల్లెక్కడ?"

"ఈవేపు"

మళ్ళీ గుర్రం పరుగుతీసింది. కొంచెం సేపట్లోనే ఆయింటి ముందుకు వచ్చాడు.

గుమ్మంలో బంట్రోతు కూచునివున్నాడు. జమీందారుగారిని చూడగానే లేచి నమస్కరించాడు.

"ఇంట్లో ఎవరున్నారు?"

"ఎవరూ లేరు?"

"ఎవరూ లేరూ? ఎక్కడికివెళ్ళారు?"

'ప్రొద్దున్నే పడవచేసుకుని వెళ్ళిపోయారు.'

'దక్షిణంగా'

'నదివొడ్డంటా దారివుందా? గుర్రం వెళ్ళగలదా?'

'చెప్పలేను. బహుశా దారిలేదు.'

తిరిగి గుర్రం వేగంగా పరుగెత్తింది. రెండుకోసులు వెళ్ళాక దారిలేదు ఇక గుర్రం నడిచేదారిలేదు. సురేంద్రనాథుడు గుర్రాన్ని వదిలిపెట్టి కాలినడకన బయలుదేరాడు. దారంటా ఒక్కసారి శరీరమంతా చూసుకున్నాడు. అక్కడక్కడా బట్టలనిండా రక్తపుమరకలుదుమ్ముతో కలిసివున్నయ్! పెదవుల నుంచి యింకా రక్తం వస్తూనేవుంది. నదిలోకిదిగి, దోసిలి నిండా నీళ్ళుత్రాగి పరుగెత్తడం సాగించాడు. కాళ్ళకు చెప్పులు లేవు. శరీరంనిండా బురద, దుమ్ము, రక్తపుడాగులు. అతని గుండెలమీద రక్తంఎవరో చల్లినట్లుంది.

ప్రొద్దు బాగావాలిపోతూవుంది. కాళ్ళు లేవడంలేదు. ఈ సారి శరీరం వాల్చినట్లయితే జన్మకి సరిపోయేంత నిద్ర పోవచ్చు. అందుకనే అంతిమశయ్యపై ఈ జీవితానికి మహా ప్రశాంతి లభిస్తుందనే ఆశతో వున్మత్తునిలా పరుగెడుతు న్నాడు. ఈ శరీరంలో ఎంతశక్తివుందో, ఆ శక్తినంతా వుప యోగించిఅంతిమశయ్యనుఆశ్రయిస్తున్నాడు. ఇక లేవలేడుసుల్లీ.

ఆ నదిమలుపులో వున్న దేమిటి....? పడవకదూ?

ఉప్పెన్లంతా కట్టత్రవ్విపోస్తూ దారి బాగుచేస్తున్నారు.

సురేంద్రుడు 'పెద్దక్కయ్యా' అని పిలిచాడు. కాని గొంతు యెండిపోవడంవల్ల మాట బయటకురాలేదు. రెండు నెత్తురుచుక్కలు బైటకివచ్చాయ్!

'పెద్దక్కయ్యా' ఇంకా రెండుచుక్కలరక్తం బయటికి వచ్చింది.

'పెద్దక్కయ్యా' ఇంకా రెండుచుక్కలరక్తం......

ఉప్పరివాళ్ళు పడవను ఆపించారు. సురేంద్రుడు దగ్గరకు వచ్చి 'పెద్దక్కయ్యా' అని పిలిచాడు.

ఆ పగలంతా వుపవాసం వుండడంవల్లనూ, మానసికంగా దిగులువుండడంవల్లనూ, మాధవి నిర్జీవిలా, నిద్రపోతూన్న సంతోషకుమారుని ప్రక్కనే పడుకునివుంది. హఠాత్తుగా ఆమె చెవులకు ఆ పిలుపు వినిపించింది. ఎవరిదో పూర్వపరిచయ స్వరంలోనేవుంది. మాధవి లేచికూచుంది. తల బయటికిపెట్టి చూసింది. శరీరమంతా ధూళి, బురదకొట్టుకునివుంది—'అరే! ఇదేమిటి? మాష్టరుగారేనే?'

"ఇదుగో, నయినతారతల్లీ! (దాసి) పడవవాళ్ళతో పడవను వొడ్డుకు మళ్ళించమని చెప్పు.'

సురేంద్రనాథుడు మెల్లమెల్లగా వొడ్డుమీద మేను వాల్చాడు. అందరూకలిసి సురేంద్రనాథుని ఎంతో జాగ్రత్తగా పడవమీదకు చేర్చారు. ముఖంమీదా కళ్ళమీదా నీళ్ళుచల్లారు. పడవవాడు ఒకడు ఆయన్ని గుర్తుపట్టి 'లాలతాపురం జమీందారుగారు' అన్నాడు.

మాధవి 'ఇష్టకవచం' వున్న బంగారుగొలుసు మెళ్ళోంచి తీసి ఆ పడవవానిచేతిలోపెట్టి 'లాలతాపురం రాత్రికే తీసుకుని వెళ్ళగలవా? నేను అందరికి ఒకొక్కగొలుసు బహుమానం ఇస్తాను' అని చెప్పింది.

బంగారుగొలుసు చూసి పడవవాళ్ళలో ముగ్గురు పడవనుదిగి తాడు బుజాన వేసుకున్నారు.

చీకటిపడ్డాక సురేంద్రునికి స్మృతివచ్చింది. ఆయనకళ్ళు తెరచి మాధవిముఖంవంక చూస్తూన్నాడు. అప్పుడామెకు ముసుగులేదు. తలమీద కొంతవరకూ పైటచెంగుమాత్రం వుంది. సురేంద్రునితల మాధవిఒడిలోవుంది.

కొంతసేపు ఆమెముఖంలోకి చూశాక సురేంద్రనాథుడు ..."నువ్వు 'పెద్దక్కయ్య' వేనా?" అని అడిగాడు.

మాధవి తన పైటచెరగుతో ముందు అతని పెదివుల మీది రక్తం తుడిచి—తరువాత కళ్ళు తుడుచుకుంది.

"నువ్వు 'పెద్దక్కయ్య' వేనా?"

"నేను మాధవిని."

సురేంద్రనాథుడు కళ్ళుమూసుకుని ..."అవును! అదే" అని అన్నాడు.

ప్రపంచంలోని సుఖం అంతా ఆమె ఒడిలోనే వున్నట్లుంది, ఇంతకాలమయ్యాక సురేంద్రనాథుడు, యీనాడు ఆ సుఖాన్ని తిరిగి పొందగలిగాడు. అందువల్ల పెదవులమీద చిరునవ్వుకూడా ప్రస్ఫుటమైంది "పెద్దక్కయ్యా! చాలా బాధగావుంది."

తర...తర.....చల—చల...లాడుతూ పడవ పరుగుతీస్తూవుంది. పడవ పైకప్పులోంచి సురేంద్రుని ముఖం మీద చంద్రకిరణాలు పడుతున్నాయ్! దాసి ఓ చినిగిపోయిన విసనకర్రతో విసురుతూవుంది. సురేంద్రుడు అడిగాడు... "యెక్కడికి వెళుతున్నావు?"

భగ్నకంఠంతో మాధవి అన్నది ..."ప్రమీల అత్త వారింటికి"

"ఛీ! ఇటువంటి పరిస్థితుల్లో బంధువుల యిళ్ళకు వెళ్ళవంటావా పెదక్కయ్యాం?" అని సురేంద్రుడు అన్నాడు.

# 10

తన మేడలో... తను పడుకునే గదిలో 'పెద్దక్కయ్య' వొళ్లో తలపెట్టి —సురేంద్రనాథుడు మృత్యుశయ్యమీద పడుకుని వున్నాడు. కాళ్లురెండూ శాంతి వొళ్ళో పెట్టుకుని కన్నీళ్లతో కడుగుతూంది. ఢబనాజిల్లాలోవున్న డాక్టర్లూ... వైద్యులూ, అందరూ కలిసి ఆయన రక్తవాంతిని కట్టించలేక పోయారు. అయిదేండ్ల క్రితం తగిలిన దెబ్బవల్లనే యిప్పుడు రక్తం కక్కుతున్నాడు.

మాధవి హృదయంలో ఏముందో చెప్పలేను. స్వయంగా నాకే తెలియదు. అయిదేండ్ల నాటిసంగతే ఆమెకు గుర్తుకు వచ్చినట్లుంది. అతన్ని ఆమె యింట్లోంచి వెళ్ళగొట్టింది. కాని, తిరిగి తీసుకుని రాలేకపోయింది. కాని యిప్పుడు అయిదేళ్ళ తరువాత తిరిగి సురేంద్రనాథుడు ఆమెను తీసుకుని వచ్చాడు.

చీకటిపడ్డాక, ఉజ్జ్వలమైన దీపాలోకనలో సురేంద్రుడు మాధవి ముఖంవేపు చూశాడు. కాళ్ళదగ్గర శాంతి కూచుని వుంది. ఆమె వినగూడని విధంగా మాధవిముఖాన్ని తన ముఖం దగ్గరం లాక్కుని ..."పెద్దక్కయ్యా! ఆనాటి సంగతి గుర్తుందా? నన్ను యింట్లోంచి వెళ్లగొట్టావు? నిన్నిప్పుడు నేను యింట్లోంచి వెళ్లగొట్టి ప్రతీకారం తీర్చుకున్నాను. బదులుకు బదులు తీరిపోయింది కదూ?" అన్నాడు.

ఒక్క నిముషంలో మాధవి తన చైతన్యం కోలుపోయిన దానిలా వాలిపోయివున్న తన ముఖాన్ని అతని భుజమీంద వుంచింది. తిరిగి ఆమెకు స్పృహ వచ్చేసరికి యింతా ఏడుపులతో ప్రతిధ్వనిస్తూంది.

—౦—

# పథనిర్దేశ్

[శరత్ బాబు]

అనువాదం:

నీలకంఠం

శరత్ గ్రంథమాల, విజయవాడ.

# నవవిధాన్

ఈ కథలోని నాయకుడైన శ్రీయుత శైలేశ్వర ఘోషాల్ భార్య చనిపోయింది. అందువల్ల కొంతకాల మయాక మళ్ళీ గృహస్థుడవ్వుదామని అతను ఏర్పాటు చేసుకుంటున్నాడు. ఈ సంకల్పము అతని స్నేహితులకు తెలిసేటప్పటికి వాళ్ళు చాలామంది పోగయ్యారు. ఇలా జరక్కపోతే ఈ కథయెలా నడిచేదో యేవిధంగా తాయమారయేదో చెప్పడంమాత్రం చాలా కష్టమయేది! అందువల్ల ఆ పాత్రల్లోని సంగతంతా పాఠకులకు తెలియపరచడం అవసరమైంది.

కలకత్తాలోని ఓ కాలేజీలో శ్రీశైలేశ్వర ఘోషాల్ దర్శనశాస్త్రజ్ఞుడుగా పనిచేస్తున్నాడు. ఈ శాస్త్రానికి ఆయన విదేశాల్లోని ఒక విశ్వవిద్యాలయంలో పరీక్షప్యాసై, ప్రస్తుతం నెలకు యెనిమిదివందల రూపాయల జీతాన్ని తీసుకుంటున్నాడు. అయిదునెల్లక్రితం ఆయనగారి భార్య తొమ్మిదేండ్ల పిల్లవాణ్ని వదలిపెట్టి యిహలోకయాత్ర చాలించింది. కలకత్తాలోని పాటల్‌డాంగ్-అనే పేటలో తరతరాలనుంచీ వుంటూ స్వంతయిల్లుకూడా కట్టుకున్నాడు. యింట్లో అతని తొమ్మిదేండ్ల పిల్లవాడేకాక, బెయరా, గుర్రపువాడూ-బండివాడూ, మొదలైనవాళ్ళంతా కలిసి, యేడెనిమిదిమంది, ఆ యింటిజనాభాఅయి కూర్చున్నారు. మొట్టమొదటి రోజుల్లో భార్యపోయిన విచారంతో రెండోపెళ్లి చేసుకుందామని శైలేశు అనుకోలేదు. అది స్వాభావికమే!-ఆ తరువాత మనసు పెరపెరలాడింది. యిలా పెరపెరలాడడం మానవుల కేమీ కొత్తకాదు. వింతకూడా కాదు!

భవానిపురంలో భూపేంద్ర బెనర్జీ నడికూతురు మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయిందనీ, అందంగా వుంటుందనీ-అందువల్ల ఆమెనే చేసుకుంటాడనీ, అందర్కీ తెలిసింది.

ఆనాడు సాయంకాలానికల్లా శైలేశ్వరుని మిత్రద్వయమంతా ఆయనతో కూచుని 'టీ' ని ఆఖరుచేస్తున్నారు. ఆ మిత్రమండలిలో ఆయనలాంటి స్కూలుపండితుడు యింకో అతను కూర్చుని వున్నాడు. అతనికి జీతం చాలా తక్కువ. యీ మండలివాళ్ళకున్న యోగ్యత లేకపోయినా 'టీ' రుచి మాత్రం అతన్ని ఒక 'ప్రొఫెసర్'గా చేసివేసింది. తెలివి తేటల్లో అఖండుడైనందున ప్రొఫెసరులంతా ఆయన్ను 'దిగ్గజము' అనిపిలిచేవాళ్ళు. ఆయన మాట్లాడడానికిముందే 'నేను ఫలానిది అడుగవచ్చునా-అడుగకూడదా?' అని ఆలోచించి మరీ అడుగుతాడని అందరికీ తెలుసు. ఆయనకు ఇంగ్లీషేమో రాదు. అందువల్ల ఫలానావాళ్ళ పిల్ల ఫలానా పరీక్షలో ప్యాసైందని యెప్పుడైతే వింటాడో-అప్పుడతనికి వంటినిండా జెర్రులుప్రాకినట్లుగా వుండేది.

భూపేంద్రబాబు కూతురు ప్రసంగము మాటల్లోకి రాగానే, ఆయన ఒక్కసారే "ఒక పెళ్లాన్ని యింట్లోంచి తరిమేశావ్?-ఒకదాన్నే మోతినేశావ్! మళ్ళీ యిప్పుడు పెళ్లి చేసుకోవాలని చూస్తున్నావన్నమాట? అయితే నీకింకా గృహస్థాశ్రమ ఆనందాన్ని అనుభవించాలని వుంటే వుమేశ భట్టాచార్యుల కూతురు నీకేమీ అపరాధం చేయలేదుగా? అటువంటప్పుడు నీకింకా ఆడదానిమీద కోరికనేది వుంటే,

పెళ్ళిచేసుకోకుండా ఆ అమ్మాయి నెందుకని పిలుచుకరాకూడదు?' అని అడిగాడు.

ఆ మండలిలో యెంతమంది మహాశయులు కూర్చొని వున్నారో, వాళ్ళకెవరికీ యీ సంగతి తెలియదు. దిగ్గజమహాశయుడు బైటపెట్టిన మాటలు వాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగించినయ్. అందరూ మెదలకుండా కూర్చున్నారు.

కొంచెం సేపయింతర్వాత దిగ్గజమహాశయుడు మళ్ళీ అన్నాడు, "చూశారూ! భగవంతునిమీద నమ్మకముండి, పాపపుణ్యాలనేవి వున్నాయని అనుకుంటే–పాపం! మళ్ళీ పెళ్లి చేసుకోకండి. ఆమెకూడా మెట్రికుృలేషన్ పాసైంది. ఇప్పటివాళ్ళలాకాకుండా అన్నీ చేసుకోగలదు."

శైలేశ్వరుని కళ్ళు కోపంతో ఎర్రబడినయ్, కోపాన్ని ఆపుకుని "అయ్యో–దిగ్గజమహాశయా! అది వట్టి పిచ్చిదండీ" అని అన్నాడు.

యెవరైనా యెప్పుడన్నా యితర్లను గురించి వాళ్ళు పిచ్చివాళ్ళండీ, అని అతనితో అన్నప్పుడు ఆయన కోపానికి అంతుండదు. అందువల్ల కోపాన్ని దిగమ్రింగుకుంటూ– "అవును అంతా పిచ్చివాళ్ళే. లోకులు నన్నుకూడాపిచ్చివాడనే అంటారు. వాళ్ళన్నంతమాత్రాన నేను పిచ్చివాణ్ణయ్యానా యేమిటి?" అని అడిగాడు.

తక్కిన మిత్రులంతా పకపకమని నవ్వారు. ఐనా ఇంతమాత్రంతోనే యీ చర్చ ఆగిపోలేదు. నవ్వంతా ఆగిపోయాక, శైలేశుడు సిగ్గుతో జరిగిన సంగతంతా చెప్పి–"నా జీవితంలో నిజంగా యిదే పెద్ద విచారమైన సంగతి, అయినా

య్యేంచేయను? విదేశానికి చదువునిమిత్తం వెళ్ళకముందే నాకు పెళ్ళయింది. ఆపెళ్లిలో మా మామగారివల్ల యేదో విషయానికి మాటపట్టింపులు కలిగాయని, మానాన్న ఆపిల్లను ఇంటికి తీసుకరావడానికే వొప్పుకోలేదు. ఇంగ్లండునుంచి వచ్చాక నేనామెను మళ్ళీ చూడనుగూడా లేదు" అని నవ్వడానికి ప్రయత్నించి, మళ్ళీ "ఓ దిగ్గజబాబుగారూ! ఇంకో సంగతి! నిజంగా ఆమెకు పిచ్చెక్కకపోతే పుట్టింటితరపు వారైనా అత్తగారింటికి పంపే ప్రయత్నమన్నా కనీసం చేయకపోయేవారా? యింతవరకూ మీరు టీపార్టీకి పంగనామాలు పెట్టినపాపాన్న పోలేదు.ఒక వేళ మీ మాటప్రకారం ఆమెగారు నిజంగా వచ్చినట్లైతే, టీ తాగే ఆశనుమాత్రం మీరు చంపుకోవాల్సొంటుంది. అదిమాత్రం గుర్తుంచుకోండి. ఆవుపేడతో అలికి, యింటిని శుద్ధిచేయడమేకాకుండా, మన ఆనందమంతాయింతటితో స్వస్తి చెప్పుకోవాల్సొస్తుందని నేను ముందుగా యీ విషయంలో మీ కందరికీ నోటీసిస్తున్నాను" అని అన్నాడు.

"కాదు–అలా యెప్పటికీ కాదు"

దిగ్గజుడూ, శైలేశుడూ మాట్లాడుకున్న మాటలకు యెవరూ యేమీ అభ్యంతరం కలిగించలేదు. యీ మాటలన్నీ అయిపోయేప్పటికి బాగా చీకటి పడింది, అందువల్ల యేదో నాలుగైదు మాటలు మాట్లాడుకుని అంతా లేచారు.

## 2

స్నేహితులు తన మూడోపెళ్ళికి యిష్టం కనబరచలేదని శైలేశ్వరుడు గుర్తించాడు. యీ విషయంలో ఒక

వేపు అతనికి యెక్కడ విరక్తికి అంతులేనట్లుగా కనుపించిందో అక్కడే అతనికి అపరిమితమైన సిగ్గు కలిగింది.

అతని పద్ధెనిమిదో యేట మొదటి పెళ్ళయింది. భార్యయైన ఉషకు అప్పుడు పన్నెండేళ్ళు వుంటాయ్. చూడడానికి ఆ అమ్మాయి చాలా అందంగానే వుంటుంది. అందుకే కాళీపదబాబు స్వల్ప వరకట్నం విక్రయానికే కొడుకును విక్రయించేందుకు వొప్పుకున్నాడు. శైలేశ్వరుడు యింగ్లండుకు వెళ్ళడంతోనే యిచ్చి పుచ్చుకోవడాల సందర్భములో అతని తండ్రిగారికీ, మామగారికీ మనస్పర్థలు కలిగినయ్. తండ్రిగారు బలవంతంగానే కోడలిని పుట్టింటికి పంపేశారు. యింగ్లండు నుంచి కొడుకు తిరిగివచ్చాకకూడా కోడలిని తిరిగి తీసుకవద్దామని అతనికి ఆలోచన కలగలేదు. అలా తీసుకవద్దామని ఆయనకు యిష్టంకూడా లేదు!

అటు వుమేశ తర్కాలంకారుడుకూడా, అభిమానం కలవాడు కావడంచేత యెన్నటూ పిలవందే తన కూతుర్ని పంపకూడదని నిశ్చయించుకున్నాడు.

తండ్రి తన భార్యను పుట్టింటికి పంపాడని శైలేశ్వరునికి యింగ్లండులో వున్నపుడే తెలిసింది. తనుయింటికి వెళ్ళాక అన్నీ సరిజేయవచ్చని అతననుకున్నాడు. కానీ – నాలుగైదు సంవత్సరాలు విదేశాల్లో వుండి యింటికి వచ్చాక అతని స్వభావమే పూర్తిగా పరివర్తనం చెంది వూరుకుంది. తిరిగి తనకు మంచి అందమైనపిల్ల భార్య కాబోతూవుందనీ, ఆమె తండ్రికూడా తనలానే విదేశంలో చదువుకుని వచ్చాడని విని

యిది జరిగి చాలాకాలమయాక శైలేశ్వరుని తండ్రి కాళీపదబాబు స్వర్గస్తుడయాడు. అతని మొదటి పెళ్ళిమామగారైన తర్కాలంకార మహాశయుడుకూడా పరమపదించాడు. యిన్నిరోజులదాకా అక్కడ యిలా జరిగిందని శైలేశ్వరునికి తెలియదు. ఉషమాత్రం అన్నగారివద్దవుంటూ, జపతపాలు, పూజా, పునస్కారాలు, గంగాస్నానాలు, గోమాత పూజలు, సేవలు చేస్తుందని విన్నాడు. యీ పవిత్రిత అనే పిచ్చి ఆమె అన్నగారికికూడా అసహ్యమనిపించింది. యిటువంటివన్నీ శైలేశ్వరుడు విన్నాడుకానీ–ఆమె ప్రవర్తనలో, నడవడికలో, యింతవరకూ శైలేశ్వరుడు ఒక అపకీర్తి మాట కూడా వినలేదు.

శైలేశబాబు యీ పరిస్థితులన్నీ మనసులోనే బాగా మననం చేసుకుని, ఆలోచించసాగాడు. "భూపేంద్రబాబు కూతురి ఆశను వదులుకుంటే–దీనివల్ల పనవుతుందా? యేమీ తెలియని సంసారులమధ్యలో పడి పెరిగినటువంటి ఒక యిరవైరెండు, యిరవైమూడేండ్ల యువతిని పల్లెటూరిలోంచి తీసుకవచ్చి యీయింటి భారాన్నంతా వొప్పగించినట్లైతే యిన్నిరోజులునుంచీ హాయిగా నడుస్తున్న గృహం దక్షయజ్ఞమై కూచుంటుంది! యిందుకేమాత్రం సంశయంలేదు. అన్నిటికంటే ముఖ్యంగా అమాయకుడైన నా ఒక్క సోమేంద్రునికి యెన్నో కష్టాలు వస్తాయ్. మారుటితల్లి యీ పిల్లవాణ్ణి సరిగ్గా చూస్తుందనే నమ్మకమేముంది?" అనుమానాలతో యేమిటేమిటో ఆలోచిస్తున్న అతని బుర్రలోకి శ్యామ బజారులో వున్న అతని చెల్లెలు హఠాత్తుగా ప్రవేశించింది. ఆమె

భర్త ఒక బారిష్టరు. తన తొమ్మిదేండ్లకొడుకు సోమేంద్రుని అక్కడకు పంపుదామని ఆలోచించాడు అక్కడ వాడు మేనత్త గారితో ఆనందంగా వుంటాడు.

ఒకక్షణం గడవడంతోనే "యీవిధంగా కొంతకాలమే అక్కడుంటాడుకానీ యెక్కువకాలం వుండడానికి వీలుండదే" అని మనసులో మెదిలింది.

ఆనాటి రాత్రింతా శైలేశ్ కు నిద్రలేదు. మంచం మీద పడుకుని యీ విషయంలో రకరకాలుగా ఆలోచించాడుకానీ—యేమీ తోచలేదు. చివరకు తెల్లవారుతుందనగా ఒక ఒక సరళమైన వుపాయం తోచింది. "ఉషను యిక్కడకు మనిషిద్వారా పిలువనంపితే అన్నివిషయాలూ వాటంతట అవే తేలిపోతాయ్. అసలు ఆమె యిక్కడికి రాదు. ఒక వేళ వచ్చినా వుండలేదు. పైగా యిదొక తురకనౌకరున్న ఇల్లు. దిక్కులేక రెండురోజుల్లో తనంతట తానే పారిపోతుంది. ఈ రెండుమూడు రోజులపాటు సోమేంద్రుని వాడి మేనత్త దగ్గరకు పంపిస్తాను. నే నక్కడక్కడా దాక్కుని యీ కాలాన్ని కాస్తా దొర్లిస్తాను. చాలు—యింతటితో దిగ్గజ మహాశయుడు లేకెత్తించిన సమస్యలూ, చిక్కులూ, అన్నీ వాటంతట అవే విడిపోతాయ్! ఇంత సాధారణమైన వ్యూహం నాదగ్గరుండికూడా నే నెంత యమయాతనపడిపోయాను?" అని అనుకుని అలానే నిద్రపోయాడు.

మరునాడు పొద్దున్నే కాలేజినుంచి యేడురోజుల పాటు శైలేశుడు శెలవు తెప్పించుకుని ప్రయాగలోవున్న తన చిన్ననాటి స్నేహితునికి తను ప్రయాగ వస్తున్నానని

తంతినిచ్చి "ఉషను నందిపురంనుంచి తీసుకరావడానికి మనిషిని పంపాననీ, తను ప్రయాగ వెళ్తున్నాననీ, రావడానికి యేడు రోజులు పడుతుందనీ, ఆమెనువచ్చి సోమేంద్రుని తీసుకవెళ్ళమనీ" చెల్లెలు విభకు ఒక వుత్తరం వ్రాశాడు.

శైలేశ్‌కు ఒక మేనమామకొడుకు వున్నాడు. శైలేశ్ చెప్పిందంతా అతను చేస్తాడు. ఒక మెస్‌లో వుంటూ ఓ దుకాణంలో నౌకరీ చేస్తున్నాడు. శైలేశు అతన్ని పిలిచి "భూతనాద్! రేపు నువ్వు నందిపురం వెళ్లి మా అత్తను తీసుకరావాలిరా?" అని చెప్పాడు.

భూతనాధుడు ఆశ్చర్యంగా "యింకా నీ అత్తాయ్-మామయ్యా?" అని అడిగాడు.

"నువ్వు నా మొదటిపెళ్ళి వూరేగింపుకు రాలేదూ? ఉమేశ భట్టాచార్యుల యింట్లో జరిగిన నా పెళ్ళికి నువ్వు కూడా వచ్చావుగా?_"

"ఆ......జ్ఞాపకంవచ్చింది. మరిచేపోయాను. ఐనా వాళ్లు నన్ను గుర్తుపట్టలేరే? అటువంటప్పుడు అత్తాయిని నావెంబడి యెలా పంపిస్తారు?"

"రాకపోతే రాకపోయిందిలే! దానికి నువ్వేమిచేస్తావు? నీవెంబడి బెయరా, వంటదీ వస్తారు. రానంటే మీరు తిరిగి వచ్చేయండి."

"సరేలే-వెళ్ళొస్తాను. కొంపతీసి దెబ్బలపెళ్ళి చేయరు కదా?"

శైలేశుడు భూతనాధునిచేతిలో కొంతపైకం పెట్టి తాళాలు యిస్తూ "యీ రాత్రిబండికి నేను ప్రయాగ వెళు

న్నాను. యేకు రోజులకుగాని తిరిగి రాను. మీ అత్తయ్య వచ్చినట్లైతే, యీ తాళాలు ఆమె కివ్వు. ఆ అలమారుకూడా చూపించు. యింటిఖర్చుకోసం డబ్బిస్తున్నాను, యీ పైకంతోనే నెలంతా గడుపుకొమ్మని చెప్పు" అని అన్నాడు.

"మీ మనసులోకి అసలు యీ ఆలోచనెందుకని వచ్చింది? పూరికే కూచోక నెత్తిన యేమయినా పెట్టుకో దలచారా?" అని భూతనాథు ధ్వడిగాడు.

"ఆమె అసలు రాదు. ఆసంగతి నాకు తెలుసు. కానీ, సమాజదృష్టిలోనూ, ధర్మదృష్టిలోనూ విధిగా పిలిపించి తీరాలి. మన బాధ్యత అంతవరకే! శ్యామబజారుకు వెళ్ళి విభతో-సోమేంద్రుని తీసుకవెళ్ళమని చెప్పు" అని ఆరాత్రే శైలేశుడు పంజాబుమెయిలెక్కి ప్రయాగకు వెళ్ళాడు.

# 3

ఈఘటన జరిగి కొంతకాలం గడిచింది. ఒకనాటి మధ్యాహ్నమప్పుడు మోటారొకటి వచ్చి వాకిలిదగ్గర నిలుచుంది. అందులోంచి ఇరవైరెండు, ఇరవైమూడేండ్ల యువతి దిగి, యింట్లోకి వెళ్ళింది. ఆమె తిన్నగా కూచునే గదిలోకి వెళ్ళింది. నేలమీద జంబుఖానా పరిచివుంది. దానిమీద కూర్చొని సోమేంద్రుడు ఓ బైండుచేయబడిన పెద్ద ఆల్బమును విప్పి, తన కొత్తమ్మకు యేమిటో చూపుతూ ఆనందంగా వున్నాడు. ఆ ప్రసన్నతతోనే మోటారులోంచి దిగివచ్చి నామెను పరిచయంచేస్తూ "అమ్మా! ఈమేనే నాఅత్తయ్య" అని చెప్పాడు.

ఉష లేచి నిలుచుంది. వంటిమీద యెర్రంచు చీర వుంది. చేతులకూ, మెడకూ కొన్ని చిన్న చిన్న ఆభరణాలు వున్నాయి. ఐనా ఆమెఅందానికి విభకుగూడ ఆశ్చర్యం కలిగింది.

ఉషే ముందుగా మాట్లాడుతూ 'నాయనా, అత్తయ్యకు నమస్కరించవేం?" అని అన్నది.

యిలాంటిశిక్షణ సోమేంద్రునికి క్రొత్తగా అలవడింది. గబుక్కున అతను తలవంచి అత్తగారి జూటుకాలును తాకి నమస్కరించాడు. "ఇంకా నిలుచున్నావేమమ్మా! కూర్చో" అని ఉష అన్నది.

"నువ్వెప్పుడు వచ్చావ్!" విభఆశ్చర్యంగా అడిగింది.

"సోమవారంనాడు వచ్చాను. ఇవాళ బుధవారం. ఇప్పటికి మూడురోజులైంది. సరేగాని, యెంత సేపని అలా నిలుచుంటావమ్మా! కూర్చో."

అన్నగారి భార్యతో ప్రేమప్రసంగాలుచేద్దామనీ యిన్నిరోజులవరకూ యెలావుందో కనుక్కుందామనీ, విభ రాలేదు. ఆమె యింటిదగ్గర్నుంచే మనసును గట్టిపరచుకొని వచ్చినందున "కూర్చొని సావకాశంగా మాట్లాడేంత టైం నాకు లేదు. చాలా పనులున్నాయి. సోమేంద్రుని తీసుకవెళదామని నేను వచ్చాను," అని అన్నది.

ఈ మాటల్ని విభ కోపంతో అన్నా ఉష నవ్వుతూనే "నన్ను వంటరిగా యెలావుండమంటావమ్మా? అక్కడ గూడా మా అన్నగారి పిల్లల్ని నేనే దగ్గరకుతీసి పెంచే

దాన్ని. ఒక వ్యక్తయినా నా దగ్గర లేకుంటే నే నుండలేను''
అని అన్నది.

ఈ మాటను లక్ష్యపెట్టకుండానే విభ కోపంతో సోమేంద్రు నుద్దేశించి "ఓరా నాన్న నాతో నిన్ను తీసుకు వెళ్ళమని చెప్పాడు. యిక్కడ అనవసరంగా నిలుచుని మాట్లాడేందుకు నాకు టైంలేదు. సోమేంద్రా! రాదలచుకుంటే తొందరగా గుడ్డలు మార్చుకుని రా, నే నింకా న్యూ మార్కెటుకి వెళ్ళాల్సిన పనుంది,'' అని అన్నది.

సోమేంద్రుడు ఆ సమయాన విసుగుతో వున్నాడు. తల్లిమీదున్న భక్తి-అత్తమీద లేదు. వాళ్ళిద్దరిమధ్యలో పడి, ముఖం మాడ్చుకుని భయపడుతూ-భయపడుతూ "అమ్మ ఆపుతుం దత్తాయి!'' అని అన్నాడు.

సోమేంద్రుని సంకటావస్థ చూచి ఉష "నేను వెళ్ళవద్దనడంలేదు నాయనా! నువ్వుకూడా వెళ్తే యింట్లో వంటరిగా వుండలేనంటున్నాను. అంతే!'' అని అన్నది.

యీ మాటకి సోమేంద్రుడేమీ సమాధానం చెప్పలేదు. అతను విమాతవద్దకు వెళ్ళి ఆమెకొంగును పట్టుకొని నిలుచున్నాడు. అతని తలవెంద్రుకల్లో వ్రేళ్ళుపెట్టి సరిచేస్తూ ఆడబిడ్డతో "పిల్లవాడు రానంటున్నాడమ్మాయి! నాకుకూడా యిక్కడ యెవరూ తోడుకూడాలేరు,'' అని అన్నది.

సిగ్గుతోనూ, కోపంతోనూ విభముఖం కందగడ్డలా మారిపోయింది. బాగా చదువనూ వ్రాయనూ నేర్చుకుంది. పెద్దింటి ఆడపిల్లలకు యేటువంటి శిక్షణ - అలవడుతుందో, అంతకంటే యెక్కువ అనుభవం ఆమెకుంది. తనను తాను

సంభాళించుకునేందుకసమర్థురాలై "-కానీ, యితను నావెంట వచ్చితీరాలి. పైగా నువ్వితనికి తియ్యతియ్యనిమాటలు చెప్పి, మాయపుచ్చకుంటే నాడు తన తండ్రి ఆజ్ఞను పాలించేవాడని నా విశ్వాసం" అని అన్నది.

ఆడబిడ్డ నోటంట వచ్చిన ఆమాటలు వినగానే,-ఉష పెదిమలచివర గగుర్పాటు కలిగింది. ఆమె ముఖభంగిమను యేలావున్నా - అయిష్టతను కనుపించనీయలేదు.- "సోమేంద్రుడు ఇంకా చిన్నవాడు. వాడికి తెలుసుకునే జ్ఞానమేముంది? అదీకాక ఆ పిల్లవాడికి మాయమాటలు చెప్పి, మోసంచేయాలన్నంత ఖర్మం నాకెందుకు? చాలామంది పిల్లలు నాదగ్గర సంతోషంగా ఆడుకుంటూ -మనుష్యులుగా తయారవుతారు. అటువంటప్పుడు ఇతను నాదగ్గరవుంటే, మీకు యిబ్బందేమీ వుండదు-" అని అన్నది,

"సరే- నే నన్నయ్యకు వుత్తరం వ్రాస్తాను."

"అలానే వ్రాయండి. ఆవుత్తరంలోనే వారు ప్రయాగలో కూచుని యే యే ఆజ్ఞలు ఇస్తారో, అవి కలకత్తాలో వుంటూ యిచ్చేవాటికంటే, యెక్కువ యిదిగా భావించి నడుచుకుంటానని వ్రాయండి- చూడమ్మాయ్మ! నేను వయసులో - అనుభవంలో, అన్నిటా నీకంటే పెద్దదాన్ని!- అందువల్ల ఇంతమాత్రానికి ఈ విషయంలో కోప్పడవనుకుంటాను." అని ఉష యింకోమారు నవ్వింది. కొంచెం సేపాగి మళ్ళీ కోపంతో యింతవరకూ నువ్వు కూచోనన్నా లేదు. కానీ,-స్వయంగా నీ అంతటనువ్వే వచ్చి యెప్పుడన్నా నీ వదినదగ్గర కూచునేరోజు ఒకటి వస్తుందని నేను నమ్ముతాను"-అని అన్నది.

విభ జవాబేమీ చెప్పకుండా, "యివాళ నాకేమీ తీరు బడిలేదు...నమస్కారం!" అంటూ గబగబా నడచివెళ్ళి, మోటారులో కూచుని పైకిచూచింది. ఉష పైవరండాలో రేలింగ్ పట్టుకుని సోమేంద్రునితో స్థిరచిత్తంగా తనవేపు చూస్తూ నిలుచునివుండడం ఆమె గమనించింది.

## 4

యేడురోజులపాటు సెలవైనా, రెండు పక్షాలవరకూ శైలేశ్వరుడు ప్రయాగలోనే వుండి, ఒకనాటి మధ్యాహ్నం అకస్మాత్తుగా యింట్లోకి ఊడిపడ్డాడు. ముందున్న వసారాలో సోమేంద్రుడుకూర్చొని, కొన్ని వెదురుబద్దలు, రంగుకాగితాలు జిగురు, దారం- మొదలైనవాటితో యేదో పనిచేసుకుంటూ తన్మయుడైవున్నాడు. ఆ ధ్యాసలో అతను తండ్రిని చూడ లేదు. తండ్రిమీద దృష్టిపడడంతోనే-ఆయనగారి కాళ్ళకు నమస్కరించాడు- యీ ఆచరణ శైలేశునికి కష్టంగా కనుపించినా ఆయనదృష్టి వెదురుబద్దలూ, రంగుకాగితాలు-జిగురూ వీట్లమీదకు వెళ్ళడంతోనే - "ఏరా సోమేంద్ర్! ఇదంతా యేమిటి?-"అని అడిగాడు.

"యేంచేస్తున్నానో మీరూ కనుక్కోండి నాన్నగారూ!"

"యేంచేస్తున్నానో నాకెలా తెలుస్తుంది?

పిల్లవాడు చప్పట్లుకొడుతూ - "ఇది ఆకాశపు దీపం నాన్నా-!" అని అన్నాడు.

"ఆకాశపు దీపం-? ఆకాశపు దీపమేమిటిరా?-"

కుర్రవాడు ఈ ఆకాశపుదీపం చేసేవిధానం, అది వుపయోగించే విధానం ప్రొద్దున్నే నేర్చుకున్నాడు.

'ఇవాళ సంక్రాంతికదూ! రేపుసాయంకాలం దీన్ని ఓ వెదురుకర్రకుకట్టి, పైన వేలాడదీయాలి నాన్నా!-స్వర్గంలో వున్న మన తాతలందరికీ ఈ దీపం చూపించాలని అమ్మ చెప్పింది. దీనికి సంతోషించి వాళ్లు ఆశీర్వాదమిస్తారట.'

శైలేశ్వరునికి హృదయం మండిపోయింది. కోపంతో వాటిని తన్ని - ఆ వస్తువులన్నిటినీ పారవేసి, - "ఆశీర్వాదమిస్తారు! యిస్వారూ? - ప్రపంచములో యెందుకూ పనికిరానటువంటి ఈ చెడ్డపనులన్నీ నీకు కావాల్సొచ్చినాయ్! వెళ్ళి చదువుకో." అని అన్నాడు.

యెంతో సంతోషంగా కట్టుకున్న ఆకాశపుదీపం పాడవడంతోనే. సోమేంద్రునికి కళ్ళల్లో నీళ్లు నిండినై! - పై భాగంలోంచి "నాయనా సోమేంద్రా! యిటు రామ్మా యిటురా! రేపు బజారునుండి నీకింకో మంచి ఆకాశపుదీపాన్ని కొనుక్కొచ్చి యిస్తాను. రా నాయనా!" అని మధురకంఠం వినిపించింది.

సోమేంద్రుడు కళ్లు తుడుచుకుంటూ, పైకి వెళ్లాడు. శైలేశ్వరుడు ఎటువేపు చూడకుండా, తిన్నగా చదువుకునే గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. క్షణమయ్యాక గణగణమంటూ బెల్ ప్రయోగించినా యెవరూ రాలేదు.

"అబ్దుల్- ."

అబ్దుల్ రాలేదు.

"గిరిధారీ!-ఓ గిరిధారీ!-"

గిరిధారికి బదులుగా బెంగాలీనౌకరైన గోకుల్ వచ్చి తొంగిచూసి భయంతో-"అయ్యా!"అని అన్నాడు.

"అయ్యో! అందరూ చచ్చారా యేమిటిరా?"-

"లేదు బాబూ!"-

"లేదు బాబు!-మరి అబ్దుల్ యేడి?"

"అమ్మగారు వాడికి సెలవిస్తే, ఇంటికి వెళ్ళాడు-"

"అబ్దుల్‌కి సెలవిస్తే, వా డింటికి వెళ్ళాడా? మరి గిరిధారో?-"

"వాడికూడా సెలవు దొరికితే యింటికి వెళ్ళాడు"

గోకుల్ చెప్పిన మాటలకు శైలేశ్వరుడు చకితుడై-"అయితే మరి-యిప్పు డింట్లో యే నౌకరూ లేడా యేం?"అని అడిగాడు.

"మిగిలినవాళ్ళంతా వున్నారండి!"

"మిగిలినవాళ్లుమాత్రం యెందుకని వున్నారు?-వెళ్లు అవతలకి వెళ్ళిపో"

"శైలేశ్వరుడు తన చేతులతోనే బూట్లు విప్పుకుని, కోటువిప్పి టేబులుమీద పెట్టాడు. వంకీనుంచి ధోవతి తీసి కట్టుకుని, పంట్లాంవిప్పి కొంచెం దూరంలోవున్న కుర్చీమీదకు దాన్ని విసిరి వేశాడు. అది కుర్చీమీద పడకుండా నేలమీద పడింది. నెక్-టై- కాలరు అన్నీ అక్కడక్కడ విసిరి పారేసి, కుర్చీలో కూర్చొని యేదో ఆలోచిస్తూ కూర్చున్నప్పుడు అతనిదృష్టి ఓ కాగితమ్మీదికి వెళ్ళింది. దానిమీద "ఇంటికైన ఖర్చుల వివరం" అని వ్రాసివుంది.

ఆ కాగితాన్ని విప్పి చూశాడు. అదొక ఆడమనిషి దస్తూరి. అందులో బజారులోనుంచి తెచ్చిన వస్తువులఖరీదు ఒక్కటొకటి విడివిడిగా వ్రాసున్నాయ్! కొంచెం సేపటికి వరజా

తొలగించుకొని యెవరో ఒకామె లోపలకు రావడం చూశాడు. ఆమె యెరరైనా కానీ,– దాసీదిమాత్రంకాదని శైలేశ్వరునికి నమ్మకం కలిగింది. వెంటనే ఆయన తన్మయత్వంతో లెక్కజాబితాను చూడ్డం మొదలుపెట్టాడు. గదిలోకి వచ్చినామె ఆయన కాళ్ళకు నమస్కరించి, లేచినిలుచుని "మీరిప్పుడు కూడా 'టీ' తాగుతారా?–టీ తాగాక భోజనం చేయరా?"– అని అడిగింది.

"సరే–భోజనం చేయను–"

"సరే–భోజనం చేయకండి! కానీ,–లేచి కాళ్ళూ ముఖం కడుక్కోండి! వేళకాని వేళలో స్నానం చేయకూడదు. నేను అల్పాహారపు యేర్పాటు చేశాను. కొంచెం షరబత్ కూడా చేసుంచమని కుముదతో చెప్పివచ్చాను. మీరు పదండి."

యిప్పటికవన్నీ అలానేవుంచు–"

'అయ్యగారూ! నేను ఉషనండి!– పెద్దపులినీ, యెలుగుబంటినీ కాను. కళ్ళెత్తి నన్నొకసారి చూస్తే, మిమ్మెవరూ ఛీ...ఛీ...అని అనరులెండి–''

"పెద్దపులివనీ యెలుగుబంటివని నేనన్నానా?–"

"అననప్పుడు మీ రెందుకని, అలా తప్పుకుని తిరుగుతారు–"

"నాకు చాలా పనులున్నాయి! అందుకని వెళ్లాల్సి వచ్చింది. కానీ,– నువ్వు విభతో యెందుకని పోట్లాడావు?–"

"అది మీరుకల్పించుకునివుండాలి. నే నామెతో పోట్లాడానని, విభ మీ కెప్పుడూ వుత్తరం వ్రాసివుండదు–"

"సరే – అబ్దుల్ నెందుకని పంపించేశావు?"

"పనిలోంచి తీసివేశానని మీతో యెవరన్నారు?- ఒకసంవత్సరంనుంచీ అతనికి జీతం మీరు యివ్వడంలేదట? ఇంటికి వెళ్ళడానికి యాతనపడుతుంటే - వాడిలెక్కంతా చూసి, పూర్తిగా యిచ్చి పంపించాను."

"అతనికి రావలసిన జీతమంతా పూర్తిగా ఇచ్చావన్నమాట!- అయితే ఇక వాడు తిరిగిరాడు. మరి గిరిధారి యెందుకని వెళ్ళాడు?"

"నౌకరులకు జీతం ఇవ్వకుండా ఇబ్బందిపెట్టడం మీకు మంచిపనికాదు. మీ రెండు కలాచేయాలి? వాళ్ళకు మాత్రం ఇల్లూ వాకిళ్ళూ లేవూ! నేను గిరిధారికికూడా జీతం చుక్తాచేసి పంపించాను."

"బాగాచేశావు! ఇక ఈ ఇంటిని వసిష్ఠమహాముని ఆశ్రమంగా తయారుచేయ్!" అని అంటుంటే ఆతనిదృష్టి చేతిలో వున్న కాగితంలోని ఓ పెద్ద మొత్తంమీద పడీ పడడంతోనే, త్రుళ్ళిపడి - "ఇదేమిటి? ఈ నాలుగువందల ఆరు రూపాయలేమిటి?-" అని అడిగాడు.

"కోమటిదుకాణంలోని పద్దును జమకట్టించాను. ఇంకా అతనికి షుమారు రెండువందల రూపాయలు బాకీ వున్నాము. వచ్చే నెలలో తక్కిన బాకీ చుక్తాచేయిస్తానని అతనితో చెప్పాను."

"కోమటిదుకాణంలో-ఆరువందల రూపాయలు బాకీ అయినవా?-"

"యెందుకనికావు?- యెప్పుడూ పూర్తిగా డబ్బీయరు. యెప్పటికీ లెక్క సరిచేయకపోతే యేమవుతుంది?- రెండు

సంవత్సరాలనుంచి బాకీ కూడపెట్టుకొని వస్తుంటే, పెద్ద మొత్తమవక యేమవుతుంది?–"

అప్పటికి శైలేశ్వరుడు మొఖమెత్తి చూసి–"అయితే నువ్వు రెండుసంవత్సరాలలెక్కను తనిఖీచేశావన్నమాట?" అని అడిగాడు.

"తనిఖీచేయకపోతే ఇక వుపాయమేముంది"

శైలేశ్వరుడు మెదలకుండా యేదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"యేమిటాలోచిస్తున్నారు–?" మృదువుగా అడిగిందిఉష.

నవ్వడానికి ప్రయత్నించి శైలేశ్వరుడు,– "వున్న డబ్బంతా ఖర్చుపెట్టేశావు. జీతం అందడానికి ఇంకా పది హేనురోజులు పడుతుంది. అందాకా సంసార మెలా నిర్వాహకం జరుగుతుందా అని ఆలోచిస్తున్నాను" – అన్నాడు.

ఇదికూడా తెలుసుకోలేనంతటి చిన్నపిల్లనాయేమిటి. ఒక్క పదిహేనురోజులకేకాదు. నెలవరకు మిమ్మల్ని డబ్బడగను, గొల్లవాడికి నూటయాభై రూపాయలు, చాకలికి యాభై,– దర్జీవాడికి యెంతుందో అది వాడికే తెలుసు! ఇంత ఇదిగా ఖర్చుపెట్టడానికి మీ కేమంత ఇబ్బందివచ్చిందో చెప్పండి?– వీళ్ళందరికి నేనీ నెలలో తీర్చేస్తానని మాట ఇచ్చాను."

శైలేశ్వరుడు భయపడి– "నువ్విలా యెందుకు మాటిచ్చావు?– బాగానేవుంది! వాళ్ళు వెయ్యిరూపాయలవరకూ బాకీవున్నానని చెపుతారు. అప్పుడు నువ్వు అవన్నీ తీరుస్తావా యేం?– తీర్చినా యెక్కణ్ణుంచి తెస్తావు?–" అన్నాడు.

ఉషముఖంలో విచారపు రేఖేమీ కనిపించలేదు. స్వాభావికంగానే "బాకీలన్నీ ఒక్కసారే తీరుస్తానని నేను చెప్పలేదు. మూడు నాలుగు నెలల్లో బాకీలన్నీ చుక్తాచేస్తాను...ఇంకా యెవరన్నా వున్నా యేమో చెప్పండి. నాదగ్గర మీరే మీ వాచకండి!" అని అడిగింది.

ఉషముఖంలోకి చూస్తూ శైలేశ్వరుడు "పోయిన సంవత్సరం వేసవికాలములో సిమ్లా వెళ్ళేప్పుడు, ఒకతనివద్ద రెండు వేలరూపాయలు ప్రోనోటుమీద తీసుకున్నాను. ఆ బాకీ ఇప్పటివరకు, ఒకదమ్మిడీకూడా తీర్చలేదు—"అని చెప్పాడు.

చెంపమీద చేయి పెట్టుకుని వుష ఆశ్చర్యంగా చూస్తూ "మీ రంతా పాడుచేశారే!"అనిక్షణమయ్యాక "మీమూలంగా నే నొక సంవత్సరం దాకా రుణవిముక్తురాలిని కాలేననుకుంటాను, సరే! ఇంకా యెవరికన్నా బాకీ వున్నారా?" అని అడిగింది.

"ఇంకెవరికీ బాకీ లేదనుకుంటూ.వున్నా యేదో స్వల్ప బాకీ వుంటుందనుకుంటాను – ఈ బాకీలవల్ల నే నీజన్మలో రుణవిముక్తుణ్ణి కాలేననుకున్నాను"–

ఈ బాకీలను గురించి – మీ రెప్పుడన్నా ఆలోచించారా?"

"యెప్పుడూ ఆలోచించలేదు. అయినా అప్పుడప్పుడు అర్ధరాత్రిపుడు మెలకువవచ్చినపుడు నాకెంతో వ్యాకులత కలిగేది. అప్పుల ఇబ్బందులమూలకంగా యిరుకుల్లో పడేవాణ్ణి! కానీ – ఉషా, నువ్వు నన్ను మరిపించాలని అనకుండా, నిజంగా ఈరుణాన్నుంచి విముక్తుణ్ణి చేయగలవా?–"

ఉషకనురెప్పలు చెమ్మగిల్లినయ్! కానీ, నవ్వి "భలే వారండీ! యింటికిగాను ఖర్చుచేస్తూ చేస్తూ ఋణాల పాలయ్యారు. ఆ ఋణాన్ని తీర్చలేమూ?–అయినా ఈజన్మకు తీర్చలేనంతఋణం, మీనెత్తిన యేముంది?– ఈ కొద్ది బాకీ తీర్చడానికి నా కట్టేకాలం పట్టదులెండి–"

"కానీ– ఇంట్లో అందరికీ, కష్టం–"

కష్టంకాదు. యేమీకాదు, యెవరికీ యే మాత్రం కష్టంకలుగకుండా యెలా మీకు తెలియకుండా తీరుస్తానో చూడండి–"

శైలేశ్ మాట్లాడకుండా కూర్చున్నాడు. కొన్నిరోజుల నుంచి చీకటిలోవున్న తను ఇవాళ సూర్య కిరణాల వెలుగు లోనికి వచ్చినట్లు యింది.

## 5

శైలేశ్వరుని మేజామీద తగినన్ని వుత్తరాల గుట్ట వుంది. చాలా కవర్లు,చాలా కార్డులూ చదివి వాటికి తిరిగి జవాబు వ్రాస్తుంటాడు. ఈ మధ్యలో వచ్చిన దినపత్రికలు పక్షపత్రికలు, మాసపత్రికలుకూడా అక్కడ పెట్టబడివున్నాయి! అన్నీవిప్పి చూడవలసివుంటుంది. యెన్నో పనులు మూలకంగా ఆయనకు సాయంకాలమువరకు తీరుబడి వుండదు. అత నెటువంటి కార్యదీక్షాపరుడో తెలుసుకొనేందుకు కొన్ని గంటలపాటు పనిచేసినా అలసట పొందని, విసుగుదలలేని ఆయనముఖం. చూసినవాళ్ళకే తెలుస్తుంది.

శైలేశ్వరుడు చేతిలోని పని పూర్తిచేసుకొని–స్విచ్ నొక్కి లైటు వేసి, ఓ లావుపాటి దర్శన్ శాస్త్రపుస్తకాన్ని తీసుకుని పట్టుదలతో చదువుకుంటున్నాడు.

గదిలో కూర్చొని శైలేశ్వరుడు చదువులో నిమగ్నుడై వున్నపుడు - కుముదిని పరదా తొలగించకుండా బైటినుంచే "బాబుగారూ! అమ్మగారు భోజనానికి రమ్మనమని చెప్ప మన్నారు.—" అని పిలిచింది.

శైలేశ్వరుడు చేతినున్న గడియారంచూసి-"యింకా నాకు భోజనపు టైం కాలేదు. యింకో యాభై నిమిషాల టైముంది." అన్నాడు.

"యిప్పుడలానే వుంచమని చెప్పమంటారా?—"

"వుంచమని చెప్పు—"

వెళ్తూవున్న దాసీదాన్ని మళ్ళీ పిలిచి- "అలా వుంచ మని చెప్పడం యేమంత బాగోలేదు- వెళ్ళి వస్తున్నానని చెప్పు" అన్నాడు.

ఈనాడు భోజనాలగదిలో మేజాబల్లలూ, కుర్చీలూ లేవు. శైలేశ్వరుడు పైకివచ్చి, తను పడుకునేగదికి యెదురుగా వున్న వసారాలో పీటవేసి వుంచడమూ, స్వదేశీ పద్ధతిలో- దేశీయ ఆహారము తయారుగా వుండడమూ చూశాడు. పూర్వము చిలుముపట్టి మాసిపోయిన గ్లాసులూ, పింగాణీ చిప్పలూ, అవన్నీ బాగా తోమి తెల్లగాచేయబడివున్నాయి! కంచానికి మూడువేపులా, రకరకాల వేపుడుపదార్థాలు వడ్డన చేసి, సోమేంద్రుని తన దగ్గరగాకూర్చోపెట్టుకుని సమీపంలో కూర్చొని ఉష యెదురుచూస్తూ వుంది.

శైలేశ్వరుడు పీటమీద కూర్చుంటూ "నేను తిన్నతరు వాతే నువ్వు అన్నంతింటావని నాకు తెలుసు!-కానీ, సోమేం ద్రుడో? వాడుకూడా తినకూడదా?—"అని అడిగాడు.

ఈ మాటకు జవాబుగా సోమేంద్రుడు "నేను ప్రతి రోజూ అమ్మతోనే భోంచేస్తున్నానునాన్నా!" అని అన్నాడు.

యెన్నో పదార్థాలు చేయబడివున్నాయి. వాటిని చూచి శైలేశ్వరుడు,-"ఈ వంటలన్నీ యెవరన్నా చేశారా? లేక నువ్వేచేశావా?" అని అడిగాడు.

" నేనే "

"అయితే ఇకనుంచి వంటమారాజుకూడా వుండడన్న మాట. వాడికి జీతం యేమీ బాకీ లేదని నాకు గుర్తుంది. అటువంటప్పుడు వాడికిఒకసంవత్సరపు జీతం బహుమతియిచ్చి పంపేస్తావా?."

వస్తున్న నవ్వును ఆపుకుంటూ ఉష-"నౌకరులకు బహుమతి యివాల్సివస్తే,యివ్వకతప్పదు. వూరికే బకాయీ పెట్తే పాపం వాళ్ళకేపనులూ కావు. వాళ్ళ సంగతులు కూడా మనం ఆలోచిస్తూవుండాలి. అయినా ఇంతటితో మహారాజెక్కడికీ పోలేదు. వాడు ఇక్కడే వున్నాడు. వాణ్ణి పిలవమంటారా?." అని అడిగింది.

"వద్దు...వద్దు...వాణ్ణి చూడ్డానికి నాకేమీ తొందర లేదు!కానీ,-ఒకనాడు కాకపోయినా ఇంకోనాడన్నా వాడితో వంటచేయించాలి. లేకపోతే. నేర్చుకున్న వంటంతా మరిచి పోతాడు."

భోజనంచేస్తున్న ప్రతిపదార్థమూ యెంత రుచిగా వుందో శైలేశ్వరునికే తెలుసు!అతనికి తల్లి బ్రతికున్నరోజులు గుర్తుకువచ్చినాయి. దగ్గరున్న చిన్నగిన్నెను లాక్కొని "భలే! మంచివాసన వొస్తోందే! గోసాయివాళ్ళు మాంసాన్ని తినరు.

పనసకూరలో, గరమసాలా వేసుకొని మాంసంలా వాళ్ళు వండుకు తింటారు.” అని అన్నాడు.

ఉష కిలకిలా నవ్వింది. తల్లి నవ్వును సోమేంద్రుడు అర్థముచేసుకోలేక “అమ్మా! పనసకూర మేక మాంసానికి బదులు యెలా చేసుకొని తింటారే?”అని అడిగాడు.

ఈ మాటకు జవాబుగా ఉష పిల్లవాణ్ని ఇంకా హృదయానికి హత్తుకుని భర్తతో “ముందు తిని చూడండి.” అని అంది.

ఒక్క ముక్కను నోట్లో వేసుకుని శైలేశ్వరుడు—“కాదు ఇది పనసకూర కాదు. మేకమాంసమే! యెంత బాగా చేశావు? ఇంతఇదిగా వండడం యెక్కడ నేర్చుకున్నావు?.” అని అడిగాడు.

“వంట వండడం మీఅబ్దులు కేనా తెలుసు.?నాకేమీ తెలియ దనుకున్నారా.?”

“ఈగిన్నెలోని పదార్థాన్ని తిన్నతర్వాత మాట్లాడడం యెవరికి చేతనవుతుంది ప్రతిరోజూ ఇటువంటి ఉత్తమ పదార్థం లభ్యమౌతుందా.?”

“మన కేం తక్కువవుందని దొరకదో చెప్పండి.?”

“అబ్దుల్ వెళ్ళిపోయాక నాకు కలిగిన విచారం ఇవాల్టితో మరచిపోయే సాధనం దొరికింది. ఐనా నా మీదున్న ఆ ఋణం మాత్రం.........”

ఆయనమాట పూర్తి కాకముందే “భర్తా, కొడుకుల కడుపులుమాడి, ఋణం చెల్లిస్తానని మీతో అన్నా, నా? ఐతే

చెబుతున్నాను, ఋణాన్ని గురించి మీరేమీ విచారించకండి.''
అని ఉష అన్నది.

'దీని సంగతి నీతో యేమీ చెప్పడం లేదు కానీ...'

'కానీ, గీనీ యేమీ లేదు. మీ కడుపుకు తినాలని మీరు అప్పు చేయలేదు.'

'ఉషా! యే కారణంతో నే నింత అప్పు చేశానో, ఆ సంగతి నీకు తెలియదు.'

"అది తెలుసుకుందామని నా కేమీ ఆదుర్దా లేదు. దయ వుంచి నేను పిచ్చి దాన్నని మాత్రం మళ్ళీ వదలిపెట్టకండి."

శైలేశ్వరుడు జవాబేమీ చెప్పలేదు. ముఖం వంచుకుని భోజనం చేస్తున్నాడు. సోమేంద్రుడు—"అమ్మా! అన్నం తినప్పా?—పద!. మరి నిన్న నీవు చెప్పావే,—ఆ జటాయువక్షి కథ పూర్తిగా చెప్పాలి...సరే—అమ్మా! జటాయుపక్షి పిల్లలు అప్పుడేమి చేసినయి?" అని అడిగాడు.

శైలేశ్వరుడు ముఖమెత్తి "జటాయుపక్షి పిల్లలు యేం చేసినయ్యో కాని, వీడు మాత్రం నిన్ను బాగా దొరికించుకున్నాడు—" అని అన్నాడు.

ఉష యేమీ మాట్లాడకుండా పిల్లవాడి తలని ముద్దుతూ వుంది.

"దీనికి కారణ మేమిటో నీకు తెలుసా?—", అని శైలేశుడు అడిగాడు.

"కారణ మేముంటుందండీ?— వీడికేమో తల్లి లేదు. పైగా ఇంట్లో ఇంకో ప్రాణికూడా లేదాయె! యింకా యేమీ తెలియని కుఱ్ఱవాడు." అని ఉష అన్నది.

"ఆ సంగతంతా నిజమే? — కాని, తల్లి బ్రతికున్న

ప్పుడు కూడా ఇటు వంటి ఆదరణ నేది యెరిగుండడు?"

"మీకెప్పుడూ ఒకటే ఆలోచన! సరే, ఇక దాన్ని పోనీయండి!. ఇంకొంచెం మాంసం తెమ్మని చెప్పమంటారా, అప్పుడే లేవకండి. మీరు తినకపోయినా సరే కాని,—ఆ మిఠాయివుండలు రెండూ తినకుండా లేస్తే, నా మీద వట్టు వేసినట్టే! ."

శైలేశుడు తల్లికి ఒక్కడే కొడుకు. ఈనాడు తను చిన్ననాడు మారాంచేసినపుడు తనతల్లి వట్టు వేసి తనకు ఆప్యాయంగా తినిపించిన దృశ్యం కళ్ళకు కట్టినట్లయింది! . ఆ రెండు మిఠాయివుండలూ విడిచి వెళ్ళలేక ఒక వుండను త్రుంచి—నోట్లో వేసుకొని మెల్లమెల్లగా "ఉషా! నేనికెప్పుడూ యేవిషయంలో కూడా లెక్కచూడను. యీ బరువంతా నీకు వదిలి, నేను నిశ్చింతగా వుందామనుకుంటున్నాను—" అని ఆయన లేచాడు.

# 6

చూస్తూచూస్తూండగనే, ఒక సప్తాహం గడిచిపోయి ఆదివారం మళ్ళీ వచ్చినసంగతి శైలేశ్వరునికి తెలియదు. వుదయాన్నే లేవగనే ఉష-"నేను ప్రతిరోజూ మిమ్మల్ని విభ వద్దకు వెళ్ళి రమ్మనమని చెప్తూనే వున్నాను. ఆమె మనసులో యేమనుకుంటుందో, యేమో మరి!——మీరు నిజంగా ఆమెకూ నాకూ పోట్లాట పెట్టేటున్నారు?" అని అడిగింది.

శైలేశ్వరుడు మనసులోనే సిగ్గుపడుతూ "నాకు కాలేజి పనులెన్నో వున్నాయి! నీకు తెలుసుగా? తీరుబడి కావడం లేదు ." అని అన్నాడు.

"మీకు తీరుబడి వుండదని నాకు తెలుసు. ఐనా కాలేజి నుంచి ఇంటికి వచ్చేటప్పుడు అక్కడికి వెళ్ళి రావచ్చుగా?"

"ఇంటికి వచ్చేటప్పుడు యెంతఇదిగా అలసిపోయుం టానో నీకు తెలుసు! నువ్వుకూడా పిల్లలకు చదువు నేర్పు తూవుంటే తెలిసేది?"

ఉష నవ్వుతూ అంది. "నేను మీకాళ్ళుపట్టుకుంటాను. మీకు యెంతకష్టంగావున్నా, ఇవాళ వచ్చేప్పుడు కొంచెం ఆలస్యమైనా సరే, అక్కడికి వెళ్ళిరాండి! ఆదివారంనాడు కూడా పిల్లలకు చదువుచెప్తారా యేం? విభదగ్గరకు మీరు వెళ్ళిరాకుంటే. ఆమె నాముఖం యీజన్మలో చూడదు."

శైలేశ్ యేమీ మాట్లాడలేదు.

ఉష గుర్రపుబండి తోలేవాణ్ణి పిలిచి, బండితయారు చేయమనీ, బాబుగారిని శ్యాంబజారుకు పంపించి వెంటనే తిరిగిరమ్మననునీ, తనకు బండి అవసరమనీ చెప్పి పంపింది.

శైలేశ్వరుడు వెళ్ళే సమయంలో పిల్లవాడితో "పద. మీఅత్తగారింటివేపు షికారుగా వెళ్ళి వద్దాం" అన్నాడు.

తండ్రిగారి మాటలు పిల్లవాడికేమీ ఇష్టాన్ని కలి గించలేకపోయినై! అసలు అత్తగారింటికెళ్ళడం ఆ అబ్బాయి కేమీ ఇష్టంలేదు. అదీకాక ఆనాడు జరిగిన సంగతులు జ్ఞప్తికిరాగానే అతనికి భయం కలిగింది. అదిచూసి ఉష పిల్లవాణ్ని దగ్గరకు లాక్కుని—"సోమేంద్రుని యిక్కడేవుంచి వెళ్ళండి! వాడు యింకోనాడు వెళ్ళివస్తాడు." అని అన్నది.

"విభవద్దకు వెళ్ళడానికి వాడి కిష్టంలేదని నీకూ తెలిసిందీ?"

"మిమ్మల్ని చూసి యిప్పుడే తెలుసుకున్నాను" అని పిల్లవాణ్ని తీసుకుని నవ్వుతూ పైకి వెళ్ళింది.

శైలేశ్వరుడు శ్యామబజారులోని చెల్లెలింటిదగ్గర్నుంచి తిరిగి వచ్చేటప్పటికి రెండున్నర గంటలైంది. ఆయన వెంట- చెల్లెలు విభ, బావగారైన క్షేత్రమోహనుడు, క్షేత్రమోహనుని అవివాహితయైన చెల్లెలు ఉమా, రావడానికి సిద్ధమయారు. చెల్లెలిని తనవెంట తీసుకురావడానికి శైలేశ్వరునికి యిష్టంలేదు. ఆమె తనంతట తానే బైలుదేరివచ్చింది. ఉషకు విరుద్ధంగా ఆమె కెన్నో ఊహలున్నాయ్!

అన్నగారు కలిసినప్పటినుంచీ బలవంతంగా విభ ఉషమీద సాడీలు చెపుతూనేవుంది. "యిన్ని రోజులు గడిచి పోయాక, భార్యను ఇంటికి తీసుకొచ్చి-చాలా పొరపాటు చేశావన్నయ్యా! దీని మూలకంగా స్వర్గంలోవున్న నాన్న గారి ఆత్మకు శాంతిని పోగొట్టావ్!-ఒకనాడు నాన్నగారు దేన్నయితే పనికిరాదని పరిత్యాగంచేశారో, ఆ వస్తువునే నీవు భద్రంగా తీసుకొచ్చి యింట్లో పెట్టుకునే అవసర మేమొచ్చింది?"

సభ్యతగల యిటువంటి గొప్పకుటుంబములో, ఉష వుండడానికి యోగ్యత లేదంటూ, "యీమెతో నాకు సంబంధముంధని, మా వదిన అనీ-స్నేహితులకుగాని, స్నేహితురాండ్రకుగానీ, నేను పులుముకుని చెప్పేంత యోగ్యత ఆమెలో నాకు కనుపించలేదన్నయ్యా!-యేసభకు, సొసైటీకి, సినిమాకుకూడా నా వెంట తీసుకునివెళ్ళేంత యోగ్యత ఆమెలో లేదన్నయ్యా! యీమెను "నా వదిన" అని చెప్పుకొనడానికి

నా కెంతో సిగ్గుగా వుంది!, అటువంటప్పుడు నావదినని చెప్పు కుంటూ.పదిమందికీ నాముఖ మెలాచూపను?'' అన్నది విభ.

క్షేత్రమోహానునికి ఉషతో పరిచయములేదు, ఐనా అతను ఆమెపక్షంగా మాట్లాడుదామని అనుకున్నాడు కాని భార్యనోటికి బెదిరి వూరుకోవలసివచ్చింది. కోపంతో విభ "అన్నాయ్! నాకేమీ తెలియదని అనుకుంటున్నావేమో కానీ, నా కన్నీ తెలుసు! యింట్లోఅడుగు పెట్టేపెట్టడంతోనే పాతనౌకరైన అబ్దుల్‌ను,తురకవాడని వెళ్ళగొట్టింది. కులానికి తక్కువవాడైనందున గిరిధారిని పంపించివేసింది. యే యింట్లో, మతంతోనూ కులంతోనూ పట్టింపులువుంటాయో, అటువంటి యిళ్ళతో మా కెంత దగ్గరవారైనాసరే, సంబంధాన్ని పెట్టుకోవడం మా కిష్టంలేదు.........యిటువంటి తత్వంగల మనిషిని, ఒకనాడన్నా, నా వదినగారు అని చెప్పుకోవడం నా కేమీ యిష్టంగాలేదు.........దీని కెవరేమనుకున్నా నాకేం ఫరావాలేదు–'' అని అన్నది.

యీమాటలు యెవర్ని గురించి చెప్పిందో – అందరూ తెలుసుకున్నారు. శైలేశ్వరుడు మెల్లమెల్లగా "అబ్దుల్‌ను గిరిధారిని మనజాతివాళ్ళు కారనీ, మన కులంవాళ్ళు కారనీ వెళ్ళగొట్టలేదు. వాళ్ళిద్దరూ యింటికి వెళ్ళడానికి చాలా యిబ్బంది పడుతుంటే పంపించింది.'' అని చెప్పేడు.

అన్నగారి నోటంట వచ్చిన సమాధానానికి విభ శాంతించలేదు. అనుమానమేమీ లేకుండా కర్రవిరిచినట్టు "రెండో వదిన బ్రతికున్నంతకాలం వాళ్ళు తమజీతాలకి తొందరచేయలేదు, నాళ్ళేమీ యిబ్బందిపడలేదు...యీమె ఇంట్లోకి

అడుగుపెట్టగానే, వాళ్ళ కెక్కడలేనియిబ్బందులూ-యింటి మీద ధ్యాసలూ బైలుదేరి పారిపోయారా?" అని అన్నది.

శైలేశ్వరుడు జవాబు చెప్పలేదు.

"నౌకర్లూ, దాసీలూ వెళ్ళిపోయాక, "మరి నీ కెలా జరుగుతుంది?"

"యేం అలానే జరుగుతుంది"

"వెళ్ళిపోయినవాళ్ళు తిరిగి రారని నానమ్మకం! సరే, యింటిని ఒక్కసారిగా బ్రాహ్మణపురోహితుల యిల్లుగా మారిస్తే బావుండను. గౌరవస్థులమధ్య మెలుగుతున్నపుడు వాళ్ళననుసరించే నడవాలి...యెక్కడన్నా తంటాలుపడి, యింకోమనిషిని వెంటనే పనిలో పెట్టుకో! యీవిధంగా గౌరవం లేనివాడిలా వుంటే లోకులేమంటారు?"

"పనులు కాకపోతే, అలానే మనిషిని పెట్టుకోవాల్సి వస్తుంది"

"మీ కెలాగడుస్తుందో, మీ కే తెలియాలి. ఆసంగతి మా కేమీ తెలియదు" అని విభ గుడ్డలు మార్చుకునేందుకు లేచింది. లేస్తూ, లేస్తూనే "మా పుట్టిల్లు వుందని వస్తే ఒక కప్పు 'టీ' కూడా దొరకదు కాబోలు!" అని అన్నది.

క్షేత్రమోహనుడు యిప్పటివరకూ వూరికే కూర్చున్నాడు. అన్నాచెల్లెళ్ళ మాటల్లో తను జోరబడ గూడదనుకున్నాడు. కానీ యికమాట్లాడకుండా వూరుకోలేక "యిన్ని మాటలు దేనికి? అక్కడికి వెళ్లి చూడకూడదూ? అక్కడికి వెళ్ళాక నీకు, టీ దొరక్కపోతే అప్పుడనాలిగాని, వూరికే మాటలంటే ప్రయోజనమేముంది?" అని అన్నాడు.

"నేను చూసేవున్నాను. మొట్టమొదటిరోజునే ఆమెను చూసి అన్నిగ్రహించాను" అని ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

విభ అన్నమాటలు నిజంగా సహింపరానివే. ఉష వచ్చాక విభ అన్నగారింటికివచ్చి, అన్ని సంగతులు పరిశీలించడానికి తీరికలేకపోయింది. యీసంగతి క్షేత్రమోహనునికిగాని, శైలేశ్ కిగానీ తెలియదు. అందువల్ల క్షేత్రమోహన్ "శైలేశ్! అసలు మీ వ్యవహారమేమిటి?... నౌకరులందర్నీ తీసివేసి నువ్వు సాధువుగా వుండాలని అనుకుంటున్నావా? అయితే యింతకూ నీ తిండి తిప్పలు యెలా వున్నాయేం?" అని అడిగాడు.

"యేం, యింట్లో అన్నం పప్పూ, పూరీలు కూరలూ చేస్తున్నారు. అవే తింటున్నాను."

"మరి, ఆ వస్తువులు గొంతులోంచి లోపలకు దిగుతున్నాయా?"

"చెప్పుతుండగానే లోపలకు మెల్లిగా జారిపోతాయ్! అవి గొంతులో అడ్డుపడవని నీకూ తెలుసు!"

"నాకు తెలుసు, కానీ, కేవలం పీటితోనే నువ్వు నిర్వాహకంచేయాలనుకున్నావా?"

"నిజం చెప్పాలంటే యీ విషయంలో నే నేమీ జోక్యం కలిగించుకోగూడదనుకున్నాను. ఆమెయిష్టానికి వ్యతిరేకంగా, యింటివిషయాల్లో నే నేమీ జోక్యం కలిగించుకోగూడదని నిశ్చయించుకున్నాను కూడా!"

తలుపువేపుచూసి క్షేత్రమోహనుడు మెల్లమెల్లగా "ఊరుకో-ఊరుకో! గట్టిగా మాట్లాడకు. మీ చెల్లెలు వింటే

పూరుకోదు!" అని అన్నాడు.

"పూరుకున్నా పూరుకోకపోయినా నా భావిజీవితానికి కష్టంలేకుండా సుఖంగా గడిపే అదృష్టాన్ని సంపాదించుకున్నాను. వచ్చేది తక్కువనీ, ఖర్చయేది యెక్కువనీ విచారించేరోజులు తప్పిపోయాయ్! ఖర్చు యెక్కువగా వుండడం మూలాన్ని రాత్రింబగళ్లు నాకదే విచారం వుండేది! పదిహేనోతారీఖువచ్చేటప్పటికి జీతం యీచేతో తీసుకునేవాణ్ని! ఆచేత్తో అంతా ఖర్చైపోయేది...తర్వాత మిగిలిన పదిహేను రోజులు యెలాగడపనా-అని ఆలోచించేవాణ్ని! యిక అటువంటి కష్టం లేకుండా నాకు మంచి రక్షణదొరికింది బావా! యిక ప్రతి మనిషినీ నేను అప్పుఅడిగే అవుసరం వుండదు, నాకు దొరికే జీతమే చాలు-సుఖపడతాననే భావం ఆమెవల్ల నాకు కలిగింది."

"ఆ! అలానా? డబ్బుకు నీవు యెంతో కష్టపడ్డావన్న మాట! నాకుకూడా యెన్నో బాకీలున్నాయ్-అవి తీరుస్తానో లేదో!"

"ఇక్కణ్నుంచి ప్రయాగ వెళ్తున్నప్పుడు, ఒక నెల తాలూకు పూర్తిజీతంఅలమారులోపెట్టివెళ్లాను.ఆపైకంతోనే నెలరోజులూ గడుపుకొమ్మనమని చెప్పేను. అంతకుముందు యీ మొత్తంతో నాకు సరిపోయేదికాదు. సోమేంద్రునితల్లి బ్రతికున్నపుడు కానీ, ఆమె చనిపోయాక కానీ, సంసారాన్ని నా చేతుల్తో నేనే నడుపుకుంటున్నప్పుడు కానీ-యీ జీతపు రాళ్లు సరిపోయేవికావు. యింతకూ, ఏ నౌకర్లను నెత్తిగొట్టిందని విభ నామీద కారాలూ, మిరియాలూ నూఱుతుందో.

వాళ్ళు తురకవాళ్ళనీ, మనకంటే తక్కువకులస్థులనీ, వెళ్ళ గొట్టలేదు. నిజంగా వాళ్ళకు నేను జీతం ఒకసంవత్సరంనుంచీ యివ్వడంలేదు. అది ముట్టినవెంటనే ఆనందంతో వాళ్ళిద్దరూ యింటికి వెళ్ళేరు. నాలుగువందలరూపాయలు కోమటిదుకాణానికి బాకీవుంటే అవి తీర్చింది. యింకా కొద్దిగొప్పా బాకీవున్నా అవన్నీ తీర్చి దమ్మిడీలుసహా లెక్కవ్రాసి పెట్టించింది. యింత యెక్కువగా ఖర్చుచేసిందని చూసేప్పటికి నాకు విచారం కలిగింది. కోపంతో నేనడిగాను "ఉషా! యింకా మనకు సగంనెల గడవాల్సి వుండాయె! నువ్వేమో డబ్బంతా అప్పుడే ఖర్చుపెట్టావు. తక్కిన పదిహేను రోజులూ యెలా గడుపుతావని" నేనంటే ఆమె తను పసిపిల్లనుకాననీ, తనకు సంసారమంటే యేమిటో తెలుసనీ చెప్పింది. ఆకారణంతో యిప్పటివరకూ, నాకు తిండికేమీ యిబ్బందిలేదు బావా! యింట్లోచేస్తున్న అన్నం పప్పే నాకు అమృతంతో సమానంగా వుంది!"

క్షేత్రమోహనుడు యేదో అందామని నోరు విప్పేసరికి యెదురుగా గుడ్డలుమార్చుకొని విభ ప్రత్యక్షమయింది. నోట్లోని మాట నోట్లోనే మ్రింగి వూరుకున్నాడు. ఇంతలో మోటారుకూడా సిద్ధమయింది. ఆ నలుగురూ అందులో కూర్చున్నారు.

## 7

కొంచెంసేపట్లో మోటారు వచ్చి, శైలేశుని ఇంటి ముందు ఆగింది. వాళ్ళంతా లోపలికి వెళ్ళగానే, మొదట

సోమేంద్రుడు, రాక్షసిబొగ్గును పగులకొట్టే, చిన్న సమ్మెటతో గడపముందు కూర్చొని, తను ఆడుకునే రైలుబండి చక్రాన్ని మరమ్మత్తు చేసుకుంటున్నాడు. అతనిముఖం చూసిన మీదట, యెవరికీ యేమీ తోచలేదు.

కలకత్తాలోని గంగానది రేవులో ఒరియా బ్రాహ్మణులవద్ద, భిన్నభిన్న దేవతల పేర్లతో అనేక ముద్రలు వుంటాయ్! స్నానం చేసినవాళ్ళశరీరాలకు, ఆ ముద్రలు వేసి దేవతలపేర్లు జపిస్తుంటారు. సోమేంద్రుని తలమీద, బుగ్గలమీద గడ్డంమీద, ఛాతీమీద వెంట్రుకలమీద, శరీరంలోని పైసగ భాగమంతా, యెరుపు-తెలుపు, నలుపు, పసుపు రంగులతో పూయబడివుంది. ఆ బ్రాహ్మణులు తమదేశపు శ్రీజగన్నాథ స్వామి మొదలు, అయోధ్యాపురి శ్రీ సీతారాముని పేరు వరకూ, పేర్లతో-అతని వంటిమీద ముద్రలు వేయబడి వున్నాయ్!

విభ మెల్లగా నవ్వి "నీకు భలేషోకుచేశారే, నాయనా" అన్నది.

చెల్లెలిముందూ, బావగారిముందూ శైలేశ్వరుడు సిగ్గుపడ్డాడు. స్వాభావికంగా అతను కోమలమైన ప్రకృతికలవాడు. యే కారణమున్నా చేయి చేసుకునే రకంకాదు. కానీ, యీనాడు చెల్లెలన్నతీక్షణమైన యీ వ్యంగ్యపుమాటలు అతని హృదయానికి బాధను కలిగించినాయి! కుర్రవాణ్ణి ఒక దెబ్బ కొట్టి "దూరంగా పో-వెధవా! యెక్కణ్నుంచి యీఅందాన్ని తెచ్చుకున్నావు? యెక్కడికి వెళ్ళావు?" అని గదిమాడు.

యేడుస్తూనే ఆ కుర్రవాడు ప్రొద్దున్న తల్లితో గంగా స్నానానికి వెళ్ళినట్లు, అక్కడ యీ తంతంతా జరిగినట్లూ చెప్పేడు. వాడి బుగ్గను మెలివేసి ఒకదెబ్బకొట్టి, "సబ్బుతో కడుక్కుగా వెళ్ళు" అని శైలేశ్వరుడు అరిచాడు.

ముగ్గురూకలసి చదువుకునే గదిలో ప్రవేశించారు. అన్నా, చెల్లెలిముఖాలు గంభీరంగా వున్నై. వాళ్ళిద్దరినోటి నుంచి ఒక్కమాటయినా పైకి పెకిలిరాలేదు.

"యేం-శైలేశ్! ఒక్కసారిగా నువ్వు 'టీ' కప్పులో తుఫాన్ లేపేవు. పిల్లవాణ్ని అస లెందుకని కొట్టేవు? మీతో తిరగడం మీ భావాలు తెలుసుకోవడం చాలా కష్టం" అని క్షేత్రమోహనుడు అన్నాడు.

భర్తగారిమాటలు విని, విభ విస్మయంగా "టీకప్పులో తుఫానేమిటి? అయితే యీసంగతంతా మీరింకా కుర్రవాళ్ళ ఆట అనుకున్నారా యేం?" అని అడిగింది.

"యింతమాత్రానికే యెవరూ భయపడాల్సిన అవుసరంలేదని నే నంటాను"

"దానర్థం?"

"అర్థమేముంది. అది అందరికీ పూరికే తెలుస్తూనే వుంది? యేముంది! యివాళ గంగాస్నానానికి సోమేంద్రుని తల్లి వెళ్ళింది. అతనూ వెళ్లాడు"

"వెళ్ళితే?"

"వెళ్ళితే యేమీలేదు. అక్కడ ఒరియా బ్రాహ్మణులు వుంటారుగా! వాళ్ళలో యెవడో ఒకడు కానీకో, రెండుకాన్లకో ఆశపడి, గంధంతో యిలా వొంటినిండా

ముద్రలు వేస్తుంటారు. ఇందులో చేయిచేసుకోవల్సినంత యిది నాకేమీ కనుపడ్డంలేదు."

"ముందుముందు దీని పరిణామమేమవుతుందో మీరేమన్నా ఆలోచించారా?"

"పరిణామమేముంది? రెండోసారి కాళ్ళూ, చేతులూ, కడుక్కుంటే వాటంతటవే పోతాయి. యిదే దానిపరిణామం"

"ఇంతేనా? అదే నీ పిల్లవాడైతే ఇలా చేయనిస్తావా?"

"అసలు నాకు పిల్లలే లేనపుడు ఇలా తర్కించుకోవడం నిరర్ధకం"

విభ మనసులోనే బాధపడి "అయితే తర్కించడంఅనవసరంకావచ్చు ... గంధం కడిగితే పోతుందని నాకూ తెలుసు! కానీ, అంతటితో ఆ మచ్చ అంత తేలిగ్గా పోదనిమాత్రం నేను గట్టిగా చెప్పగలను. చిన్నపిల్లల భావిజీవితం వేపు మనసుంచుకుని యేపనైనా చేయాలి. యివాళ జరిగిన యీపని యెంతమాత్రమూ అనుచితమైంది కాదని, మీరనకపోయినా వందసార్లు నేనంటాను" అని అన్నది.

"మీరంతా అని యెందుకంటావు? ఈ సంబంధంలో యేమయినా, అనదలచుకుంటే నేనొక్కణ్నేగా? శైలేశేమో పిల్లవాణ్ని ఒక త్రోపుత్రోసి-బుగ్గలు మెలిపెట్టి, ఓ లెంపకాయ కొట్టి, ఆ పాపాన్ని పరిహారంచేశాడు. కానీ, ఒక నిష్ఠాపరురాలైన బ్రాహ్మణపిల్ల ఇక్కడికొచ్చి, అమాంతంగా దొరసాని అయిపోతుందని నేననుకోను...సరేగాని, మీ అన్నా చెల్లెళ్ళిద్దరూ కూచుని మాట్లాడుతూవుండండి, నేను వెళుతున్నాను"

అంతవరకు మెదలకుండా కూర్చొనివున్న శైలేశ్వరుడు "నువ్వెక్కడికెళ్తున్నావు బావా?" అని అడిగాడు.

"పైకి వెళ్తున్నాను యజమానురాలిని ఒకసారి పరిచయంచేసుకోవాలి...ఆమె నాతో మాట్లాడుతుందో, లేదో చూస్తాను"అని పైకి వెళ్ళాడు.

రెండో అంతస్తులోని పడకగదిలోకి వెళ్ళి, గుమ్మం ముందునుంచే "అక్కా! నమస్కారం" అని అన్నాడు.

ఉష ముఖంత్రిప్పిచూసి, తలమీదకు గుడ్డలాక్కొని లేచి నిలుచుంది.

దగ్గరకూచున్న సోమేంద్రుడు "అమ్మా! మామయ్య" అని చెప్పేడు.

గదిలోవున్న ముక్కాలిపీటను చూపి "కూర్చోండి" అని ఉష అన్నది. ఆమె ముందు రెండలమారాలు తెరిచి ఉన్నాయి. నేలమీద పంచెలూ - చొక్కాలూ, చీరెలు, జాకెట్లూ, కోట్లూ, పంట్లాంలూ, మేజోళ్ళూ నెక్‌టైలు, కాలర్లు, మొదలైనవస్తువులు, యెన్నో పడివున్నాయి!. ఆమె వాటినన్నిటినీ కుప్పలు కుప్పలుగా పెడుతూఉంది.

పీటమీద కూచుని క్షేత్రమోహనుడు "మీరేమిటో చేస్తున్నారు?" అని అడిగాడు.

ఆ కుప్పలోంచి సోమేంద్రుడు,ఓ రెండు మేజోళ్ళనుతీసి తల్లికి చూపిస్తూ, యింకోజత మేజోళ్లుకూడా, కొంచెంచినిగి పోయినయ్-యివికూడా చూడమ్మా!" అని అడిగాడు.

ఉష అతనిచేతులోని మేజోళ్ళు తీసుకుని, సరిజేసి, యథాస్థానంలో వుంచింది. యీవిధంగా యేరి కుప్పపెడు

తున్న విధానాన్ని చూసి, క్షేత్రమోహనుడు ఆశ్చర్యంగా "అనాథాలయాని కివ్వడాని కివన్నీ బాగుచేస్తున్నారా? లేక పోతే, అవన్నీ బాగుచేయాలనుకుంటున్నారా?" అనిఅడిగాడు.

పల్లెటూరినుంచి వచ్చిన యీ కొత్తకోడలు తనను చూస్తూనే, కాళ్ళూ - చేతులూ చల్లబడేంత యిదిగా సిగ్గు పడుతుందనుకొని వచ్చాడు కాని, ఉషఆచరణ చూసి,యిలా అనుకోవడం చాలా పొరబాటనుకున్నాడు. ముఖమెత్తి క్షేత్రమోహనుని చూడకుండానే "వీటిని దర్జీదగ్గరకు పంపిద్దామని ఆలోచిస్తున్నాను. ఒక్క మేజోళ్ళే పది సంవత్సరాల వరకు కొనవలసిన అవసరంలేనన్ని వున్నాయి?" అన్నది.

క్షణంసేపు మౌనంగావుండి క్షేత్రమోహనుడు "అక్కాయ్! యిప్పుడిక్కడ యెవరూలేరు. యిటువంటప్పుడు మీతో ఒకసంగతి చెప్పాలనుకుంటున్నాను. చూడండి! మీఆడబిడ్డను చూసి ఆమెభర్తగారు కూడా ఆమెలాంటి ప్రకృతిగలవాడని మాత్రం అనుకోకండి; పైగా నావేషభూష ణాదులుచూసి నన్నొక క్రైస్తవుణ్ణని కూడా అనుకోవద్దని అంటున్నాను. యివన్నీ నాబాహ్యరూప అలంకారాలే!మన స్సాక్షిగా అంతఃకరణలో నేను శుద్ధ శ్రోత్రియ హిందువుణ్ణి! యీ విషయంమాత్రం మీరు మరచిపోకండి!...యింకా యెవరివిషయంలోనన్నా వాళ్లు గంగస్నానం చేసివచ్చారని తెలిస్తే,కొట్టడాని కెప్పటికి నాకిష్టముండదని ముందుగానే చెప్పుతున్నాను" అని అన్నాడు.

ఉష మౌనంగానే వుంది. మళ్ళీ క్షేత్రమోహను డన్నాడు "వంటరిగా వున్నపుడు మీకింకోసంగతి కూడా

చెప్పాలనుంది. సోమేంద్రునిమీద పడిన దెబ్బలు నిజంగా నామీద పడ్డట్టుగా వున్నాయి! పాపం, శైలేశుడు వాస్తవంగా అటువంటి కోపదారిమనిషి కాడు."

యీ మాటకుకూడా ఉష యేమీ జవాబు చెప్పలేదు. ఆమె మెదలకుండా నిలుచునివుంది "యిక మీరు కూర్చోండి నావల్ల మీ పని పాడవడం బాగులేదు." అని క్షేత్రమోహనుడు కొంచెం సేపాగి, మళ్ళీ "మీలాంటివాళ్ళు చేసేపనులు నేనుకూడా నేర్చుకుందామని బుద్ధిపుడుతూవుంది." అన్నాడు.

ఒక ప్రక్కగా కూచునివున్న ఉష నవ్వి "ఇవన్నీ ఆడవాళ్ళు చేసేపనులు......యివి నేర్చుకుంటే మీ కేమి లాభం?" అని అన్నది.

"యీ మాటకు యింకోనాడు జవాబు చెపుతాను, యిప్పుడు కాదు"

ఉష తనపనిలో నిమగ్నురాలై కొంచెం సేపుండి "యీ పనులన్నీ బీదవాళ్ళే చేస్తారుకానీ, మీ బోటివాళ్ళ కిటువంటి పనుల్తో అవుసరముండదు" అని అంది.

ఒకనిట్టూర్పు విడిచి క్షేత్రమోహనుడు "అక్కాయ్! బైటి ప్రపంచానికి కనపడుతుండే మెరుపు తెలుపులు చూసి, మీబోటివాళ్లే యిలా పొర్లపడుతూంటే, యిక మాబోటి వాళ్ళబాధలు తెలుసుకునేవాళ్ళెవరుంటారు? నేను నా చిన్ని చెల్లెల్ని వెంబడి తీసుకొచ్చాను. కొన్ని రోజులపాటు ఆమెను యిక్కడ విడిచి వెళ్దామనిపిస్తోంది...మీతో వుంటూ మీపని పాటులు నేర్చుకుని చక్కని గృహస్థురాలవుతుంది. మీవల్ల కొంత వుపదేశంపొంది అత్తవారింటికి వెళ్తే, ఆమెకాకుండా–

ఆమెతో బాటు ఆమె భర్త కూడా సుఖపడతాడు-" అని అన్నాడు.

ఉష మాట్లాడలేదు. క్షేత్రమోహనుడు యేదో అడుగుదామని నోరు తెరిచేప్పటికి, మెట్లమీద బూటుచప్పుడు వినిపించింది. అందువల్ల అతను "వాళ్ళంతా పైకి వస్తున్నారు. శైలేశుని చెల్లెలూ, బైటి వేషభూషణాల్లో, వస్త్రాలంకారాల్లో ఒకేవిధంగా వుండడం చూసి, ఇద్దరి మనః ప్రవృత్తులు ఒక టేనని మీరనుకోవద్దు-" అన్నాడు.

ఆమె మెల్లగా నవ్వుతూ వూరుకుంది.

శైలేశ్వరుడూ, విభా-క్షేత్రమోహనుని చెల్లెలు ఉమా మెట్ల చప్పుడుచేసుకుంటూ పైకి వచ్చారు. శైలేశ్వరుడూ, విభా-యిద్దరూ గదిలోకి ప్రవేశించాక, వెనుకనున్న ఉమ గదిలోకి కాలుపెట్టబోతూంటే-"ఉమా! చెప్పులువిడిచి గదిలోకిరా అమ్మాయి!" అని క్షేత్రమోహనుడు అన్నాడు.

విభ గిరుక్కునతిరిగి భర్తగారివేపు ఆశ్చర్యంగా చూస్తూ-"గదిబైట చెప్పులు యెందుకని విడవాలి?" అని అడిగింది.

క్షేత్రమోహనుడు నవ్వుతూ- "బైటవిడిచిపెట్టి లోపలికి వచ్చినంతమాత్రంలో మనకిక్కడ యేంప్రమాదముంది?- యింక్కడకు చెప్పులులేకుండా, వట్టి కాళ్ళతో వస్తే - ముళ్లు గుచ్చుకుంటాయనీ, యెదురుదెబ్బలు తగులుతాయనీ, మనకు భయం లేదుగా?"-అన్నాడు.

"ఆసంగతి నాకూ తెలుసు! యిక్కడికి రాగానే గబుక్కున చెప్పులు విడిచేంత అవసర మేమొచ్చిందో కొంచెం నాకు చెప్పండి?"

"యేముంది?- యీయింటి యజమానురాలు హిందువుల ఆచారవ్యవహారాలపట్ల నమ్మకంకలది. అందుకని, ఆమె గదిలోకి వచ్చేప్పుడు, మనం చెప్పులు విడిచిరాడవమే మంచిదనిపించింది."

విభ భర్తగారి కాళ్ళవేపు చూసి, తన చెల్లెలినే ఈ నియమాన్ని పాటించమని చెప్పలేదనీ,- ఆయనకూడా ఈ నియమంపట్ల శ్రద్ధచూపించాడని తెలుసుకునీ మండిపడుతూ-"పూజ్యులయందుమీకు భక్తిశ్రద్ధలుండడంమంచిదే! కాని, వాటిని ఇంకా యెక్కువచేసి బైట పెట్టడం మంచిది కాదు. ఇది పడుకునే గది కనుక సరిపోయింది. లేకపోతే యిదిగాని పూజచేసికొనే గదైతే, మీరెంత పేడతిని పవిత్రులయాకనే యిందులో కాలు పెట్టాల్సి వచ్చేది!" అని వ్యంగ్యంగా అన్నది.

భార్య కోపాన్ని-ఆమె వ్యంగపుమాటల్ని గ్రహించి క్షేత్రమోహనుడు నవ్వుతూ -"పిచ్చిదానా! పేడ నాకు యిష్టమైన వస్తువు కానేకాదు. అక్కగారి నియమాలను,ఆమెనూ-మనసులో వుంచుకునికూడా, దాన్ని నేను నోట్లోవేసుకోలేను. యిక దేవుడి గదంటావా?- ఆగదిలోకొచ్చి నే నెందుకు ఆపాతకంకలుగజేస్తాను? సరేగానక్కాయి! ఈ గదిలో ఇదివరకు యిక్కడ పెద్ద జంపఖానా పరుచుండేది. దాన్ని మీరెందుకని తీసివేశారు?" అని అడిగాడు.

"జంపఖానా నేలమీదపరిచుంచితే, గది కడగడానికి వీలుండదు-పైగా గదిలోకి దుమ్మూ, ధూళీ, మురికీ-యెంతో చేరుతుంది. ఇది పడుకునేగదికదూ.? అందువల్ల తీసేశాను." అని ఉష అన్నది.

ఉషమాటను ఖండిస్తూ విభ-వ్యంగ్యముగా "అయితే, జంపఖానా పరిచుంచినంతమాత్రాన గదికి మురికి చేరు తుందా?-" అని అడిగింది.

ఆమె ముఖంలోకి చూస్తూ "-అవునమ్మా! మురికి చేరుతుంది. చూడ్డానికి పైకి జంపఖానా అందంగానే కనపడు తుందిగాని,- దానిక్రిందమాత్రం, మట్టీ-దుమ్మూ-మురికీ-యెంతో వుంటుంది" అని ఉష అన్నది.

ఈ మాటకు విభ యేదో అనబోతూండేప్పటికి, భర్త గారు గట్టిగా-"బాగా చెప్పావకాయి! బాగా చెప్పావు! మాకు మురికిత్రొక్కుతుంటేనే బావుంటుంది! ఇకమా కేమీ అవుసరం లేదు! మురికివస్తువులు కంటికి కనబడకుండావుంటే చాలు. మేము సంతోషిస్తాము! శైలేశ్-నీ అభిప్రాయ మేమిటి? నేను చెప్పేది నిజమా, కాదా!." అని అడిగాడు.

శైలేశ్వరుడేమీ చెప్పలేదు. విభ కోపాని కంతులేక పోయింది. కానీ, - ఆ కోపాన్ని దిగమ్రింగి మౌనంగానే కూర్చుంది. ఇతరులముందు, యేదైనా వాదప్రతివాదాలు, తర్కవితర్కాలు ఆరంభమైతే,- విభ ఆ తర్కంలో ఓడి పొయ్యేందుకు కెంతమాత్రం వొప్పుకోదు!- ఆమె మనస్తత్వం తెలిసినవాడు గాబట్టి క్షేత్రమోహనుడు, ఆవాద ప్రతి

వాదాల్లో తనే ఓడిపోయానని వొప్పుకునేవాడు! యీ వాద ప్రతివాదాలు ముదిరినట్లయితే—పోట్లాటల్లోకి దిగి వూరుకుం టుందని ఆయనకు తెలుసు! కానీ, ఈ నాడు ఆయన అలా వూరుకోలేకపోయాడు. భర్తగారి ఈ ఆచరణ విభను ఆశ్చ ర్యంలో ముంచింది.

నిరపరాధినియైన ఉమ, ఈ ఇంట్లో కాలుపెట్టినప్పటి నుంచీ, నడుముబిగించి కయ్యానికి కాలుదువ్వినట్లుగా విభ ఆమె వెనకాలపడింది. భార్యప్రవర్తన క్షేత్రమోహానుని ఎంతో బాధను కలిగించింది. యే విధమైన అపరాధం చేయకపోయినా—యేమీ తెలియని నిర్దోషురాలైనా, ఎంతో కాలానికి తిరిగి పూర్వపుణ్యాలవల్ల, భర్తగారింట్లో స్థానం దొరికినప్పుడు, ఆ అమాయకురాలికి తిరిగి ఆ స్థానాన్ని లేకుండాచేయడం యెంతపాపం! క్షేత్రమోహానుడు కూడా ఒక స్త్రీకి భర్త! భార్యమీద భర్తకుండవలసిన కర్తవ్య మేమిటో సాధకబాధకాలేమిటో ఆయనకుకూడా తెలుసు! ఉమ భర్త ఇంతకాలానికి తిరిగి ఆమెకు తనహృదయంలో చోటిస్తున్నప్పుడు,—విభ దాన్ని మార్చడానికి ప్రయత్నిస్తూ వుంది.

ఇన్ని కారణాల కోపంతో నిండిన అతని హృద యంలో విభమీద—జాలినిచూపిద్దామనే సంకల్పము లేక పోయింది. క్షేత్రమోహానుడు తనఆలోచలన్నీ మనసులోనే మిగ్రింగుకొని, చెల్లెలివేపుచూస్తూ, "ఉమా! నీ పల్లెటూరి అకాంఛయివద్దకు ప్రతిరోజూ మధ్యాహ్నంపూట వచ్చి

కూచున్నట్లయితే,నువ్వెటువంటిఇంట్లో కాపురంచేస్తున్నా దుఃఖమనేది, విచారమనేది, నీదగ్గరకు రాదమ్మా''అన్నాడు.

ఉష మాట్లాడకుండా, తలొంచుకుని వూరుకుంది. క్రిందకుచూస్తూ ఉష "-అలా అయినట్లయితే, మీ సమాజంలో ఆమెకు స్థానముండదు...ఆమెను దూరంగా తరిమేస్తారు. ఆమెకెందుకు బాధను కలిగిస్తారు?" అని అన్నది.

"గౌరవ మర్యాదలతో జీవిస్తున్నాననుకునే, యీ సమాజం ఆమె నెలాగన్నా ఒకప్రక్కకు నెట్టడం తప్పదక్కాయి! కానీ ఆమెతోపాటు, ఆమె భర్త జీవితంకూడా-సుఖంగా జరుగుతుందని నేను ఢంకా బజాయించి చెప్పగలను-" అని క్షేత్రమోహనుడు అన్నాడు.

ఒకమారు విభవేపు చూసి, శైలేశ్వరుడు "ఢంకా బజాయించాల్సిన పనిలేదు. కానీ-మీరు చెప్పితేనేచాలు-మాకెంతో నమ్మకం?" అని అన్నాడు.

"నేమయినాసరే,- ఇవాళ ఈమె చేస్తున్నపనిని జాగర్తగా మనము చేసినట్లయితే, ప్రతిరోజూ కొత్త మేజోళ్ళు కొనవలసిన అవసరం ఉష భర్తకు వుండదు-" అని క్షేత్రమోహనుడన్నాడు.

ఇప్పటివరకూ విభ మెదలకుండా వింటూ, తన కోపాన్నంతా మనసులో గుప్తంగా దాచి నవ్వేందుకు ప్రయత్నిస్తూ-"ఉష భావి జీవితంలో ఇలా మేజోళ్ళకు అతుకులు వేసేగతిమాత్రం వుండదు; ఆమె భావిభర్త అతుకులు వేయబడిన మేజోళ్ళను తొడుగుకోడు! ఆ సంగతి ముందుగా మనం చెప్పలేముగా?-" అని అన్నది.

"యెందుకని చెప్పలేను?–కన్నులూ, చెవులూ–బాగా తెరిచున్నా చెప్పగలను! ఓడను నడిపే తెలివితేటల్లో, బాగా అనుభవమున్న యేకస్తానైనా, ఓడ నడుస్తున్న నీళ్ళలోతు యెంతుంటుందో, వ్వారికినే చెప్పగలడుఅక్కాయ్! ఓడఅనే మీఇంట్లో కాలుపెట్టా, అజాగ్రత్తగాకూచుంటే. సుడిగుండంలో ఓడపడిపోయికూచుంటుందని తెలుసుకున్నాను, ఇంత మాత్రానికే మీకు ధన్యవాదా లర్పిస్తున్నాను....శైలేశుని తరఫునయితే వేలకొద్ది ధన్యవాదాలర్పించినా చాలవనుకుంటాను."

ఉష సిగ్గుపడుతూ– "క్షేత్రమోహన్ బాబూ! తన ఇంటో తనభర్త స్థితిని తెలియపరచడాని కేదయినా ప్రయత్నిస్తే,. ఇందులో ధన్యవాదాలెందుకు?–"అని అన్నది.

విభనోటివెంట యేమాటా పెకిలిరాలేదు. క్రిందుమీదై ఒకసారి భర్తముఖంలోకి, మరోసారి అన్న శైలేశు ముఖంలోకి చూసింది– ఇంతమందిముందు తనభర్త తనను ఇలా అవమానం జేస్తాడని, ఆమె యెప్పుడూ అనుకోలేదు. శైలేశు ముఖంవంకచూసి, యేడుస్తూ– "అన్నాయ్! ఇక మీదట ఇక్కడికి రాకుండా చేశారు...సరే, నేనెప్పటికీ ఇక్కడి రాకుండా వెళ్తున్నాను–" అని అన్నది.

శైలేశ్వరుడు వ్యాకులపడ్డాడు. ఉష తనుచేస్తున్నపని వదిలేసి–విభ చేయిపట్టుకుని.– "మాలో నిన్నెవరు యేమీ అనలేదు గదమ్మాయీ!"అని అన్నది.

చాలా గంద్రగోళం జరిగింది. ఈ మధ్యలో క్షేత్ర మోహనుడు అక్కణ్ణుంచి జారుకున్నాడు. విభ తన చేయి విడిపించుకుని కళ్ళు తుడుచుకుంటూ,- "మీకు విరుద్ధంగా మీలోమీకు పోట్లాటలు పెడుతూ, మీ ఇంటికి రావడం నాకిష్టంలేదు." అని అన్నది.

"ఇటువంటి మాటల్ని నేను మనసులోకూడా ఊహించుకోలేదు విభాషిణీ!"అని ఉష అన్నది.

ఉష మాటలు విభ చెవుల్లోకి పోనేలేదు. కన్నీళ్ళతో వికృతమైన గొంతుతో "ఇవాళ వారు నా ముఖంముందే అన్నారు. రేపు అన్నకూడా అనవచ్చు!- ఈ ఇంట్లోకి వచ్చి మీ ఇద్దరికీ అనవసరంగా కలతలు పెట్టడం దేనికి? ఉమా- ఇంటికి పోదాంపద!" అని క్రింద అంతస్తులోకి రాబోతూ- "అసలు యీ ఇంట్లో కాలుపెట్టడమే పెద్దపొరపాటు...పుట్టింటితో ఇదివరకున్న సంబంధము ఇవాల్టితో తెగిపోయింది-". అని క్రిందకు వెళ్ళింది.

ఆమెతో శైలేశుడు కూడాక్రిందకు దిగివచ్చి,-"విభా నా లైబ్రిరీ గదిలో కొంచెంసేపు కూర్చో అమ్మాయ్!" అని అన్నాడు.

విభ అడ్డంగా తలతిప్పుతూ-"కాదు - ఇక నేను కూర్చోను. కానీ- నీతో ఒకసంగతి చెపుతున్నా నన్నాయి! చచ్చిపోయిన మా వదినను ఒక్కసారిగా మరిచిపోకు. సోమేందుని దేశాలకు పంపి, చదువు చెప్పించాలని ఆమె కెంతో ఇదిగావుండేది... ఆమెను గుర్తుంచుకుని ఆమె ప్రతిఫల

రూపంగా వున్నవాడి జీవితాన్ని మాత్రం నువ్వు పాడుచేయ కన్నయ్యా!-వాడి భావి జీవితాన్ని గురించి నేను మీకాళ్ళ మీందపడ్తాను. ఇవాళ నేను చూసిన విధంగానే వాడు వున్నట్లయితే ఇక సమాజంలో నేను ముఖమెత్తుకునితిరగలేనన్నాయి!" అని అన్నది.

కన్నీళ్ళతో గద్గంగా వున్న ఆమె కంఠాన్ని విని, శైలేశ్వరుని హృదయం ద్రవించింది. "నువ్వు నాబైటి గదిలోనే కూర్చొని వుండమ్మాయ్.- ఇలా కోపంతో వెళ్ళిపోతే, నా హృదయం బాధపడుతుంది." అని అన్నాడు.

"ఇక ఏగదిలోనూ కూర్చోవడానికి నా కిష్టంలేదన్నాయ్! మన నాన్నగారి వంశానికి ఇక మూలాధారము సోమేంద్రుడొక్కడే!-అందుకని అతన్ని ఒక కంటితో చూస్తూవుండు. ఒక్కసారిగానిన్నునీవు మరిచిపోకన్నాయి!" అని విభ బైటికివచ్చి తన కారులో కూర్చుంది. ఉమ ఇంత వరకూ యేమీ మాట్లాడకుండా విభ దగ్గరకు వెళ్ళి నిలుచుంది.

శైలేశ్వరుడు దగ్గరకు వెళ్ళి-"విభా! సోమేంద్రుని నీవెంట తీసుకుని వెళ్తే మంచిది. నీకు కూడా పిల్లలెవరూ లేరాయె!- అటువంటప్పుడు వాణ్ని నీకొడుకులా చూసుకుంటూ, నీ ఇష్టాను సారంగా పెంచి, ఓమనిషినిచేయి! నేనొద్దనను-" అని అన్నాడు.

ఉమా, విభా-ఇద్దరూ విస్మయంతో శైలేశుని ముఖంలోకి చూశారు!- విభ "పట్టిమాటల్ని యెందుకంటా

వన్నాయ్! దీని కనుగుణంగా నువ్వేపనీ చేయలేవు. నేను అలాచేయనీయను కూడా!" అని అన్నది.

"విభా! నే నలా చేసితీరుతాను. ఇలాచేస్తానని నీతో ప్రమాణంచేస్తున్నాను!"

"అలా చేసినట్లయితే, చాలామంచిదే! తప్పకుండా వాణ్ని నాదగ్గరకు పంపించు! వాడికి చదువు చెప్పించడానికి నీదగ్గర డబ్బులేకపోతే, ఆ భారం నేను మోస్తాను." అని ఉష దృష్టిలో తన దృష్టిని కలిపి—పై అంతస్తు వరండాలో ఉషనిలుచుని తమవేపు చూడ్డం విభ చూసింది, క్షణంలో మోటారు కదిలిపోయింది. శైలేశ్వరుడు పైకి వెళ్ళడానికి మనసొప్పక, చదువుకునే గదిలోకి వెళ్ళి కూలబడ్డాడు. ఉష తమ మాటలన్నీ విన్నదని తెలుసుకునేందు కాతని కాట్టే కాలం పట్టలేదు.

## 9

రాత్రి భోజనపు సామాగ్రిని సిద్ధంచేసి భర్తను పిలువడానికి మనిషినిపంపి, ఉష రోజుటికిమల్లే-కంచందగ్గర కూర్చుంది. సోమేంద్రుడిప్పుడు ఆమెవద్ద కూర్చోనిలేడు. నిదుర పోయూడులాగుంది.! గంభీరమైన ముఖంతో శైలేశుడు గదిలోకి వచ్చాడు. ఆమె అతన్ని యేమీ అడగకుండా మెదలకుండా కూచుంది. ఆమె అనవసరంగా ఈ విషయాన్ని తిరిగి రేకెత్తించదని శైలేశ్వరునికి తెలుసు!

భోజనానికి కూర్చున్నపుడు ఆయన కోపంగానేవున్నా సంగతిగూర్చిఉషసంఆశ్చర్యపడవలసిందేమీ లేదు. కాని, భార్య

చూపుల్లోంచి తప్పించుకుంటూ, క్షణాని కోమారు ఆమె భంగిమను పరీక్షిస్తున్నాడు. ఈ నాడాయన సంతుష్టిగా యిది వరకటిలా కడుపునిండుగా తిన్నట్టు లేదు. చేయికడుక్కొని మాట్లాడకుండా బైటికి వచ్చాడు.

ఆయన మనసు అనేకవిధాలుగా ఆలోచనలతో చిక్కుల్లోపడి బాధపడింది. ఈ విధంగా యెవరి నోటంటా మాటరాకుండావుంటే, విరోధపక్షంలో శత్రుత్వ మెక్కువ వుంటుందని శైలేశుడు పడుకునేందుకు వచ్చినపుడు – "ఒకానొకప్పుడు నీకు నేను చాలా అన్యాయం చేశానని ఒప్పుకుంటాను; కానీ– ఇక నిన్నొదిలి యింకొకతెను ఈ యింట్లోకి తెచ్చుకుంటానని నువ్వనుకోవద్దు–నాకా అధికారం యేమాత్రం లేదు–" అని అన్నాడు.

ఈ మాటల్ని శైలేశ్వరుడు, ఉష యిక్కడికి వచ్చినప్పుడుకూడా అనలేదు. అందుకని మనసులోనే యెంతో ఆశ్చర్యపడి–" దీనర్థమేమిటో నాకు తెలియడంలేదు" అని అన్నది.

"యేముంది!–నువ్వు మా గౌరవాన్ని సంస్కారాన్ని, సమాజాన్ని, ఒక్కసారిగా తలక్రిందులు చేసి మీ తండ్రిగారింటిని చేసినట్లుగా చేయాలనుకుంటే మాకెంతో కష్టంగా, వుంటుంది...సరేగాని, రేపు సోమేంద్రుని వాడిమేనత్త దగ్గరకు పంపాలనుకున్నాను. ఈ విషయంలో నీ అభిప్రాయ మేమిటి?" అని శైలేశు అడిగాడు.

"వాడి మేలును, గౌరవాన్నీ చూడాలనే మీకుంటే అక్కడికే పంపించండి" అని ఉష అన్నది.

ఉష మాటల్లో కోపంకానీ వుగ్రత కానీ కనుపించ లేదు. అందుకని ఆయన యేమీ మాట్లాడకుండా వూరుకు న్నాడు. దుర్బల ప్రకృతిగల మనుష్యులు, మనోవ్యథను కల్పించుకుంటూ, చేతకాని అభిమానంతో గున్నుంచరకూ వచ్చి, ఒక్కొక్క మెట్టే తిరిగి క్రిందికి దిగి వెళ్ళిపోయేవిధంగా ముహూర్తంసేపు శైలేశ్వరుడు నిశ్శబ్దంగావుండి- "నాడు అక్కడుండాలని అంతా అంటున్నారు. యే ఆచారవ్యవహా రాలు, కీర్తి అపకీర్తుల్ని మనము ఒప్పుకోమో ఒప్పుకో లేమో వాటి కారణంగా అన్నాచెల్లెళ్ళ మధ్య, అనవసర మైన తగువులుండడం మంచిదికాదు. ఈ విషయానికి స్నేహి తుల మధ్య నవ్వులపాలు కావలసివస్తే, నా కేమీ బాగా వుండదు-" అని అన్నాడు.

ఆమె యేమీ మాట్లాడకుండా ఒకనిట్టూర్పువిడిచింది. గది నిశ్శబ్దంగా వున్నందున ఆ నిట్టూర్పు శైలేశుని చెవుల్లో పడింది.

శైలేశ్వరుడు మెల్లిగా- "యెవరు పైదేశాలకు చదు వుకోవాలని వెళ్తారో, వాళ్ళతాం ఆంగ్లేయుల పద్ధతుల్లో మసలు తుంటారు. అందుకని చిన్నప్పటినుంచే, అటువంటి వాతావర ణంలో వుంచి పిల్లవాణ్ని పెంచాలి...చిన్నతనంలోనే పిల్ల వాళ్ళకు సంస్కారమునేది నేర్పాలి. యెవరైతే భావిజీవితంలో, వాడికి అనుకూలం కలిగించలేరో, వాళ్ళు ఆ పిల్లవాళ్ళకు యెంతో అన్యాయాన్ని చేసినవాళ్ళవుతారు-" అన్నాడు.

జవాబుకోసం క్షణంసేపు నిరీక్షించి శైలేశుడు"మళ్ళీ ఈ విషయంలో నువ్వేమీ చెప్పదలచుకోకుండా వుంటే మరి

మంచిదే కాని- నోరుమూసుకుని దీర్ఘనిట్టూర్పులు విడుస్తూ వుంటే-అవి నామాటలకు జవాబులు కావు...సోమేంద్రుని విషయంలో బాగా ఆలోచించాకనే మేము యిలా చేయా లని నిశ్చయించుకున్నాము-" అని అన్నాడు.

సోమేంద్రుడు దగ్గరగానే నిద్రపోతున్నాడు. యీ యింట్లో యింకో ఆడదక్షత లేకపోవడంమూలాన ఉష ఇక్కడికి వచ్చినప్పటినుంచీ, సోమేంద్రుని మమతతో తన దగ్గరనే వుంచుకుంటూవుంది. ప్రేమతో అతని తల నిము రుతూ-"మీరు సోమేంద్రుని మంచినే కోరుతారు. వాడు పైకి రావాలని మీకూ వుంటుంది. యిదికాదని యెవరన్నా అంటారా? బాగానేవుంది, అలానే చేయండి!" అనిఅన్నది.

గదిలోవున్న యెలక్ట్రిక్ లైటు ఆర్పివేశారు. ఒక మూల నూనెదీపం చిమచిమ లాడుతూవుంది. శైలేశుడు లేచి తన పక్కమీద కూర్చున్నాడు. దగ్గర్లోనేవున్న మంచం మీద ఉష పడుకుని వుంది. సన్నగిల్లిన దీపపు వెలుతుర్లో ఆమె ముఖాన్ని చూడడానికి ప్రయత్నిస్తూ, "అదీగాక సోమేంద్రునికయ్యే ఖర్చంతా-విభ భరిస్తాననంటోంది. యిది సాధారణమైన విషయంకాదు" అని అన్నాడు.

యేకారణంతోనైనా కంఠస్వరం పెద్దదిగా చేసి యెప్పుడూ ఉష మాట్లాడలేదు. ఆమె యెప్పుడూ శాంతం గానే మాట్లాడుతుంది! భర్తగారన్నమాటలకు ఆమె "కాదు అలా యెప్పటికీకాదు. మనపిల్లవాణ్ణి వాళ్ళఖర్చులమీద చది చదివించడానికి నేను పంపను" అని అన్నది.

"దూరదేశాల్లో చదవాలంటే మాటలా?.. చదవడాని కెంతో డబ్బుండాలి"

"డబ్బయితే అవనీయండి. వాడికంటే మనకింకెవరున్నారు? యీ విషయానికి అనవసరంగా ఆలోచనలుచేస్తూ మీారు మేలుకోవద్దు. నిద్రపోండి"

మరునాడు సాయంకాలం శైలేశ్వరుడు కాలేజినుంచి యింట్లో అడుగుపెట్టగానే వంటింటిలోంచి మాంచి సుగంధపువాసన రావడం చూసి, పులకితుడై, చదువుకునే గదిలోకి వెళ్ళాడు. కొంచెం సేపయాక అల్పాహారముతో, టీ-తీసుకుని ఓ ముసల్మానువ్యక్తి లోపలకు రావడం శైలేశు చూశాడు.

రాత్రి భోజనాలగదిలో దీపం వెలిగించాడు. గదిలో అన్ని పదార్థాలతో అలంకరించబడిన టేబులు చూసి, శైలేశ్వరుడు మనసులో కాదనలేకపోయి, కూర్చుని టేబులు మీాదున్న పదార్థాలని కొద్దిగా తినేటప్పటికి, ఉష వచ్చి ఒక ఒక కుర్చీని లాక్కుని, కొద్దిదూరంలో కూర్చుంది.

శైలేశుని మన సప్పుడు ప్రశాంతంగా వుంది.ఉషతో వేళాకోళంచేస్తూ "యీ ప్రదేశంలోకి వచ్చినట్లయితే, జాతిభ్రష్టత్వమవుతుందనే భయం నీకులేదుకదూ? ముక్కుతో వాసన చూచినట్లయితే సగం భోజనంచేసినట్లేనని శాస్త్రకారులంటారు" అని అన్నాడు.

మెల్లగా నవ్వి "ఇలా అనడం మీాకు ధర్మంకాదు. యేశాస్త్రాన్ని మీారు నమ్మకుండా తిరస్కరిస్తారో, దాన్ని గురించి మీారు చాటించడం, నలుగురికీ తెలియపరచడం, మీాకు మంచిదికాదు" అని ఉష అన్నది.

శైలేశు నవ్వి "సరే! నేను ఓడిపోయానని ఒప్పు కున్నాను. అయినా, ఎక్కడ హిందూధర్మాన్ని గురించి, శాస్త్రాన్ని గురించి, నువ్వు శిక్షణ పొందావో, అక్కడికి మాత్రం నువ్వు మళ్ళీ పారిపోవద్దు"అని అన్నాడు.

తాత్కాలికంగా ఈ మాటకు ఉమ జవాబు చెప్ప కుండా క్షణంసేపు నీరసంగా క్రిందకు చూసి గబుక్కున భర్త గారిముఖం చూస్తూ, "నిన్నరాత్రి ఆలోచించి ఆలోచించి నేను ఒక విషయాన్ని గురించి నిశ్చయించుకున్నాను...... దాన్ని మాత్రం మీరు తారుమారు చేయొద్దని ప్రార్థిస్తున్నాను" అన్నది.

శైలేశుని మనసు కరుణతో ద్రవించింది. "ఉమా!అలా నేనెప్పటికీ ప్రయత్నించను. నీవ్రూహాలే నీకు యోగ్యంగా వుంటాయని నాకు తెలుసు! నేను దుర్బల ప్రకృతిగల మనిషిని. నీ మనసూ, ఆలోచనలూ అన్నీ దృఢంగానూ బలంగానూ ఉంటాయ్" అని అన్నాడు.

ఉమ భర్తముఖంలోంచి తన దృష్టిని మళ్ళించుకుని, మెల్లమెల్లగా "నాసంకల్పం మాత్రం మారదు. నేను బాగా ఆలోచించి చూశాను" అని అన్నది.

జోమేంద్రుని విషయమని శైలేశు నిశ్చయించుకుని "నాంది ప్రస్తావన అయితే అయింది. ఇక నువ్వేమని అలోచించుకున్నావో చెప్పు? నువ్వు నిర్ణయించుకున్నదానికి, విరుద్ధంగా నేనేమీ చెప్పనని ప్రమాణంచేసి అంటున్నాను" అని అన్నాడు.

"అన్నగారి ఇంటివద్ద నాకు బాగానే జరుగుతుంది. అక్కడ నాకేమీ బాధలేదు... రేపు నేనక్కడికి వెళ్ళి పోతాను"

"మీఅన్నగారింటికి వెళ్తావా? మళ్ళీయెప్పుడువస్తావు"

"నన్నుక్షమించాలి...ఇక తిరిగిరాను. ఇక్కడ నాకేమీ బావుండడంలేదు. నేను బాగా ఆలోచించి చూశాను. నన్ను క్షమించాలి!"

ఉషమాటలు విని, శైలేశుడు రాతిబొమ్మైపోయాడు! హృదయంలోని నవనాడులూ "ఇనపకవాటం మూసుకుపోయింది. ప్రపంచములో ఇక దాన్ని పగులకొట్టే శక్తి లేదు" అని ప్రతిధ్వనిస్తున్నాయ్!

# 10

రాత్రంతా భయంకరమైన కలలతో బాధపడుతూ ఉదయాన్నే శైలేశు లేచి, కిటికీలోంచి తొంగిచూశాడు.ఉష తన నిత్యకృత్యాల్లో నిమగ్నరాలైవుంది. సోమేంద్రుడుకూడా ఆమెవెంట వున్నాడు. అతను అన్నం అడుగుతున్నట్లుంది. మెట్లమీదినుంచి అతను క్రిందికి వస్తుంటే—ఉష యెదురుపడి "వాడు మీకోసం టీ తయారుచేసి వుంచాడు. ముఖం కాళ్లూ కడుక్కోవడం ఆలస్యమయితే, అవి చల్లారి పోతుంటాయ్! కొంచెం తొందరచేయండి!" అన్నది.

"సరే!నువ్వు వెళ్ళి పంపించు.ఒక్కనిమిషంకూడా ఆలస్యం చేయను." అని దూకుతూ స్నానాలగదిలోకి వెళ్ళాడు. మనసులోనే "నే నో శుద్ధ తెలివితక్కువ మూర్ఖుణ్ణి భార్యా

భర్తల్లో, యేదో కొద్దిపాటి మతభేధాల కలతలకు గణఘేరి ద్రోహించి-భీష్మప్రతిజ్ఞ చేసి రాత్రంతా వెధవకలలతో వేగి పోయాను" అని అనుకుంటుంటే అతనికి నవ్వురాలేదు. కానీ, సిగ్గుకలిగింది.

అదీకాక "ఇంటి పనిపాటల్లో కొద్దిగా మతభేధాలు కలిగినప్పుడు, భార్యా భర్తల తగువుకోసం భర్తగారిల్లు వొదిలి, అన్నగారింటికి వెళ్తే-ప్రపంచంలో మానవజాతిఅనేది మచ్చుకు కూడా వుండదు...సోమేంద్రుని తల్లే వుంటే.. అయిదారు రోజులపాటు పుట్టింటిలో వుండి వచ్చేది. అయినా ఉషలాంటి స్త్రీకి, చిన్నప్పటినుంచీ శుద్ధమైన హిందూగృహ వాతావరణములో పెరిగి పెద్దదై, ప్రపంచములో తనకు భర్త తప్ప, ఇంకేదైనమూ తోడులేదని నమ్మిన స్త్రీ, భర్తఅన్న మాటకోసం కోపంతో-సంసారాన్ని వదిలి పెట్టి, జన్మంతా శిక్షను అనుభవించినట్లయితే - ప్రపంచంలో ఇక మిగి లేదేమిటి? యీ కొద్దివిషయానికే భయపడినట్లయితే-ఇంత కన్న వేరే, పిచ్చేమీలేను!" అని అనుకుంటే అతని మనసు లోని విచారం దూరమైంది. దానితోపాటే, హృదయం-శాంతితో, శ్రద్ధతో పరిపూర్ణమైంది.

అధునిక పద్ధతులలో పెరిగిన విభలాంటి స్త్రీలతో ఉషను సరిపోల్చడం ఆయనకు నచ్చలేదు. చివరకు నిట్టూర్పు విడిచి, - "ఇక అవుసరంవ్దు. ఒకవేళ నాకు ఆడపిల్ల పుడితే-తన తల్లిలానే వుండాలి. యీపద్ధతులు ఇక నాకవు సరంలేదు. సరిగ్గా తన తల్లిలాంటి మనఃప్రవృత్తి నివ్వమని భగవంతుని వేడుకుంటాను." అని మనసులో అనుకుంటూ,

ఐదారు నిమిషాల్లో స్నానమైందనిపించుకుని, చదువుకునే గది లోకి వెళ్ళాడు.

క్రొత్తగా వచ్చిన ముసల్మాన్ వంటవాడు టీ, రొట్టీ, మాంసమూ–కేకులూ, మొదలైనవి ప్రొద్దుటిపూట తినేపదార్థాల్ని తీసుకుని వచ్చాడు. అతనికి యెన్నో రోజులనుంచి యీవస్తువుల్ని తినే అలవాటువుంది. మధ్యలో కొన్నిరోజుల పాటు అవిదొరకలేదు. నౌకరు వస్తువుల్ని టేబులుమీద పెట్టి వెళ్ళాక వాటివేపు చూస్తూ కూర్చున్నాడు. మామూలుగా ఉష వచ్చి దగ్గరగా కూచోనందున శైలేశ్ కేమీ రుచించ లేదు. ఒక కప్పు టీ మాత్రం చేత్తో పట్టుకుని, వంటవాణ్ణి పిలిచి మిగిలినవన్నీ పంపించేశాడు.

పర్దాచాటునుంచి తను గుర్తించే కాలిచప్పుడు యేమన్నా వినిపిస్తుందేమోనని, శైలేశ్ చెవులు దోరపెట్టుకుని కూచున్నాడు. కానీ–తను వినేందుకు కూర్చున్న కాళ్ళచప్పుడు మాత్రంవినిపించలేదు. ఉష ఆ గదిలోకి రాలేదు.

క్రమ క్రమంగా ప్రొద్దెక్కింది. స్నాన భోజనాదుల నుంచి నివృత్తుడై, ఇక అతను కాలేజీకి వెళ్లాలి. భోజనసమయానికి మామూలుగానే ఉషవచ్చి దగ్గరకూర్చుంది. ఒక్కొక్కవస్తువునే తినమనీ, –మెల్లి మెల్లిగా తినమనీ, అతను తృప్తిపడేనిధానాన్ని యెలా వుపయోగించాలో, అలా వుపయోగించి–తృప్తిపరిచింది.

చివరకు బట్టలువేసుకొని, కాలేజికి వెళ్ళేప్పుడు ఉషను పిలిచి–యేమైనా చెప్పుదామనుకునికూడా అతను సాహసించ లేకపోయాడు.

# 11

శైలేశ్వరుడు తిన్నగా ఇంటికి రాక, కాలేజినుంచి విభ ఇంటికి వెళ్ళాడు. అతను అనుమానించినట్లే, బావ గారు కచేరికి వెళ్ళలేదని తెలుసుకుని, దానితోపాటే - ఆ భార్యాభర్తల మధ్య సంధికుదిరెందనీ విన్నాక తృప్తిపడి,- "విభా! సోమేంద్రుని తీసుకురావడానికి మనిషి నెందుకని పంపలేదు?"- అని అడిగాడు.

విభ యేదో చెప్పబోతూంటే, క్షేత్రమోహనుడు - "యేనుగును, కోరినవాళ్లిప్పుడు లేరు?" అని అన్నాడు.

"అంటే?——"

"యీ కథ నువ్వెప్పుడూ వినలేదూ? యెవరో ఒక త్రాగుబోతువున్నాట్ట. నిషామైకంలో వాడొకనాడు రాజుగారి యేనుగును కొంటానన్నాడు. యింకేముంది. రెండో నాటికల్లా వాణ్ణి రాజభటులు పట్టుకుని దర్బారుకి తీసుకుని వెళ్లారు. అక్కడ వాణ్ణి - యేరా? నువ్వీమాటలు యెందుకని ప్రేలావురా?" అని అడిగాడు. దీనికి జవాబుగా ఆత్రాగు బోతు చేతులు జోడించి మహాప్రభూ! నాకు యేను గవసరం లేదు. నిజంగా యెనుగును కోరేవా డిప్పుడు లేడని వా డెళ్లి పోయాట్ట!" అనిఅంటూ క్షేత్రమోహనుడు పకపకానవ్వాడు చివరకు నవ్వు ఆగాక-"శైలేశ్! యీ కథ వినిపించి అక్కా యిని అలగనద్దని చెప్పు! వా సవంగా కోరేవా రిప్పుడు లేరు. వారు వెళ్ళిపోయారు. తల్లిని వదలి అత్తగారిదగ్గరకు వచ్చి నప్పుడు, యెక్కువగా రాణించలేకపోతే ఆ సొణ మంతా తీసుకుని విభకు ఒక యేనుగు కొని పెట్టాల్సివుంటుంది." అని అంటూ, విభచూపులోంచి తన [illegible]

బావ నవ్వుల్లో తను భాగం పంచుకోలేక, తనునవ్వితే విభకు కోపంవస్తుందని, తనను తాను సంబాళించు కుంటూ, నోరు మూసుకుని కూర్చున్నాడు.

క్షేత్రమోహనుడు సిగ్గుపడి "శైలేశ్ ! సంగతులేమిటి?" అని అడిగాడు.

"సోమేంద్రుని విషయంలో విభ చెప్పాక నేను నిశ్చింతగా వున్నాను. కానీ. ఆ ప్రబంధము కానప్పుడు ఇంకో వుపాయమేదైనా చూడాల్సివుంటుంది."

"ఆడభూతంచేతుల్లో వదిలిపెట్టిన మీందట పిల్లవాడి విషయంలో నిశ్చింతగా వుండలేమనేనా-?"

"యీ మాటకు జవాబు చెప్పకుండానే ఉష తొందరగా వెళ్ళి పోదలచుకుంది."

"వెళ్ళాలనుకుందా? యెక్కడికి?"

"ఎక్కణ్నుంచి వచ్చిందో అక్కడికే! తన అన్నగారి దగ్గరకు..."

"క్షేత్రమోహనుని ముఖం గంభీరమైంది. ఆయన తన భార్యవేపు వక్రదృష్టితో చూస్తూ" 'శైలేశ్! ఈ సంగతి నాకేమీ బాగోలేదు.' అని అన్నాడు.

విభ యింతవరకు ఒక్కమాటకూడా మాట్లాడలేదు. భర్తగారి మాటల్లోని అర్థం తెలుసుకుని స్వాభావికంగాముఖం త్రిప్పుకుని "యేం అన్నయ్యా? నాగురించే నీ పీపని చేయ దలచుకున్నావా? అదే నీయిష్టమైతే నిన్నేమీ అనను కానీ, ఒకప్పుడు మీరిద్దరూ యేడవాల్సివస్తుందని మాత్రం చెప్పుతున్నాను" అని అన్నది.

శైలేశుడు తలూపుతూ "కాదు" అని, ముసల్మాన్ వంటవాణ్ని పెట్టింది మొదలు, యివాల్టి వుదయంవరకూ జరిగిన సంగతులు పూసగ్రుచ్చినట్లు చెప్పి, చివరకు "నే నామెను వెళ్ళమని చెప్పలేదు. ఆమె తనంతట తానే వెళ్ళా లని అనుకున్నప్పుడు నేను వొద్దనను. యింతకీ ఒక పెద్ద పొర పాటునుండి తప్పుకున్నందుకు భగవంతునికి నేను ధన్యవాదా లర్పిస్తున్నాను" అని అన్నాడు.

విభ నోరుమూసుకుని కూర్చుంది. చాలా సేపటివరకూ క్షేత్రమోహనుడు యేవిధమైన అభిప్రాయాలు బైటికి వెల్ల డించలేదు. కొద్దిసేపయిన తర్వాత "ఈసంగతులన్నీ మీకు ముందుగా చెప్పడం మంచిదని యిటువేపు వచ్చాను. నావిష యంలో మాత్రం మీరు భ్రమపడవద్దు" అని అన్నాడు.

క్షేత్రమోహనుడు తలూపుతూ "కాదు కాదు...... అలా జరుగుతుందా? సరే శైలేశ్! భవానీపురంలో యిది వరకు జరిగిన, మాటలవిషయంలో వాళ్ళేమయినా కబురు పంపారా? లేదా?" అని అడిగాడు.

"యీ ఆక్షేపణ పూర్వకమైన మాటలు నాకు కోపా న్ని కలిగిస్తున్నాయ్! మీ మాటలు నా కెంత బాధను కలిగిస్తు న్నవో నీకు తెలియదు" అని శైలేశు అన్నాడు.

"నిజమే! నీకు బాధనుకలిగించే మాటలేవో నేను తెలుసుకోలేకుండా వున్నాను."

వ్యంగ్యంతో కూడిన యీ మాటలకు శైలేశుని హృదయం యింకా యెక్కువగా బాధపడింది. "మీకు నొప్పి కలుగుతుందని, ఆలోచించి నేనెప్పుడూ మిమ్మల్నే మీ

అనలేదు. యీ సంగతిని మీకు నా కిదివరకే చెప్పివుంటే శావుండు" అని అన్నాడు.

"శైలేశ్! నీవు నిజమే మాట్లాడావు. పరిపూర్ణమైన జ్ఞానంతో, నీతో వాదించే వయసు దాటిపోయింది. ఈ విషయాన్ని గురించి నువ్వొక పుస్తకాన్ని వ్రాసివున్నట్లయితే, నాబోటివాళ్ళ కెంతో ఉపయోగపడేది! సరే మీ అన్నా చెల్లెళ్ళిద్దరూ మాట్లాడుతూ కూర్చోండి, నే నిప్పుడే వస్తాను" అని అంటూ పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

శైలేశుడు గట్టిగా అరిచి "పుస్తకం వ్రాయాలంటే, యెంతో కాలం పడుతుంది. ఆ రాసేదేమిటో, నానోటివెంటే చెపుతున్నాను విను! హేళనచేస్తూ, భవానీపురంవాళ్ళ విషయంలో నువ్వేమనుకున్నాసరే, వాళ్ళు కబురుచేసినా, చేయకపోయినా, వాళ్ళకు నేను తప్పకుండా కబురుచేయాల్సొంటుంది తెలుసా?" అని అన్నాడు.

గుమ్మంబైటినుంచే క్షేత్రమోహనుడు "సరే కబురు చేయాలనుకుంటే చేయ్! యెవరు వద్దంటారు? నా కనవసరంగా ఆలస్యమవుతూవుంది–" అని వెళ్ళిపోయాడు.

రెండోనాడు ప్రొద్దున్నే క్షేత్రమోహనుడు, శైలేశుని ఇంటికి వచ్చాడు. స్నానానికి వెళ్ళబోతూన్న శైలేశుడు బావగారిని చూసి, నిన్న జరిగిన వాద ప్రతివాదనలకు, అవన్నీ మరచిపోయినట్లుగా, తనంతట తాను రావడం చూసి విస్మయాన్ని పొంది–మనసులోనే సిగ్గుపడుతూ, "ఇవాళ హైకోర్టు లేదా యేం?" అని అడిగాడు.

"ఈ ప్రశ్న అనవసరం–"

"అయితే ఇవాళ ప్రాక్టీసుకు స్వస్తి చెప్పావా-యేం?"

"ఈ ప్రశ్న అసలనవసరం-"

"అయితే నేనూ అనవసరమే ననుకుంటాను. సరే! నేను స్నానంచేయడానికి వెళ్తున్నాను. మీా కేమీా నాతో పని లేదని అనుకుంటాను."

"లేదు-నువ్వు వెళ్ళొచ్చు"అని మూడడుగులు నడిచి క్షేత్రమోహనుడు, "అక్కాయి! నేను లోపలకు రావచ్చునా?-" అని కేక వేశాడు.

పూజచేసుకునే గది వేరే లేనందున, పడుకునే గదిలోనే, ఒకప్రక్క ఆసనం పరచి, పూజచేసుకుందామనే ప్రయత్నంలో ఉషవుంది. కంఠస్వరాన్ని విని ఆమె తన తడిసిన వెంట్రుకలమీాదికి గుడ్డ లాక్కుని- "రాండి"అని పిలిచింది.

క్షేత్రమోహనుడు గదిలోకి వచ్చాక,- "వేళకాని వేళలో వచ్చి, నేను చాలా పాపాన్ని చేశా నక్కాయి! అయినా, ఇంత తొందరగా మీారు పుట్టింటికి వెళ్ళే అవుసరమే మొచ్చింది? మీా నాన్నగారివంట్లో బావుండడంలేదా యేం?" అని అడిగాడు.

"నాన్నగారెప్పుడో దిక్కులేనివాడిలా చనిపోయారు"

'అయితే అమ్మగారికేమన్నా యిబ్బందిగా వుందా?-'

'ఆమె తండ్రిగారికంటే ముందుగానే పోయింది'

ఆశ్చర్యంగా చూస్తూ - 'అయితే మీారెక్కడకని వెళ్తారు?-యెవరున్నారు? యిటువంటి స్థితిలో మీారెక్కడికని వెళ్తారు? శైలేశుని వదిలిపెట్టి వెళ్ళడం మాకిష్టంలేదు-' అని అన్నాడు.

'మీా కిష్టంలేదా?' అని నవ్వుతూ అడిగింది.

'లేదు, యేవిధంగా కూడా మీారు వెళ్ళడానికి మా కిష్టంలేదు.'

'అయినా క్షేత్రమోహనబాబూ! నేనింతకాలం అన్న గారివద్దే హాయిగా వుండి వచ్చాను. అక్కడ నాకేవిధమైన కష్టమూ, యెప్పుడూ కలగలేదు, కలగదు కూడా!–'

'సరే, అంతగా వెళ్ళదలచుకున్నప్పుడు, మళ్ళీ మీారు యెన్నిరోజులకి తిరిగి వస్తారు? ఈ సంగతన్నా చెప్పకపోతే మిమ్మల్ని యిక్కడ్నుంచి కదలనీయము–'

ఉష మాట్లాడలేదు. 'కాని, మీారిలా వెళ్ళిపోతే సోమేంద్రుని మంచి చెడ్డలు, ఎవరు చూస్తారు? ' అని క్షేత్రమోహనుడు మళ్ళీ అడిగాడు.

'అతని అక్కవుంది–'

'ఆమె నా భార్య! ఆమెను క్షమించమని మిమ్మల్ని నేను ప్రార్థిస్తున్నాను'

ఉష మాట్లాడలేదు.

'అయితే మీారు నాకు క్షమాభిక్ష పెట్టరా?–'

ఉష మాట్లాడలేదు. క్షేత్రమోహనుడు కొంచెంసేపు వూరుకుని ఒక నిట్టూర్పు విడిచి మెల్లమెల్లగా 'మీారెప్పుడు వెళ్తారు?' అని అడిగాడు.

'అన్నయ్య పిలవడానికెప్పుడువస్తాడో అప్పుడు వెళ్తాను. ఒకవేళ వారు రేపే వస్తారేమో!'

కొంచెంసేపయాక క్షేత్రమోహనబాబు 'మీాతో [illegible] చెప్పకూడదని, ఒక సంగతి నా మనసులో యింత

వరకూ దాచిపెట్టాను. యిక దాచినట్లయితే, ఆ పాపం నాకు చుట్టుకుంటుంది...మీరు ఈ యింట్లోకి రాకముందు, ఇంకో వ్యక్తిని తీసుకరావాలనీ ఈ గృహభారాన్నంతా ఆ వ్యక్తికి అప్పగించాలనే ప్రయత్నాలు జరిగినాయ్!– ఆ ప్రయత్నా లిప్పటికి ఫలవంతమయ్యేట్లుగా కనుబడుతున్నాయి!' అని అన్నాడు.

'ఆ సంగతి నాకుకూడా తెలుసు–'

'అయితే, మీకు తెలుసుండే ఆ ప్రయత్నాల్ని పరిపూర్ణమయ్యేటట్లు చేస్తున్నారన్నమాట! యెందువల్ల?...

ఆయన మాట పూర్తికాకుండానే 'క్షేత్రమోహన్ బాబూ! అది విజయవంతమైనా,–ఫలవంతంకాకుండా భగ్నమైపోయినా మీరు నన్ను క్షమించాలి! యిదే మిమ్మల్ని కోరుకుంటాను.' అని ఆమె రెండుచేతులెత్తి నమస్కరించింది. యిప్పుడామె క్షేత్రమోహనుని ముఖం చూసింది.

క్షేత్రమోహనుడు కూడా, ఆమె ముఖాన్ని, అలానే చూస్తూ నిలుచున్నాడు.

## 12

భార్యతో మాట్లాడడం శైలేశుడు మానేశాడు. కానీ ఉష అలా చేయలేదు. ఆమె సేవలకూ, పరిచర్యకూ ... ఏవిధమైన పరిణామముకలగలేదు. యింటిపనులన్నీ మామూలుగా చేస్తూవుంది. నోరువిప్పి శైలేశుడుకూడా యేమీ అడుగడు. యే వ్యక్తి యీ యింటిని వదలిపెట్టి వెళ్ళదలుచుకుందో, ఆ వ్యక్తికి యీ యింట్లోని ప్రతి పనిమీదా యింత

మము తెందుకు? అని ఆలోచించేవాడు. క్రొత్తగా వచ్చిన నౌకరు గోడకు యేదో మురికి పూశాడని, ఉష వాణ్ని కోప గించడంకూడా విన్నాడు.

ఉషలాంటి అద్భుతశక్తిగల మనిషి నెవర్నీ అత నింత వరకూ చూడలేదు. ఆమె ఒక కంటితో యేడుస్తూ, రెంట్రో కంటితో నవ్వుతూ వుంటుంది. వుయ్యాలలూగినట్లు అతని మనసు ఆలోచిస్తూవుంది.

ఆనాడు క్షేత్రమోహనుడు తిన్నగా వంటింటిగదివద్దకు వచ్చి, "అక్కాయి! ప్రసాదానికింకెంత ఆలస్యముంది?—" అని అడిగాడు.

ఉష తన తలమీాదకు, గుడ్డను కొంచెం పైకిలాక్కొని "ఆసంగతి మీారు మీాభావమరిది నడిగి తెలుసుకోండి! ఆలస్య మేమైనావుంటే వారిదేగాని, ఇక్కడంతా సిద్ధంగావుంచాను" అని అన్నది.

"మీాదేమీా ఆలస్యంలేదు! - మిమ్మల్ని మాటల్లో నన్నా ఓడిద్దామని వచ్చి, నేనే ఓడిపోవాల్సివచ్చింది. అక్కాయి! మీా రింతఇదిగా వంటచేసినందుకు, తినివచ్చినా ఇక్కడ మళ్ళీ తినాలనిబుద్ధిపుడుతూవుంది. కానీ, అనుమాన మేమిటంటే, భోజనంచేశాక మళ్ళీ వెంటనే భోజనంచేస్తే, శరీరారోగ్యం చెడిపోతుందనేకాని,మీాపిలుపును కాదనలేను. యింకోనాడు వచ్చి ఇక్కడ భోజనంచేస్తాను."

ఉష మాట్లాడలేదు.

"పిల్లవాడెక్కడికెళ్ళాడక్కాయ్?" అని క్షేత్రమో హనుడు మళ్ళీ అడిగాడు.

"యివాళెందుకో బడికి వెళ్ళనని మోడువేస్తే ఇంత అన్నంపెట్టి, బుజ్జగించి పంపాను."

"వాడు మీదగ్గర బాగా మాలిమయ్యాడు" అని కొంచెంసేపు నవ్వి, "సరే, అక్కాయ్! మీరు పుట్టింటికి వెళ్తానన్నారు, ఆ వుద్దేశాన్నింకా మనసులో వుంచుకున్నారా? వాస్తవంగా మీ భావిజీవితసౌఖ్యాని కేదయినా, నిరాధారమైన సంగతులు వింటుంటే-ఇక ప్రపంచంలో యెవరినీ నమ్మలేనంత వరకు వస్తుంది." అని అన్నాడు.

ఉష ఈ మాటకు్కూడా యేమీ జవాబు చెప్ప లేదు. క్షేత్రమోహనుడు అక్కణ్నుంచి శైలేశుని గదిలోకి వచ్చాడు. శైలేశు డప్పుడే స్నానంచేసి, అద్దంముందు నిలుచుని తలదువ్వుకుంటున్నవాడల్లా, బావగారు రావడాన్ని చూశాడు.

లోపలకు రావడంతోనే క్షేత్రమోహనుడు-"యివాళ కాలేజి మూసేశారా?" అని అడిగాడు.

"లేదు, ముందరి రెండు గంటలూ సెలవనుకుంటాను"

"నీకు చాలాసంతోషంగావుంది...అయినా. .అక్క గారిని పుట్టింటికి పంపే సంగతి యేంచేశారు?"

"చేసేదేముందీ? ఆమెంతట ఆమే వెళ్ళిపోతూ వుం దాయె! - రేపు ఆమె అన్నగారు వచ్చి తీసుకవెళ్తాడని విన్నాను."

"నువ్వొట్టి పూర్తిగా పిచ్చివాడి వేనోయ్!- నీ కా అమ్మాయితో పనికాదు, నీ మనసు మార్చుకుంటే చాలామంచిది. నువ్వొట్టి సుఖపడ్తావు. నేనూ సుఖపడతాను."

"బావా! నీ కింత వయసొచ్చినా, యీ పరిహాసాలు మానవేం?–"

"వ్యాకే నవ్వొననుకున్నావా? – మీ వ్యవహారం చూస్తుంటే అలా అనాల్సివొచ్చింది. మనోవ్యథకారణంతో ఆమె పుట్టింటికి వెళ్తానంటే నువ్వో సరేనన్నావు. నీ కింకా భవానిపురంవాళ్ళ ఆశ వదల్లేదు. నా కా భవానిపురపు పిల్ల మీద కోరికున్నది బావా! అని అన్నావు. యిదంతా యేమనుకోవాలి? మీ అన్నాచెల్లెళ్ళిద్దరూ ఒకమాటమీద వుంటారు. అదీకాక నే నావిషయంలో అన్నిటినీ సరిచేసి వచ్చాను. యిక ఆమె వెళ్ళదు. అనవసరంగా ఆమె మనసుకు కష్టాన్ని కలిగించకు.–" అని గడియారం వేపు చూసి, తుళ్ళిపడి—"ఇక నేను వెళ్తాను"అని వెళ్ళబోతూ మెల్లగా"శైలేశ్! ఇంకా కొద్దిరోజులపాటు ఓర్పుగా చూడు, ఈమె ఆచారంగల బ్రాహ్మణులయింట్లోని పిల్లమ్మా. అన్నం నాలుగు రోజులపాటు తినకపోయినా, ఇటువంటి అనాచారాలు ఆ యమ్మాయికి గిట్టవు...సరే వెళ్తున్నాను–" అని అంటూ జవాబుకు యెదురుచూడకుండానే క్షేత్రమోహనుడు వెళ్ళిపోయాడు.

శైలేశ్వరుడు కొన్ని క్షణాలపాటు స్తబ్ధంగా నిలుచున్నాడు. క్షేత్రమోహనుడు యెప్పుడువచ్చాడు? యేవుపాయంతో ఉషను తారుమారుజేసి వెళ్ళాడు?. యెంతసేపు ఆలోచించినా అతని కేమీ పాలుపోలేదు.

బెయరా వచ్చి భోజనం వడ్డించారని చెప్పాడు. ప్రతిదినంలాగానే రకరకాల భోజనపదార్థాలు వడ్డించివున్నాయి!

దగ్గరగానే వృష కూర్చుంది. తలొంచుకుని శైలేశు భోజనం దగ్గర కూర్చుని, యేం మాట్లాడనా?-అని ఆలోచించాడు. సోమేంద్రుని పేరుతోనైనా మాట్లాడలేకపోయినంతగా మారిపోయి, తలవంచుకునే భోజనంచేసి-లేచి, మెదలకుండా వెళ్ళిపోయాడు.

# 13

మరునాడు ఉదయాన్నే ఉష తమ్ముడు 'అవినాశుడు' అక్కగారింటికి వచ్చి చేరాడు. సరిగ్గా అదేసమయంలో శైలేశుడు ముఖం చేతులూ కడుక్కుని, టీ త్రాగడానికి గదిలోకి వెళ్తూ అపరిచితుడైన మనుష్యుని చూసి, అనుమానంగా- "మీరెవరు?" అని అడిగాడు.

అవినాశుడు తన పరిచయాన్ని చెప్పి-"మా పెద్దన్న గారు అర్జంటుపనులవల్ల రాలేకపోయి, మా అక్కను తీసుక రమ్మనమని నన్ను పంపాడు-" అని అన్నాడు.

"అయితే తీసుకవెళ్ళండి." అని శైలేశుడు తనగది లోకి వెళ్ళేప్పటికి-మేజాబల్లమీద అనేకరకాల తినుపదార్థాలు పెట్టబడివుండడం చూసి, యేవీ ముట్టుకోకుండా, ఒక కప్పు టీ మాత్రం త్రాగి పడకకుర్చీలో కూర్చున్నాడు.

పుట్టింటివద్దనుంచి యెవరైనా వచ్చి, ఉషను తీసుక వెళ్తారని అతనికి ముందే తెలుసు! అందువల్ల అవినాశుని చూడడంతోనే త్రుళ్ళిపడే అవకాశం లేకపోయింది. అదీ కాక అవినాశుడు యెవర్ని తీసుకవెళ్ళడానికివచ్చాడో, వాళ్ళను ఆపడం తనకు చేతకానిపనవుతుందనీ, అయినా యీ విష

యంలో యేదో ఒకటి నిశ్చయమైన సంగతి తేల్చుకోనిపక్షం లో తన మనసేమీ బావుండదనీ అనుకున్నాడు.

క్షేత్రమోహనుడు కూడా ప్రొద్దున్నే వస్తాడు. అతను వచ్చినట్లయితే జరిగేదేదో జరిగి తీరుతుంది. యేమి టేమిటో ఆలోచిస్తూ అతని హృదయం యెంత పిరికిగావుందో అంత యిదిగా దాన్ని సంబాళించుకోలేనంత ముత్తేజం అతని కనుభవమవుతూవుంది. ఆ ముత్తేజంలోనే 'క్షేత్రమోహనుడు సీతో యేం మాట్లాడాడు' అని అడగడానికి ఉషవద్దకు పరుగుతీద్దామనుకున్నాడు...అత నిప్పుడు తనను తాను నమ్మలేక పోతున్నాడు. ఆ భావాలతోనే శైలేశుడు గడియారపు ముళ్ళను చూస్తూ కూర్చున్నాడు.

యెంతసేపు కూర్చున్నా, అతనికి కాలంగడవడంలేదు.

తలుపుద్వారానికున్న పరదాను తొలగించుకొని మెల్లిగా అవినాశుడు లోపలికి వచ్చాడు. అవినాశుడు లోపలికి రావడంతోనే, శైలేశుడు పుస్తకం చదువుతున్నట్లుగా కూర్చున్నాడు. అతని శరీరానికి కాగడాలుపెట్టి కాలుస్తున్నట్టుంది...అవినాశుడు కూర్చోబోతూ, టేబిలుమీదున్న పదార్థాలను చూసి, దగ్గరున్న కుర్చీ లాక్కుని, దూరంగా కూర్చున్నాడు. గృహయజమాని తనకు స్వాగతమిస్తాడని అత నెప్పుడూ అనుకోలేదు. గదిలోకి రావడంలోని వుద్దేశ మేమిటని శైలేశుడు అడుగకముందే "అక్కయ్య యీరెండున్నరగంటల బండికే వెళదామంటోంది" అని అవినాశుడు అన్నాడు.

శైలేశుడు పుస్తకముమీదనుంచి చూపులు మరల్చి "వెళతానంటోందా? యెందుకని? వెళ్ళితే నేను కోపపడుతానను కుందా?" అని అడిగాడు.

అవినాశుడు ఇంకా చిన్నపిల్లవాడు. ఈ మాటకు యేమని జవాబు చెప్పాలో అతనికి తట్టలేదు. మెదలకుండా కొంచెంసేపు కూర్చొని "అవును" అని అన్నాడు.

దర్వాజా బైట గాజులచప్పుడు విని, శైలేశు మనసు లోనే కోపగించుకుంటూ "లేదు. వెళ్లితే నాకేమీ కోపం లేదు" అని అన్నాడు.

అవినాశుడు యేమీ మాట్లాడలేదు.

"మీ అన్నగారు వస్తారని విన్నాను, ఆయనగారు రాలేదేం?" అని శైలేశు అన్నాడు.

అవినాశుడు సంకుచితంగా "అసలు నన్నుకూడా పంపాలని ఆయనగారికి యిష్టంలేదు' అని అన్నాడు.

"యెందుకని?"

అవినాశుడు యేమీ మాట్లాడలేదు.

"నువ్వింకా కుర్రవాడివి. నీకన్నిసంగతులూ చెప్ప లేను. చెప్పినా యేమీ లాభముండదు. ఇక్కడి సంగతులన్నీ మీఅన్నగారు అడిగేటట్లయితే, ఉషది యేమీ తప్పు లేదని మాత్రం చెప్పు! తప్పేదన్నావుంటే అది నాదే! పొర పాటు నావల్లనే జరిగింది. ఇక్కడికి తీసుకరావడం నాదే తప్పు' అని కొంచెంసేపు మెదలకుండా కూర్చుని—"మానాన్నగారు ఉషను ఉపేక్షించి యెంతో అన్యాయంచేశాడని నాకు తెలుసు! యెన్నోరోజులకు ఆ అన్యాయానికి ప్రతీకారం జరిగి

నట్లు యిక్కడికి తీసుకవచ్చాను; గాని, ఆమెలో ఒక్కదోష మ్ముంటే- అదే వేయిదోషాల కోపంగా పరిణితమై కనుపిస్తున్నది.” అని అన్నాడు.

అవినాశుడు దీనికూడా యేమీ జవాబు చెప్పలేదు. రెండో వేపునుంచి తలుపు త్రోసుకుని క్షేత్రమోహనుడు లోపలికి వచ్చాడు. శైలేశుడు అతన్ని చూసికూడా నోరు మూయకుండా యింకా గట్టిగా మాట్లాడుతున్నాడు. ఉష చాటుగా నిలుచుని ఇదంతా వింటూనేవుంది. శైలేశుడు మతిలేనివాడిలా “నే నొకనాడు మీ అక్కయ్యను పెండ్లిచేసుకొన్నమాట వాస్తమేకాని, పెండ్లిచేసుకున్నంతమాత్రాన ఆమె నా సహధర్మచారిణని చెప్పలేను. మా ఇద్దరిశిక్షా, దీక్షా—సమాజధర్మమూ, యేవీ ఒకటికాదు. ఒకవేళ బలవంతంగా ఆమెను నా యింట్లో వుంచివేస్తే, నా యిల్లు స్మృతి శాస్త్రిలు చెప్పబడే పాఠశాలగా మారిపోతుంది. ఈ అనర్థకంమూలంగా నా రక్తాన్ని పంచుకుని పుట్టిన ఒక్క చెల్లెలుకూ కోపం తెప్పించి, ఆమెను యిటువేపుకి రాకుండా చేసి, నా ఒక్కగాని ఒక్క కొడుకు హృదయంలో ఇటువంటి పనికిరాని శిక్షణలనీ—ప్రయోజనంలేని సంస్కారాలనీ, ప్రవేశపెట్టబడటానికి నే నొప్పుకోను. ఇంతకూ నేను చెప్పకుండానే ఆమె తనంతట తానే పుట్టింటికి వెళ్ళిపోతానన్నందుకు, కృతజ్ఞతతో వుంటాను. నేను చెప్పి నలుగురినోటా పడకుండా ఆమె తనంతట తానే వెళ్ళానని అన్నాను.” అని అన్నాడు.

ఉద్వేగంతో శైలేశుడు మాట్లాడటం చూచి, క్షేత్రమోహనుడు చకితుడై తెలివిలేనివాడిలా ఆశ్చర్యంలో అతని

ముఖంలోకి చూశాడు. దుర్బల ప్రకృతితో - మాటి మాటికీ సిగ్గు పడుతూ, భయపడే శైలేశు యీవిధంగా మాట్లాడడం క్షేత్రమోహనునికి మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది. గదిలో కూర్చున్న అపరిచితుడైన మనిషి ఉష తమ్ముడని తెలుసుకు నేందుకు ఆతని కాట్టే ఆలస్యంకలగలేదు. అతని ముందే శైలేశుడు సిగ్గులేని తాగుబోతువిధంగా మాట్లాడుతూవుంటే క్షేత్రమోహనునికి విచారం కలిగింది. చివరకాయన సహించలేక, చేతులు జోడించి "చూడండి! వీరిలా మాట్లాడే మాటల్లోని కోపాన్ని కలిగించే తెలివితక్కువ మాటల్ని మాత్రం మీ అక్కగారికి తెలియనీయకండి!" అని అవినాశుతో అన్నాడు.

అవినాశుడు చేతివ్రేలితో తలుపువేపు చూపి "నేనేమీ చెప్పనవసరంలేకుండానే అక్కగారు అంతా బైటనుంచి వింటూనేవుంది." అని అన్నాడు.

"యేమిటి-బైట నిలుచుందా?. అక్కడేనా?"

ఈ మాటకు అవినాశుడు ఏదో చెప్పబోయేప్పటికి శైలేశుడుస్పష్టంగా "ఆమెఅక్కడవుందనినాకు తెలుసు" అన్నాడు.

ఆ మాట విని క్షేత్రమోహనుడు మరింత సిగ్గుతో కుంగిపోయాడు.

ఆనాడు మూడుగంటలబండికి అవినాశుడు అక్కగారిని తీసుకుని స్టేషనుకు వెళ్ళాడు. యిటు సోమేంద్రుడు అత్తగారింటికి వెళ్ళాడు.

మరునాడుదయం టీ-తాగుతున్న సమయంలో విభ భర్తగారిముఖంలోకి చూస్తూ "మా అన్న యేంచేస్తున్నాడో మీరు చూశారా?" అని అడిగింది.

"చూశాను. అతని చేతుల్లో ఒక పుస్తకముంది. నా స్తవంగా అతను తన మూర్ఖత్వానికి,పశ్చాత్తాపపడుతున్నట్లుంది"

"మరి మీరా రీపని యెప్పుడు చేస్తారు?"

"యేపని? చేతిలోకి మీ అన్నలా పుస్తకం తీసుకునేపనేనా? లేకపోతే అతనిలా పశ్చాత్తాపంపడేపనా?"

"మీచేతిలో పుస్తకం అందంగా వుండదు-ఆఖరిపనిని గురించి అడుగుతున్నాను"

"నువ్వు మీ అన్నగారినిపిలిపించుకుని పుట్టింటికి వెళ్తేనే నాపని చేయగలను విభా!"

"ఆపని నాకు చేతకాదు. హిందూకుటుంబములో పుట్టినా, నేను పూజా పునస్కారాలు, జపతపాలు చేసే చదువునుమాత్రం చదువుకోలేదు.

"నువ్విటువంటి సౌభాగ్యాన్ని అలవరుచుకోకుండా వుండడం నీ దౌర్భాగ్యం! లేకపోతే ఈనాడు మీ అన్నగారు చేసినపనికి, నువ్వెంతో అసహ్యించుకునేదానివి" అంటూ క్షేత్రమోహనుడు బైటికి వెళ్ళాడు.

## 14

భవానీపురంలోని యే అమ్మాయిని పెళ్ళిచేసుకుందామని శైలేశుడు ప్రయత్నించాడో, ఆమెవిషయంలో తిరిగి పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నై. భర్తగారికి యేమాత్రం యీపని ఇష్టంలేదని విభ బాహాటంగా ఈ పనిలో జోక్యాన్ని కలిగించుకోలేదు. అయినా ఆమె మనసులో దాగుకొనివున్న సానుభూతి, ప్రేమభావన, తన అన్నకు మంచి పెళ్ళాం దొరకలేదే? అని మరింత తహతహలాడిపోయింది.

కొన్నిరోజులయాక శైలేశునికి పెళ్ళి వ్యామోహం తగ్గిపోయింది. ఒకనాడు శైలేశుడు తన వివాహానికి అడ్డుతల పెడుతూ క్షేత్రమోహనునితో "బావా! యీ జీవితంలో యెక్కువకాలం గడిచిపోయింద. కొద్దికాలంకోసం మళ్ళీ ఒక కొత్తమురికిని నామీద పూసుకునే సాహసం నాలోలేదు.... సోమేంద్రుడున్నాడు. మీరంతా వాణ్ణి ఆశీర్వదిస్తేచాలు... యిక ఈ మురికంతా నాకెందుకు?" అన్నాడు.

యేసంగతినైతే మానవులు నిష్కపటభావంతో బైటికి మంచికోసం వెల్లడిచేస్తారో, అది తెలుసుకోనేందుకేమీ కష్టముండదు. శైలేశునిమాటలు విని, క్షేత్రమోహనుడు వేదనఅనుభవించాడు.

ఆ తరువాత ఆయన ప్రతిరోజూ కచేరినుంచి ఇంటికి వెళ్ళేప్పుడు, శైలేశునిఇంటికి రావడం ప్రారంభించాడు. ఆ యింట్లో గృహలక్ష్మి లేదు. కొడుకులేడు. కేవలం నౌకర్ల తోనూ, చాకర్లతోనూ కలిసి గృహస్థాశ్రమము నడుస్తూ వుంది. చూస్తూ చూస్తూండగానే ఇంట్లో యెంత విశృంఖలత వ్యాపించిందో, యిల్లెంత కళాహీనంగా వుందో, చూస్తుం టేనే మనసు బాధపడుతూవుంది. ఒక నెలరోజులు గడి చాక, "శైలేశ్! నీకు నా మనసులోని సంగతి తెలుసు!- యింట్లో భాగస్వామిని లేనిదే, జీవనయాత్రకు నిర్వాహక ముండదు. విశేషించి-ముసలితనంలో..."అని క్షేత్రమోహ నుడు ఆగిపోయాడు.

ఈనాడు ఉమకూడా అక్కడే కూర్చుని వుండడంవలన "ముసలితనం రావడానికింకా యెంతోకాలముంద. అకహ్యా

అంతకంటే ముందేవచ్చి హాజరవుతుంది. కోపంవచ్చి యే ఆడదన్నా పుట్టింటికివెళ్తే అక్కడ ఎంతకాలమని వుంటుంది?" అని ఒకసారి తన అన్నగారిముఖంలోకి, మరోసారి శైలేశుని ముఖంలోకి చూసింది. అయినా ఇద్దరు వ్యక్తులలోనూ ఎవరూ యేమీ జవాబు చెప్పలేదు. విశేషించి శైలేశుని ముఖం మేఘాలమాదిరి మలినమైంది. ఉమ జిజ్ఞాసాదృష్టితో తనవేపు చూస్తోందని శైలేశు తెలుసుకుని నీరసభావంతో తలూపుతూ "రాదు...ఆమె యిక రాదు" అనిమాత్రం అన్నాడు.

"రాదూ! యెందుకనిరాదు? తప్పకుండా వచ్చితీరుతుంది... యీ నెలలలోనే వస్తుంది. యేం అన్నాయ్! అక్కాయి రాదూ?" అని ఉమ అడిగింది.

ఉష తిరిగిరావడాని కెంత కష్టమో. ఆమె హృదయం యెంత విధిగా బాధపడిందో శైలేశుడు ఆమె తమ్ముడి ముందు, ఆమె వినేట్లుగా అన్న ప్రతి అక్షరక్షరమూ క్షేత్రమోహనుడి మనసులో అంకితమై వున్నాయి!-ఈ మాటల్ని ఉష మరిచిపోతుందనుకోవడం పొరపాటు! అసలు శైలేశుని తండ్రే ఆమె కెంతో అన్యాయంచేశాడు...ఆ అన్యాయాన్ని ద్రోహాన్ని తనకు కానట్లుగా భావించుకుని ఆమె యిక్కడికి వస్తే, విభ ఆమెను అవమానపరిచింది. ఇవన్నీ వూహించుకుంటున్నకొద్దీ క్షేత్రమోహనుని హృదయం క్షోభతో నిండిపోతూవుంది.

తన మాటలకు జవాబు రాకపోయేసరికి, ఉమ ఆశ్చర్యంగా అన్నగారిముఖంలోకి చూస్తూ—"యేం అన్నాయి-చెప్పవేం?" అని మళ్ళీ అడిగింది.

"ఏమిటమ్మాయ్ ?"

"సరే! బాగానేవుంది ఈ నెల్లోనే అక్కాయి మళ్ళీ తిరిగివస్తుందని నే నంటాను. నీకీవిషయంలో నమ్మకంలేదా?"

"మాటవరుసకు ఆమె రాదనుకుందాం! ఆమె రాక పోయినా ఇక్కడికి రానంతకాలం ఆమె కెలా గడిచిందో, అలానే మిగతా జీవితంకూడా హాయిగానే గడుస్తుంది. ఒక వేళ ఆమె రాకపోయినంతమాత్రంతో ఇక రెండో వుపా యం లేదా యేం?—యేదైనా వుపాయం ఆలోచించాలి."

ఈ మాటలేవీ ఉమకు అర్థంకాక అలానే చూస్తూ వూరుకుంది. విస్మయంతో కూడుకున్న ఆమె ముఖాన్ని చూసి "యేం, ఉమా! అలా ఆశ్చర్యంగా చూస్తావేం? ఆమె తిరిగిరావడం నాకేం బాగోలేదు. ఆమెను నేను పెళ్ళి చేసుకున్నంతమాత్రాన-నా సహధర్మచారిణిఅనిమాత్రం చెప్పలేను"—అని శైలేశు అన్నాడు.

ఉమకు విరుద్ధంగా మాట్లాడడం చూసి, క్షేత్రమోహ నుడు సహించలేక 'ధర్మమనేది మన కసలు యెప్పట్నుంచి లేకపోయిందో, అప్పుడే సహధర్మచారిణినికూడా పోగొ ట్టుకున్నాం! మన జీవితాశయాల్ని అనుసరించే సహధర్మ చారిణి కావాలనుకుంటూ, సాంఘికధర్మాల్ని నెట్టివేస్తే సహధర్మచారిణి మన కెక్కణ్నుంచి వస్తుంది ?" అని అన్నాడు.

"అయితే మనకు ధర్మంలేదా."

"ధర్మమెక్కడుందో కొంచెం చూపించు. వ్యాపారం చేస్తున్నాం, తింటున్నాం, ఉద్యోగాలు చేస్తున్నాం,పడుకుంటు

న్నాం. అంతే! ధర్మమెక్కడుంది? సాంఘిక ధర్మాలు, గృహస్థాశ్రమ ధర్మాలూ యెక్కడున్నాయి? అటువంటప్పుడు, మనకు సహధర్మచారిణి లేకపోయినా గడుస్తుంది. కానీ—మన పూర్వీకులున్నారే, వాళ్ళు యజ్ఞయాగాదులుచేసేవాళ్లు. పూజాపాఠాలు చెప్పేవాళ్ళు, తీర్థవ్రతాలు చేసేవాళ్ళు. ధర్మకర్మలకు తలలొంచుతూతిరిగేవాళ్ళు, మెదిలేవాళ్ళు. వాళ్ళకు సహధర్మచారిణి అవసరముండేది! 'సహధర్మిణి' అనేమాటకు వాళ్ళు విలువయిచ్చారు. ఈమాటకోసం మన కింత వ్యాకులమెందుకు? సహధర్మచారిణి లేకపోయినా మనకు కష్టమేమీ లేదు." అని అన్నాడు.

"పూజా పునస్కారాలు, యజ్ఞయాగాదులు, తీర్థవ్రతాలు చేసేవాళ్ళకేనా, సహధర్మచారిణి?" అని శైలేశు అడిగాడు.

"అవునయ్యా! అవును! నేను చెప్పేదిఅదే! ఇంకేమీ కాదు...నువ్వో హిందువుడివే. నేను హిందువుణ్ణే! విత్ఔట్ అఫెన్స్ పూజచేయలేము. మందిరాల్లోకి పోలేము. విష్ణువు, కృష్ణుడు, మొదలైనపేర్లకు లోబడి, భగవంతుళ్ళనుకుని, వాళ్ళ భజనల్లో పడే దురభ్యాసాలు మనకులేవు. ఆడవాళ్ళింకా హార్మ్లెస్‌గా వుంటారు. మన మంతా సరళత్వంగా జీవితాన్ని నడిపేవాళ్ళం. యేంచేస్తాం బావా! మన మంతా అయిదక్షరాలుగల ఇంత పెద్ద 'సహధర్మిణి'ని—సంపాయించుకుని యేంచేస్తాం...మనబోటివాళ్ళకు యెవతో ఒకతి, ఆడదనేదిఉండేచాలు! మనకుజరుగుతుంది... సరేగాని నువ్వో కొంచెం షోకుచేసుకుని తయారవ్వు. భవానిపురంలోని

వాళ్ళు నన్ను యెంతో యిదిగా విసిగిస్తున్నారు. నీ చెల్లెలికికూడా యీ సంబంధమంటే యెంతో ఇష్టంగావుంది. నామాట విను శైలేశ్!"

ముఖం మాడ్చుకుని "నన్నెగతాళిచేస్తున్నావా బావా!" అని శైలేశు అన్నాడు.

సంగతి సందర్భాలు చూసి ఉమ భయపడింది. క్షేత్ర మోహనుడు కూడా భయపడుతూ "కాదోయ్! శైలేశ్ నిన్నలా పరిహాసంచేస్తే, నేనుకూడా పరిహాసపాత్రుణ్ణవుతానుగా!" అని అన్నాడు.

శైలేశు డేమీ మాట్లాడలేదు.

## 15

ఇక యెక్కువ మాట్లాడితే బావుండదనీ, యింకా అయిదారు రోజులు వూరుకుంటే, శైలేశుని కోపం తగ్గిపోతుందనీ, ఆతరువాత యెప్పుడైనా, భవానీపురం వాళ్ళ సంగతి యెత్తవచ్చుననుకునీ, క్షేత్రమోహనుడు ఇంకేమీ మాట్లాడకుండా ఉమతో యింటికి వెళ్ళిపోయాడు.

వారంరోజులు కాకముందే హైకోర్టులో అతనికి ఒక వ్యాజ్యము దొరికితే కలకత్తా వదలి వెళ్ళాల్సివచ్చింది. వెళ్ళేముందు వసునిపత్నిన విభతో "పైకి మన కెంత నిరాశగా కనుపిస్తూవుందో, మనమంత నిరాశపడవలసిన అవసరమేమీ కనుపించడంలేదు. చేప ఆహారంకోసం బైలుదేరింది. గాలానికి తగులుకుందంటే - ఇందులో ఆశ్చర్యపడాల్సిన దేమీ నాకు కనుపించడంలేదు" అని అన్నాడు.

చాలారోజులయ్యాక ఇప్పుడు భార్యతో క్షేత్రమోహనుడు ప్రేమపూర్వకంగా మాట్లాడాడు.

ఉమనోటంట సంగతంతా విన్న విభ "మీరు మీ అక్కాయ్‌గారికి అనుకూలంగా వుంటారనుకున్నాను. కానీ ఇలా మా అన్నగారి పెళ్ళి ఈనెలలో చేసే యేర్పాటు చేస్తారని నేను కలలోకూడా అనుకోలేదు" అని అన్నది.

"ఈ నెలలో అవుతుందని నేననుకోలేదు. కానీ. ఇప్పుడు అయిపోతేనే మంచిదిలా కనుపిస్తుంది. నే నెప్పటికీ ఉష మంచినీ, సుఖాన్నీ కోరేవాణ్ని! యేది కూడదని మన మనుకుంటున్నామో, అది ఏనప్పటికీ లాభంలేదు -ఇక దానికోసం మనం తలలు పగులకొట్టుకున్నప్పటికీ - ఏమొస్తుంది?" అని క్షేత్రమోహనుడన్నాడు.

"మీరు మగవాళ్ళుగనుక మా వదిన స్వభావాన్ని గుర్తించలేకపోయారు. కానీ, నేనామెను మొట్టమొదట చూసినప్పుడే ఆమె యిటువంటిదనే సంగతి కనుక్కున్నాను. ఆమె సంపర్కములో వున్నట్లయితే, మన నిర్వాహకం జరిగేదికాదు.

"విభా! ఇదంతా నేను నా కళ్ళతో చూశాను. యీ అనర్థకాల వత్తిడికి చావలేక ఆమెపారిపోవలసివచ్చింది. పైగా ఆమెను మనమంతా తలో రీతిగా అర్థంచేసుకున్నాము. అదే ఇంకోవిధంగా జరిగివున్నట్లయితే, యిప్పటి సంగతి సందర్భాలు యెలావుండేవో. యేవిధంగా తారుమారయేవో చెప్పడంమాత్రం కష్టం! ఇంతకూ పొరపాటు నావల్ల జరిగిందని వప్పుకుంటాను."

"పోనీయండి!—మీరు మీ పొరపాటు వొప్పుకుంటున్నారు. అదే చాలు. జపతపాలమీదా, ఆచార వ్యవహారాలమీదా, యజ్ఞ యాగాదులమీదా మీకు నమ్మకం కుదిరి అందులో పడిపోయారు. అది చూసి నాకు యెంతో భయమేసింది. మనమంతా ముసల్మానులము కానీ,-క్రిస్టియనులము కానీ కాముగా! అటువంటప్పుడు యితరులునుట్టుకున్న దాన్ని తింటే, మన జాతి పోతుందనీ, యితరులేమన్నా అనుకుంటారనీ భయమెందుకు?—పాతకాలపువాళ్ళలా, సాంఘిక ధర్మాల్ని పట్టుకుని, పాత ఆచారాలతో నడుస్తూవుంటే స్వర్గం ప్రాప్తిస్తుందనీ, యింకోవేపు కొత్తపద్ధతిమీద నడుస్తుంటే నరకాని కీడ్వబడతారనీ మనమెందుకనుకోవాలి? యింతకు పుట్టింటికెళ్తే బాగా జరుగుందనీ, యిక్కడుంటే అలా జరగదనీ ఆమె అనుకుంది."

క్షేత్రమోహనుడు యేమీ మాట్లాడకుండా, భార్య ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో మెల్లగా అక్కడికి ఉమ వచ్చి "అన్నాయ్! యేమిటది!" అని అడిగింది.

విభ మళ్ళీ తన మాటలధోరణిలో మునిగిపోయింది."

"అయితే తన జాతినీ, ధర్మాన్నీ రక్షించుకోవడమే వదినకు పెద్దపనా?. బాగానేవుంది! యీ కారణంతోనే అన్నయ్య ఆమెను తిరస్కరించాడని అనుకోండి! అయినా- వదిన అన్నయ్యచే అవమానించబడినట్లు, మీరుకూడా నన్ను అవమానించలేదా? ఆ అవమానంతో ఆమె వెళ్ళినట్లుగా నేనుకూడా మిమ్మల్ని వదిలిపెట్టి పుట్టింటికివెళ్ళానా? ఇంతకూ మీరు చెప్పేది ఇంతేనా!" అని అడిగింది.

"కాను నేనలా చెప్పను."

'యెప్పటికీ మీ రిలా చెప్పరని నాకు తెలుసు!'' అని ఉమవేపు చూసి 'మీఅన్నగారు ఒక కొత్తవస్తువుపొంక్క-భాగాన్నిచూసి, దాని తళుకుబెళుకులకు . . నిగనిగలకు మన విషయాన్నంతటినీ మరిచిపోయాను. ... హిందూధర్మ శాస్త్రంలో, యే ఆచార నిష్టా నియమాల పాఠం చెప్ప బడివుందో, ఆ పాఠంలోని శిక్ష—మనకందరకూ ప్రాప్తించ లేదు. అయినా మనము తలిదండ్రులవల్ల వుత్తమవిషయాల్ని నేర్చుకున్నాము. అదేమనకు గౌరవమైనది. సత్యమైనదీను'అని కొంచెం నవ్వి'' నువ్వు మీ వుషఅక్కయ్యవద్దనుంచి సంగ తులు నేర్చుకోవాలని మీ అన్నగారి కోరిక! కూర్చుని ఆ సంగతులన్నీ వినడానికి నాకు తీరికలేదుగాని-నువ్వా మెదగ్గర యేమినేర్చుకున్నావో, నేర్చుకోవడానికింకా యేం మిగిలి వుందో అన్నీ మీ అన్నగారిని కూర్చోపెట్టి చెప్పమ్మా!'' అని ఆమె బైటికి వెళ్ళిపోయింది.

తన చెల్లెలుయెదుటనే భార్య మాట్లాడిన మాటలన్నీ బాణాల్లాగా ఆయనహృదయంలో గ్రుచ్చుకున్నాయ్! ఈ మాటల మూలంగా ఆయన బాధపడుతూకూడా జవాబు చెప్పకుండా మెదలకుండా కూర్చున్నాడు.

ఆ నాటిరాత్రి క్షేత్రమోహనుడు బండికెళ్తూ, భార్యను పిలిచి "నేను తిరిగి రావడానికి అయిదారు రోజులుపడుతుంది. యీలోపు భవానిపురంవాళ్ళతో నువ్వుమాట్లాడడం సంభ విస్తే, శైలేశుని ఆ త్రోవకు లాక్కురావడానికి ప్రయత్నిస్తు న్నానని మాత్రం చెప్పు-''అని అన్నాడు.

"అయితే వదినగారు యిక తిరిగిరారా?"

"రాదు. నేనెంతగా ఆలోచించినా, శైలేశునికంటే ఆమెదే ఎక్కువ అపరాధమని తేల్తుంది. నీవు చెప్పేదే నిజం!–ఏ శిష్టమానవులను యింత సంకీర్ణంగా, యింత స్వార్థపరాయణాత్వంగా హృదయంలో మెసలుతుందో, ఆ శిష్టవిలువ ఏ యుగంలోవున్నా దానికి యీనాడు విలువలేదు. దాన్ని తిరిగి మనము పునరుద్ధరించే అధికారంకానీ, అవుసరంకానీ లేదు. యీమాట ముమ్మాటికీ నిజం!–అక్కాయి ఆచారనిష్ట నియమాలతో వుంటుందికాని–అందులో యోగ్యతేమీలేదు. సరే–నేవెళ్తున్నాను" అని అంటూ ఆయన వెళ్ళిమోటారులో కూర్చున్నాడు.

వ్యాజ్యము ఆఖరుచేసి రావటానికి పట్టే అయిదురోజులల్లా పదిరోజులయింది. పదిరోజులు గడిచిపోయింతర్వాత క్షేత్రమోహనుడు ఇంట్లో కాలుపెట్టగానే— చెల్లెలు ఉమ ఎదురైంది. ఆమె అన్నగారిని చూసి–శైలేశుబాబు ఆరునెలల శెలవుమీద ప్రయాగవెళ్ళాడనీ, వెంట సోమేంద్రునికూడా తీసుకవెళ్ళాడనీ–" చెప్పింది.

"అతను ఎందుకిలాగ గబుక్కున వెళ్ళా డమ్మాయి."

నాకేమీ తెలియదు! సోమేంద్రుని తీసుకవెళ్ళడానికి ఇక్కడికి వచ్చినప్పుడు ఆయన్ని అడిగితే, ఇంట్లో ఏమీ బావుండలేదని చెప్పాడు."

విభ గదిలోకి రాబోతూవుంది. ఆమెను చూసీచూడ [illegible]— "ఇంట్లో బాగుండకపోవటం కాగా నేవుండికాదీ.

అతనికి బాగుపడే వుపాయమేమీ లేదు''—అని ఇంకేమేమో
అనబోతూవుంటే విభ నిలుచోవడం చూసి ఆగిపోయాడు.

## 16

జూనియర్ బారిష్టరులకు రోజులెల్లా గడుస్తాయో, క్షేత్రమోహనునికికూడా రోజు లలానేగడుస్తున్నాయ్. యెప్పుడైనా ఖర్చుకు డబ్బు దొరక్కపోతే, అప్పుడతను ప్రాచీనవాదులైన హిందువులకట్టుబాట్లను ప్రశంసిస్తూ, పూర్వపువాళ్ళ జీవితాలే అత్యుత్తమమైనాయి''అని అంటుండేవాడు. అయినా, డబ్బు చేతుల్లో మెదులుతున్నప్పుడు, అతనికి తిరిగి మామూలు వ్యవహారాలు పట్టుకునేవి.

దుర్లభ స్వభావంగల మనిషితో ఎటువంటిపనులున్నా చేయించవచ్చుననే నమ్మకము క్షేత్రమోహనుని కుంది.అందుకని ఆయన భవానీపురంవాళ్ళ సంబంధంలో నిరాశచేసుకోలేదు. శైలేశుడు ప్రయాగనుంచి వచ్చాక అంతా సిద్ధంచేస్తానని, రావడంతోనే లగ్నంనిర్ణయిస్తాననీ, కన్యాపక్షంవాళ్ళకు నచ్చచెప్పాడు. అయినా, ఆయనహృదయంలో వుషమీద ఎంతో శ్రద్ధాప్రేమలూవున్నాయి!''అక్కగారు ఎక్కడవున్నా ఏంచేస్తున్నా ఆమె సుఖంగా వుండాలనీ, ఆరోగ్యంగా వుండాలనీ, శాంతంగా వుండాలనీ, ఆమె ధార్మికజీవితం వుతరోత్తరా వున్నతికావాలనీ''ఆయనమనసులో కోరుకునేవాడు.

యిలా రెండు నెలలు గడిచింది. ఈమధ్యలో ప్రయాగనుంచి ''సోమేంద్రునికి వ్రతబంధసంస్కారం చేయించి, తను ఒక భక్తుడైన వైష్ణవునివద్ద దీక్ష పుచ్చుకున్నాననీ'' శైలేశుని

వద్దనుంచి క్షేత్రమోహనునికి కబురు తెలిసింది. ఈ తండ్రీ కొడుకులు గంగాస్నానం ఒక్కరోజుకూడా తప్పడంలేదనీ, మాంసమూ, చేపలూ ఏ వీథుల్లోకి వస్తాయో, ఆ వీథిలోకి శైలేశుడు కాలుకూడా పెట్టడంలేదని ఆయనకు తెలిసింది.

ఉమ ఇదంతా విని మెల్లగా నవ్వింది.

"మాఅన్నకిలా మతి చెడగొట్టిం దెవరు? —యోగేశ బాబేనా?" అని విభ కోపాన్ని ఆపుకోలేక అడిగింది.

ఈ కబురు యోగేశబాబుగారివద్దనుంచే వచ్చింది. నన్ను గమ్మత్తుగా యేడిపించటానికిగాని, నవ్వులాటకు అనడానికి గాని, ఆయనకు నాకు యెక్కువ స్నేహంలేదు"—అని క్షేత్ర మోహను డన్నాడు.

"యేమైనా కానీయండి! యోగేశబాబంటే అన్నగారి స్నేహితుడే!—నాకు బాగా తెలుసు. మిమ్మల్నాయన గమ్మత్తుచేస్తున్నాడంటే, అందులో విశేష మేముంది.?" అని కొంచెంసేపుండి "ఆయనిలా ఎందుకుచేశాడో మీ కేమన్నా తెలుసా? వదినగారిసంగతంతా అన్నగారివల్ల ఈ విధంగా మిమ్మల్ని గమ్మత్తుచేస్తుంటారు"- అని అన్నది.

అయిదారు రోజులయాక ఒక పెద్ద వుత్తరాన్ని తీసుక వచ్చి, క్షేత్రమోహనుడు భార్యవేపు విసిరివేసి "ఈ ఉత్త రాన్ని యోగేశబాబుతండ్రి వ్రాశాడు. ఆయనగారి వయసు డెబ్భైవుంటుంది. నాకు ఆయనకు అంతగా పరిచయంలేదు. ఉత్తరప్రత్యుత్తరాలవల్ల మాకు స్నేహంకలిగింది. ఇంతకూ ఆయ నెటువంటివాడో అదికూడా నాకు తెలియదు.

అతనుకూడా యీ విషయాన్ని గురించి నన్ను గమ్మత్తు చేస్తున్నాడంటే అదేమంత అందంగావుంటుంది?

ఉత్తరం చాలా పెద్దది. ఇంగ్లీషులో కాకుండా మాతృ భాషలో వ్రాసుంది. విభ ఆ వుత్తరాన్ని మొదటినుంచి చివరవరకు రెండుసార్లు చదివి, ఆ తరువాత ముఖమెత్తి "అయితే చాలా యిదిగానే మారిపోయాడన్నమాట! యిక మీరు అక్కడికి ఒకసారి వెళ్ళిరావాల్సివుంటుంది." అని అన్నది.

"నాకు ఒక నిమిషమన్నా తీరుబడిలేదు"

" అలాఅంటే కాదు. యిటువంటి ఇబ్బందుల్లో మనమే అతనివద్దకు వెళ్ళకుంటే, యింకెవరు వెళ్ళుతారు? ఈ వుత్తరంలో వ్రాసినట్టుగా సగం సంగతులన్నా నిజమైతే చాలు. యెంతో ఇబ్బందిలో వున్నారన్నమాటే"

తలూపుతూ క్షేత్రమోహనుడు "అవును ఈ విషయంలో నేను నీతో ఏకీభవిస్తాను...అయినా ఏవిధంగా వెళ్ళను? వెంటనే మనమెళ్తే ఈ యిబ్బందులన్నీ దూరమవుతాయని నమ్మకమేమిటి?"—అని అన్నాడు.

భార్యాభర్తలిద్దరూ మాట్లాడకుండా చాలాసేపటి వరకూ కూర్చున్నారు. చివరకు ఒక నిట్టూర్పు విడిచి క్షేత్రమోహనుడు "మానసికబలమనే వస్తువు శైలేశునిలో లేనే లేదు. అత నెలాపోయినా ఫర్వాలేదు. కానీ, కుర్రవాణ్ణి కూడా పాడుచేస్తున్నాడనిమాత్రం విచారించాలి!...అదొక్కటే బాధిస్తుంది" అని అన్నాడు.

విభ, విషాదమైన ముఖంతో కూర్చునివుంది. ఏమీ మాట్లాడకుండా చాలాసేపటివరకూ క్షేత్రమోహనుడు

కూర్చోని యింతకూ, అసలు నన్నొక సందేహం మొదట్నుంచీ పీడిస్తూనేవుంది. కానీ విభా!ఒక విషయాన్ని మాత్రం నేను కనుక్కోగలిగాను...నిజంగా నీఅన్న వృషను యెంతో యిదిగా ప్రేమించాడు. సోమేంద్రుని తల్లినికూడా ప్రేమించనంత యెక్కువగా ప్రేమించాడు. యిదంతా అతనిప్రేమకు సాఫల్యంపుఅని అనుకుంటాను" అని అన్నాడు.

విభ కోపంతో "అందుకని ఆమె అలా చేస్తుందా? అలా చేసి అతని మనసును తన వేపుకు ఆకర్షించేందుకు ప్రయత్నం చేస్తుందా?—చూడండి! మా అన్న నిజంగా అతి దుర్బల స్వభావుడేకానీ నీచుడుమాత్రం కాదు......ప్రేమకోసం అతనిలా ప్రతిక్రియచేసే స్వభావ మేమాత్రం అతనిలో లేదు" అని అన్నది.

ప్రతిక్రియ అనే పేరుకి విలువ ఏమిటో అది యెటువంటిదో విభ కేమి తెలుసు? క్షేత్రమోహనుడు ఈ ప్రతిక్రియపదాన్ని గురించి పుస్తకాల్లో చదివుంటే, చదవొచ్చుగాని, అతనికికూడా ఈ సంబంధంలో ఏమీ తెలియదు. అందుకని భార్యకోపానికి అతనేమీ ప్రత్యుత్తర మివ్వలేదు.

ఏది ఎలావున్నా ఆఖరికి విజయము విభకే లభించింది. చివరకు పనంతా వదులుకొని రెండురోజుల్లో ప్రయాగ వెళ్ళేందుకుగాను భర్తను సిద్ధంచేసింది.

అతను ప్రయాగ వెళ్ళి తిరిగివచ్చి అక్కడ జరిగిన సంగతులన్నీ వివరించాడు. "అసలు తనకు శైలేశుని దర్శనము కాలేదని, దర్శనమల్లా ఒక్క సోమేంద్రునిదే అయిం

దనీ, శాస్త్రాల్లో నిర్దేశించబడిన బ్రహ్మచారిలా కుర్రవాడు తయారయ్యాడనీ" అతను చెప్పాడు.

"నన్ను చూడగానే వాడికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్. వాడిముఖం చూస్తుంటే భోజనానికే యిబ్బందిగా వున్నట్లు కనుపించింది" అనికూడా క్షేత్రమోహనుడు చెప్పాడు.

యీ కుర్రవాడిమీద విభకు యెక్కువ ప్రేమ! ఆ మాటలు వినేటప్పటికి కళ్లు నీళ్ళతో నిండినయ్! "మరి వాణ్ణి యెందుకని తీసుకరాలేదు?" అని ఆమె అడిగింది.

"నా కిష్టం కలగలేదు. ఒకవేళ తీసుకవస్తే యేమవుతుందోనని భయంకలిగింది-ధర్మానికి నేను భయపడతాను".

విభ కళ్ళుతుడుచుకుని "ఇలా అవుతుందని నాకు తెలిసుంటే, నేనుకూడా మీ వెంబడి వచ్చేదాన్నే" అని అన్నది.

## 17

ఉత్తర ప్రత్యుత్తరాలు నడవడంకూడా ఒకవిధంగా ఆగిపోయింది. అయినప్పటికీ కలకత్తాలో యెంతమంది బంధువులున్నారో, యెంతమంది మిత్రులున్నారో, వాళ్ళకు శైలేశు ఈవిధంగా మారిపోయినసంగతి తెలిసింది. అక్కడక్కడ అతని మార్పుకు బాగా వుప్పూ, కారం పెట్టి ప్రచారం చేశారు. శైలేశుకు పిల్లనిస్తానన్న వాళ్ళకుకూడా ఈ సంగతి తెలిసింది. విభ సిగ్గుతో ముఖమెవరికీ చూపడంలేదు. కేవలం భర్తముందుమాత్రం "అన్నను తిరిగిరానీయండి, నా యెదుట యెలా చేస్తాడో చూస్తాను" అని అనేది.

భార్య అనే ఈ మాటలకు క్షేత్రమోహనుడు మాటాడేవాడు కాదు. శైలేశుని యేవిధంగానైనా విభ

ప్రకాశించేటట్లు చేయలేదని ఆయనకు తెలుసు. ఐనా, సమాజంలో వుంటున్న నైతిక దబాయింపు అతన్ని లోబరిచేది. దుర్బల ప్రకృతిగల శైలేశుడు ఈవిధంగా యెక్కువకాలం వుండడనీ వొంటరిజీవితం అతని మనస్తత్వానికి పడదనీ అతనికి నమ్మకముంది.

శైలేశుడు కాలేజీనుండి యింకా నాలుగు మాసాల పాటు శెలవు తెప్పించుకున్నాడు. ఈ నాలుగు మాసాలకి యింకా రెండు నెలలుమాత్రం గడువుంది. యేది యేవిధంగా నడిచినా—అతనెంత ధర్మ భక్తిపరాయణుడైనా, కాలేజీని మాత్రం వదలడని క్షేత్రమోహానునికి మంచి నమ్మకం!

ఆనాడు క్షేత్రమోహానుడు టీ త్రాగుతూ త్రాగుతూ యీసారి ఉపక్కయ్య రావడంగాని జరిగితే మళ్ళీ తమ్ముణ్ని పిలిపించుకుని పుట్టింటికి వెళ్ళే ప్రయత్నం చేయడు. జపతపాల్లోనే ఆ రెండు ప్రాణాలూ యెగిరిపోతాయ్!" అని అన్నాడు.

విభ ముఖం మాడ్చుకుని "ఆమె వస్తుందని మీరు విన్నారా?—"అని అడిగింది.

"లేదు"

క్షణంసేపు వూరుకుని విభ మెల్లమెల్లగా "పల్లెటూరి వాళ్లు అనేక విధాలయిన మంత్రతంత్రాలు ప్రయోగిస్తారని విన్నాను. ఈ సంగతుల్ని మీరు నమ్ముతారా?" అనిఅడిగింది.

క్షేత్రమోహానుడు నవ్వుతూ—"లేదు...ఒక వేళ నువ్వు అనుకునే మంత్రతంత్రాలు వున్నా ఆమెమాత్రం అలా చేయదు—"అని అన్నాడు.

"ఎందుకని చేయదేం?—"

"అక్కగారంటే నాకిదివరకున్న శ్రద్ధాభక్తులు ఇప్పుడు లేవు... అయినా ఇటువంటి కుత్సితకర్మలు స్వార్థంకోసం ఆమె ఉపయోగించుకోదు. ఈ విషయాన్నిమాత్రం నేను శపథం చేసి చెప్పగలను—"

విభ నమ్మలేక మెల్లమెల్లగా అంది—"నా. అన్నగారు యెలావున్నా, ఏ పరిస్థితులోవున్నా, ఆయన్ని అక్కణ్ణుంచి లాక్కువస్తానని గట్టిగా చెపుతున్నాను—"

బేరా వచ్చి, బంధు రెండు చాపలడుగుతున్నాడని చెప్పాడు. బంధు శైలేశుడి పురాతనపు సేవకుడు ఆశ్చర్యంగా విభ "చాపలు తీసుకుని యేమిచేస్తాట్ట!" అంటూనే భార్యాభర్తలు బైటికివచ్చారు. వాళ్ళను చూసి బంధు సలాంచేశాడు.

"చాప లెందుకురా బంధూ!"

"తెలియదండి, భజనచేస్తారేమో—"

"భజనెవరు చేస్తార్రా?—"

"దొంగారివెంట నలుగురైదుగురు ఎవరోవచ్చారండి. వారు భజనచేస్తారేమో—?"

"మా అన్నగారు వచ్చారా యేం?—"

క్షేత్రమోహనుడుకూడా ఆదుర్దాగా— "శైలేశుడు వచ్చాడా —" అని అడిగాడు.

తలూపుతూ, రాత్రే అందరూ వచ్చారని — చెప్పి చాపలు తీసుకొని వెళ్ళిపోయాడు.

మరునాడు సాయంకాలము విభను, ఉషను వెంట బెట్టుకుని, శైలేశునియింటికి క్షేత్రమోహనుడు వచ్చాడు.

మామూలు విధంగానే వాళ్ళు శైలేశుని లైబ్రరీగది లోకి వచ్చారు. కానీ, అక్కడి ఆచారవ్యవహారాలు చూసి, బైటనే నిలువబడవలసివచ్చింది. దర్వాజాకు వ్రేలాడదీసిన పెద్ద పరదాగుడ్డను తీసివేశారు. ఆ కారణంతో గదిలోని వస్తువులన్నీ ప్రత్యక్షంగా కనుపిస్తున్నాయ్! యిందులో పుస్తకాల అలమారువున్నది. నిజమే! అయినా మునుపటి వస్తువులలో యే ఒకటికూడా కనుపించలేదు. నేలమీద కంబడి పరచి దానిమీద తెల్లనిగుడ్డ పరచబడివుంది. ఆ పరచబడిన గుడ్డమీద యిద్దరు మనుష్యులు కూర్చునివున్నారు. వాళ్ళు అందంగానే వున్నారు. క్షేత్రమోహనుణ్ణి,విభనూ, ఉమనూ చూసి వారు గాభరాపడ్డారు. వాళ్ళను భయపెట్టడం దేనికని తిన్నగా ముగ్గురూ పైఅంతస్థుకు వెళ్ళబోతూంటే వంటబ్రాహ్మణుడు వాళ్ళను ఆపుతూ– "పైగదిలో యోగి నమ్మవారువుంది వెళ్ళకండి" అని అన్నాడు.

"యోగిని? ఎవ రామె?–"

వంట మారాజు మాట్లాడలేదు.

"మీ దొరగారు ఎక్కడున్నారురా?–" అని క్షేత్ర మోహనుడు అడిగాడు.

వ్రేలితో పైకి చూపించి వంటబ్రాహ్మణుడు వెళ్ళిపోయాడు. క్షేత్రమోహనుడు అక్కడే నిలుచుని, "శైలేశ్— శైలేశ్!" అని పిలిచాడు.

క్షేత్రమోహనుని పిలుపుకు సోమేంద్రుడు పరుగెత్తు కుంటూ వచ్చాడు. అతని వేషభూషణాదులూ ముఖము చూసి, పిఖ యేడ్చింది. నడుముకు తెల్లని ధోవతీ, నొసలుమీద

పెద్దబొట్టూ, మెడలో తులసిపేరులదండలూ వున్నాయి! దూరంనుండే సోమేంద్రుడు వాళ్ళకు నమస్కరించాడు. కానీ, దగ్గరకు రాలేదు. ఉమ అతన్ని యెత్తుకుందామని వెళు తుంటే, క్షేత్రమోహనుడు ఆపి-"ఆగు అమ్మాయి - ఆగు! వేళకాని వేళల్లో వీళ్ళి మళ్ళీ చన్నీళ్ళల్లో ముంచుతారు. "సోమేంద్రా- మీనాన్నగారెక్కడరా?" అని అడిగాడు.

"ప్రభువైన శ్రీగురుదేవునివద్ద కూర్చొని, భాగవతం పారాయణంచేస్తునారు."

"మేమంతా వచ్చి యిక్కడ నిలుచున్నామని, మీ నాన్నగారితో చెప్పనాయనా."

"మీ కేక వారుకూడా విన్నారు, యిప్పుడే వస్తారు. కొంచెంసేపు నిలుచోండి!"

కొన్ని నిమిషాలయాక పావుకోళ్ళు తొడుగుకొని శైలేశు క్రిందికి దిగివచ్చాడు. మామూలు సాదా ధోవతి, సాదా చొక్కా కట్టుకుని, తలమీద ఓచిన్న పిలకతో తయా రయాడు. ఆయన ముఖంలో పరివర్తనమేమీలేదు. ఉమా, విభా ఆయన్ని చూడడంతోనే నమస్కరించారు. శైలేశు దూరంగా నిలుచునే వాళ్ళను దీవించారు.

"కూర్చోవడానికి యింట్లో మీ కెక్కడా బాగా లేదా? అని త్రమోహనుడు అడిగాడు.

"బెటగది కొంచెం మురికిగా వుంది. అది బాగుచే యించాలి."

"అయితే మేము మళ్ళీవస్తాము." అని సోమేంద్రుని వేపు చూస్తూ "ఇక మేము వెళుతున్నాము. మా వల్ల మీ

కిక ఏమీ అవుసరం లేదనుకుంటాను...ఎప్పుడైనా యిక్కడ మాకు కూర్చునేందుకు స్థలమున్నప్పుడు మాత్రం కబురుచేయ్. పదండి'' అని క్షేత్రమోహనుడు అన్నాడు.

శైలేశు యేమీ మాట్లాడలేదు.

బండిలో కూర్చున్నాకకూడా విభ భర్తగారితో యేమీ మాట్లాడలేదు. ఆమె రెండుకళ్ళల్లోంచి జరజర లాడుతూ నీళ్లు బైటికి వచ్చినయ్! అన్న యేంచేసినాసరే, సోమేంద్రునిమాత్రం తను గట్టిగా తీసుకవస్తానని విభ భర్తతో అన్నది! ఈమాటే భార్యాభర్తలకు మాటిమాటికీ జ్ఞాపక మొచ్చినా. -యేమో, యెవరూ మాట్లాడలేదు.

ఆతరువాత ఒక మాసంపైన గడిచింది. ఈ మధ్యలో, శైలేశుని సంగతంతా అతని మిత్రులకు వెల్లడయింది. ఈ వాలకమంతా చూస్తూంటే, విభకు రోడ్డువెంట వెళ్ళడమే యెంతో కష్టమైంది. ఈ పరిస్థితిని తారుమారుచేసే వుపాయ మేమీ ఆమెకు కనుపించలేదు.

ఉమ విషయం చర్చలోకి వస్తే, యిప్పుడు ఒక్క విభకే కోపంగాలేదు. ఉమా, క్షేత్రమోహనుడూ అందరూ అసహ్యించుకుంటున్నారు. అసలు ఆమెను ఈయింటికి తీసుక రాకుండా వున్నట్లయితే యింత గందరగోళం జరిగుండదని వాళ్ళకు నమ్మకం!

సోమవారమునాడు వుదయాన్నే కూర్చుని విభా, క్షేత్రమోహనుడు శైలేశుని విషయంలో మాట్లాడుకుంటు న్నారు. అవమానింపబడినప్పట్నుంచీ వాళ్ళు తిరిగి శైలే శునిముఖం చూడలేదు. ఆయింటికి వెళ్ళకపోయినా. .

వాళ్ళను వెళ్ళి చూడకపోయినా, యెప్పటిసంగతు లప్పుడు తెలుస్తూనే వున్నాయ్! ఆ సంగతులతోపాటు, యింకో క్రొత్తసంగతి తెలిసింది! శ్రీధామమయిన నవద్వీపంలో స్థలంకొని-గురుదేవులు నివసించేందుకు, ఒక ఆశ్రమం కట్టించాలనీ, దానికయే ఖర్చంతా, అప్పుచేసి, చేయిద్దామనీ, శైలేసుడు సంకల్పించుకున్నట్లు వాళ్ళకు తెలిసింది.

"ఈ సంగతే నిజమయితే, యిక పిల్లవాడికి యేమీ ఆధరవు లేదన్నమాట? మనం చూస్తుండగనే మనకళ్ళముందే పిల్లవాడు చెడిపోడా? యిలా అయితే యెలా? వీలా రొకసారి మళ్ళీ అన్నగారిని మందలించండి" అని విభ అడిగింది.

"ఈ విషయంలో నన్నేం చేయమంటావేం?" ఏంచేస్తే-ఏమవుతుందో ఆమెకేం తెలుస్తుంది?

"ఆరోజునుండి తిరిగి మన మక్కడికి వెళ్ళనేలేదు. పద, ఒకసారి వెళ్ళి చూసివద్దాం" అని క్షేత్రమోహనుడు అన్నాడు.

విభ అసలే ఏడుస్తూంది. ఆమెలో మానాభిమానాలు లేవు. అందువల్ల "పదండి" అని అన్నది.

ఈనాడు ఉషను వాళ్లు వెంటతీసుకురాలేదు. వాళ్ళ మోటారు శైలేశుని ఇంటిముందు కొచ్చి ఆగేసరికి పదిగంట లయింది. బైటగది తెరిచేవుంది. గురువుగారి శిష్యులిద్దరు నేలమీద కూర్చొని-మూటను బిగించి కట్టుకుంటున్నారు

"శైలేశుబాబు ఇంట్లోవున్నాడా?" అని క్షేత్రమోహనుడు వాళ్ళను అడిగాడు.

ఆ యిద్దరూ ముఖమెత్తి వారి ముఖంచూసి, కొంచెం సేపు యేదో గుసగుసలాడుకుని "లేరు. మొన్న శ్రీధామమైన నవద్వీపానికి వెళ్ళారు" అని చెప్పారు.

"మళ్ళీ ఎప్పుడు వస్తారేం?"

"రేపో, యెల్లుండో వస్తారనుకుంటాను"

"బాబుగారి కొడుకైనా, యింట్లో వున్నాడా?"

వాళ్ళిద్దరూ తలూపుతూ వున్నారని చెప్పి, తమపనిలో తిరిగి నిమగ్నులయ్యారు.

క్షేత్రమోహన్, విభా-యిద్దరూ ఇంట్లోకి వెళ్ళారు. ఇద్దరి చూపులూ లైబ్రరీగదిదర్వాజా వేపు వెళ్ళినయ్! గది ద్వారానికి వెనుకటిలాగే పరదా వ్రేలాడుతూంది. దాన్ని కొంచెం జరిపిచూడగానే, మామూలువిధంగా యెక్కడి సామానులు అక్కడ వుండడం కనబడింది. అది చూడడం తోనే విభ "ఆ మనుష్యుల నిద్దరినీ వెళ్ళగొట్టి, మళ్ళీ గదిని యెలా అందంగావుంచాడో చూశారా? మళ్ళీ ఈ బుద్ధి వస్తుందని అనుకోలేదు." అని అన్నది.

ఆ మాట పూర్తి కాకముందే, వెనుకనుంచివచ్చిన ఒక శబ్దాన్ని విని, తుళ్ళిపడి ఇద్దరూ నిశ్చేష్టులయ్యారు!

సోమేంద్రుడు యెక్కడికైనా బైటికి వెళ్ళాడేమో మరి, ఒక రబ్బరుబంతి యెగురుతూ యెగురుతూ అక్కడకు వచ్చింది. అందరూ అటువేపు చూశారు. అతనికున్న దండలు యెక్కడికి వెళ్ళినయి! జుట్టెటు పోయింది? వేషంకూడా బ్రహ్మచారిలా లేదు! వంటిమీద యేవిధమైన గుడ్డలూ లేవు. కానీ, నడుముకు మాత్రం ఒక యెర్రంచు జరీపంచె వుంది.

కాళ్లకు చెప్పులూవున్నాయి!-పరుగెత్తుక వచ్చి అతను విభను కౌగలించుకుని, '-అత్తయ్యా! మా అమ్మొచ్చింది. వంట గదిలో వంట చేస్తూవుంది. పద!' అని విభను లాగడం మొదలుపెట్టాడు. విభ నిశ్చేష్టురాలయింది.

క్షేత్రమోహనుడు 'సోమేంద్ర్!-మీఅమ్మగారు మళ్ళీ వచ్చిందా?-అందుకేనా......?' అని ఆగాడు.

'నిన్న మధ్యాహ్నం వచ్చింది. వెళదాం రా మామయ్యా! రా, వంట గదిలోకి వెళ్దాం!'

ముగ్గురూ వంటగదివద్దరకు వెళ్ళారు. పాదాల చప్పుడూ, మాటలధ్వనీ విని ఉష చేతులుకడుక్కుని బైటకు వచ్చింది. ఆమెను చూస్తూనే విభ కాళ్ళకున్న చెప్పులు వదిలి నమస్కరించి, 'చూడు వదినా! ఆఖరికి యెలా మారిందో?'' అని అంది.

ఉష, విభగడ్డాన్ని పట్టుకుని, ముద్దుపెట్టుకొని నవ్వుతూ చూశావమ్మా! పిల్లవాడి ముఖంచూడగానే నాకు ఏడుపు వచ్చింది. అయినా దండలన్నీ ఊడలాగి పారేసి మంగలిని పిలిచి జుట్టు క్రాపుచేయించాను. క్రొత్తధోవతీ, చొక్కా, చెప్పులూ కొని, కట్టిపెట్టాను. ఈ ముస్తాబుచేస్తేనే, అతని ముఖం చూడ బుద్ధిపుట్టింది. సరే, మీరేంచేశారో కొంచెం చెప్పండి?'' అని క్షేత్రమోహనుని అడిగింది.

క్షేత్రమోహనుడు. "అక్కయ్యగారూ! అంత తొం దరపడతారెందుకు. అంతా మెల్లమెల్లగా చెపుతాను.ముందు పైకి వెళ్ళి తినడానికేమయినా వుంటేమో చూడండి...సరే గాని, అక్కా! గురువుగారి శిష్యులిద్దరూ బయిట మాటలు

కట్టుకుంటుంటే చూసివచ్చాను. కానీ-ప్రభుదేవుడైన గురువు గారూ, గురువుగారి భార్యా ఏంచేశారు? యెక్కడికి వెళ్ళారు? వాళ్ళు పైనలేరా-ఏం?" అని అన్నాడు.

ఉష నవ్వుతూ "లేరు, భయపడవలసిన పనేమీ లేదు. శ్రీధామమైన నవద్వీపానికి వారు వెళ్ళిపోయారు" అని అన్నది.

"అయితే, వారు తిరిగిరారా ఏం?"

ఉష అలానే నవ్వుతూ "రారు" అని అన్నది.

"అక్కాయ్! మీలో యింత మంచిగుణముందని నే నెప్పుడూ కలలోకూడా అనుకోలేదు" అని క్షేత్రమోహనుడు అన్నాడు.



# పరిణీత

[శరత్ బాబు]

అనువాదం:

గద్దెలింగయ్య

శరత్ గ్రంథమాల, విజయవాడ.

# పరిణీత

సమ్మోహనాస్త్రం తగిలినప్పుడు లక్ష్మణుని మొహం తప్పకుండా వాడిపోయివుంటుంది. కాని ప్రొద్దున్నే అంతఃపురాన్నుంచి తనభార్య నిర్విఘ్నంగా అయిదో ఆడపిల్లను ప్రసవించినట్లువచ్చినకబురు విన్నప్పుడు గురుచరణునిముఖం అంతకంటె మ్లానంగా కన్పించింది.

గురుచరణుడు బ్యాంకులో అరవైరూపాయలగుమాస్తా కాబట్టి అతనిదేహం బాడుగబండివలె గుర్రంవలె బక్కపలుచగా వుంది. కళ్ళల్లోనూ, మొహంమీదా అదేవిధంగా ఒకరకమైన నిష్కామ నిర్వికార నిర్లిప్తభావం ద్యోతమానమవుతుంది. అయినా ఈ భయంకర శుభవార్తతో ఇవాళ అతని చేతిలోనిహుక్కా చేతిలోనే వుండిపోయింది. చిరిగి శిథిలమైన పిత్రార్జితమగు దిండునానుకొని కూర్చున్నాడు. ఒక్క దీర్ఘ నిట్టూర్పు వదలటానిక్కూడ అతనిలోశక్తిలేకపోయింది.

ఈ శుభవార్తను తెచ్చినది ఆయన మూడో కూతురు అన్నాకాళి. "చూద్దువుగాని రా నాన్నా" అన్నది పిల్ల.

గురుచరణుడు కూతురుమొహంకేసి చూచి 'గ్లాసుతో మంచినీళ్లు తే అమ్మా, తాగుతాను' అన్నాడు.

పిల్ల మంచినీళ్ళు తీసుకవచ్చేందుకు వెళ్ళిపోయింది. అప్పుడు గురుచరణునికి ప్రసవసందర్భంలో అయ్యే వివిధ ఖర్చులవిషయం జ్ఞాపకంవచ్చింది. తర్వాత వత్తిడిరోజుల్లో స్టేషన్‌లోకి రైలురాగానే మూడవతరగతి ప్రయాణీకులు పెట్టెలు, మూటలతో పిచ్చెత్తినవాళ్ళలా జనాన్ని త్రోసు

కుంటూ శ్రోక్కుకుంటూ పెట్టెలోపలికి జొరబడి క్రిక్కిరిసినట్టు ఏవేవో ఆలోచనలు ఆయన బుర్రనిండా వచ్చిపడసాగాయి. క్రితం సంవత్సరం రెండోకూతురుపెళ్ళికి తన ఈ పిత్రార్జిత రెండంతస్థుల యిల్లుకూడ తాకట్టుపెట్టాల్సిరావటం తలపుకొచ్చింది. ఆ అప్పుకి ఆర్నెల్లనుంచీ వడ్డీయే తీర్చలేదు. ఇంకో నెలకు దుర్గాపూజావుత్సవం వస్తోంది. చిన్నమ్మాయికి కానుక పంపాలి.ఆఫీసులో గతరాత్రి జమాఖర్చులు కూడనే లేదు. ఇవాళ పన్నెండు గంటలలోపే విదేశానికి లెక్కలు పంపాలి. మురికి దుస్తులతో ఎవరూ ఆఫీసుకు రాకూడదనీ, అలావస్తే జరిమానా విధించబడుతుందనీ నిన్నదొరగారు ఆజ్ఞాపించారు. ఇక్కడేమొ వారంరోజులనుంచీ చాకలి పత్తాలేడు. ఏమయ్యాడో, ఏమో! ఇంట్లోవున్న బట్టల్లో సగం వాడివద్దే వున్నై. అవి చేతబట్టి వుడాయించాడేమొ! గురుచరణుడి ఆలోచనలతో ఇంక దిండు నానుకొనికూడ కూర్చోలేకపోయాడు. హుక్కా ప్రక్కనపెట్టేసి పడుకున్నాడు. మనసులో అనుకున్నాడు—దేవుడా, ఈ కలకత్తా నగరంలో రోజూ ఎంతమంది గుర్రపుబళ్ళక్రింద, కార్లక్రిందపడి చచ్చిపోవటం లేదు. నీ దృష్టిలో వారు నాకంటె పాపాత్ములా? దయామయా! నీ దయవల్ల ఏ నిండు మోటారులారీ అయినా నా పొమ్మమీదుగా పోగూడదూ!

అన్నాకాళి మంచినీళ్ళు తెచ్చి 'త్రాగు నాన్నా' అంది.

గురుచరణుడు లేచి ఒక్కగుక్కలో సాంతం త్రాగేడు. "అమ్మాయ్, గ్లాసు తీసుకెళ్లు" అన్నాడు.

ఆమె వెళ్ళిపోగానే మళ్లీ పడుకున్నాడు.

లలిత గదిలోకి వచ్చి "మామయ్యా, టీ తెచ్చాను, లే" అన్నది.

టీ కోసం గురుచరణుడు మరోపర్యాయం లేచి కూర్చున్నాడు. లలిత మొఖం చూడగానే ఆయన ఆవేదన సగం తగ్గింది. 'రాత్రంతా మేల్కొన్నావా అమ్మాయ్, రా, నా దగ్గరకొచ్చి కూర్చో' అన్నాడు.

లలిత నవ్వి సిగ్గుపడుతూ వచ్చి కూర్చున్నది. 'రాత్రి నే నెక్కువసేపు మేల్కొనలేదు మామయ్యా' అన్నది.

కృంగి కృశించి అకాలవృద్ధుడైన మామహృదయంలో దాగివున్న విచారాన్ని యీ ఇంట్లో ఆమెకంటె ఇంకెవరూ ఎరుగరు.

"అయితే సరేలే. నువ్వు ఇంకా దగ్గరగా కూర్చో అమ్మా" అన్నాడు గురుచరణుడు. లలిత దగ్గరకువచ్చికూర్చోగానే ఆమె నొసలుమీద చెయ్యేసి 'నా యీ బిడ్డను గొప్పవారియింట్లో ఇచ్చానా, ఒక ఘనకార్యం చేసినట్లే అన్నాడు.

లలిత తలవంచుకొని టీఆరబోస్తుంటుంది. గురుచరణుడు 'ఏం అమ్మాయ్, నీ యీ పేదమామయ్య యింటికొచ్చి నువ్వు రాత్రింబగళ్లు కష్టపడాల్సివస్తోందికదూ?" అనడిగాడు.

లలిత తలాడించుతూ 'రాత్రింబగళ్ళు పనిచేస్తున్నా నెక్కడ మామయ్యా? అందరితో పాటు నేనూ చేస్తున్నా' అన్నది.

గురుచరణుడు నవ్వాడు; టీ తాగుతూ "సరేగ లలితా, ఇవాళ వంటయెలా?" అన్నాడు.

"ఏం మామయ్యా, నేను వండుతాగా"

గురుచరణుడు ఆశ్చర్యంగా అడిగాడు "నువ్వేలా చేస్తానమ్మా, నీకు చేతనవునా!"

"చేతనవును మామయ్యా, అత్త దగ్గర నేర్చుకున్నాను"

గురుచరణుడు టీకప్పు కిందపెడుతూ "నిజంగానా?" అన్నాడు.

"నిజమే. అత్త చూపించి, చెప్తూంటే నేను చాలా సార్లు వండాను. అని లలిత తల వంచుకున్నది. ఆమె తల మీద చెయ్యివేసి గురుచరణుడు మనసులో ఆశీర్వదించాడు. అతని కో పెద్దదిగులు వదిలింది!

వీరి ఇల్లు బజారును ఆనుకొనే వుంది. టీ త్రాగి కిటికీ వంటా బయటికి చూడగానే గురుచరణ్ కేకవేశాడు.

'శేఖర్! నువ్వేనా? రా, ఒకమాట విని పో.'

ఒక పొడుగాటి సుందర యువకుడు లోపలికివచ్చాడు.

'నాన్నో, ఇవాళ తెల్లవారేప్పటికి మీ పిన్ని చేసినపని విన్నావు కదా!' అన్నాడు గురుచరణుడు.

శేఖర్ చిర్నవ్వునవ్వుతూ 'ఏంపనిచేసింది? ఆడపిల్ల పుట్టింది, ఇదేనా?' అన్నాడు.

గురుచరణ్ ఒక దీర్ఘనిశ్వాసవదలి 'నువ్వు 'ఇదేనా' అంటున్నావు. కాని ఆ ఇది' ఏమిటో నాకే తెలుసు.'

'అలా అనవద్దు బాబాయ్, పిన్ని వింటే చాలా దుఃఖ పడుతుంది. అదీగాక భగవంతుడు ఎవర్నియిస్తే వారినే ప్రేమతో స్వీకరించాలి.'

గురుచరణుడు ఒక క్షణం మౌనంగావుండి 'ప్రేమగా స్వీకరించాల్సిందేనని నేనూ ఎరుగుదును. కాని, అబ్బాయి

దేవుడూ న్యాయంచెయ్యడంలేదు. నేను పేదవాడినిగదా, నా ఇంట్లో ఇంతమంది ఎందుకూ? ఈ తలదాచుకొనే ఇంటిని కూడ మీ నాన్నకు తాకట్టుపెట్టాను. అయినా నాకు ఇందు కేమీ విచారంలేదు, శేఖర్! కాని మా లలిత విషయమే ఆలోచించి చూడు బాబూ! తల్లీ తండ్రీకూడ లేరు. బంగారు ప్రతిమే ననుకో. పిల్ల గొప్పింట్లోనే రాణిస్తుంది. ఇలాంటి పిల్లని ఎవరికి అప్పగించను చెప్పు? రాజకిరీటంలో మెరిసి పోయే కోహినూరులాంటి రత్నాలతో తూచినాకూడ నా బిడ్డవిలువ తేలదు. కాని ఈ సంగతి ఎవరికి తెలుస్తుంది? ధనా భావం వల్ల ఇలాంటి రత్నాన్నికూడ కోల్పోవాల్సివస్తుంది. మరి ఇది గుండెలో ఎలా గుచ్చుకుంటుందో నువ్వే చెప్పు నాయనా! పదమూడేళ్లు వచ్చాయి. అయినా నా చేతిలో పదమూడుకానాలైనా లేవు. మరెలా సంబంధం కుదిర్చేది?'

ఆయనకళ్ళల్లో నీరుక్రమ్మింది. శేఖర్ మెదలకుండా కూచున్నాడు. గురుచరణుడు మళ్ళీ చెప్పనారంభించాడు.

'శేఖరనాథ్, చూడు బాబూ, నీ స్నేహితుల్లో ఎవరైనా ఈ పిల్లను గట్టెక్కిస్తారేమో. ఈ రోజుల్లో చాలమంది కుర్రవాళ్లు డబ్బే ప్రధానమనుకోక, పిల్లనిచూచి చేసుకుంటున్నట్లు విన్నాను. అలాంటిపిల్లవాడెవరేనా అదృష్టవశాత్తు దొరికితే, నేను నీతో నిజం చెబుతున్నాను శేఖర్, నా ఆశీర్వాదంతో నువ్వు రాజావైపోతావు. మీ నాన్నగారూ నన్ను తమ్ముని లాగే చూస్తున్నారు. ఇంకేం చెప్పను. బాబూ!'

శేఖర్ తలూపి 'సరే, నేను వెదుకుతానులే'అన్నాడు.

మర్చిపోయేవు నాయనా, ఒక కన్నుంచి చూడు. లలిత ఎనిమిదేళ్ళప్పటినుంచీ నీ వద్దే చదువుకుని పెద్దదయింది. ఎంత తెలివిగల పిల్లో, ఎంత శాంతంగలదో నీకే తెలుసు. కాస్తంత వుందో లేదో ఇదే ఇప్పట్నుంచీ ఇంట్లో వంటచేసి, వడ్డించటం కూడాను. అంతా తనే సంబాళించుతోంది.'

లలితఒకసారి తలెత్తిచూచి మళ్ళీ దించేసుకున్నది. గురుచరణుడు నిట్టూర్చి 'దీని తండ్రిమాత్రం తక్కువవ్యాపారం చేశాడా! కాని తన కూతురుకైనా దమ్మిడీ మిగల్చకుండా అంతా దాన-ధర్మాలు చేసిపోయాడు.'

శేఖర్ మౌనంగావుండగా ఆయన మళ్ళీ చెపుతూనే వున్నాడు-'ఏమీ మిగిల్చిపోలేదనీ అనటానికి వీల్లేదు. ఆయన ఎందరి కష్టాల్లో నివారించి వాటి ఫలితాన్ని ఈ బిడ్డకోసం విడిచిపెట్టిపోయాడు. కాకపోతే ఇంత చిన్నపిల్లప్పుడే ఇటువంటి అన్నపూర్ణ అవుతుందా! నువ్వే చెప్పు శేఖర్, నిజమంటావా లేదా!''

శేఖర్ నవ్వుతాడుగాని మాట్లాడడు.

అతను లేవబోతుంటే గురుచరణుడు 'పొద్దున్నే ఎక్కడికెడుతున్నావు?' అనడిగాడు.

"బారిష్టరుగారి ఇంటికి. కేసొకటి వుంది" అంటూ శేఖర్ లేచి నిలబడతాడు. గురుచరణుడు మరోసారి జ్ఞాపకంచేస్తూ "కాస్త మనసులో వుంచుకో బాబూ, లలిత చూడటానికి చాయనచాయే గాని, ఇలాంటి కళ్ళు, మొహం, ఇంత జాలిగుండె, ప్రేమహృదయం ప్రపంచంలో వెతికినా దొరకవు!" అన్నాడు.

శేఖర్ తలూపుతూ, నవ్వుతూ వెళ్ళిపోయాడు.

ఈ అబ్బాయి వయస్సు ఇరవైఅయిదు - ఇరవైఆరే ళ్ళుంటుంది. ఎం ఏ. ప్యాసై ఇంకా ఏదేదో చదువుతూ వచ్చాడు. నిరుడే అటర్నీ అయ్యాడు. ఇతనితండ్రి నవీన చంద్రుడు బెల్లంవ్యాపారంలో లక్షాధికారి అయి, కొద్ది సంవత్సరాలనుంచీ ఆ వ్యాపారం మాని వేసి వడ్డీవ్యాపారం చేస్తున్నాడు. ఆయన పెద్దకొడుకు అవినాశచంద్రుడు వకీలు. చిన్నవాడు అటర్నీ అని చెప్పాంగదా. వారి మూడంతస్తుల విశాలోన్నతసౌధం ఆ పేటలోకల్లా యెత్తయినది. గురుచరణుని ఇంటిప్రక్కనేవుంది. రెండు మిద్దెలూ కలిసిపోయినవి. రెండుకుటుంబాలు చాలా అన్యోన్యంగావుంటూ ఆడవాళ్లు మిద్దెలపైగానే ఒకరింటి కొకరు వచ్చి పోతూండేవారు.

## 2

శ్యామ్ బజారులోని ఒక ఘరానా కుటుంబంలోని పిల్లని శేఖర్‌కు పెళ్ళిచెయ్యాలని చాలాగోజులుగా రాయబారాలు జరుగుతున్నై. వారు శేఖర్‌ని చూడడానికి వచ్చి వచ్చే మాఘమాసంలో శుభదినం చూచి వివాహం ఖాయ పర్చుకుందా మనుకున్నారు. కాని, శేఖర్ తల్లి అందుకు ఒప్పుకోలేదు. "పిల్లవాడు స్వయంగా పిల్లనుచూచి యిష్టపడితేనే ఖాయపర్చుకోవచ్చని దాసితో చెప్పింది. నవీనచంద్రుని దృష్టి డబ్బుమీదే వున్నందున, తనభార్య మధ్యలో సందిగ్ధంగా పంపిన కబురువిని విసుక్కొని "అదేమన్న మాట? పిల్ల ఎరుగని దేమీ కాదుగదూ? ఇప్పుడు ఖాయపర్చు... ప్రధానంనాడు బాగా చూచుకోవచ్చు" అన్నాడు.

అయినా ఆమె ఖాయపర్చనివ్వలేదు. భర్తకు కోపం వచ్చి చాలా ప్రొద్దెక్కగాని భోంచేయలేదు. మధ్యాహ్నం యింట్లోకే రాలేదు.

శేఖర్‌నాథ్ శాస్త్ర సరదాపురుషుడు. మూడో అంతస్తులో అతనువుండే గది చక్కగా అలంకరింపబడివున్నది. అయిదారు రోజులతర్వాత అదేగదిలో నిలువుటద్దం ముందు నిలబడి శేఖర్ తయారవుతున్నాడు పిల్లను చూచిరావడానికి. ఇంతలో లలిత లోపలికివచ్చింది. కాస్సేపు మెదలకుండా నిలబడి చూచినతర్వాత 'వధువును చూడటానికి వెళ్తున్నావా?' అనడిగింది.

శేఖర్ వెనక్కి తిరిగి ఆమెవంకచూస్తూ అన్నాడు. 'వచ్చావా? మంచిదే. పెళ్ళికూతురుకు నచ్చేటట్లు నన్ను బాగా అలంకరించు.'

లలిత పక్కున నవ్వింది. 'నాకిప్పుడు తీరికలేదు బావా! నేను డబ్బుకోసం వచ్చాను' అంటూనే తలగడక్రింద తాళం చెవి తీసుకొని డ్రాయరు తెరిచింది. లెక్కపెట్టి కొన్నిరూపాయలు తీసుకొని కొంగున కట్టుకుంటూ 'కావలసినప్పుడల్లా తీసుకెడుతూనే వున్నాను గాని, తీర్చేదెల్లాగో? తనలో తాననుకున్నట్లు మెల్లగా అన్నది.

శేఖర్ జుట్టు అదోవిధంగా పైకిలేపి దువ్వుకుంటూ అటు తిరిగి 'తీరుతుందా? తీరిపోతుందా?' అన్నాడు.

లలిత కేమీ అర్థంకాలేదు. చూస్తూ వుండిపోయింది.

'చూస్తావేమిటి, అర్థంకాలేదా?'

'లే' దని లలిత తలాడించింది.

'ఇంకా పెద్దదానవైతే అప్పుడు తెలుస్తుంది?' అని శేఖర్ చెప్పులుతొడుక్కొని వెళ్ళిపోయాడు.

రాత్రి శేఖర్ మంచంమీద పడుకొని వున్నాడు. తల్లివచ్చి పక్కనే కూర్చునేసరికి అతను చప్పున లేచి కూర్చు న్నాడు 'పిల్ల ఎలా వుందిరా అబ్బాయ్, చూచివచ్చావా?' అనడిగింది?

శేఖర్ తల్లి పేరు భువనేశ్వరి యాభైయేళ్ళ ప్రాయం. చక్కని గట్టిశరీరమేమొ ముప్పైఅయిదు ముప్పై ఆరేళ్ళకు మించి వున్నట్టుండదు. ఆ సుందరమూర్తిలోవున్న మాతృ హృదయం మరీ కోమలమైనది.ఆమె పల్లెటూరి పడుచు. పల్లె టూళ్ళోనే పెరిగి పెద్దదయింది. అయినా పట్టణవాతావర ణంలోకూడ ఎన్నడూ రాణించకపోలేదు. బస్తీ సజీవ త్వాన్ని, చంచలత్వాన్ని, ఆచార వ్యవహారాల కెంత సులు వుగా అలవడిపోయిందో అట్లే జన్మస్థానమందలి, నిస్తబ్ధమాధు ర్యాన్ని కోల్పోకుండా నిలబెట్టుకున్నది. తన తల్లి శేఖరున కెట్టి గర్వహేతువో ఆ తల్లికిమాత్రం తెలియదు. భగవం తుడు శేఖర్‌కి అనేకం. అసాధారణస్వాస్థము, రూపము, ఐశ్వర్యము, బుద్ధి -- అన్నీ ఇచ్చినా, అతడు ఆ తల్లి కడుపున పుట్టిన అదృష్టాన్నే భగవంతుడు తనకు ప్రసాదించిన సర్వో త్తమదానంగా ఎంచుకున్నాడు.

"బాగానేవున్నదని వూరుకున్నావేంరా?" అన్నది తల్లి.

శేఖర్ మందహాసంచేసి క్రిందికిచూస్తూ "నువ్వడిగిన దానికి చెప్పానూ" అన్నాడు.

తల్లికి నవ్వొచ్చింది. "ఎక్కడ చెప్పావు? రంగు ఎలా

వుంది? ఎరుపేనా? ఎవరిలా వుంటుంది? మన లలితకును లేనా? అని అడిగింది.

శేఖర్ మొహమెత్తి చెప్పాడు—లలిత నలుపు గదమ్మా, అంతకంటె ఎరుపే

"కళ్ళు, మొహం ఎలావున్న?"

"అసహ్యంగా లేవు."

"అయితే మీనాన్నగారితో చెప్పనా?"

శేఖర్ మాట్లాడలేదు.

తల్లి ఒకక్షణం కొడుకు మొహంకేసి చూచి "ఏంరా అబ్బాయ్. పిల్ల చదుకున్నదేనా?" అనడిగింది మళ్ళీ.

"ఆ సంగతి నే నడగలేదమ్మా!"

తల్లి ఆశ్చర్యపడి "ఎందుకని అడగలేదురా? ఈ రోజుల్లో మీకు అన్నిటికంటె ముఖ్యమైనదే అడక్కుండా వూరుకున్నావా?" అన్నది.

శేఖరుడు నవ్వి "లేదమ్మా, నాకది తోచనేలేదు" అన్నాడు.

ఈసారి కుమారుని జవాబువిని తల్లి మరింత విస్మితురాలై అతనిముఖంచూస్తూ వుండిపోయింది, తర్వాత నవ్వి "అయితే నువ్వా పిల్లని పెళ్ళిచేసుకోవన్నమాట?" అన్నది.

శేఖరుడు ఏమో చెప్పబోతూన్నాడు గాని, అంతలోలలిత రావటంవల్ల మెదలకుండా వూరుకున్నాడు. లలిత మెల్లగా వచ్చి భువనేశ్వరివెనుక నుంచున్నది. ఆమెను చేత్తో ముందువేపుకు లాగి "ఏమిటే అమ్మాయ్!" అనడిగింది.

"ఏమీలేదు అమ్మా!" అన్నది లలిత.

లలిత మొదట్లో భువనేశ్వరిని పెద్దమ్మా అని పిలిచేది కాని ఆమె "నేను నీకు పెద్దమ్మనుకాదు, అమ్మనే" అనటం వల్ల లలిత ఇంక*'అమ్మా' అనే పిలుస్తుండేది. భువనేశ్వరి లలితను మరింత దగ్గరకు లాక్కొని ప్రేమతో 'ఏం లేకపోతే నన్ను చూడటానికే వచ్చావా?' అన్నది.

లలిత మౌనంగా వున్నది.

"చూడటానికివస్తే అక్కడ వంట ఎవ్వరు చేస్తుంది?" అన్నాడు శేఖరుడు.

"వంటెందుకు చేస్తుంది?" అన్నది తల్లి.

"లేకపోతే వారియింట్లో వంట ఇంకెవరు చేస్తారు అమ్మా? వంట-మిగతాపనులు ఈమె చేస్తున్నదని వాళ్ళ మామయ్య చెప్పాడు."

తల్లి నవ్వి అన్నది .."ఈమెమామమాటల కేమొచ్చెలే. నోటికి వచ్చింది అనేస్తాడు. ఇంకా పెళ్ళైనా కాలేదే దీనిచేతికూడు ఎవరుతింటారే? మన వంటావిడను పంపాను. అదే వండిపెడుతుంది. మన యింట్లో సువారం మీా వదిన చేస్తోంది."

ఆ పేద కుటుంబాన్ని తన తల్లి ఆదుకుంటున్నదని గ్రహించి శేఖరుడు సంతోషించి మిన్నకుండిపోయాడు.

నెలరోజుల తర్వాత ఒకనాటి సాయంత్రం శేఖరుడు తన గదిలో మంచంమీాద పడుకుని ఏనో ఇంగ్లీషు నవల చదువుకుంటున్నాడు తదేకంగా. అదేసమయంలో లలిత వచ్చి దిండుక్రింద తాళంచెవుల గుత్తిని ధ్వనిచేస్తూ తీసి,

*వంగదేశంలో కోడళ్ళు అత్తను అమ్మ అని పిలుస్తారు.

సాగుగు తెరుస్తోంది. శేఖర్ పుస్తకంలోంచి దృష్టి మరల్చకుం డానే 'ఏమిటి?' అన్నాడు.

'డబ్బు తీసుకుంటున్నాను.'

'హుఁ' అని మళ్ళీ చదువుకుంటున్నాడు. లలిత రూపా యలు కొంగున కట్టుకొని లేచింది. ఇవాళ ఆమె బాగా అలం కరించుకొని వచ్చింది. శేఖర్ తనవేపు చూడాలని ఆమె కోరిక. "పదిరూపాయలు తీసుకున్నాను బావా!" అన్నది.

"సరేలే" అన్నాడేగాని శేఖరుడు ఆమెవంక చూడనే లేదు. కాబట్టి ఇంకేవుపాయమూ తోచక ఆమె అదీ ఇదీ సర్ద సాగింది. ఈవిధంగా కాస్సేపు అక్కడే కాలయాపన చేస్తు న్నది. కాని ప్రయోజనమేమీ లేకపోయినందున ఇంక ఆమె మెల్లగా బయటికివెళ్ళిపోయింది, అయినా వెళ్ళలేకపోయింది. వెనక్కి తిరిగివచ్చి ద్వారంవద్ద నిలబడింది. ఇవాళ ఆమె మిగతావారితో సినిమాకు వెళ్ళాలి.

శేఖరునితో చెప్పకుండా ఏనాడూ ఎక్కడికీ వెళ్ళలేదు. అలా చెయ్యమని ఆమె కెవరూ చెప్పింది కాదు. ఎందుకు చెప్పాలని ఆమె మనసులో ఎన్నడూ తర్కించనూలేదు. ప్రాణులకు సహజంగావుండే బుద్ధే ఆమె కలానేర్పింది. ఇంకె వరు ఎక్కడికి వెళ్ళినా, ఏంచేసినా ఆమె మాత్రం వెళ్ళ లేదు, చెయ్యలేదు. ఆమె స్వతంత్రురాలు కాదు, అత్తమా మల అనుమతే చాలదు, తలుపుచాటునుంచి ఆమె "మేము సినిమాకి వెడుతున్నాము" అని చెప్పింది మెల్లగా.

ఆమె మృదుస్వరం శేఖరునికి విన్పించనేలేదు.

లలిత మళ్ళీ కాస్త బిగ్గరగా చెప్పింది. 'అంతా నా కోసం నిలబడివున్నారు.'

శేఖరుడు ఈసారి విన్నాడు. పుస్తకం ఒకప్రక్కన పెట్టి 'ఏమిటి?' అనడిగాడు.

లలిత కొంచెం కోపగించుకున్నట్లు 'ఇప్పటికి వినపడిందా? మేము సినిమాకి వెళ్తున్నాము' అన్నది.

'మే మంటే ఎవ రెవరు!'

'నేను, అన్నాకాళి, చారుబాల, ఆమెమామయ్య'—

'ఆ మామయ్య ఎవరు?'

"ఆయన పేరు గిరీంద్రబాబు. ముంగేరునుంచి వచ్చారు. అయిదురోజు లయింది. ఇక్కడ బి. ఏ. చదువుతారు. మంచివాడే"

"భేష్! పేరు వూరు వ్యవహారం బాగా పరిచయమైనట్టుందే! ఇందువల్లా ఈ నాలుగైదురోజులనుంచీ కంటికే కనపడడంలేదు! చీట్లపేక ఆడుకుంటున్నారు కాబోలు!"

అకస్మాత్తుగా శేఖర్ మాట్లాడేవిధంచూచి లలిత భయపడింది. అలాంటిప్రశ్న వస్తుందనే ఆమె వూహించలేదు. మెదలకుండా వుండిపోయింది.

"ఈమధ్య చీట్లాట జోరైందికదూ?"

లలిత ఎదురుగుటకమింగి "చారుచెప్పిందా" అన్నది మృదువుగా.

"చారు చెప్పింది. ఏం చెప్పంది?" అని శేఖరుడు తలెత్తి చూచి 'ఓ! డ్రెస్సువేసుకొని అలంకరించుకొనే వచ్చావన్నమాట! సరే వెళ్ళు' అన్నాడు.

లలిత కదలకుండా అక్కడే నిలబడివుంది.

పక్కింటి చారుబాల లలితకు సమవయస్క, స్నేహితురాలూను. వారు బ్రహ్మసమాజికులు. గిరీంద్రుడు మినహా మిగతావారి నందరిని శేఖర్ ఎరుగును. గిరీంద్రుడు అయిదారేండ్లక్రితం ఎప్పుడో ఒకసారి యిక్కడికి వచ్చాడు. ఆ తర్వాత అతను బాంకీపూరులో చదువుతున్నాడు. ఇంక కలకత్తా రావలసిన అగత్యంలేక రానేలేదు. కాబట్టి శేఖర్ అతన్నెరుగడు. ఇంకా లలిత నిలబడేవుండటం చూచి "ఇంకా నటన ఎందుకు? వెళ్ళు" అని పుస్తకం తీసుకున్నాడు.

ఐదు నిమిషాలు అలాగే నిలబడుండి 'వెళ్ళనా?' అని మళ్ళీ అడిగింది లలిత.

"వెళ్ళమన్నానుగా లలితా"

శేఖర్ తీరుచూచి లలితకు సినిమా చూడాలన్న అభిలాష అంతరించిపోయింది. కాని వెళ్ళకుండా వుండడానికీ వల్లకాదు. అందరూ వెళ్ళాలనీ, సగంఖర్చు లలిత సగం చారుబాలమామయ్య భరించాలనికూడ నిర్ణయించుకున్నారు.

చారుబాలయింట్లో అందరూ ఆమెకోసం ఆతురతతో నిరీక్షించుతున్నారు. జాగవుతున్నకొద్దీ వారు వేగిరపడుతున్నారు. ఇది లలితకు తెలుసు. కాని ఎంత వెదికినా వుపాయమే కానరావటంలేదు. అనుమతిలేకుండా వెళ్ళగల సాహసమూ లేదు. రెండుమూడునిమిషాలాగి "ఇవాళ్టికే...మరి వెళ్ళనా?" అనడిగింది ఇంకోసారి.

శేఖర్ పుస్తకం అవతలకు గిరవాటేసి "నన్ను విసిగించమాకు లలితా, వెళ్ళాలనుకుంటే వెళ్ళు; మంచి చెడ్డలు తెలుసుకోదగ్గవయస్సు వుందిగా నీకు" అన్నాడు.

లలిత ఉలిక్కిపడింది. శేఖర్ వల్ల చీవాట్లుతినడం ఆమెకు క్రొత్తేమీకాదు. అది ఆమెకు అలవాటే. కాని రెండు మూడు సంవత్సరాలనుంచీ ఆమె ఇలాంటిఅదలింపు ఎన్నడూ విన్లేదు. అక్కడ మిత్రులు ఎదురుచూస్తున్నారు. తానూ బట్టలువేసుకొని సిద్ధంగానేవున్నది. డబ్బుకోసంవచ్చి ఇక్కడ ఈప్రమాదంలోపడింది. ఇప్పుడు వారితో ఏమని చెపుతుంది. ఎక్కడికైనా వెళ్ళటం, రావటం విషయంలో శేఖర్ అభ్యంతరమేమీ వుండేదికాదు. ఆ ధైర్యంతోనే అంతా సిద్ధమై వచ్చింది.ఇప్పుడామె స్వతంత్రతకేభంగంకల్గిందనికాదుగాని, ఇలా జరగటానికి కారణం సిగ్గుచేటే. పదమూడేళ్ళ వయస్సులో మొట్టమొదటిసారిగా ఇది అనుభవమై ఆమె అంతరంగంలో కృంగిపోతున్నది. స్వాభిమానంతో కంట నీరుపెట్టి మరో అయిదునిమిషాలు మెదలకుండా నుంచొని, కళ్ళుతుడుచుకుంటూ మెల్లగా వెళ్ళిపోయింది. ఇంటికిపోయి దాసిని పంపి అన్నాకాళిని పిల్పించి ఆమెచేతికి డబ్బిచ్చి "ఇవాళ మీరు వెళ్ళండి కాళీ, నాకు ఒంట్లో బాగుండలేదు. నేను రాలేనని స్నేహితులతో చెప్పు" అన్నది.

"సుస్తీచేసిందా వదినా?" అన్నది అన్నాకాళి.

"తలనొప్పిగావుంది. కడుపులో త్రిప్పుతోంది. ఏం బాగుండలేదు" అని చెప్పి పక్కమీద ఒత్తిగిలి పడుకున్నది. తర్వాత చారు వచ్చి ఎన్నో చెప్పింది. మొండిపట్టు పట్టింది, మేనత్తతో చెప్పించింది. కాని లలిత నేవిధంగాను ఒప్పించు తీసుకెళ్ళలేకపోయింది.

పదిరూపాయలు చేతిలోకి రావటంతో అన్నాకాళి వెళ్లేందుకు కొట్టుకుంటోంది. ఈ గొడవవల్ల వెళ్ళడమే జరు

గదేమోనన్న భయంతో చారుబాలను అవతలికి తీసుకెళ్లి రూపాయలు చూపిస్తూ "వదినకు బాగుండలేదులే. ఆమెరాక పోతేమాత్రం ఏం? మనం వెళ్దాంవదినా" అన్నది అన్నాకాళి. ఈడులో చిన్నదైనా తెలివితేటల్లో ఎవరికీ తీసిపోదని చారు గ్రహించింది. ఆమె యిష్టపడి అన్నాకాళితో వెళ్లిపోయింది.

## 3

చారుబాల తల్లి మనోరమకు చీట్లాటకంటే ప్రియమైన దేదీలేదు ప్రపంచంలో. కాని ఆటయందు ప్రీతివున్నంత నైపుణ్యం మాత్రంలేదు. ఆమెలోపాన్ని లలిత సర్దుకుపోతూండేది. లలిత అతినేర్పుగా ఆడేది. మనోరమ మేనమామకొడుకు గిరీంద్రుడు వచ్చినప్పట్నుంచీ వారియింట్లో రోజూ మధ్యాహ్నం చీట్లాట జోరుగా సాగుతున్నది. గిరీంద్రుడుమగవాడు. చాలాబాగా ఆడేవాడు. కాబట్టి అతనికి ప్రతిపక్షంలో మనోరమకు లలిత తప్పకుండా వుండాలి.

సినిమాచూచిన మర్నాడు యథాసమయానికి లలిత తమయింటికి రాకపోయేసరికి మనోరమ దాసిని పంపింది. పిల్చుకొనిరమ్మని లలిత అప్పుడే ఏదో ఇంగ్లీషునుంచి అనువాదంచేస్తోంది. కాబట్టి వెళ్ళలేదు.

చెలికత్తెవచ్చికూడ ఏమీ చేయలేకపోయింది. చివరకు మనోరమ తానే వచ్చింది పుస్తకాలు, కలం లాగి ఒక ప్రక్కకు విసిరేసి "పెద్దదానవై మేజిస్ట్రేటువు అయిపోవులే. రా రా" అన్నది.

లలిత లోలోపల సందిగ్ధావస్థలో పడింది. బిక్కమొహంవేసి "ఇవాళ రావటానికి వీల్లేదు, రేపు వస్తాలే" అన్నది.

మనోరమ వూరుకుంటుందా? మేనత్తతో చెప్పించి తీసుకెళ్ళకుండా వదల్లేదు. ఇవాళకూడా ఆమె గిరీంద్రునికి ఎదురుగా చీట్లాడవలసివచ్చింది. కాని, ఆట రక్తికట్టలా, లలిత మనసుంచి ఆడలేకపోయింది. వున్నంతసేపూ విచారంగానేవుంది. కొంచెంసేపటికే వెళ్ళటానికి లేచింది. వెళ్ళేప్పుడు గిరీంద్రుడు ఆమెతో "నిన్న డబ్బు పంపావుగాని, నువ్వు రానేలేదు, మళ్ళీ రేపు మాపిటికి వెళ్దాం" అన్నాడు.

లలిత తలాడించుతూ "వద్దు. ఆరోగ్యం బాగుండలేదు" అన్నది.

"ఇప్పుడు బాగానేవున్నదిగా. తప్పకుండా వెళ్దాం" అన్నాడు గిరీంద్రుడు నవ్వుతూ మళ్ళీ.

"వద్దు వద్దు. రేపు నాకు తీరికేవుండదు" అంటూనే లలిత వెళ్ళిపోయింది. ఇవాళ శేఖర్ భయంవల్లనే ఆటలో మనసు నిల్వలేదనుకోటానికి వీల్లేదు. ఆమె కసలు సిగ్గుగానేవున్నది.

శేఖర్ యింట్లోవలెనే ఆమె వీరియింటికి చిన్నప్పట్నుంచీ వచ్చిపోతుండేది. తతిమ్మావారితో కలసిమెలసివున్నట్లే ఇక్కడా చనువుగా వుంటూండేది. కాబట్టే గిరీంద్రునితో మాట్లాడటానికీ, ఆడటానికి ఆమెకు సంకోచం వుండేదికాదు. కాని ఇవాళ గిరీంద్రునిఎదుట కూర్చుని చీట్లాడేటప్పుడు మొదట్నుంచి చివరిదాకా గిరీంద్రుడు ఈకొద్దిరోజుల పరిచయంతోనే తన్నేదో ప్రత్యేక ప్రేమతో చూస్తున్నట్లనిపించింది. పురుషుని ప్రేమవీక్షణం ఎంత లజ్జాకరమో ఆమె ఇంతకుముందెన్నడూ ఊహించనేలేదు.

ఇంటివద్ద కొంచెంసేపు కన్పించగానే ఆమె శేఖర్ యింటికివెళ్ళి అతని గదిలోకి చేరుకుని సర్దటం మొదలుపెట్టింది. చిన్నప్పట్నుంచీ ఈ గదిలోని చిన్న పెద్ద పనులన్నీ ఆమె చేస్తున్నది. పుస్తకాలుతీసి సరిగా సర్దటం, బల్లలు, కుర్చీలు తుడవటం, కలం, సిరాబుడ్డి దగ్గిరా సిద్ధంగావుంచటం ఇలాంటివన్నీ ఆమెతప్ప ఇంకెవరూ చేసేవారుకాదు. ఏడెనిమిది రోజుల నిర్లక్ష్యంవల్ల అంతా చిందరవందరగావుంది. ఎక్కడివక్కడ అన్నీ శుభ్రంగా తుడిచి శేఖరుడు రాకముందే సర్ది వేయాలని మొదలుపెట్టింది.

ఏమాత్రం తీరికవున్నా లలిత భువనేశ్వరివద్దకు వచ్చి కూర్చునేది. ఈ యింట్లో అందరితోను కలిసిమెలసి వుంటూండేది. వీరూ ఎవరూ ఆమెను పరాయిదాన్నిలా చూచేవారు కారు. ఎనిమిదేళ్ళప్పుడే తల్లిదండ్రులను కోల్పోయి మేనమామగారియింటికి వచ్చింది. తద్దాది చెల్లెల్లాగానే శేఖర్‌వద్ద తిరుగుతూ, అతనివద్దే చదువుకొని పెద్దదవుతూంది.

శేఖర్‌కి ఆమెయందు దమిత ప్రేమయని అందరికీ తెలుసు కాని, ఆ ప్రేమ యిప్పుడెంతవరకు వచ్చిందో ఎవరికీ తెలియదు. అసలది లలితకే తెలియదు. బాల్యంనుంచీ శేఖర్ ఆమె నొకేరీతిని ప్రేమగా చూడటం అందరూ గమనించుతూనే వచ్చారు. ఇంతవరకు ఆ ప్రేమగాని, అతని ప్రవర్తనగాని ఎవరిదృష్టిలోను అయిష్టమూ కల్గించలేదు. వేరేభావమూ కలుగలేదు. కాబట్టే లలితయింట్లోవారికిగాని, భువనేశ్వరికిగాని ఎప్పటికైనా ఆమె ఈ యింటి కోడలవుతుందని ఊహా కలుగలేదు.

శేఖర్ రాకపూర్వమే అన్నీ సర్దిపెట్టి వెళ్ళిపోవాలను కున్నది లలిత. కాని అన్యమనస్కయై వున్నందున ఆమెదృష్టి గడియారంపైకి పోనేలేదు. అకస్మాత్తుగా ద్వారంవెలుపల చెప్పుల టకటక ధ్వని విని తలెత్తిచూచి చప్పున లేచి ఒక ప్రక్కకు తొలగి నుంచున్నది.

శేఖర్ గదిలోకివస్తూనే "వచ్చావ్! రాత్రి తిరిగివచ్చే ప్పటికి ఎంత ప్రొద్దుపోయిందేమిటి?" అన్నాడు.

లలిత జవాబేమీ చెప్పలేదు.

శేఖర్ పడకకుర్చీలో పడుకొని "ఎప్పుడొచ్చావు? రెండింటికా? మూడింటికా?—ఏం, నోటితో మాటే చెప్ప లేకున్నావ్?" అన్నాడు.

లలిత అలాగే మెదలకుండా నుంచున్నది.

శేఖర్‌కి కష్టం కలిగింది. "క్రిందకు వెళ్ళు, అమ్మ రమ్మంటోంది" అన్నాడు.

భువనేశ్వరి సామానుకొట్టుముందర కూర్చునిపళ్ళెంలో ఫలహారం పెడుతోంది. లలిత వెళ్ళి "నన్ను పిల్చారా అమ్మా?" అనడిగింది.

"లేదే" అని ఆమెముఖంవంక చూడగానే "నీ ముఖం అలా పీక్కుపోయినటుందేఁ లలితా? ఇంకా అన్నం తిన్లేదాయేఁ?" అనడిగింది భువనేశ్వరి.

లలిత తలూపింది.

"సరే, వెళ్ళి మీా బావకు ఫలహారం యిచ్చిరా."

లలిత ఫలహారంపళ్ళెంతో పైకి వెళ్ళింది. శేఖరుడు కళ్ళుమూసుకొని అలాగే పడుకొనివున్నాడు. ఆఫీసు దుస్తు

ంగా మార్చలేదు. కాళ్ళూ చేతులూ కడుక్కోలేదు. దగ్గరకు వెళ్ళి మెల్లగా "ఫలహారం తెచ్చాను" అని చెప్పింది.

అతను తలెత్తి చూడకుండానే "ఎక్కడో ఒకచోట పెట్టి పో" అన్నాడు.

కాని లలిత అలాగే పళ్ళెం పట్టుకొని నిలబడివుంది. లలిత వెళ్ళలేదని శేఖరుడు చూడకుండానే తెలుసుకున్నాడు. రెండు నిముషాలు ఆగి "ఎంతసేపు నుంచుంటావు లలితా? నాకింకా ఆలస్యమున్నది ఉంచేసి వెళ్ళు" అన్నాడు.

లలిత మాట్లాడకుండా నిలబడి లోలోపల కోపగించుకుంటున్నది. అయినా మృదుస్వరంతో "ఆలస్యమైతే కానీ, నాకూ క్రింద పనేమీ లేదు" అన్నది.

శేఖర్ కళ్లు తెరచి నవ్వుతూ "అబ్బో, నోట్లోనుంచి మాటపెగిలిందే! క్రింద పనిలేకపోతే మీ యింట్లోవుంటుంది. అక్కడా లేకపోతే పక్కింటిలో వుండవచ్చుగా. నీకు ఒక ఇల్లంటూ లేదుగా లలితా?" అన్నాడు.

"అవును నాకు ఇల్లులేనిమాట నిజమే" అని లలిత కోపంతో ఫలహారప్పళ్ళెం టక్ మని బల్లమీద పెట్టేసి, చరచర వెళ్లిపోయింది.

శేఖరుడు వెనుకనుంచి "సాయంత్రం ఒకసారి రా!" అని కేక వేసి చెప్పాడు.

"వందేసిసార్లు క్రిందకూ పైకీ నేను తిరగలేను" అని ఆమె అదృశ్యమైంది.

క్రిందకు వెళ్ళగానే, భువనేశ్వరి "బావకి ఫలహారంఇచ్చి వచ్చేవేగాని, తాంబూలం పట్టుకెళ్లి ఇవ్వలేదేం?" అన్నది.

"నాకు ఆకలవుతున్నది అమ్మా, నే నింక వెళ్ళలేను. ఎవరైనా ఇచ్చివస్తారే" అని లలిత చతికిలబడింది.

తల్లి కోపంగావున్న ఆమె మొహంకేసి చూచి నవ్వుతూ "అయితే అన్నం తిందువుగాని కూర్చో దాసీతో పంపుతాన్లే" అన్నది.

లలిత మాట్లాడకుండా భోంచేసింది. తను సినిమాకి వెళ్ళకపోయినా శేఖరుడు తన్ను బెదరించాడు. ఈ కోపంతో ఆమె నాలుగైదురోజులు అతనియెదుటికి పోనేలేదు. తమాషా ఏమిటంటే అతను ఆఫీసుకి వెళ్ళిపోయినతర్వాత రోజూ గదిలో సామాను సర్దివస్తూనేవుంది. శేఖర్ తన పొరపాటు తెలుసుకొని రెండురోజులు రమ్మని కబురంపాడు. కాని ఆమె వెళ్ళనేలేదు.

## 4

ఈపేటకు అప్పుడప్పుడు ఒకవృద్ధుడు బిచ్చానికివస్తూంటాడు. లలితకు అతనియందు సహోదయ. రాగానే అతనికామె ఒకరూపాయి యిచ్చేది. రూపాయి చేతిలోపడగానే అపూర్వము, అసంభవమైన ఆశీర్వాదం ఉచ్చరించేవాడు. లలితకా ఆశీర్వాదం వినటం ఎంతో యిష్టంగా వుండేది. లలిత పూర్వజన్మలో తనతల్లియని ఆమెను చూడగానే అనుకున్నాడు. ఆ ముసలికొడుకు ఇవాళ వుదయాన్నే ద్వారం వద్దకు వచ్చి "నాతల్లీ! ఎక్కడున్నావమ్మా?" అని కేకవేశాడు.

ఆ కేకవిని లలిత ఇవాళ కొంచెం సందిగ్ధంలోపడింది. శేఖర్ ఇంకా గదిలోనేవున్నాడు; మరిడబ్బు తేవటానికి ఎలా

వెళ్తుంది? అటూయిటూచూచి మేనత్తవద్దకు వెళ్లింది. ఆమె యింతకుముందు పనిమనిషిని చీవాట్లువేసి కోప్పడి చిరాకుగా వున్నది. వంటచేస్తున్న ఆమె మొహం చూచి లలిత అడక్కుండానే తిరిగొచ్చింది. బయటికి తొంగిచూస్తే వృద్ధుడు ద్వారానికి ఒకప్రక్కగా చేతికర్ర పెట్టి పీఠంవేసి కూర్చొని వున్నాడు. ఇంతకుమునుపు లలిత అతన్నెన్నడూ వృత్తచేతులతో పంపలేదు. ఇవాళ లేదని చెప్పటానికి ఆమెమనసొప్పలేదు.

భిక్షుకుడు మళ్ళీ కేకవేశాడు. అన్నాకాళి పరుగెత్తుకువచ్చి 'వదినా,నీ ముసలబ్బాయివచ్చాడమ్మా'అని చెప్పింది.

"కాళీ! ఒకపని చేయగలవటమ్మా? నాకు పనుంది గాని, నువ్వెళ్ళి శేఖర్ బావ నడిగి ఒకరూపాయి తెచ్చి పెట్టవూ?" అన్నది లలిత

కాళి పర్వెత్తుకెళ్ళి కాస్సేపట్లోనే తిరిగివచ్చి 'ఇదుగో' అని రూపాయి యిచ్చింది.

"శేఖర్ బావ ఏమన్నాడే?" అనడిగింది లలిత.

"ఏమీ అన్లేదు. చొక్కా జేబులోంచి తీసుకెళ్ళమంటే తీసుకొచ్చాను."

"ఇంకేమీ అన్లేదూ?"

"ఊఁహూఁ, ఇంకేమన్లేదు" అని చెప్పి కాళి ఆడుకోవటానికి వెళ్ళిపోయింది.

లలిత బిచ్చగానికి దానమిచ్చి పంపిందేగాని, ఎప్పటిలాగా ఇవాళ ఆమె నిలబడి ఆశీర్వాదం వినలేకపోయింది. ఆమె మనస్సేమీ బావుండలేదు.

వారియింట్లో కొన్నాళ్ళనుంచీ చీట్లాట మహాజోరుగా సాగుతోంది. ఇవాళ లలిత వారియింటికి వెళ్ళలేదు. తల

నొప్పి నెపంతో పడుకున్నది. ఇవాళనిజంగానే ఆమెమనస్సు బాగుండలేదు. సాయంత్రం అన్నా కాళీని పిల్చి "కాళీ, పాఠం చెప్పించుకోవటానికి శేఖర్ బావదగ్గరకు వెళ్ళున్నావా?" అనడిగింది.

"వెళ్తున్నాను."

"బావ నాసంగతేమీ అడగటంలేదూ?"

"లేదే. ఆఁ ఆఁ, నువ్వు మధ్యాహ్నమప్పుడు వాళ్ళిం టికి చీట్లాటకు వెడుతున్నావా లేదా అని అడిగాడు ఒదినా?"

లలిత ఉద్విగ్నురాలై "ను వ్వేం చెప్పావు?" అన్నది.

"రోజూ మధ్యాహ్నం నువ్వు చీట్లాటకు వెళ్తున్నావని చెప్పాను. ఎవరెవరు ఆడుతున్నారని శేఖర్ అన్నయ్య అడిగాడు. నువ్వు, చారుపదిన, వాళ్ళఅమ్మ, మామ ఆడుతున్నారని చెప్పాను. సరేగాని, నువ్వుబాగా ఆడుతున్నావా? వాళ్ళమామయ్య బాగా ఆడుతున్నాడా ఒదినా? నువ్వు చాలాబాగా ఆడతావనివాళ్ళఅమ్మఅంటుంది నిజమేగదూ?"

లలిత ఆమె అడిగినదానికి సమాధానంచెప్పక, అసం తృప్తిచెంది "నీకీ అధిక ప్రసంగం ఎందుకు? అన్ని విషయా ల్లోను నువ్వు వేలుపెట్టాలా యేం? ఇంక నీకు నే నేమీ ఇవ్వ నులే" అని కోపంతో లేచి చక్కాపోయింది.

కాళీ డంగైపోయింది. ఆకస్మికంగా లలితలో వచ్చిన పరివర్తనం ఆమె కేటూ అర్థంకాలేదు.

రెండురోజులనుంచీ మనోరమయింట్లో చీట్లాట బంద యింది. లలిత రావటంలేదు. లలితను చూచిన లగాయతు

గిరీంద్రుడు డామెచే ఆకర్షింపబడినట్లు మనోరమకు అనుమానంగానే వుంది. ఇవాళ అది దృఢపడిందికూడాను.

ఈ రెండురోజులనుంచీ గిరీంద్రుడు నిరుత్సాహంగాను, అన్యమనస్కుడుగాను వుంటున్నాడు. సాయంత్రం షికారు వెళ్ళటంలేదు. ఊరకే యింట్లో అటూయిటూ తిరుగుతూంటాడు. ఇవాళ మధ్యాన్నం మనోరమవద్దకు వచ్చి "ఇవాళ కూడా ఆటవుండదా అక్కా?" అనడిగాడు.

"ఎలా ఆడతాం గిరీంద్రా, ఉజ్జీలు లేందే! పోనీ మనం ముగ్గురమే ఆడదాం లే."

గిరీంద్రుడు నిరుత్సాహంగా "ముగ్గురితో ఏం ఆట అక్కా? లలితను పిల్చుకురారాదూ!" అన్నాడు.

"ఆమె రాదు."

గిరీంద్రుడు ఉదాసీనుడై "ఎందుకురాదు? వాళ్ళఇంట్లో వాళ్ళు వద్దన్నారా?" అని అడిగాడు.

"ఏబ్బే! వాళ్ళలాంటివాళ్ళు కాదు. అదే రా వద్దనుకున్నది."

గిరీంద్రుడు ఒకవిధంగా సంతోషించి "అయితే నువ్వు వెళ్ళి పిలిస్తే వస్తుంది" అని లోలోపల సిగ్గుపడ్డాడు.

మనోరమ నవ్వింది. "సరేలే, నేనే వెళ్ళిపిలుస్తాను" అని బయల్దేరింది. కాస్సేపటికి లలితను తీసుకొచ్చింది. మళ్ళీ ఆటకు కూర్చున్నారు. రెండు రోజుల్నుంచీ ఆట మున్నాళ్ళు అయిందిగా, ఇవాళ నెంటనే ఠక్కికట్టింది. లలిత పక్షానికే గెలుపు.

రెండు గంటలు ఆవేళప్పటికి కాళివచ్చి "అక్కా, శేఖర్ అన్నయ్య పిలుస్తున్నాడు. దబ్బున లేచి రా" అన్నది.

లలిత మొహం తెల్లబడింది. చీట్లు పంచడం మానేసి "ఆయన ఆఫీసుకు వెళ్ళలేదూ?" అనడిగింది.

"ఏమో, వెళ్ళి తిరిగివచ్చాడేమో!" అని కాళి వెళ్ళిపోయింది.

లలిత పేక క్రిందపడేసి, మనోరమ మొహంవంక చూచి సంకోచంగానే "ఇక వెళ్తాను పెద్దమ్మా!" అన్నది.

మనోరమ "ఇంకా రెండాటలు ఆడిపోవచ్చులేవే" అన్నది కాని, లలిత "ఉహుఁ, ఆయనకు కోపం వస్తుంది" అంటూనే గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది.

"శేఖరుడు ఎవరు అక్కా?" అనడిగాడు గిరీంద్రుడు

"ఎదురుగావున్న ఇంటివారబ్బాయి."

"అలాగా, ఆ యింటియజమాని నవీనబాబు వీరికి బంధువు కాబోలు!"

మనోరమ అతని మొహంవంక చూస్తూ నవ్వి "బంధుత్వమా! లలిత మేనమామ యిల్లుకూడ తాకట్టుపెట్టుకొని కాజెయ్యాలని చూస్తుంటేను!" అన్నది.

గిరీంద్రుడు ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

"గత సంవత్సరం గురుచరణుబాబు ధనాభావంవల్ల రెండో పిల్ల పెళ్ళి చేయలేకపోయాడు. అప్పుడు నవీనబాబు ఆయనయిల్లు తాకట్టుపెట్టుకొని అధికవడ్డీకి అప్పిచ్చాడు. ఆ అప్పు ఇంతకీ తేదికాదులే! చివరికెలాగూ యిల్లు నవీనబాబు స్వాధీనమవ్వాల్సిందే! గురుచరణుని యిల్లు పడగొట్టించి

అక్కడ రెండోకొడుకు శేఖర్‌కి ఇంకోమేడ కట్టించాలని ఆ ముసలాయన కోరిక. ఇద్దరు కొడుకులకు వేర్వేరు యిళ్ళు ఏర్పరచా లనుకోవడం తప్పేమీకాదనుకో!" అని మనోరమ కథఅంతా చెప్పింది.

ఇది విని గిరీంద్రుడు చాలా విచారపడ్డాడు. "సరేగాని అక్కా, గురుచరణబాబుకి ఇంకా కూతుళ్లు వున్నారుగదా! మరి వారి పెళ్ళిళ్ళు ఎలాచేస్తాడు?" అనడిగాడు.

"తన పిల్లలు సరే, పైగా లలితకూడా వుంది. ఈ పిల్లకి తల్లి-దండ్రుల్లేరు పాపం! ఈ సంవత్సరం పెళ్లిచెయ్యాలి కూడాను. వాళ్ళ సంఘంలో సహాయంచేసే వాళ్లెవరూ లేరు. జాతి ఎంచడానికిమాత్రం అంతా వుంటారు. వాళ్ళకంటె మనమే మెరుగు గిరీ!"

గిరీంద్రుడు ఏమీ మాట్లాడలేదు. మనోరమ యింకా చెపుతోంది–"ఒకనాడు లలితప్రసక్తి తెచ్చి ఆమె మేనత్త "లలితపెళ్ళి ఎలాచేస్తామో ఏమో! ఆ చింతతోనే వాళ్ళ మామకు అన్నమే సహించటల్లేదు" అన్నది. ఏం గిరీ! మీ గేరులో నీ స్నేహితుల్లో డబ్బుకాశించకుండా పిల్లను చూచి పెళ్లాడేవా రెవరూలేరూ? ఇలాంటిపిల్ల దొరకటం కష్టమే."

గిరీంద్రుడు ఉదాసీనంగా నవ్వుతూ "స్నేహితులెక్కడున్నారు అక్కా! ఆఁ, నేను డబ్బురూపంలో సహాయం చేయగలను" అన్నాడు.

గిరీంద్రుని తండ్రి డాక్టరువృత్తిలో చాలాడబ్బూ, భూములూ సంపాదించి పోయాడు. ఇప్పుడా ఆస్తికంతకూ గిరీంద్రుడే యజమాని.

"డబ్బు అప్పుగా యిస్తావా?" అనడిగింది మనోరమ.

"అప్పేమిటిలే. ఇవ్వగల్గితే యిస్తారు; లేకపోతేమానె!"

మనోరమ ఆశ్చర్య పడింది. "డబ్బిస్తేలాభం? వాళ్లు, మన కేమీ చుట్టపక్కాలు-కాదే. మనసామాజికులూ కాదాయె, ఫూరికేనే డబ్బిస్తారా ఎవరైనా?" అన్నది.

"సామాజికులు కాకపోతేయేం అక్కా? మన దేశస్తులే గద, వాళ్ళకేమో యిబ్బందిగావుంది. నాదగ్గర ఫూరకే మూలుగుతోంది. నువ్వొకసారి అడిగిచూడు. వాళ్ళకిష్టమైతే నేను యిస్తాను. లలిత వారికి స్వంతపిల్ల కాదు, మనకూ ఏమీకాదు. ఆమె పెళ్ళిఖర్చంతా నే నిస్తాను."

అతనిమాటలు విని మనోరమ సంతోషించలేదు. ఇందులో తన కేమీ లాభనష్టాల్లేకపోయినా, ఇంతడబ్బు ఒకరు యింకొకరికి ఇవ్వటంమాట విని ఏస్త్రీ అయినా సంతోషించలేదు.

ఇంతవరకు మాట్లాడకుండా కూచున్న-చారుబాల సంతోషంగా "అవును. మామా, నువ్విప్పు, నేను వాళ్ళఅత్తయ్యతో చెప్పొస్తాను" అంది.

"నువ్వూరుకో పిల్లా, నీకేం తెలుసు? ఆడపిల్లలకెందుకు ఈ సంగతులన్నీ? చెప్పాల్సొస్తే నే చెప్పలేనూ?" అని తల్లి కూతురును కోప్పడింది.

"నువ్వు చెప్పు అక్కా; మొన్న దారిలో యెదురుపడితే గురుచరణ్ బాబుతో మాట్లాడాను. చాలామంచివాడులా కన్పించాడు. అవునా అక్కా?"

"నేనేకాదు, అందరూ అలాగే అంటారు. ఆ భార్యాభర్తలిద్దరూ మంచివాళ్ళే. అందుకనే పాపం ఇలాంటివాళ్లు కొంపకాస్తా పోగొట్టుకొని నిరాశ్రయులవుతారే అని విచారం కలుగుతుంది. చూచాయగా, శేఖర్ బాబు పిలిచాడనగానే లలిత ఎలా తందరబిందరలాడుతూ వెళ్ళిందో! ఇంటిల్లిపాదీ వారికి అమ్ముడుపోయారనుకో. ఎవ రెంత గొప్పగా చెప్పినా ఒకసారి ఆ నవీనరాయివల్లోపడితే ఇంక బయటపడటం వట్టిదే"

"సరే, నువ్వు చెపుతావుకదూ?"

"చెపుతాలే. నువ్వు డబ్బిచ్చి సాయంచేయటం మంచిదే" అని నవ్వి మనోరమ అడిగింది—"నీకవసరమేమిటిగిరీ?"

"అనసరమేమిటి అక్కా? దుఃఖంలోను, కష్టాల్లోను, ఒకరికొకరు సహాయం చేసుకోవల్సిందే" అని లేచి సిగ్గుతో బయటికి వెళ్ళాడు. కాని ద్వారం అవతలినుంచే తిరిగొచ్చి మళ్ళీ కూర్చుని "ఇదంతానటనకూడా కావచ్చుగా?" అన్నాడు.

మనోరమ విస్మితయై "ఏం?" అన్నది.

వాళ్ళ లలితచేసేఖర్చుచూస్తే ఆమెకేమీ విచారము న్నట్లు కన్పడదు. ఆవాళ మేము సినిమాకి వెళ్ళినప్పుడు తాను రాకపోయినా కాళికి పదిరూపాయలిచ్చి పంపింది. ఎలా ఖర్చుపెడుతుందో చారునే అడుగు! నెల కే పాతికరూపాయలకో తక్కువ ఖర్చుపెట్టదు."

మనోరమ నమ్మలేకపోయింది.

"నిజమే అమ్మా! శేఖర్ బాబువద్ద తీసుకొని ఖర్చుపెడుతుంది. ఇప్పుడేకాదు, చిన్నప్పట్నుంచి ఆయనఅరమరలోంచి

డబ్బు తీసుకుంటుంది. ఎవరూ ఏమీ అనరు” అని చారు చెప్పింది.

మనోరమ సందిగ్ధభావంతో “డబ్బు తీసుకుంటున్నట్లు శేఖర్‌కి తెలుసా?” అనడిగింది.

“తెలియకేం? ఆయన యెదుటే తీసుకుంటుంది. పోయిన నెలలో అన్నాకాళి బొమ్మలపెళ్ళికి ఖర్చంతా ఎవరిచ్చారనుకున్నావ్? అంతా లలితే యిచ్చింది.”

మనోరమ కాస్త ఆలోచించి “ఏమో ఎవరికి తెలుసు! ఒక సంగతివుంది. కొడుకులు ముసలాయనలాంటి పీనాసిరకం కాదు. వారివన్నీ తల్లిగుణాలు. దయా-ధర్మగుణాలువున్నాలే. అదీగాక లలిత చాలా మంచిపిల్ల. చిన్నప్పట్నుంచి కలిసిమెలిసి వుంటూ బావా, బావా అంటూ తిరుగుతూండె. అందరికి ఆ పిల్లంటే ప్రేమే. చారూ, నువ్వు వెడుతూంటావు గదూ. వచ్చే మాఘమాసంలో శేఖర్ పెళ్ళట నిజమేనా? పిల్ల తరఫునుంచి ముసలాయనికి బాగా డబ్బువస్తుందటనే?” అన్నది.

“అవునే అమ్మా. మాఘమాసంలో అవుతుంది. అంతా ఖాయమైంది.”

## 5

గురుచరణునితో ఏప్రాయంవారైనా నిస్సంకోచంగా మాట్లాడవచ్చు. ఆయన అలాంటిమనిషి. రెండురోజుల సంభాషణతోనే గురుచరణ గిరీంద్రులమధ్య చిరమైత్రి ఏర్పడినట్లయింది. గురుచరణుడు దృఢచిత్తుడు కాకపోవటంవల్ల

చర్చించటమంటే ఎంతప్రీతివున్నా, చర్చలో ఓటమికి అసంతృప్తి చెందేవాడు కాదు.

గురుచరణుడు గిరీంద్రుని రోజూ సాయంత్రం తేనీటికి రమ్మని ఆహ్వానించాడు. ఆఫీసునుంచి తిరిగివచ్చేప్పటికి ప్రొద్దుగూకేది. ఇంటికివచ్చి మొహంకడుక్కోగానే "లలితా, టీ పెట్టావా అమ్మాయ్? కాళీ, మీ గిరీంద్రమామని త్వరగా పిల్చుకురా" అనేవాడు. తర్వాత యిద్దరూ తేనీరు త్రాగుతూ ఏదో చర్చించుతూండేవారు.

లలిత ఒక్కొక్కనాడు మామచాటున కూర్చుని వింటూండేది, అలాంటప్పుడు గిరీంద్రునివాదన మహాజోరుగా వుండేది. తరచుగా ఆధునిక సమాజానికి విరుద్ధంగా చర్చ జరుగుతూండేది.సంఘంలో హృదయహీనత,అవకతవకలు .. ఎన్నో మాట్లాడేవారు.

మొదట సమర్థించటానికి వాస్తవంలో ఏమీవుండేదే కాదు. ఆపైన గురుచరణుని పీడిత అశాంతహృదయంతో గిరీంద్రుడూ ఏకీభవించుతూండేవాడు. "గిరీ! తమ ఆడపిల్లలకు యుక్తవయస్సులో మంచిసంబంధాలు కుదిర్చి పెళ్ళిళ్ళు చెయ్యాలని ఎవరికుండదు? కాని జరిగేదెట్లా? పిల్లలకు పెళ్ళీడు వచ్చింది. పెళ్ళిచేసెయ్యా"మంటుంది సంఘం. కాని, పెళ్ళిచేయడానికి ఏర్పాటుమాత్రం చెయ్యలేదు. నువ్వు చెప్పింది నిజమే గిరీంద్రా! నన్నేచూడు, ఇల్లుకూడ తాకట్టుపెట్టేశాను. నాలుగురోజులుపోతే పిల్లా-జెల్లతో బజారునపడాలి. అప్పుడు ఈ సంఘం "రండి, మా యింట్లోవుండండి" అని అంటుందా! చెప్పు?" అనేవాడు గురుచరణ్.

గిరీంద్రుడు మౌనంగా వుండేవాడు. గురుచరణ్ మళ్ళీ చెప్పేవాడు–ఇలాంటి సంఘంలో వుండేకంటే జాతిపోవటమే మేలు. తిన్నా, పస్తులున్నా శాంతిగా పడివుండొచ్చు! దుఃఖితుని దుఃఖాన్నెరుగని సంఘం, కష్టంలో ఆపత్సమయంలో ఆదుకోనిసంఘం, నాకెందుకు? అది నావంటి బీద వారిదికాదు, గొప్పవారిది. మంచిదే, వారినే వుండనీసంఘంలో, మాకు దానితో అవసరమే లేదు'' అని ఆయన టక్కున ఆపి వేసేవాడు.

ఈ వాద ప్రతివాదాలను లలిత కేవలం మనసుంచి వినటమే కాదు, రాత్రిళ్లు పక్కమీద పడుకొని నిద్రపట్టే వరకూ ఆ విషయాలే ఆలోచించుతూండేది. ప్రతివిషయం ఆమె హృదయంలో అంకితమవుతూండేది. "గిరీంద్రబాబు చెప్పింది సబబుగానే వుంది'' అనుకునేది.

మేనమామయం దామెకు నల్లమూలిన ప్రేమ. తన మామ చెప్పినదాన్ని సమర్థించుతూ గిరీంద్రుడు ఏం చెప్పినా యథార్థమనిపించేది! "మామ ముఖ్యంగా నన్నుగురించే ఇంతగా విచారపడుతున్నాడు. అన్నం సయించకుండావుంది. ఆయన నాకాశ్రయమిచ్చి యింత క్లేశమనుభవించుచున్నాడు ఎందుకు? మామ జాతి ఎందువల్ల పోతుంది? ఇప్పుడు నా పెళ్ళిచేస్తే, రేపే నేను విధవనై తిరిగి యింటికి వచ్చేస్తే, అప్పుడుమాత్రం జాతి పోదూ! ఏమిటిఇందులోవున్న తేడా?'' ఇలాగే గిరీంద్రుని మాట లామె భావోద్రిక్త హృదయంలో ప్రతిధ్వనించేవి. వాటినిగూర్చి తర్కించుకుంటూ తర్కించుకుంటూ నిద్రపోయేది.

తన మేనమామ కష్టస్థితిని అర్థంచేసుకొని ఆయనతో ఏకీభవించేవారి అభిప్రాయంతో తానేకీభవించకుండా ఎలా వుంటుంది? కాబట్టి గిరీంద్రునిపట్ల ఆమెకు అభిమాన మేర్పడటం సహజమే.

క్రమంగా ఆమెకూడా గురుచరణునివలెనే సంధ్యా చర్చలకు నిరీక్షించుతూండసాగినది.

మొదట్లో గిరీంద్రుడు లలితను 'మీ'రని సంబోధించుతూండేవాడు. కాని ఒకరోజున గురుచరణుడు "మీ"రనటం ఎందుకు రీగిన్? "నువ్వనే అనూ' అప్పటుంచీ అతడు ఆమెను నీవనటం ప్రారంభించాడు.

ఒకనాడు గిరీంద్రుడు "నువ్వు టీ త్రాగావా లలితా?" అనడిగాడు.

లలిత లేదన్నట్లు తలాడించింది. గురుచరణుడు "వాళ్ళ శేఖర్ బావ ఆంక్షపెట్టాడులే. ఆడపిల్లలు టీ త్రాగటం అతని కిష్టంవుండదు" అని చెప్పాడు.

ఈ కారణం విని గిరీంద్రుడు అప్రసన్నుడయ్యాడు. అది లలిత గ్రహించింది.

నాడు శనివారం. ఇతరరోజులకంటె ఆనాటి సమావేశం ముగింపు కొంత ఆలస్యంగాగాని జరుగదు.

టీ త్రాగటం పూర్తయింది. ఆవాళ గుర్‌చరణ్ చర్చలో ఉత్సాహంగాలేడు. మధ్యమధ్య అన్యమనస్కుడవుతున్నాడు.

గిరీంద్రు డది కనిపెట్టి "ఇవాళ మీ మనసు బాగుండలేదలేవుంది?" అన్నాడు.

ఆయన హుక్కా గొట్టం నోటినుంచితీసి "ఏం, బాగానే వున్నదే?" అన్నాడు.

"ఆఫీసులో ఏమైనా —"

"లేదు, అలాంటిదేమీలేదు" అని గురుచరణుడు ఆశ్చర్యంగా గిరీంద్రుని మొహంవంక చూచాడు. తనలోని ఉద్వేగం బయటికి ప్రదర్శితమవుతున్నదని ఆయనకు తెలియదు.

లలిత ప్రారంభంలో బొత్తిగా మాట్లాడేదికాదు. కాని ఈమధ్య ఒకటిరెండు మాటలు కలుపుతున్నది. "ఇవాళ నిజంగానే నీ మనసు బాగుండలేదల్లేవుంది మామయ్యా!" అన్నది.

గురుచరణుడు నవ్వుతూ లేచి నిటారుగా కూర్చుని "అవునమ్మా, నువ్వన్నట్లు నా మనసు యివాళ బాగాలేదు" అన్నాడు.

లలిత, గిరీంద్రుడు ఆయన మొహంకేసి చూస్తున్నారు.

"నవీనబాబు అంతా తెలిసివుండికూడ ఇవాళ దారిలో నిలవేసి కష్టంగా మాట్లాడాడు. అయినా ఆయన్ననుకు నేపనే ముంది? అసలుసంగతి అలావుంచి ఆర్నెల్లనుంచీ వడ్డీయే వసూలివ్వలేకపోయాను" అని చెప్పాడు గురుచరణ్. ఈ సంగతి విని అక్కడితో ఆపించడానికి లలిత ఆరాటపడుతున్నది. దూరదృష్టి లేని తనమామ గృహవిషయాలన్నీ పరాయివారినుం దెక్కడ చెప్పివేస్తాడోనని చప్పున ఆమె అందుకున్నది. "నువ్వేమీ విచారపడకు మామయ్యా! తర్వాత అవే సర్దుకుపోతాయి!"

కాని గురుచరణుని దృష్టి అటులేదు. ఆయన శుష్క-హాసంచేస్తూ "తర్వాత ఏం సర్దుకుంటుంది అమ్మాయ్! అసలు సంగతేమిటంటే-గిరీంద్రా! ఆమ్మాయి వాళ్ళమామ ఏ విచారం లేకుండా నిశ్చింతగా వుండాలనుకుంటుంది. కాని లలితా, నీ యీ మామ దుఃఖాన్ని గమనించేవాళ్ళెవరూ లేరమ్మా!" అన్నాడు.

"నవీనబాబు ఇవాళ ఏమన్నా డేమిటి?" అనడిగాడు గిరీంద్రుడు.

అతని కన్నిసంగతులూ తెలుసునని లలిత ఎరుగదు. అందువల్ల అతని ఈ ప్రశ్నను అనుచిత కుతూహలంగా యెంచి మనసులో కోపగించుకున్నది.

గురుచరణుడు జరిగిన వైనమంతా చెప్పేశాడు. నవీన బాబు భార్య చాలా రోజులనుంచీ అజీర్ణవ్యాధిచే బాధపడు తోంది. వ్యాధి ముదురుతున్నందున డాక్టర్లు గాలిమార్పుకు ఎక్కడికైనా పంపమని సలహాయిచ్చారు. అందుకే పైకం అవసరమైంది. కాన గురుచరణుడు ఎలాగైనాసరే పూర్తివడ్డీ యేగాక అసలులోకూడ కొంత వసూలు ఇవ్వాల్సివచ్చింది.

గిరీంద్రుడు కొంచెంసేపాగి "మీతో కొన్నాళ్ళనుంచి ఒకసంగతి చెప్పాలనుకుంటున్నాను. కాని చెప్పలేకపోయాను. మీరేమీ అనుకోనంటే చెపుతాను" అన్నాడు.

గురుచరణ్ నవ్వి "నాతో ఏంచెప్పడానికైనా ఎవరూ సందేహించనక్కర్లేదు ఏమిటిసంగతి?" అన్నాడు.

నవీనబాబు చాలా అధికవడ్డీ పుచ్చుకుంటున్నారని మా అక్కయ్య చెప్పింది, నావద్ద చాలాడబ్బు వుంది. ఎం

దుకూ వుపయోగంలేకుండావుంది. నవీనబాబుకు అవసరంగా వుంది కాబట్టి, వారి బాకీ తీర్చివేస్తే బాగుంటుందని నా వుద్దేశ్యం."

లలిత,గురుచరణు లిద్దరూ ఆశ్చర్యచకితులై అతనివంక చూడసాగారు. గిరీంద్రుడు సంకోచంగానే చెపుతున్నాడు—"నాకిప్పుడు డబ్బుతో అనసరమేమీలేదు. మీకు వీలైనప్పుడే ఇవ్వవచ్చు. వారి కిప్పుడే అవసరంకాబట్టి ఇచ్చెయ్యడమే మంచిది. కాని—"

"మొత్తం అంతా యిస్తావా?"అని మెల్లగా అన్నాడు గురుచరణ్.

అతడు తలవొంచుకుని "ఆ, మొత్తమంతాను. వారి అవసరం గడుస్తుందిగదా" అన్నాడు.

గురుచరణ్ ఏమో చెప్పాలనుకుంటూండగానే అన్నాకాళి పరుగెత్తుకొచ్చి "అక్కా, దబ్బున దబ్బున శేఖర్ అన్నయ్య బట్టలువేసుకు తయారవమన్నాడు—సినిమాకి వెళ్ళటానికి" అని చెప్పి వచ్చినట్లే పరుగుతీసింది. ఆమె హడావుడి చూచి తండ్రి నవ్వాడు. లలిత కదలకుండా అలాగే కూర్చునివుంది.

అన్నాకాళి మరుక్షణంలోనే మళ్ళీవచ్చి "ఏమిటే, లేవనేలేదేఁ? మేమంతా నీకోసంమంచున్నాంఅక్కా!" అంది.

అయినా లలిత లేచేలక్షణాలు కన్పడలేదు. ఆమె సాంతం విని వెళ్ళాలనుకున్నది. కాని గురుచరణుడు కాళిమొహం చూచి నవ్వుతూ లలితతలమీద చేయ్యేసి "నువ్వు వెళ్ళమ్మా!

ఆలస్యం చెయ్యమాకు, నీకోసం చూస్తుంటారు వాళ్ళంతా"
అన్నాడు.

లలిత లేవక తప్పలేదు. కాని వెళ్ళేముందు గిరీంద్రుని వంక కృతజ్ఞతాదృష్టినిబరపి మెల్లగా వెళ్ళిపోయింది. అది గిరీంద్రుడూ గమనించలేకపోలేదు.

పదినిమిషాల్లో దుస్తులు మార్చుకొని, తాంబూలం యిచ్చేవంకతో మళ్ళీ ఆ గదిలోకి వచ్చింది. కాని గిరీంద్రుడు వెళ్ళిపోయాడు. మేనమామ ఒక్కడే దిండుమీద తలపెట్టుకొని కళ్లుమూసుకొని పడుకునివున్నాడు. ఆయన కనుకొలుకుల్లోంచి అశ్రువులు కారుతున్నై. అవి ఆనందాశ్రువులని లలిత గ్రహించింది. ఆయన్ను కలిచడానికి యిష్టంలేక లలిత మెల్లగా బయటికి వెళ్ళిపోయింది.

శేఖర్ యింటికి వెళ్ళినప్పుడు ఆమె కళ్ళల్లో నీరు క్రమ్మింది. కాళి అప్పటికే పోయి ముందుగా బండిలో ఎక్కి కూర్చున్నది. శేఖర్ ఒంటరిగా తనగదిలో ఆమెకోసమే ఎదురుచూస్తున్నట్లు నిలబడివున్నాడు. లలిత రాగానే తలెత్తి ఆమె అశ్రుసిక్తనయనాలను చూచాడు.

ఏడెనిమిది రోజులనుంచీ లలిత కన్పడనందున అతనికి లోలోపల కోపంగానేవుంది. కాని ఇప్పుడది మర్చిపోయాడు. "ఇదేమిటి, ఏడుస్తున్నావా?" అనడిగాడు గాబరాపడుతూ.

లలిత తలవొంచుకుని మెడ ఆడించింది.

ఇన్నాళ్ళుగా లలితను చూడనందున శేఖర్‌లో ఒకవిధమైన పరివర్తనం జరుగుతున్నది. అతడామెను సమీపించి

రెండుచేతులతో మొహాంపైకెత్తి "నిజంగా ఏడుస్తున్నావా" ఎందుకు?" అని అడిగాడు.

లలిత ఇంక ఉండబట్టలేకపోయింది. అక్కడే చతికిల బడి ముఖానికి చెంగు అడ్డంవేసుకుని ఏడ్వసాగింది.

## 6

నవీనరాయి వడ్డీ అసలుఫాయిదాలు పూర్తిగా లెక్క బెట్టుకొన్నతర్వాత తాకట్టుపత్రంఇచ్చివేస్తూ "ఇంతమొత్తం యిప్పు డెక్కడిది? ఎవ రిచ్చారేమిటి?" అనడిగాడు.

డబ్బువసూలైనందుకు ఆయన కేమీ సంతోషంగా లేదు. ఈవిధంగా వసూలవుతుందని ఆయన ఆశించనూ లేదు. వసూలు అవ్వాలన్నకోరికా లేదు. బాకీక్రింద ఆ యిల్లుస్వాయత్తంచేసుకొని పడగొట్టించి, ఏరకం భవనం కట్టిద్దామా అని ఆలోచించుతున్నాడు. ఇంతలో ఇలా జరిగింది. "ఈరోజుల్లో ఇంతేలేవయ్యా. నీదేమీ తప్పులేదు. నాదేలే కొంత వసూలిమ్మని అడగటమే పొరపాటైంది. మరి కలికాలం కదూ!" అన్నాడు వ్యంగ్యంగా.

గురుచరణుడు వ్యాకులపడి "మీబాకీతీర్చానేగాని, మీ దయకు బదులు తీర్చగలనా?" అన్నాడు.

నవీనబాబు నవ్వాడు. అనుభవజ్ఞుడుగదూమరి. ఇలాంటి మాటలన్నీ నమ్మితే బెల్లంవ్యాపారంలో ఇంత ధనం ఎలా సంపాదించగలిగేవాడు? మళ్ళీ ఇలాఅన్నాడు - "నాయందు అటువంటిభావమేవుంటే ఇలా ఒక్కసారిగా డబ్బంతా తెచ్చి పడేస్తావా? మీ వదినకోసం అవసరమై ఒకసారి అడిగానే అనుకో. సరేగాని, ఎంతవడ్డీకి యిల్లు తాకట్టుపెట్టావేమిటి?"

గురుచరణుడు మెడఆడించి "తాకట్టు పెట్టలేదు. వడ్డీ విషయంలోకూడ ఏమీ అనుకోలేదండీ" అని చెప్పాడు.

నవీనరాయి నమ్మలేకపోయాడు. "ఏమిటీ? ఊరకనే వచ్చిందా?" అన్నాడు.

"ఆ, ఒకవిధంగా అంతే ననుకోవాలి. ఆ అబ్బాయి చాలా మంచివాడులెండి. జాలిగుండె!"

"అబ్బాయి! అబ్బాయి ఎవరు?"

గురుచరణు డందు కేమీ జవాబు చెప్పక మిన్నకున్నాడు. ఇంతవరకు చెప్పిందే అనవసరం.

నవీను డాయన వుద్దేశ్యాన్ని గ్రహించి నవ్వుతూ అన్నాడు—"పోనీ, చెప్పొద్దనుకుంటే చెప్పనక్కర్లేదులే. కాని లోకంలో నేను చాలాచూచాను కాబట్టి చెబుతున్నాను. ఆ మనిషి ఎవరైనప్పటికీ ఇంత మేలు వూరకే చెయ్యరు. వల్లో పడేవు, జాగ్రత్త!"

గురుచరణుడేమీ మాట్లాడకుండా కాయితం పుచ్చుకొని తిన్నగా యింటికి వెళ్ళిపోయాడు.

సాధారణంగా ప్రతిసంవత్సరం ఈరోజుల్లో భువనేశ్వరి పడమటి ప్రదేశానికివెళ్ళి కొన్నాళ్ళపాటువుండివచ్చేది. అందువల్ల ఆమె అజీర్ణవ్యాధి కొంత నిమ్మళించుతూండేది. ఆ జబ్బు నవీనబాబు బాకీవసూలుకు చెప్పినంత ప్రమాదమైనది మాత్రం కాదు. ఏమైనప్పటికి ప్రయాణసన్నాహాలుప్రారంభమైనాయి.

ఆనాడు సాయంత్రం శేఖర్ లెదర్ కేసులో తనప్రయాణానికి కావలసినసామాను సర్దడానికి కూచున్నాడు. అన్నా

కాళి వచ్చి "శేఖర్ అన్నయ్యా!మీరు రేపే వెళ్తారుగదూ?" అనడిగింది.

శేఖర్ సూట్ కేసుపైనుంచి మొహమెత్తి "కాళీ,మీ అక్కని పంపించు. తనకేమే తీసుకెళ్లాలో ఇప్పుడే తీసుకు రావాలి" అన్నాడు.

లలిత ప్రతియేటా భువనేశ్వరివెంట వెడుతూండేది. ఇప్పుడూ వస్తుందనే అనుకుంటున్నాడు శేఖర్.

"మా అక్క రాదుగా"అన్నది కాళి.

"ఎందువల్ల?"

"బలే, ఎలావస్తుందేమిటి! మాఘమాసంలో అక్క పెళ్ళిగదూ, నాన్నగారు పెళ్ళికొడుకుని వెతుకుతున్నారుగా"

శేఖరుడు నిర్నిమేషదృష్టితో ఆమెవంక చూస్తున్నాడు. కాళి తమయింట్లో విన్నదంతా చెప్పుకొచ్చింది హుషారుగా. మంచివరుణ్ని చూడమనీ, పెళ్ళికయ్యే ఖర్చంతా తానే యిస్తాననీ గిరీంద్రుడు చెప్పాడట! వాళ్ళనాన్న ఆఫీసుకు సెలవుపెట్టి వరాన్వేషణ చేస్తున్నాడనీ, గిరీంద్రుడుకూడ వెంట వెళుతున్నాడనీ చెప్పింది.

శేఖరుడు మెదలకుండా వింటున్నాడు. లలిత ఎందువల్ల రాదో అతనికి బోధపడింది.

"గిరీంద్రబాబు చాలా మంచివాడు అన్నయ్యా, మా చిన్నక్క పెళ్ళికి నాన్నగారు యిల్లు తాకట్టుపెట్టారుగదూ; ఇంక ఒకటిరెండు నెలల్లో మేమంతా బజారునపడాలనిఅన్నారుగా నాన్నగారు. అందుకని గిరీంద్రబాబు ఆ డబ్బంతా ఇచ్చాడు. నాన్నగారు నిన్న ఆడబ్బు పెదనాన్నగారికి ఇచ్చే

శాడుకూడాను. ఇంక మేము భయపడనక్కర్లేదనిలలితక్కయ్య అన్నది——అంతేకదూ శేఖరన్నయ్యా?" అన్నది కాళి.

శేఖరుడు ప్రత్యుత్తరమేమీ ఇవ్వలేదు అలాగే రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు.

"ఏమి టాలోచింపుతున్నావు శేఖరన్నయ్యా?" అన్నది కాళి.

శేఖర్‌కి ధ్యానభంగమయింది. వెంటనే "ఏం లేదు. కాళీ, మీ అక్కని త్వరగా పంపు. నేను రమ్మంటున్నానని చెప్పు. త్వరగా వెళ్ళు" అన్నాడు.

కాళి పరుగుతీసింది.

శేఖరుడు తెరచివున్న సూట్‌కేసువంక చూస్తూ మెదల కుండా కూర్చున్నాడు. ఏది అవసరమో, ఏదికాదో అన్నీ ఒకేరూపంలో కనపడుతున్నాయి అతనికళ్ళకి.

పిలుపు విని లలిత పైకి వచ్చి కిటికీగుండా తొంగి చూచింది. తన శేఖర్ బావ తదేకంగా క్రిందికిచూస్తూకూర్చుని వున్నాడు. అతని ముఖంలోని అలాంటిభావ మిదివరకెన్నడూ ఆమె చూచి యెరుగదు. లలిత ఆశ్చర్యంతో పాటు భయ పడింది. మెల్లగా సమీపించింది. 'రా' అంటూ శేఖర్ లేచి నుంచున్నాడు.

'నన్ను పిల్చావా?' అనడిగింది నెమ్మదిగా లలిత.

'అవు' నని శేఖర్ ఒక క్షణం వూరుకుని "రేపు వుద యుబ్బండికి అమ్మతో నేను పడమటికి వెడుతున్నాను. ఈసారి తిరిగి రావటానికి ఆలస్యం కావచ్చు. ఇదిగో తాళంచెవి. సీకు

డబ్బాబదస్కం కావాల్సొస్తే ఆ సొరుగులో వుంది' అని చెప్పాడు.

ప్రతిసారీ లలితకూడా వెంటవెళ్ళేది. క్రితంసారి ఎంత హుషారుగా సర్దింది సామాను! ఇప్పుడా పనిఅంతా శేఖర్ ఒక్కడే చేసుకోవాల్సివచ్చింది. తెరచివున్న పెట్టెను చూచే ప్పటికిదంతా లలితకు జ్ఞప్తికి వచ్చింది.

శేఖర్ లలితవేపునుంచి దృష్టి మరల్చి ఒకసారి దగ్గి గొంతు సరిచేసుకుని "జాగ్రత్త! ఇంకేదైనా అవసరం కలిగితే అన్నయ్యనడిగిచిరునామా తెలుసుకునిజాబురాయి"అన్నాడు.

తర్వాత ఇద్దరూ కాస్సేపు మౌనం వహించారు. ఈ పర్యాయం తానుకూడా రావడంలేదనీ, అందుకు కారణము శేఖర్‌కి తెలిసిపోయివుంటుందన్న తలంపుతో లలిత సిగ్గుచే కృంగిపోతోంది.

శేఖర్ అన్నాడు. "ఇక వెళ్ళు" నేనింక సామాను సర్దుకోవాలి. ప్రొద్దెక్కింది. ఒక పర్యాయం ఆఫీసుకు వెళ్ళి రావాలి కూడాను."

లలిత తెరచివున్న సూట్‌కేసుముందు కూర్చుని 'నువ్వు వెళ్ళి స్నానం చెయ్యి, నేను సర్దుతాలే' అన్నది.

"అయితే మరీమంచిది" అని శేఖర్ తాళంచెవుల గుత్తిని లలితముందు పడేసి బయటికెళ్ళి ద్వారంవెలుపల టక్కున ఆగి"నాకేమేమి కావల్సివుంటాయో మరచిపోలేదు గదా?" అన్నాడు.

లలిత తలవంచుకుని సూటుకేసులోని వస్తువులను చూస్తున్నది. జవాబేమీ ఇవ్వలేదు.

శేఖర్ క్రిందకు వెళ్ళి కాళి చెప్పినదంతా నిజమో కాదోనని తల్లినడిగి తెలుసుకున్నాడు. గురుచరణుడు అప్పు తీర్చినదీ నిజమే! లలితకు వరుని వెదకుచున్నదీ నిజమే; అత డింకేమీ అడక్కుండానే స్నానానికి వెళ్లాడు.

తర్వాత సుమారు రెండుగంటలకు స్నానంచేసి, భోంచేసి ఆఫీసు దుస్తులు ధరించటానికి పైకి తనగదిలోకివెళ్ళి చూచి నిర్ఘాంతపోయాడు. ఆమె సూటుకేసుమీద తలపెట్టు కొని మెదలకుండా కూర్చొనివున్నది. శేఖర్ పదధ్వని విని ఆమె ఉలిక్కిపడింది. తలెత్తిచూచి వెంటనే దించేసుకున్నది. ఆమె కళ్ళు ఎర్రబడి వున్నై.

కాని, శేఖర్ ఆమెను చూడనట్లే దుస్తులు వేసు కుంటూ సహజంగా అన్నాడు "ఇప్పుడు నీవల్ల కాదులే లలితా, మధ్యాహ్నంవచ్చి సర్దులే" అన్నాడు. తర్వాత ఆఫీ సుకు వెళ్ళిపోయాడు. లలిత కళ్ళెర్రబడిన కారణం అతను గ్రహించాడు. కాని, అన్నివిషయాలు బాగా ఆలోచించ కుండానే ఏం చెప్పటానికీ సాహసం లేకపోయింది.

ఆవాళ సాయంత్రం మామకు టీ ఇవ్వటానికి వెళ్ళి నప్పుడు లలిత కుంచుకుపోయింది. శేఖర్కూడా వున్నాడు. అతడు గురుచరణునివద్ద సెలవు తీసుకోటానికి వచ్చాడు.

లలిత తలవొంచుకొని రెండుకప్పులు మేనమామకు గిరీంద్రునికి ఇచ్చింది. "శేఖర్ బాబుకి ఇవ్వలేదేం లలితా?" అన్నాడు గిరీంద్రుడు.

లలిత తలవొంచుకొనే మెల్లగా "శేఖర్ బావ టీ

త్రాగడు" అన్నది. గిరీంద్రు డింకేమీ మాట్లాడలా, లలిత టీ త్రాగని కారణంకూడా అతనికిప్పుడు జ్ఞప్తికి వచ్చింది.

టీ కప్పు చేత్తో పుచ్చుకొని వసునివిషయం ఎత్తాడు. కుర్రవాడు బి.ఏ. చదువుతున్నాడని వివరాలు చెప్పి "అయినా మన గిరీంద్రబాబుకు పిల్లవాడు నచ్చలేదు. చూట్టానికి అంత అందంగా వుండనిమాట నిజమేననుకోండి. అయినామగవాడికి అందం ఎందుకు, గుణంకావాలిగాని" అన్నాడు.

ఆయన చెప్పినదాని సారాంశం ఏమిటంటే ఎలాగైనా పెళ్ళి అయిపోతే ప్రాణం కుదుటబడుతుందట.

శేఖర్ గిరీంద్రులకిప్పుడిప్పుడే పరిచయమయింది. శేఖర్ అతనివంక చూచి నవ్వుతూ "గిరీంద్రబాబుకు ఎందుకునచ్చలా? అబ్బాయి చదువుతున్నాడుగదా స్థితికూడబాగున్నదంటిరే?" అన్నాడు.

శేఖరుడు ఏదో మామూలుగా అడిగాడేగాని, గిరీంద్రునకేలనచ్చలేదో, ముందుకూడ ఏలనచ్చదో అతడు బాగా ఎరుగును. గిరీంద్రుడు వెంటనే ఏమీ చెప్పలేకపోయాడు. అతనిముఖం ఎర్రబడింది. శేఖరుడు ఇదీ గ్రహించాడు. అతడిక లేచి "బాబాయ్, నేను రేపు అమ్మను తీసుకొని పడమటి దేశం తిరిగి రావటానికి వెళ్తున్నాను, సమయానికి నన్ను మర్చిపోకండేం?" అన్నాడు.

"అలా అంటావేం నాయనా! మీరేగా మాకుకావలసిన ముఖ్యులు. అదీగాక మీ అమ్మ లేకుండానే లలితపెళ్లా? ఏమమ్మాయ్! అంతేకదూ?" అని నవ్వుతూ తిరిగిచూస్తే

లలిత లేదు. "అరె, ఎప్పుడు వెళ్ళిపోయింది?" అన్నాడు గురుచరణుడు.

"ఈ సంగతి ఎత్తగానే లేచిపోయింది" అన్నాడు శేఖర్.

"అవును మరి, గాయకం వచ్చిందికదూ!" అని చిన్న నిట్టూర్పు వదలి "అమ్మాయి నా లక్ష్మి, సరస్వతికూడాను. ఇలాంటిపిల్ల అదృష్టముంటేగాని దొరకదు శేఖర్!" అంటూంటే కృశించిన ఆయనముఖంలో గంభీరవాత్సల్యంతో కూడిన మధురఛాయ చూచి గిరీంద్ర, శేఖర్లు యిద్దరూ లోలోపల ఆయనకు నమస్కరించకుండా వుండలేకపోయారు.

# 7

లలిత తేనీటి సమావేశంలోనుంచి లేచి పారిపోయి శేఖర్ గదిలోకి వచ్చి లైటువెలుతురులో పెట్టెలో అతనిబట్టలు సర్దసాగింది. శేఖరుడు వచ్చాక అతనిముఖం చూచి భయ విస్మయాలతో ఆమె డంగైపోయింది.

కోర్టులో ఓడిపోయి సాయంత్రం తిరిగివచ్చే మనిషి ముఖం గుర్తుపట్టలేకపోయినట్లే, ఈ ఒక్కగంటలోనే శేఖరుని ముఖాన్ని చూచి లలిత అతనేనా అనుకున్నంతపని అయింది. సర్వస్వం కోల్పోయినట్టి చిహ్నం అతని ముఖంమీద ముద్ర వేసినట్లుంది. శేఖరుడు క్షీణస్వరంలో "ఏం చేస్తున్నావు లలితా?" అన్నాడు.

లలిత ప్రత్యుత్తర మివ్వకుండానే లేచి వెళ్ళి అతని చేతిని చేతిలోకి తీసుకొని ఏడ్పుమొహంతో "ఏం జరిగింది శేఖరుబావా?" అనడిగింది.

"ఎక్కడా, ఏం జరగలేదే!" అని బలవంతంగా నవ్వు తెచ్చుకున్నాడు. లలిత కరస్పర్శతో అతని మొహంలోకి కొంత జీవకళ వచ్చింది. ఒక పీటమీద కూర్చుని "ఏంచేస్తున్నావ్?" అనడిగాడు మళ్ళీ

"ఓవరుకోటు పెట్టడం మర్చిపోయాను. అది పెట్టెలో పెడదామని వచ్చాను". శేఖరుడు వింటూంటే ఆమె మరింత తేరుకొని "నిరుడు రైల్లో నువ్వు చాలా ఇబ్బంది పడ్డావు. కోటులు చాలా వున్నాయిగాని, మందపాటిది ఒక్కటీలేదు. అంచేత తిరిగివచ్చాక ఇది కుట్టించి వుంచాను" అని చెప్పి ఒక కోటు తీసి అతనిముందుంచింది.

శేఖరుడు దాన్ని చేత్తో తీసిచూచి "ఎప్పుడూ?నాతో అననేలేదే!" అన్నాడు.

లలిత నవ్వి "నువ్వు గొప్పవాడివి. చెపితే ఇంతమోటు గుడ్డ కుట్టనిస్తావా? అంచేత చెప్పకుండానే కుట్టించి అట్టే పెట్టేను" అని కోటును పెట్టెలో పెట్టి "పైనే పెట్టేను, మూత తెరవగానే కనపడుతుంది. చలివేయగానే తీసి వేసుకో బద్ధ కించేవు, ఏం!" అన్నది.

"అలాగేలే" అని రెప్పలువాల్చకుండా కాస్సేపు ఆమె వంక చూస్తూవుండి "ఉఁ హుఁ, అలా జరగటానికి వీల్లేదు" అన్నాడు.

"ఏం జరగదు. తొడుక్కోవా?"

"ఉఁ హుఁ! ఆ సంగతికాదు. సరేగాని లలితా! అమ్మ సామానంతా సర్దటం అయిందేమో తెలుసా?"

"ఆ, మధ్యాహ్నం నేనే సర్దాను"అని పెట్టెకు తాళం వేసింది లలిత.

శేఖరుడు కొంచెంసేపు ఆమెకేసి చూస్తూవుండి వచ్చే సంవత్సరం నాగతేమిటి లలితా?" అన్నాడు.

లలిత మొహమెత్తి చూచి "ఏం?" అన్నది,

"అది నీకే తెలుసు" అని వెంటనే ఆవిషయం తప్పించడానికి లేని చిర్నవ్వు తెచ్చుకొని "పరాయివారింటికి వెళ్ళేముందు ఏది ఎక్కడున్నదో, ఏదిలేదో. అన్నీ నాకు చెప్పిపో. ఎంతవెతకినా కావలసింది కన్పడక ఇబ్బంది కల్గుతుంది" అన్నాడు.

లలిత కోపంగా "ఫో" అన్నది.

శేఖరుడికి నవ్వొచ్చింది."ఎలాగూ పోవాల్సిందేగా. కాని నాసంగతేంకావాలి చెప్పు? కోరికఎంతగావున్నా గవ్వొత్తు ఓపికలేదు. ఇవ్వన్నీ నౌకర్లు చేసేవికావు. ఇంక మీ మామయ్యలాగా-ఒకపంచె, కండువాలతో సరిపెట్టుకోవాలేమొ!" అన్నాడు.

లలిత తాళంచెవులగుత్తి నేలకేసి కొట్టిపారిపోయింది.

"రేపువుదయాన ఒకసారిరా"అని శేఖర్ కేకవేశాడు.

లలిత విన్పించుకోనట్టు గబగబమెట్లుదిగివెళ్ళిపోయింది.

సరాసరి తమ మేడపైకి వెళ్ళి ఒకమూల కూర్చొని బంతిపువ్వులు దండలు గుచ్చుతున్న అన్నాకాళివద్ద కూర్చున్నది. మంచులో "ఏంపనే?" అన్నది లలిత.

"మాపటికి మా అమ్మాయి పెళ్ళికదూ, దండగుచ్చుతున్నాను" అని చెప్పింది కాళి.

"ఎప్పుడూ నాతో చెప్పనేలేదే!"

"మొదట అనుకోలేదు. నాన్న పంచాంగం చూసి ఈరాత్రి తప్ప ఇంకీనెలలోనే లగ్నంలేదని చెప్పాడు. పిల్ల పెద్దదయిందాయె. ఇంకా ఆపటమెట్లాగు? ఎలాగో సాగనంపితే తీరిపోతుంది. అక్కా, రెండురూపాయ లివ్వవే, మిఠాయి తెప్పిస్తాను.

లలిత నవ్వి "డబ్బుకోసమైతే అక్కకావాలేం? పోయి నా తలగడదిండుక్రింద వున్నై తెచ్చుకో—ఏమే కాళీ, పెళ్ళికి బంతిపూలదండలా?" అన్నది.

కాళి గంభీరంగా చెప్పింది—"ఇంకే పువ్వులూ దొరక్కపోతే ఏంచేస్తాను? నే నెందరు ఆడపిల్లలకు పెళ్ళిళ్లుచేసి పంపలేదు అక్కా? నాకు అన్నీ తెలుసులే" అని మిఠాయి తెప్పించేందుకు క్రిందకు వెళ్ళింది.

లలిత అక్కడే కూర్చుని దండ గ్రుచ్చుతున్నది.

కాస్సేపటికి కాళి తిరిగివచ్చి "అందరికీ చెప్పాను. ఒక్క శేఖరన్నయ్యే మిగిలిపోయుండు. పోయి చెప్పివస్తాను, లేకపోతే కోపం వస్తుంది" అని మళ్ళీ వెళ్ళింది.

కాళి పెద్ద ఆరిందాలాగా అన్నీక్రమప్రకారంచేస్తుంది శేఖర్‌తో చెప్పివచ్చి "అన్నయ్యకి ఒకదండ కావాలట. నువ్వు పట్టుకెళ్ళి ఇచ్చిరా అక్కా! నేనిక్కడ ఏర్పాటుచూసుకుంటాను. ఇంకెంతో వ్యవధికూడ లేదు" అన్నది.

లలిత తలవంచి "నేను వెళ్ళలేను, నువ్వు పోయి యిచ్చిరా కాళీ!" అన్నది.

"సరే, వెళ్తానే, ఆ పెద్దదండ యిలా యివ్వు."

లలిత దండతీసి ఇవ్వబోయి, మళ్ళీ ఏం తోచిందో "పోనీ నేనే ఇచ్చివస్తాలే" అన్నది.

"మరీ మంచిది. నువ్వే వెళ్లు అక్కా, నాకు చచ్చినంత పనుంది" అన్నది కాళి గంభీరంగా.

ఆమె మొహంలోని భావగాంభీర్యత, మాటల తీరు చూచి లలితకు నవ్వొచ్చింది. "చాలా ముసల్ది అయిందే!" అనుకుని దండతీసుకుని బయల్దేరింది. ద్వారంవద్దకు పోయి చూస్తే శేఖర్ తదేకధ్యానంతో జాబురాస్తున్నాడు. తలుపు తెరచుకొనివెళ్ళి వెనకాల నుంచున్నది. అయినా శేఖర్‌కి తెలియదు. కాస్సేపు నిశ్శబ్దంగావుండి శేఖర్‌ని ఉలిక్కి పడేటట్టుచేద్దామని జాగ్రత్తగా దండలు అతనిమెడకు తగిలించింది. శేఖరుడు ఉలిక్కిపడి "కాళీ!" అన్నాడు కాని మరుక్షణంలోనే మెడత్రిప్పి చూచి అతిగాంభీర్యంగా "ఏం పనిచేశావు లలితా?" అన్నాడు.

లలిత శేఖరునిమొహంలోని భావం చూచి శంకించి శద్దై "ఏఁ, ఏం జరిగింది?" అని అడిగింది.

శేఖర్ మొహంలోని గాంభీర్యతను చెదరనీకుండా "ఏం జరుగుతుందో తెలియదూ! ఈ రాత్రి దండవేయట మంటే ఏమిటో కాళి నడిగిరా" అన్నాడు.

లలిత కిప్పుడు బోధపడింది. క్షణంలో ఆమె మొహం సిగ్గుచే ఎర్రబడింది. "అదికాదు, కాదు, ఎన్నటికీ కాదు" అంటూ గదిలోనుంచి పారిపోయింది.

"వెళ్ళమాకు లలితా! ఒకమాట వినిపో. స్త్రీతో అప సరమైన పని" అని శేఖర్ పిల్చాడు

శేఖర్ పిలుపు విన్నా విననట్లే ఆగకుండా తన గది లోకి వెళ్ళిపోయింది. మంచంమీద పడుకుని కళ్ళుమూసు కొని ఆలోచించుతోంది.

గత ఐదారు సంవత్సరాలనుంచీ ఆమె శేఖర్ సంప ర్కంలోనే పెద్దదయింది. గాని, ఇలాంటి మాట ఎన్నడూ విన్లేదు. అసలు పరిహాసకాలాడే స్వభావమేకాదు శేఖర్‌ది. అదీగాక లజ్జాకరమైన మాట అతనినోటినుంచి వస్తుందనైనా ఆమె గ్రహించజాలదు. సిగ్గుచే పావుగంటసేపు పక్క మీదపడుండి లేచింది. అసలే శేఖర్‌కి భయపడుతూవుంటుంది. అందువల్ల అతను అవసరమైన పనున్నదన్నాడుకదా! వెళ్దామా వద్దా అని ఆలోచించసాగింది. ఇంతలోనే వారి యింటి పని మనిషి "లలితమ్మగారేరి? చినబాబుగారు పిలుస్తున్నారు" అంటూ బయట అడుగుతున్నది. వెంటనే లలిత బయటికి వచ్చి "నేను వస్తున్నా, నువ్వు పద" అన్నది.

పైకివెళ్ళి తలుపుసందులోంచి చూస్తే శేఖరుడు ఇంకా వుత్తరం రాస్తూనేవున్నాడు. కొంచెంసేపాగి "ఏమిటి?" అనడిగింది లలిత.

శేఖర్ వ్రాస్తూనే "దగ్గరకు రా చెప్తాను" అన్నాడు.

"ఉఁ హుఁ, ఇక్కడే వుంటాను చెప్పు."

శేఖర్ లోలోపల నవ్వుకొని "హఠాత్తుగా ఇలా చేశావేమిటి చెప్పు?" అన్నాడు.

లలిత అలకచెందిన స్వరంతో "ఛో, మళ్ళీ అదేనా!" అన్నది.

శేఖరుడు ఆమె వేపుతిరిగి 'నాదేముంది?నాతప్పేమైనా వున్నదా? నువ్వేగా!' అన్నాడు.

"నే నేం చెయ్యాలా.నువ్వు దాన్ని తిరిగి ఇచ్చెయ్యి."

"ఇందుకే పిలిచాను లలితా! దగ్గరకు రా, ఇచ్చేస్తాను. నువ్వు సగంపనిచేశావు. మిగతా సగం నేను పూర్తి చేస్తాను రా."

లలిత ద్వారంవద్దే ఒకక్షణం నిలబడివుంది "నేను నిజం చెప్తున్నాను. నువ్విలా పరిహాసంచేస్తే నే నింక నీ దగ్గరకు రాను. ఇదిగో చెప్తున్నాను. దండ నా కిచ్చెయ్యి" అన్నది.

"తీసుకెళ్ళు."

"విసిరేయి."

శేఖరుడు తలాడించి"దగ్గరకురాని దే ఇవ్వను''అన్నాడు.

"అయితే నా కక్కరేదులే"అని లలిత కోపంతో వెళ్ళిపోయింది.

"కాని సగంలోవుండిపోయింది!"అని కేకేశాడు శేఖర్

"ఉంటే వుండనీ" అని లలిత వెళ్ళిపోయింది. గాని క్రిందకు పోలేదు. పైనే తూర్పువేపున పిట్టగోడపట్టుకు నుంచున్నది. అప్పుడు ఆకాశంలో చంద్రుడు పైకి లేస్తున్నాడు. పైన ఆకాశం నిర్మలంగావుంది. ఆమె ఒక్కసారి శేఖరుని గది వేపుచూచి తర్వాత పైకి చూస్తున్నది. ఆమెకు కళ్ళుమండుతున్నవి. లజ్జాభిమానములచే కళ్ళ నీరు క్రమ్మింది. ఈ మాటలభావం తెలుసుకోజాలనంత చిన్నపిల్ల కాదు. మరి ఎందుకింత హృదయానికి బాధకలిగించే పరిహాసం చెయ్యాలి! తా

నెంత హీనురాలో, అతని కెంత దిగువనున్నదో కూడా గ్రహించగల వయసున్న దామెకు. తాను అనాథ, నిరాశ్రయురాలు అయినందువల్లనే అంతా తన్ను ప్రేమగా చూస్తున్నారనీ తెలుసు. శేఖరూ ప్రేమిస్తున్నాడు, అతని తల్లీ ప్రేమిస్తున్నది. తనకు నాఅన్నవారెవరూ లేరు. ఆమెకు బాధ్యత వహించినవారెవరూ లేనందుననే గిరీంద్రుడు పరాయివాడయి వుండికూడ ఆమె నుద్ధరించే తలంపును వెల్లడించగలిగాడు.

లలిత కళ్లుమూసుకొని తనలో అనుకుంటోంది. ఈ కలకత్తా సంఘంలో తనమామస్థితి శేఖరుని కుటుంబంముందు ఎంతహీనం! అటువంటిమామ నాశ్రయించివున్నభారం తాను! అటు సమానస్థాయీలోవున్న కుటుంబంతో శేఖరుడి పెండ్లి సంభాషణలు జరుగుతున్నై. రెండురోజులు వెనకో ముందో అతనిపెళ్ళి అయిపోవటం ఖాయమే. ఈ పెళ్లికి నవీనరాయి ఎంతడబ్బు గుంజుతాడో అదీ శేఖర్‌తల్లి చెప్పగా విన్నది.

మరి శేఖరుడు తన్నివాళ అకస్మాత్తుగా ఎందు కవమానించాడు? ఇవన్నీ ఆలోచించుకుంటోంది. లలిత ఎదుట శూన్యంగా చూస్తూ, ఇంతలో వులిక్కిపడి వెనుదిరిగి చూస్తే శేఖరుడు నిలబడి నవ్వుతున్నాడు. తాను వేసినట్లే శేఖరుడు తనమెళ్ళో దండవేశాడు. ఆ బంతిపూలదండ సరిగ్గా అదే రీతిని తనకు తిరిగివచ్చింది. ఏడ్పు ముంచుకొచ్చి ఆమెకంఠం ఆగినట్లయింది. అయినా "ఎందు కిలా చేశావ్?" అని తీవ్రంగా అడిగింది.

"నువ్వెందుకు వేశావు?"

'నే నేమీ వేయలా' అని ఆమె దండను త్రెంచి పార వేసేందుకు చెయ్యి ఎత్తింది. కాని, శేఖరుని మొహంవంక చూచి టక్కున ఆగిపోయింది. ఇంక త్రెంచిపారవెయ్య డానికి సాహసించలేకపోయింది. ఏడుస్తూ అన్నది. నాకెవరూ లేర నేగా నువ్వు న న్నిలా అవమానించటం?"

ఇంతవరకూ మందహాసంచేస్తున్న శేఖరుడు లలిత మాట విని స్తబ్ధుడైపోయాడు. అదేమీ తెలివితక్కువ పిల్లల మాట కాదు! "నే నవమానించుతున్నావా? నువ్వు నన్నవ మానించుతున్నావా?" అన్నాడు.

లలిత కళ్ళు తుడుచుకుంటూ భయపడుతూనే 'నేనేం అవమానించాను?' అనడిగింది.

శేఖరుడు ఒక క్షణం నిశ్చలంగా వుండి అన్నాడు 'కాస్త ఆలోచించి చూస్తే నీకే తెలుస్తుంది. ఈమధ్య నువ్వు చాలా అతిగా పోతున్నావ్ లలితా. ఊరువదలిపెట్టి వెళ్లే ముందు నేను దాన్ని కట్టివేశాను."

లలిత ఇంకేమీ మాట్లాడకుండా నుంచున్నది. పండు వెన్నెల్లో ఇద్దరూ స్తబ్ధులై నిలబడి వున్నారు. క్రిందనుంచికాళీ పిల్లపెళ్ళి శంఖారావంమాత్రం వినపడుతోంది.

కొంచెంసేపు మౌనంగా వుండి "ఇక మంచులో నుంచోకు, క్రిందకు వెళ్ళు" అన్నాడు శేఖరుడు.

'వెడుతున్నాను' అని లలిత అతనిపాదాలపైకి వొరిగి ప్రణామంచేసి, లేచి నిలబడి మెల్లగా "నే నేం చెయ్యాలో చెప్పు" అన్నది.

శేఖరుడు నవ్వాడు. మొదట కొంచెం సందిగ్ధంలో పడ్డాడుగాని, తర్వాత రెండుచేతులూ చాచి ఆమెను లాగి తన యెద కదుముకొని పెదవులపై ముద్దాడి ఏమీ "చెప్పనక్కర్లేదు లలితా, ఇవాళ్టినుంచీ నీకే తెలుస్తుందిలే" అన్నాడు.

ఒళ్ళంతా గగుర్పొడిచి లలిత కంపించిపోయింది. వెంటనే ఎడంగా వెళ్ళి "నేను అకస్మాత్తుగా నీ మెడలో దండ వేశాననేనా యిలా చేశావు?" అన్నది.

శేఖర్ నవ్వి తల ఆడించుతూ "కాదు, కాదు. నేను చాలారోజులనుంచీ ఆలోచించుతున్నానుగాని, ఏమీ నిర్ణయించలేకపోయాను. ఇవాళ నువ్వు లేనిదే నేను వుండలేనని బాగా తెలిసిపోయింది—గనుకనే ఈ నిశ్చయానికి వచ్చాను"

"కాని మీనాన్నగారు వింటే మహా మండిపడతారు; అమ్మవింటే దుఃఖిస్తుంది - ఇది జరుగదు శే .."

నాన్నగారికి కోపంవచ్చేమాట నిజమే; కాని అమ్మ చాలా సంతోషిస్తుంది. సరే, దానికేంలే, పోనీ! జరగాల్సింది జరిగిపోయింది. ఇంక నువ్వూ కాదనలేవు. నేనూ కాదనలేను. క్రిందికిపోయి అమ్మకు నమస్కారంచేసిరా!

## 8

మూడుమాసాల అనంతరం ఒకనాడు గురుచరణుడు విచారముఖంతో నవీనరాయిగదిలోకి వెళ్ళి ఆయనముందు తివాచీమీద కూచోబోతూండగానే నవీనబాబు "వద్దు,వద్దు. ఇక్కడకాదు, ఆ పీటమీద కూర్చో. నే నీ కాని వేళ స్నానం చెయ్యలేను .ఏమయ్యా, నువ్వు జాతిని వదిలేశావా?" అని అడిగాడు.

గురుచరణుడు దూరంగా పీటమీద కూర్చొని తల వంచుకున్నాడు. నాల్గురోజులక్రితం ఆయన నియమానుసారంగా దీక్షగైకొని బ్రహ్మసమాజంలో చేరాడు. ఈ సంగతే రకరకాలుగా నవీనబాబు చెవిని పడింది. గురుచరణుడు మెదలకుండా కూచునివున్నాడు. ఆయన ఎవరినీ అడక్కుండానే ఈ పని చేశాడు. ఇందుకు ఆయన యింట్లోను ఏడ్పులు మొత్తుకోళ్ళకు తక్కువేమీ లేదు.

గురుచరణుడు నీరుక్రమ్మిన కళ్ళెత్తి "నిజమేనండి" అన్నాడు.

"ఎందుకు చేశావయ్యా ఆపని? నీజీతం అరవయ్యేగదా. నువ్వు —" కోపతీవ్రతచే నవీనరాయినోట మరి మాట రాలేదు.

గురుచరణుడు కళ్ళుతుడుచుకొని,, బిగపట్టిన గొంతు సరిచేసుకొని "ఆలోచన లేకపోయింది అన్నయ్యా! అప్పుడు దుఃఖంలో మెడకు వురివేసుకొని చావాలో, బ్రహ్మసమాజంలో చేరాలో ఏమీ తోచలేదు. చివరికి ఆత్మహత్యచేసుకునేకంటే అందులో చేరిపోదామనే అనుకున్నాను" అని చెప్పాడు.

ఆయన ఇంక వుండలేక కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయుండు.

నవీనరాయి వెనకాల బిగ్గరగానే యిలా అన్నాడు— "మంచిపని చేశావు! నీ మెడకి వురివేసుకోకుండా జాతికి వురికి తగిలించావన్నమాట. పో, పో! ఇంక నీ పాడుమొహం మాకు చూపించమాకు. ఇప్పుడు సలహాఇచ్చినవారితోనే

వుండు. ఆడపిల్లల్ని మాల - మాదిగవాళ్ళకిచ్చి పెళ్ళిళ్ళు చెయ్యి!"

కోపం, అభిమానములు కారణంగా నవీనరాయి ఏం చెయ్యడానికీ తోచలేదు. గురుచరణుడు తన చేయిదాటి పోయాడు. ఇంక గుప్పిట్లోకి వచ్చేవిధం తెలియక కోపావేశంతో మండిపడ్డాడు. గురుచరణుని ఇంకేవిధంగానూ ఇబ్బంది పెట్ట లేక గోడకట్టువారిని పిలిపించి మేడపైనుంచి వారి మేడ మీదికివున్న దారిని బందుచేయించాడు.

ఎక్కడో దూరాన ప్రవాసంలోవున్న భువనేశ్వరి ఈ సంగతి తెలిసి కన్నీళ్ళుకార్చింది. "ఆయన కెవరు చెప్పారా యీ బుద్ధి?" అన్నది కొడుకుతో.

శేఖర్ కి ఆచెప్పిన దెవరో తెలుసు. కాని అదేమీ ఎత్తకుండానే "అమ్మా, నాలుగురోజులుపోతే మీరే వెళ్ళ గొట్టేవారు జాతిలోంచి వారిని. మరి ఆయన ఇందరు ఆడ పిల్లల పెళ్ళిళ్ళు ఎలా చేస్తాడు?" అన్నాడు.

భువనేశ్వరి "ఏదీ ఆగిపోదు నాయనా! అందుకోసమే జాతిని వదిలిపెట్టాల్సివస్తే అలా చాలామంది చెయ్యాలే! ఈ భూమ్మీద వదిలిన దేవుడే వారిభారమూ వహిస్తాడు" అన్నది.

శేఖరుడు మాట్లాడనేలేదు. తల్లి కళ్ళుతుడుచుకుంటూ ఇంకా చెపుతున్నది "లలితను వెంటబెట్టుకొనివస్తే దాన్నె లాగో నేనే ఒకఒడ్డున పడెయ్యాల్సొచ్చేది. ఎలాగూ తప్పేది కాదు. గురుచరణుడు ఈ ఉద్దేశ్యంతోనే పంపలేదని నేనను కోనేలేదు. నిజంగా దానికి పెళ్ళవుతుందనే అనుకున్నాను."

శేఖరుడు తల్లి మొహంకేసి చూచి కొంచెం సిగ్గుపడి అన్నాడు... "మంచిదేనమ్మా, ఇప్పుడు యింటికివెళ్లాక ఆపని చెయ్యి. ఆమె తానేమీ బ్రహ్మసమాజంలో చేరలేదుగా. వాళ్ళ మేనమామ చేరాడూ, నిజమాలోచించితే ఆయన మాత్రం ఆమెకు కావలసినవాడా యేం? ఇంకెవరూ లేంనే లలిత వారియింట్లో వుంటున్నది.'

భువనేశ్వరి కొంచెమాలోచించి "అది నిజమే ననుకో. కాని మీనాన్నగారి స్వభావం వేరు. వారేవిధంగాను ఒప్పుకోరు. అసలు వాళ్ళని కలుసుకోనివ్వక పోవచ్చుకూడాను" అన్నది.

ఇదే సందేహం శేఖరుడుకీ కల్గింది. ఇంకేం మాట్లాడకుండా యెటో వెళ్ళిపోయాడు. ఇంక అతనికి ఆ దూరప్రాంతతంలో ఒక్క నిమిషంకూడ ఉండాలనిపించలేదు. రెండు మూడు రోజులు విచారంగా, దిగులుతో ఇటూ అటూ తిరిగి ఒకనాటి సాయంత్రం తల్లివద్దకు వెళ్ళి "ఇక్కడేం బాగుండ లేదు అమ్మా; ఇంటికి వెళ్దాం" అన్నాడు.

భువనేశ్వరి వెంటనే సమ్మతించింది "సరే వెళ్దాం, పదరా అబ్బాయ్! నాకూ ఇక్కడేమీ బావుండలేదు" అన్నది.

ఇంటికి చేరి తల్లీ కొడుకు లిద్దరూ మేడమీది అవతలి యింటికి వున్నదారి కాస్తా పూడ్పించి వుండటంచూచారు. వా రిద్దరూ ఎవర్నీ ఏమీఅడగకుండానే గురుచరణుని కుటుంబంతో ఏలాంటి సంబంధము—నోటి మాటలు కూడా నవీన రాయి కిష్టంలేనట్లు గ్రహించారు.

రాత్రి శేఖరుడు భోంచేసేటప్పుడు తల్లిదగ్గరేవున్నది.

ఏదో ఒకటి రెండు మాటలు జరిగినాక "నేను మొదట్నుంచీ అనుకుంటున్నట్లు లలిత పెళ్ళి గిరీంద్రునితోనే అవుతోంది" అని చెప్పింది.

శేఖరుడు తలెత్తకుండానే "ఎవరన్నారు?" అనడిగాడు.

"దాని నోటనే. మధ్యాహ్నం మీ నాన్నగారు నిద్ర పోతుండగా వాళ్ళింటికి వెళ్ళాను." ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు ఉబ్బిపోయినై. ఒక క్షణం ఆగి కన్నీరు తుడుచుకొని "ప్రారబ్ధం శేఖర్! నుదుటిరాత ఎవరూ తప్పించలేరు. ఎవరినంటే ఏం లాభం? అయినా గిరీంద్రుడు మంచిపిల్లాడేలే. డబ్బున్న వాడు లలితకేమీ కష్టముండదు" అన్నది.

శేఖరుడు జవాబేమీ చెప్పలేదు. తలవంచుకునే పళ్లెం లోని పదార్థాలు అటూ ఇటూ త్రోసి పారేస్తున్నాడు. తల్లి అవతలికి వెళ్ళగానే లేచిపోయి పక్కమీద పడుకున్నాడు.

మరునాటి సాయంత్రం షికారుకు వెళ్తున్నాడు. అదే సమయంలో గురుచరణుని యింట్లో తేనీటిసమావేశం సాగుతున్నది. సంభాషణలు, పరిహాసాలు సాగుతున్నాయి. ఆ ధ్వని చెవినిబడగానే నడుస్తున్న శేఖరుడు నిలబడి ఏమాలోచించుకున్నాడోగాని, మెల్లగా గురుచరణుని బయటిగదిలోకి వెళ్ళాడు. అతడు వెళ్ళగానే ఒక్కసారిగా మాటలు, నవ్వులు ఆగిపోయి అందరిచూపులు శేఖరుని వేపు మళ్ళాయి.

శేఖరుడు వ్యాళ్ళోకి వచ్చినట్లు లలితకుతప్ప ఇంకెవరికీ తెలియదు. ఇవాళ ఆ సమావేశంలో గిరీంద్రుడుగాక మరొక వ్యక్తి కూడా వున్నాడు. ఆయన విస్మితుడై శేఖర్ కేక

చూస్తున్నాడు. గిరీంద్రుడు గాంభీర్యత వహించి గోడవేపు చూస్తున్నాడు. అందరికంటె బిగ్గరగా మాట్లాడుతున్న గురు చరణుని మొహంకూడా తెల్లబడింది. లలిత అక్కడే టీ కలుపుతున్నది. ఆమె ఒకసారి తలెత్తి చూచి దించేసుకున్నది.

శేఖరుడు ముందుకు వెళ్ళి నమస్కరించి బెంచిమీద ఒకమూల కూర్చుని "ఇదేమిటి? ఒక్కసారిగా అందరూ మాట్లాడడం మానేశారు?" అన్నాడు.

గురుచరణుడు మెల్లగా ఆశీర్వదించాడుగాబోలు! పైకిమాత్రం మీా స్పష్టంగా వినపడలేదు.

శేఖరుడు ఆయన మనోభావం గ్రహించి తేరుకోవటానికి అవకాశమిస్తూ తానే మాట్లాడ నారంభించాడు. నిన్న పుద యం ఫ్లాట్కి వచ్చినట్లూ, తల్లి ఆరోగ్యం కొంత కుదుటబడిన సంగతీ, పశ్చిమదేశ యాత్రావిశేషాలూ అనర్గళంగా చెప్పి చెప్పి—నూతనయువకుని మొహంకేసి చూచి హాసం వహిం చాడు. గురుచరణు డప్పటికి బాగా తమాయించుకున్నాడు. నూతనయువకుని పరిచయంచేస్తూ 'ఈయన మన గిరీంద్రుని స్నేహితుడు.ఒకేవూరు, ఒకచోటనే యిల్లూను. ఇద్దరూకలిసే చదువుకున్నారు. చాలామంచివాడు, యోగ్యుడూను. శ్యామ్ బజారులో వుంటున్నా మాతో పరిచయమైనప్పట్నుంచీ తరుచుగా వస్తున్నాడు.'

శేఖరుడు మెడాడించి తనలో 'అవును. చాలాచాలా యోగ్యుడు!' అనుకొని, కొంచెమాగి "బాబాయ్, అంతా క్షేమమేకదూ?" అన్నాడు.

గురుచరణుడు అందుకేమీ మాట్లాడక శేఖరుడు వేస్తుంటే చూచి గద్గదకంఠంతో "నాయనా! అప్పుడప్పుడు వస్తూండేం! మన్నుల్ని సొంతం వదిలెయ్యిమాకు—అన్నీ వినేవుంటావు" అన్నాడు.

"ఆ, వినకేం" అని శేఖరుడు ఇంట్లోకి వెళ్ళాడు.

మరుక్షణంలోనే లోపల గురుచరణునిభార్య ఏడ్వటం వినపడింది. బయటకూర్చున్న గురుచరణుడు పంచెచెంగుతో కళ్ళు తుడుచుకుంటూ తలవొంచుకున్నాడు. గిరీంద్రుడు. అప రాధివలె మొహంపెట్టి కిటికీగుండా బయటికి చూడసాగాడు. లలిత ముందే అక్కణ్నుంచిలేచిపోయింది.

కాస్సేపటికి శేఖరుడు వంటింట్లోంచి వచ్చి వసారా దాటి ప్రాంగణంలోకి వెళ్ళబోతూ తలుపుచాటున చీకట్లో నిలబడివున్న లలితను చూచాడు. ఆమె నేలకు వంగి ప్రణా మంచేసి లేచి నుంచున్నది. ఆమె మొహం శేఖరుని రొమ్ము నానుకున్నంత సమీపంగావుంది. ఒకక్షణం నిలచి ఏమా లోచించిందో కాని తర్వాత నిరాశతో వెనక్కి తగ్గి 'నా వుత్త రానికి జవాబే ఇవ్వలేదేం?' అనడిగింది.

'ఎప్పుడు? నాకేమీ జాబు అందలేదే. ఏంరాశావు?'

'చాలా సంగతులు రాశాను. పోనివ్వు ఇప్పుడెందుకు. అన్ని విషయాలు విన్నావుకదూ! ఇప్పుడు నన్నేం చెయ్య మంటావో చెప్పు?'

శేఖరుడు ఆశ్చర్యపడినవాడై 'నేను చెప్పాలా? నేను చెప్పడ మేమిటి?' అన్నాడు.

లలిత సందేహాస్పదంగా అతని మొహంకేసి చూస్తూ 'ఏం?' అంది.

"కాకపోతే ఏమిటి లలితా? నే నెవర్ని ఆజ్ఞాపించను?"

"నన్నే. ఇంకెవర్ని ఆజ్ఞాపించుతావు?"

"నిన్నుమాత్రం ఎందుకని ఆజ్ఞాపించాలి? నేను చెప్పినా నువ్వెందుకు వింటావు?" అంటూంటే శేఖర్ స్వరం గంభీర మైనది.

లలిత లోలోపల భయపడిపోయింది. మళ్ళీ బాగా దగ్గరకు వచ్చి గాద్గదికంగా అన్నది—"వెళ్లి, ఇప్పుడు నీ పరిహాసం ఏమీ బాగుండలేదు. నీ కాళ్ళు పట్టుకుంటాను. ఏం జరగాలో చెప్పు. భయంతో నాకు రాత్రిళ్ళు నిద్రపట్టడంలేదు.

"భయ మెందుకు?"

"నువ్వు బలేవాడివే! భయంగా వుండదూ? నువ్వా దగ్గర్లో లేకపోయావు; అమ్మా లేకపోయింది. ఇంతలో మామయ్య ఏం చేసి కూచున్నాడో! ఇప్పుడు అమ్మ నన్ను తన యింట్లోకి తీసుకోకపోతే?"

శేఖర్ ఒక్క క్షణ మూరకుండి 'అదినిజమే. అమ్మ తీసుకోవటానికి యిష్టపడదు. మీ మామయ్య ఇతరులవద్ద డబ్బు పుచ్చుకున్నాడుగా. ఇవన్నీ ఆమెకు తెలిసిపోయినై. అదీగాక నువ్విప్పుడు బ్రహ్మసమాజానికి చెందినదానవు. మేమేమో హిందువులము!' అన్నాడు.

ఇంతలో వంటింట్లోంచి అన్నాకాళి "అక్కా, అమ్మ పిలుస్తోంది" అని కేక వేసింది.

లలిత 'ఇదిగో వస్తున్నా' నని బిగ్గరగా చెప్పి మెల్లగా "మామయ్య ఎందులో చేరినా నేను నీతోపాటే. అమ్మ నిన్ను వదల్లేకపోతే నన్నూ విడిచిపెట్టదు. ఇక గిరీంద్రబాబు వద్ద తీసుకున్న డబ్బు సంగతి. ఆయన డబ్బు తిరిగి ఇచ్చి వేయబడుతుంది. అప్పుతీర్చడం రెండు రోజులు ఆలస్యమైతే కావచ్చు. కాని తప్పదుగదా!" అన్నది.

"అంతడబ్బు ఎక్కడనుంచి తెచ్చి తీరుస్తావు?" అనడిగాడు శేఖర్.

లలిత శేఖర్ మొహంవంక ఒకక్షణం చూచి "ఆడ వాళ్ళకు డబ్బెక్కణ్ణుంచి వస్తుందో తెలియదూ? నాకూ అలాగే వస్తుంది" అన్నది.

శేఖరుడు ఇంతవరకూ నిబ్బరంగా మాట్లాడుతున్నా లోలోపల మండుతూనే వున్నాడు. ఇంక పట్టలేక "కాని మీ మామయ్య నిన్ను అమ్మివేశాడుగా"అన్నాడు వ్యంగ్యంగా.

లలిత చీకట్లో శేఖరుని మొహంలోనిభావం చూడ లేక పోయినా, స్వరంలోని పరివర్తనను కనిపెట్టింది. తానూ గట్టిగానే జవాబిచ్చింది–"అదంతా శుద్ధఅబద్ధం. మామయ్య లాంటి మనుష్యులీ ప్రపంచంలో బహుకొద్దిమందే వుంటారు. నువ్వాయన్ను హేళన చెయ్యొద్దు. ఆయన కష్టాలు, దుఃఖం నీకు తెలియకపోవచ్చు. కాని, లోకానికి తెలుసు" అని అటూఇటూ చూచి "ఆయన డబ్బు తీసుకున్నదైనా నా పెళ్ళికి ముందే. ఆయనకు నన్ను అమ్మే అధికారమూ లేదు, అసలాయన అమ్మనూలేదు. ఆ అధికారం వున్నది నీకొక్క డికే, డబ్బు ఇవ్వాల్సి వస్తుందన్న భయంతో నువ్వు అమ్మా

లనుకుంటే అమ్ముకోగలవు!" అని అతని ప్రత్యుత్తరానికైనా వేచియుండక చరచరా వెళ్ళిపోయింది.

## 9

ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు శేఖరుడు విహ్వలుడై బజార్ల వెంట తిరుగుతున్నాడు. తర్వాత యింటికి వెళ్ళి ఆలోచించసాగాడు—ఆ చిన్నపిల్ల లలిత ఇన్ని మాటలుఎక్కడ నేర్చింది? సిగ్గులేకుండా తన మొహంమీద ఎలా అనేసిందో!

ఇవాళ లలిత ప్రవర్తనతో నిజంగానే అతడు విస్మితుడు, క్రుద్ధుడు కూడ అయినాడు. కాని, అతడు శాంత చిత్తంతో ఆలోచించిచూస్తే యీ కోపం యదార్థానికి లలితపై కాదనీ, తనపైనేననీ తెలుసుకుంటాడు.

లలితను విడచి ఈమధ్య ప్రవాసంలో వుండగా శేఖర్ తన్నుగూర్చి చాలా యోచించుకున్నాడు. సుఖ—దుఃఖాలు; లాభ—నష్టాలను ఊహల్లో లెక్కవేసుకొని తనజీవితంలోలలిత కెట్టిస్థానమున్నదో, భావిలో ఆమె తోడి బంధనము ఎలా త్రెంచరానిదో,ఆమెలేనిదే తనజీవిత మెంత కష్టదాయకమో ...ఇవన్నీ ఆలోచించేవాడు. లలిత చిన్నప్పట్నుంచీ తమ కుటుంబంలో కలిసిమెలసి తిరుగుతోంది. కాబట్టే ఆమెను తన తల్లిదండ్రులు, సోదరీ సోదరులతో కలిపి సమానంగానే చూడలేదు. అసలట్టిభావమే తోచలేదు. లలితను తాను పొందలేక పోవచ్చుననీ, తల్లిదండ్రు లీ వివాహానికి సమ్మతించరనీ, బహుశ ఆమె మరొకరిది అయిపోవచ్చునన్న ఆలోచన అతన్ని వదలకుండా వస్తున్నది. ఇందువల్లనే తాను యాత్రకు

బయల్దేరేముందు బలవంతంగా ఆమె మెళ్ళో దండ వేసి లలిత ఇంకొకరిది కాకుండా ఆ వేపు ద్వారం మూసివేశాడు.

ప్రవాసంలో ఉన్నప్పుడు గురుచరణుకు బ్రహ్మసమాజంలో చేరిన సంగతి విని అతడు రాత్రింబగళ్ళు లలిత నెక్కడ పోగొట్టుకోవాల్సి వస్తుందోనని విచారపడుతూండేవాడు. సుఖమో, దుఃఖమో ఏదైనాగానీ అతడా విచారమే ఎరుగును. కాని ఇవాళ లలిత స్పష్టంగా అన్నమాటలు అతని ఆ రకమైన ఆలోచనలు కట్టివేసి, రెండో మార్గంపట్టించింది. లోగడ లలిత లభ్యం కాదేమోనన్న విచారం ఇప్పుడుపోయి ఇంక ఆమెను వదలిపెట్టటానికి వీల్లేదన్న చింత యేర్పడింది.

శ్యామ బజారు సంబంధం చెడిపోయింది. వారు వీరి ధనతృష్ణ తీర్చలేక వెనకడుగు వేశారు. శేఖర్ తల్లికి ఆ పిల్ల నచ్చలేదు. కాబట్టి శేఖరునికి స్థిమితం చిక్కింది. నవీనరాయి ఇరవై వేల రూపాయల మూటపైనె నిలబడి వున్నాడు.

ఇప్పుడేం చెయ్యాలి? అని శేఖరుడు ఆలోచించుతున్నాడు. ఆ నాటి రాత్రి తను చేసిన పని ఇంత గంభీర సమస్య అవుతుందని, లలిత తన్నింతగా విశ్వసించుతుందని, ఆమె తన పెండ్లి జరిగిపోయినట్లే ఎంచుతుందని, ఇందుకే కారణంవల్లా అది మారదనే నమ్ముతోందనీ అతడు ఆలోచించలేదు. 'జరగవలసినదేదో జరిగిపోయింది. ఇంక నువ్వూ కాదనలేవు, నేనూ కాదన' నని తన నోటితోనే అన్నాడు. కాని ఇవాళ ఆలోచించుకొని చూచుకున్నట్లుగా అప్పుడాలోచించేశక్తి అతనిలోలేదు. ఇంత అవకాశమూ లేదు. అప్పుడు తలపైన చంద్రుడు వున్నాడు. నలువైపులా వెన్నెల ప్రకాశించుతోంది. మెడలో మాల వ్రేలాడుతున్నది.

ప్రేయసిపక్షోజాలు తన యెద నానుకోవడం అతనికిప్రథమాను భూతి. ప్రేమికులు అధరామృతమని అనేదాన్ని పానంచెయ్యా లన్న మహాోద్రేకం. ఆ సమయంలో స్వార్థము, కుటుంబ మంచిచెడ్డల యోచనేలేదు. తల్లి లలితనెలాగా అత్యంత ప్రేమతో చూస్తూనేవున్నది. కాబట్టి ఆమెను ఒప్పించడం ఏమంతకష్టం కాదనుకున్నాడు. అన్నఎదుట తండ్రి నెలాగో మెత్తబరచి తుదకు కార్యం సాధించవచ్చు ననిపించింది. అదీ గాక గురుచరణు డీ విధంగా విధర్మాన్నాశ్రయించి తన ఆశా పథాన్ని శిలామయంచేసి దృఢంగా మూసివేసివుండలేదు.

నిజానికి శేఖర్ చింతించడానికి ప్రత్యేక కారణమేమీ లేదు. తండ్రిని సమ్మతింపజేయటం సంగతి అలావుంచి తల్లిని అంగీకరింపజేసుకోవడంకూడ సంభవంకాదని అత డిప్పుడు స్పష్టంగా గ్రహించుకున్నాడు. ఇప్పు డా విషయం నోటితో వుచ్చరించడానికే వీల్లేదు!

శేఖర్ ఒక దీర్ఘ నిట్టూర్పు వదలి అస్పష్టంగా 'ఇప్పు డేంచెయ్యాలి?' అనుకున్నాడు ఒకసారి. అతడు లలితను బాగా ఎరుగును. తన చేతులతోనే ఆమెను తీర్చిదిద్దాడు. ఆమె ఒక పర్యాయం ధర్మమని అంగీకరించినదంటే ఇంక ఏవిధంగానూ దాన్ని వదలిపెట్టలేదు. ఆమె తాను శేఖరుని ధర్మపత్ని నను కొనే యివాళ సాయంత్రం చీకట్లో అతని గుండెవద్దకు చేరి మొహంలో మొహం పెట్టి ఆ విధంగా నిలబడింది.

"గిరీంద్రునితో ఆమె వివాహ విషయంలో మాటలు జరుగుతున్నాయి. కాని ఎవరూ ఆమె నందుకు అంగీకరింప జెయ్యలేరు! ఇక ఆమె ఏ విధంగానూ వూరకుండజాలదు. ఆమె జరిగిందంతా బయటపెట్టేస్తుంది. ఇలా అనుకుని శేఖర్

కళ్ళు మంట పెట్టాయి. జరిగినదీ యదార్థమేగా. తాను కేవలం దండ వేసి వూరుకున్నాడా? ఆమెను కౌగలించుకొని ముద్దుకూడా పెట్టుకున్నాడయ్యో! లలిత అభ్యంతరం చెప్పలేదు. అందులోద్దోషంలేదు. అందువల్లనే ఆమె అటకాయించలేదు. అందుకితనికి హక్కున్నదికాబట్టే అభ్యంతరం చెప్పలేదు. ఇప్పుడీవ్యవహారంలో తానెవరికైతేమాత్రం ఏంజబాబు చెపుతాడు?

తల్లి-దండ్రులను సమ్మతింపజేయనిదే లలితను వివాహ మాడటం జరుగదన్నది నిశ్చయమే. కాని గిరీంద్రునితో లలిత పెండ్లి జరుగకపోవటానికి కారణం బయటపడినతర్వాత తాను ఇంటా బయటా కూడ మొహం చూపడం ఎలా?

## 10

అసంభవం కానటంవల్ల శేఖర్ లలితపై ఆశనుపూర్తిగా వదులుకున్నాడు. ఆమె ఎక్కడవచ్చిపడి అంతా బయట పెట్టేస్తుందో, తానందుకు అందరిముందు సమాధానం చెప్ప వలసివస్తుందోనని మొదట్లో అతడు చాలా భయపడుతూండే వాడు. కాని తన్నెవరూ ఆ విషయమే అడుగలేదు. అసలు సంగతి ఏమైనా బయటపడిందో లేదోగూడ తెలియలేదు. అసలా యింటికీ యీ యింటికీ రాకపోకలే లేవు.

శేఖర్ గదిముందున్న స్థలంలో నిలబడితే లలిత ఇంటి పైభాగం బాగా కనబడుతుంది. లలిత ఎక్కడకనబడుతుందో నన్న భయంచే అతను మేడమీద బయట నిలబడేవాడే కాదు. కాని ఏ గొడవాలేకుండా పూర్తిగా నెల్లాళ్లు గడిచే ప్పటికి అతడు నిశ్చింతగా వూపిరి పీల్చుకొని తనలో అను కొన్నాడు ఏమైనప్పటికీ సిగ్గు కారణంగా ఆడవాళ్ళు ఇలాంటి విషయాలు బయల్పర్చలేరు. 'స్త్రీకి గుండె బ్రద్ద

లైతే కావచ్చుగాని నోరుమాత్రం తెరవలే'దని అతడు విని వున్నాడు. ఇవాళ అతని కామాటపై విశ్వాసం ఏర్పడింది. స్త్రీకి బలహీనత కలుగజేసినందుకు సృష్టికర్త నతడెంతగానో ప్రశంసించాడు. అయినా అతనికి శాంతి లభించటంలేదే? అతడు ఇంకేమీ భయం లేదనుకున్నప్పట్నుంచీ అతని హృదయంలో ఎన్నడూ ఎరుగని ఏదో వేదన ఏలవృద్ధిచెందుతోందో? ఉండుండి అతని అంతరాంతరాళంవరకు నిరాశ, ఆ వేదన, నిస్పృహాలచే ఏల కంపించిపోతున్నది? ఇంక లలిత తన్నింకో వ్యక్తికిఅప్పగించే క్షణంవరకు సమానంగానే వుంటుందా! ఆమె వివాహమై భర్తగృహాన్ని చక్కబెట్టటానికి వెళ్ళినట్టు ఆలోచన కలిగినంతనే అతని మనసులో, దేహంలో మంటలా మండుతున్న దేమిటి?

పూర్వంలాగా అతడు మేడమీద ఆరుబయట సాయంత్రం వేళలయందు పచారుచేయసాగాడు. కాని, ఒకనాడు ఆ ఇంటివారిపొడకన్పడనేలేదు ఒక్కరోజునమాత్రం అన్నాకాళి యేదో పనిమీద పైకివచ్చింది. కాని శేఖర్‌నిచూడగానే తలబొంచేసుకుని అతడు మాట్లాడించకపూర్వమే అక్కణ్నుంచి తుర్రుమన్నది. మేడపై దారి బందుచేయించిన దానిభావం అన్నాకాళికూడ గ్రహించిందని అతను తెలుసుకున్నాడు.

మరో నెలకూడ గడచిపోయింది.

ఒకరోజున భువనేశ్వరి "ఈమధ్య లలితను చూచావంటరా అబ్బాయ్!" అనడిగింది. శేఖర్‌ని.

"లేదు ఏం?"

"రెండు నెలలకు నిన్న మేడమీద దాన్ని చూచిరమ్మని

పిల్చాను. పిల్ల ఎలా అయిపోయిందనుకున్నావ్! చిక్కి, మొహంలో కళ లేకుండా ముసలిదానిలా తయారైంది. దాని నిబ్బరంచూస్తే పధ్నాలుగేళ్ళ పిల్ల అని ఎవరనగలరు?" అని చెపుతూంటే ఆమెకళ్ళు అశ్రువులతో నిండాయి. చేత్తో తుడుచు కుంటూ గద్గదస్వరంతో "మాసి, చిరిగిపోయిన బట్ట కట్టు కున్నది. వేరేబట్టలేదా అని అడిగితే వుందని చెప్పింది. గాని నాకు నమ్మకం లేకపోయింది. వాళ్ళ మామయ్య ఇచ్చిన గుడ్డలు ఎప్పుడూ కట్టుకోలేదు. నేనే దానికి కావలసినవన్నీ ఇస్తూండేదాన్ని. మరి ఏడెనిమిది నెలలనుంచీ నేనేమీ ఇవ్వనే లేదు" ఇంక చెప్పలేక కళ్లు తుడుచుకోసాగింది. నిజంగా ఆమె లలితను తన బిడ్డలాగే ప్రేమించేది.

శేఖర్ మరోవైపుకు మొహంపెట్టి మెదలకుండా కూర్చున్నాడు.

చాలాసేపటికి తల్లి మళ్ళీ చెప్పసాగింది—"నన్నుతప్ప అది ఏనాడూ ఇంకెవర్నీ ఏమీ అడిగేదికాదు. ఆకలైనా యింటివద్ద నోరు తెరచి ఎవరితోనూ చెప్పేదికాదు. నేనే దాన్ని పిల్చి పెడుతూండేదాన్ని. నాచుట్టూ తిరుగుతూండేది. ఆకలిగొన్నట్లు దాని మొహంచూస్తేనే నాకు తెలిసిపోయేది. నాకు దానిసంగతే జ్ఞాపకంవస్తూంటుందిరా అబ్బాయ్. ఇప్పుడుకూడా అది ఆకలితో అలమటించిపోతుందేగాని ఎవర్నీ అడుగదు. దానిసంగతి ఎవరికీ తెలియనూ తెలియదు. ఎవరూ దాన్ని అడగనూ అడుగరు. అది నన్ను 'అమ్మా' అని పిల్వ టమేకాదు. తల్లిలాగే ప్రేమిం చుతున్నది."

కళ్లెత్తి తల్లి మొహంలోకి చూసేసాహసం లేకపోయింది శేఖర్‌కి. అటు త్రిప్పివున్న మొహం అలాగేవుంది. "సరేగాని,

అమ్మా, ఆమెనుపిల్చి ఏమేమికావాలో అడుగకపోయావా?" అన్నాడు.

"అదెందుకు తీసుకుంటుందిరా? ఈయనగారు రాకపోకలు జరక్కుండా దారిబందుచేయించే. నే నేముహంతో దానికి ఇవ్వబోను? మరది దుఃఖంలో పొరపాటుచేశాడనుకో, మనం ఆయనకు కావలసినవాళ్ళంగదా, ఏ ప్రాయశ్చిత్తమో ఏదో చేయించవచ్చుగా. అదేమీ లేకుండా ఒక్కసారిగా వదిలేసి పరాయివాళ్ళను చేసివేశారు! నిజానికి ఈయనతో బాధపడలేకనే పాప మతడు జాతిని పోగొట్టుకున్నాడు. అయినా నే నాయన మంచిపనేచేశాడంటాను. ఆ గిరీంద్రుడు వారికి మనకంటే ముఖ్యుడు. అతనితో లలిత పెళ్ళి జరిగితే బాగానే సుఖపడుతుంది. అదిమాత్రం నిజం. వచ్చే నెలలోనే పెళ్ళవుతుందని విన్నాను."

శేఖర్ టక్కున మొహం తల్లి వేపుత్రిప్పి "వచ్చే నెలలోనే జరుగుతుందా?" అనడిగాడు

"అట్లా అనే విన్నాను."

శేఖర్ మరేమీ అడుగలేదు.

తల్లి కొంచెమాగి మళ్ళీ చెప్పసాగింది "వాళ్ళ మామయ్య ఆరోగ్యం బాగుండటంలేదని లలితే చెప్పింది. అది నిజమేలే. ఆయన మనసూ బాగాలేదు. యింట్లోనూ రోజూ ఏడుపులూ మొత్తుకోళ్లూను. పాపం! ఆయనకి ఒక్క నిమిషమైనా శాంతిలేదు!"

శేఖర్ మెదలకుండావింటున్నాడేగాని మాట్లాడలేదు. కాస్సేపటికి తల్లి లేచి వెళ్ళిన తర్వాత అతడు తన పక్కపైకి చేరి పడుకుని లలిత విషయమే ఆలోచించ సాగాడు.

శేఖర్ యిల్లువున్న సందులో రెండు బండ్లు ఒకేసారి అటూఇటూ వెళ్ళేటంత వెడల్పులేదు. ఒకబండి ఒకప్రక్కగా అంచున నిలబడితేగాని, రెండవబండి ప్రక్కగా వెళ్ళదు. ఎని మిది పదిరోజుల తర్వాత ఒకరోజున శేఖరునిబండి గురుచర ణుని యింటిముందర ఆగవలసివచ్చింది. అతడు ఆఫీసునుంచి వస్తున్నాడు. వారి యింటిముందు ఆగివున్నబండి ఎవరిదా అని అడిగితే డాక్టరు వచ్చాడని తెలిసింది.

అంతకుముందు గురుచరణుని ఒంట్లో బాగుండలేదని తల్లిద్వారా విన్నాడు. ఇది గుర్తుకుతెచ్చుకొని ఇంక యింటికి వెళ్ళక బండిదిగి తిన్నగా గురుచరణుని గదిలోకివెళ్ళాడు. తా నూహించినట్లే అయింది. గురుచరణుడు నిర్జీవిలా మంచం మీాద పడుకునివున్నాడు. ఒక ప్రక్కన లలిత, గిరీంద్రుడు కూర్చుని వున్నారు. రెండోవైపున డాక్టరు కుర్చీలోకూర్చుని రోగిని పరీక్షించుతున్నాడు.

గురుచరణుడు అస్పష్టస్వరంతో అతన్ని కూర్చో మన్నాడు. లలిత తలపైకి చెంగు లాగుకొని అటువేపు తిరిగి కూర్చున్నది.

డాక్టర్ శేఖర్‌కి తెలిసినవాడే. రోగిని పరీక్షించి, మందు పథ్యం చెప్పి, శేఖరునితో బయటికి వచ్చాడు. వెన కాల గిరీంద్రుడు వచ్చి ఫీజుయిచ్చాడు. డాక్టరు జబ్బుఇంకా విషమించలేదనీ, గాలిమార్పు చాలా అవసరమనీ చెప్పాడు. డాక్టరు వెళ్ళిన తర్వాత యిద్దరూ గురుచరణ్ మంచంవద్దకు వెళ్లి నుంచున్నారు.

లలిత గిరీంద్రుని ఒకప్రక్కకుపిల్చి అతనితో మెల్లగా ఏమో చెపుతున్నది. శేఖర్ నిబ్బడై కుర్చీలోకూర్చుని గురు

చరణ్ వంక చూస్తున్నాడు. గురుచరణుడు అదివరకే అవతలి వేపుకు తిరిగి పడుకున్నందున శేఖర్ మళ్ళీవచ్చినదే ఆయనకు తెలియదు.

కాస్సేపు మెదలకుండా కూర్చుని శేఖర్ లేచి వెళ్ళి పోయాడు. అంతవరకు లలితా గిరీంద్రులు అదేవిధంగా గుస గుస లాడుతూనే వున్నారు. శేఖర్ నెవరూ కూర్చోమననూ లేదు, పల్కరించనూ లేదు.

లలిత తన నా కఠోర బాధ్యతనుండి తప్పించినదని శేఖరుడు నిశ్చయంగా అనుకున్నాడు. ఇంక తాను నిర్భయంగా ఊపిరిపీల్చుకోవచ్చు! ఇంక శంకించవలసినదేమీ లేదు. ఇంక లలిత తన్ను ఇబ్బందిపెట్టదు. "గిరీంద్రుడు వారి కుటుంబానికి ఆప్తుడు. అందరూ అతనిపైనే ఆశపెట్టుకున్నారు. నమ్ముకున్నారు. లలితకు భావిఆశ్రయం అతడే. నే నిప్పుడు వారి కేమీ కాను. ఇలాంటి విపత్సమయంలో కూడా లలిత నా నుంచి చిన్నసలహాకూడా ఆశించటంలేదు!" అనుకున్నాడు, అంతా కళ్ళతో చూచి ఇంటికి వచ్చిన తర్వాత.

అతడు 'ఓహ్' అని పడకకుర్చీలో తలవాంచుకుని కూర్చున్నాడు. లలిత తన్నుచూడగానే పరాయివాడినిచూచినట్లు తలమీది ముసుగును ముందుకు లాక్కున్నది. బొత్తుగా అపరిచితలాగ వ్యవహరించింది ఇంతేనా? అతని కళ్ళెదుటే గిరీంద్రుని చాటుకుతీసుకెళ్ళి ఏమిటేమిటో సంప్రదించింది. తమాషా ఏమిటంటే ఒకనాడు ఆ గిరీంద్రునితో సినిమాకు వెళ్ళకుండా లలితను అభ్యంతరపరిచాడు!

ఒక వేళ తమ గుప్తసంబంధాన్ని తలచుకొని సిగ్గుచే

అలా ప్రశ్నించిన దేమోననికూడా ఆలోచించడానికి ప్రయత్నించాడు. అయినా అది సంభవమా? అయితే ఇంత జరిగిన తర్వాత ఇన్నాళ్ళలో ఒకనాడైనా తననొక్క మాటా అడుగలేకపోయిందా?

అంతలో ద్వారం వెలుపల తల్లిస్వరంవినిపించింది— "ఎక్కడున్నావురా అబ్బాయ్? ప్రొద్దుకూకవస్తోంది. ఫలహారం చెయ్యనేలేదే."

శేఖరుడు చప్పున లేచి తల్లికి కన్పడకుండా మొహం ప్రక్కకు తిప్పుకొని చరచర క్రిందికి వెళ్లాడు.

ఇటీవల కొన్నాళ్ళుగా అనేకవిషయాలు వివిధరూపాలతో అతని మనసులో మెదుల్తున్నాయేగాని, ఇంతకూఅసలు దోషం ఎవరిదన్న విషయంమాత్రం అత డాలోచించనేలేదు ఆమె కాశకల్గించేమాట ఒక్కటీ తాను చెప్పలేదు. కాని ఎక్కడ రహస్యం బయటపడుతుందోనన్న భయంకొద్దీ అతడు శిలాప్రతిమలా నిశ్చేష్టుడవుతున్నాడు. అయినాకూడా తప్పంతా ఆమె నెత్తినేరుద్ది ఆవిధంగా ఆలోచించుతున్నాడు ఈర్ష్యతో. కోపంతో, స్వాభిమాన అవమానాలతో తనలో తాను మండి కుళ్ళుతున్నాడు బహుశ ప్రపంచంలో పురుషులందరూ స్త్రీలనుగూర్చి యిలాగే ఆలోచించిమండిపోతుంటారేమో!

ఇలా మండుతూ వారంరోజులు గడిపాడు. ఇవాళ కూడ అదేవిధమైన మంటతో తనగదిలో కూర్చునివున్నాడు. తటాలున ద్వారంవద్ద చప్పుడు విని తలయెత్తి చూసేగానే అతనిగుండె ఉడికిపోయింది. కాళీచెయ్యిపట్టుకొని లలిత గది

లోకి వచ్చి క్రింద కార్పెట్ మీద కూర్చున్నది.

"మేమిద్దరం నీకు ప్రణామం చెయ్యటానికి వచ్చాం శేఖరన్నయ్యా! రేపు మేము వెళ్ళిపోతున్నాము" అని చెప్పింది కాళి.

శేఖర్ నోట మాటరాలేదు. రెప్ప వాల్చకుండా చూస్తూ వుండిపోయాడు.

"నీ సన్నిధిలో చాలా తప్పులుచేసివుంటాం అన్నయ్యా నువ్వు అవన్నీ మర్చిపో" అన్నది కాళి మళ్ళీ.

ఈ మాటల్లో కాళిది ఒక్కటీలేదనీ, అవన్నీ నేర్పబడినవేననీ శేఖర్ గ్రహించాడు. "రేపు యెక్కడికి వెళ్తున్నారు మీరు?" అనడిగాడు.

"పడమటికి. నాన్నగారిని తీసుకొని మేమందర ముంగేరు వెళ్తాము. అక్కడ గిరీంద్రబాబు యిల్లుంది. నాన్నగారికి నయమైనతర్వాతకూడ మేమిక్కడికి రాకపోవచ్చు. ఇక్కడైతే నాన్నగారి ఆరోగ్యం ఎప్పుడయినా బాగుండదని చెప్పారు డాక్టరుగారు."

"ఇప్పు డెలావుంది వారి ఒంట్లో?"

"కొంచెం మెరుగే" అని కాళి చెంగులోని కొన్ని చీరలుతీసి చూపుతూ "ఇవన్నీ అమ్మగారుయిచ్చారు" అన్నది.

లలిత ఇంతసేపూ మౌనంగా వుండి, ఒక తాళంచెవి తీసి బల్లమీద పెడుతూ "అలమర తాళంచెవి ఇన్నాళ్ళూ నావద్దేవుంది" చిరునవ్వు నవ్వి "కాని ఇందులో డబ్బేమీ లేదు. అంతా ఖర్చయిపోయింది" అన్నది.

శేఖరుడు మాట్లాడలేదు.

'ఇక పద అక్కా, ప్రొద్దుపోతోంది' అన్నది అన్నా కాళి లలిత పెదవులు కదల్చకముందే శేఖర్ అన్నాడు..

"కాళీ, క్రిందకు వెళ్ళి కాస్త తాంబూలం తెచ్చిపెట్టవే."

లలిత కాళి చెయ్యి నలిపి "నువ్విక్కడేవుండు కాళీ, నేను తెచ్చిస్తాను" అని చప్పున తానే క్రిందకు వెళ్లింది. కాస్సేపట్లో తాంబూలం తెచ్చి అన్నా కాళి చేతిలో పెట్టింది. కాళి శేఖరుకు అందించింది.

తాంబూలం అందుకొని స్తబ్ధుడై కూర్చుండిపోయాడు.

'వెళ్ళుతున్నాను అన్నయ్యా' అని కాళి సాష్టాంగ ప్రణామం చేసింది. లలిత నిలబడివున్న చోటే శిరస్సు నేల కానించి ఇద్దరూ నెమ్మదిగా వెళ్ళిపోయారు.

శేఖర్ తన మంచి-చెడ్డలు, ఆత్మగౌరవాలతో తెల్ల మొహం వేసి విహ్వలుడై హతబుద్ధిలా స్తబ్ధుగా వుండిపోయాడు. లలిత రానూ వచ్చింది, చెప్పవలసిన రెండు మాటలూ చెప్పి వేసి శాశ్వతంగా సెలవు తీసుకొని వెళ్ళిపోయింది. తను చెప్ప వలసిన దేమీ లేనట్లు ఆ క్షణాలు యిలాగే గడచిపోయాయి. లలిత బుద్ధిపూర్వకంగా తీసుకురావాలనే కాళిని వెంట పెట్టు కొని వచ్చిందనని శేఖరు గ్రహించాడు. ఏ విషయమూ పైకి రాకూడదనే ఆమె వుద్దేశ్యం అనుకున్నప్పుడు అతనికి దేహ మంతా అదోలావున్నది. కడుపులో కెలికినట్లుంది. తల తిరుగ సాగినది. లేచి పక్కమీదపడి కళ్ళుమూసుకొనిపడుకున్నాడు

# 11

గురుచరణుని ఆరోగ్యం ముంగేరుగాలితో కూడ కుదుటబడలేదు. ఒక ఏడాది గడచినతర్వాత ఆయన తన

కష్టాలు, దుఃఖం అన్నీ తప్పించుకొని ప్రాణంవదిలాడు. గిరీంద్రుడు వాస్తవంగానే ఆయన్నెంతో ప్రేమించాడు. తుది వరకు శక్తివంచన లేకుండా ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

మరణించేముందు గురుచరణుడు గిరీంద్రుని చేయి పట్టుకొని గద్గదకంఠంతో 'నువ్వెన్నడూ పరాయివాడవు కావద్దు. మన యీసంబంధం చిరబంధుత్వంగా పరిణమించు నట్లు భగవంతుడనుగ్రహించుగాక' అని కోరాడు. గిరీంద్రుడు ఆయన కళ్లేనని హృదయపూర్వకంగా మాట యిచ్చాడు కాని, ఆయన జబ్బుస్థితిలో అవకాశంలేక అది చూడకుండానే పోయాడు. కాని పరలోకాన్నుంచైనా చూచి ఆనందించేటట్లు చేయుటకై గిరీంద్రుడు తనమాట నిలుపుకోవాలి.

గురుచరణుని యింట్లో అద్దెకున్నవారిద్వారా వారి కబుర్లు భువనేశ్వరికి తెలుస్తూనే వున్నై. గురుచరణుని మరణ వార్త వారిద్వారానే ఆమెకు తెలిసినది.

తర్వాత మరో దుర్ఘటనకూడా జరిగిపోయింది. అకస్మాత్తుగా నవీనరాయి మృతిచెందాడు. భువనేశ్వరి శోక-దుఃఖాలవల్ల మతిచెడినట్లయి, కుటుంబభారం పెద్దకోడలికి అప్పగించి కాశీకి వెళ్ళిపోయింది. ఒకిందుసంవత్సరం అన్నీ సిద్ధమైన తర్వాత వచ్చి శేఖర్ పెళ్ళిచేస్తానని చెప్పి వెళ్ళింది.

వివాహసంబంధం నవీనరాయే స్థిరపర్చాడు. ఈసరికి జరిగిపోయేదిగాని ఆయన ఆకస్మిక మరణహేతువుచే ఏడాది పాటు ఆగిపోయింది. పిల్లతరఫువారు ఎంతో కాలం వేచి

యుండదు కాబట్టి నిన్న వారు వచ్చి పిల్లవాడిని ఆశీర్వదించి వెళ్లారు. ఈ నెలలోనే వివాహం జరుగుతుందికాబట్టి, శేఖర్ తల్లిని తీసుకువచ్చేందుకు కాశీ ప్రయాణసన్నాహంలో వున్నాడు. పెట్టెలో బట్టలు నగైరా సర్దుతున్నాడు. చాలా రోజులకు ఇనాళ అతనికి లలిత జ్ఞాపకంవచ్చింది. మరి తన కోసం అన్నీ ఆమె సర్దుతూండేదికదూ.

వారందరూ ఇక్కణ్నుంచి వెళ్ళిపోయి మూడు సంవత్సరాలకు పై నే అయింది. ఈలోగా వారి సమాచారాలే అతనికి తెలియలేదు. అసలు తెలుసుకోవాలని ప్రయత్నించనూలేదు ఇప్పు డతనికి వారివిషయమందే ఆసక్తి లేదేమొ! లలితయందు క్రమేణా ద్వేషం కల్గుతున్నది. కాని, ఇనాళ ఒక్కసారిగా ఎలాగైనా ఆమె సమాచారం తెలిస్తే బాగుండు ననిపించింది. అందరూ కులాసాగా వుండివుంటారని అతనికీ తెలుసు. కారణంగిరీంద్రుని ధనమున్నదిగా అని అతనితలంపు. అయినా ఎప్పు డామెవివాహం జరిగిందో, ఎలావున్నదో మున్నగు విషయాలు తెలుసుకోవాలన్న కోరక కలిగింది.

ఇప్పుడు గురుచరణునియింట్లో ఎవరూ అద్దెకువుండటం లేదు. రెండు నెలలనుంచీ యిల్లు ఖాళీగానేవుంది.ఒకసారిచారు బాలతండ్రిని అడిగివద్దామూ అనిపించింది శేఖర్‌కి. ఒకక్షణం సర్దడం ఆపి వేసి శూన్యంగా కిటికీగుండా బయటికిచూస్తూ పైవిధంగా ఆలోచించుతున్నాడు. ఇంతలో బయటినుంచి పాత పనిమనిషివచ్చి ‘చినబాబూ, తమర్ని కాళీ తల్లిగారు రమ్మన్నారు’ అని చెప్పింది.

శేఖర్ మొహం త్రిప్పి దానివేపు కాశ్చర్యంగా చూస్తూ 'కాళి అమ్మా?' అన్నాడు.

దాసి చేత్తో గురుచరణుని యింటివేపు చూపుతూ చెప్పింది—'మన అన్నాకాళి తల్లే చినబాబూ, వారంతా నిన్నరాత్రి ముంగేరునుంచి వచ్చేశారు.'

'వస్తున్నా పద' అని వెంటనే లేచి బయల్దేరాడు.

ప్రొద్దు వాలుతున్నది. శేఖరుడు వారి యింట్లోకి వెళ్ళగానే గుండెలు బాదుకుంటూ ఏడ్పులు సాగాయి. విధవ రూపంలోవున్న గురుచరణ్ భార్యముందుకు వెళ్ళి నేలమీద కూర్చున్నాడు. పంచెచెంగుతో కళ్ళు తుడుచుకోసాగాడు. కేవలం గురుచరణుని గురించే కాదు. తన తండ్రి మరణ దుఃఖంకూడ అతన్ని మరొకసారి ఆవరించింది.

ప్రొద్దుగ్రుంకగానే లలిత వచ్చి దీపం వెలిగించింది. దూరాన్నుంచే శేఖరుకు వంగి నమస్కరించి మెల్లగా వెళ్ళిపోయింది. శేఖరుడు పదిహేడేండ్ల యువతి. పరస్త్రీ వంక కళ్ళెత్తి చూడజాలకపోయాడు. మరి ఆమెను పల్కరించి మాట్లాడగలడా! అయినా ప్రక్కచూపుకు కన్పించినదాన్ని బట్టి ఆమె పూర్వంకంటె పెద్దదై, మరీ బలహీనంగావున్నది.

ఏడ్పులు, మొత్తుకోళ్ళు అయినతర్వాత గురుచరణుని భార్య అతనితో చెప్పినదాని సారాంశం యిది: ఈ యిల్లు అమ్మివేసి ముంగేరులో తమ అల్లునియింటోనే వుండాలని ఆమె కోరిక. చాలాకాలంగా శేఖరుని తండ్రికి ఇల్లు కొనాలని కోరికవుంది. ఇప్పుడు తగినధర ఇచ్చి వారు కొనుక్కుంటే

అయినవారికే వుంటుంది. ఇందువల్ల ఆమెకేమీ దుఃఖం గలుగదు. పైగా ఎప్పుడేనా యిక్కడికివస్తే ఒకటి రెండు రోజులు యీ యింట్లోనే వుండవచ్చునుకూడాను.

తల్లితో చెప్పి యథాశక్తిని ప్రయత్నించుతానని శేఖరుడు చెప్పాడు. ఆమె కన్నీళ్లుతుడుచుకుంటూ 'అక్కయ్య యిప్పట్లో ఇక్కడికి రాదా శేఖర్!' అనడిగింది.

ఆమెను తీసుకొనిరావటానికి తా నీరాత్రే కాశీ వెళ్తున్నానని శేఖర్ చెప్పాడు. తర్వాత ఆమె కుటుంబ విషయాలుకూడ అడిగింది. శేఖరుని పెళ్ళి యెప్పుడో పెళ్ళివారెవరో, ఎంతకట్నం వస్తుందో, పిల్లకు నగలెన్ని పెడతారో వగైరా సంగతులన్నీ తెలుసుకున్నది.

శేఖరుడు ఆమెవద్ద సెలవుతీసుకుని బయలుదేరేసరికి బాగా వెన్నెలవచ్చింది. అప్పుడే గిరీంద్రుడు పైనుంచి దిగి తన అక్కగారి యింటికి కాబోలు వెడుతున్నాడు. గురుచరణుని భార్య అతన్ని చూచి శేఖరునితో 'మా అల్లునితో నువ్వు మాట్లాడనేలేదా శేఖర్? ఇలాంటి అబ్బాయి ఈ ప్రపంచంలో దొరకడం కష్టమే' అన్నది.

"ఇందులో సందేహంలేదు పిన్నీ. నే నతనితో మాట్లాడాను" అని చెప్పి గబగబ బయటికి వెళ్ళాడు. కాని బయటి హాలుముందుకురాగానే అతడుతటాలునఆగిపోవాల్సివచ్చింది.

చీకట్లో తలుపువెనుక లలిత నిలబడివుంది. "ఇదిగో, అమ్మని తీసుకురావటానికి ఇవాళే వెళ్తున్నారా?" అనడిగింది.

'అవును'

'ఆమె మరీ దుఃఖిస్తోందా?'

"అవును పిచ్చిదానిలా అటుపోయింది."

'మీ ఆరోగ్యం ఎలావుంది?'

"బాగానేవుంది" అని శేఖరుడు త్వరత్వరగా వెళ్ళిపోయాడు.

బజార్లోకి వచ్చేసరికి అతని దేహం యావత్తూ సిగ్గు, ద్వేషములచే కంపించింది. లలితకు దగ్గరగా నిలబడినందున తనశరీరం అపవిత్రమైనట్లే భావించుకున్నాడు. ఇంటికిచేరి ఎలాగో పెట్టెలో సామాను సర్దాడు. బండికి ఇంకా వ్యవధి వుంది. పోయి పక్కమీద వాలాడు. విషాక్తమైన లలిత స్మృతిని కాల్చి భస్మంచేయటానికి ప్రతిజ్ఞపట్టి, మనసులో అనరానిమాటలతో ఆమెను దూషించాడు. ఆమెను కులట అనడానికూడా సంకోచం లేకపోయింది. పిల్లపెళ్లి జరిగిందేమోగాని ఏమీ సంతోషంగా జరగలేదనీ, లేకపోతే లలిత చెప్పినట్లు తమకందరికి వుత్తరాలు వ్రాయించేదాన్నేనని గురుచరణునిభార్య చెప్పనేచెప్పింది, లలిత ఈ మూర్ఖత్వం అగ్నిజ్వాలలాగా అలలుకొట్టసాగింది.

## 12

శేఖరుడు తన తల్లిని తీసుకొనివచ్చిననాటికి అతని వివాహ మింకా పదిరోజులున్నది.

మూడు నాలుగురోజుల అనంతర మొకనాటి వుదయం లలిత శేఖరుని తల్లివద్దకూర్చుని బుట్టలో ఏదో పెడుతోంది. ఆమె వున్నట్లు తెలియక శేఖర్ ఏదో పనిమీద 'అమ్మా'

అంటూ లోపలికొచ్చేశాడు గాని, టక్కున స్తంభించిపోయి నిలబడ్డాడు. లలిత తలొంచుకుని పనిచేస్తూనేవుంది.

అతను తానువచ్చినపని మర్చిపోయాడు. 'ఇప్పుడు కాదులే, తర్వాత చూద్దాం' అంటూ చరచర బయటికి వెళ్ళిపోయాడు. లలిత మొహం అతనికి కనబడలేదుగాని, ఆమె చేతులమీద అతనిదృష్టిపడనేపడింది. చేతులకు రెండుగాజులు గాజులు మినహా ఇంకేమీ లేవు. శేఖర్ మనసులోకోపగించుకొని నవ్వుతూ "ఇదొకరకం బూటకంలే!" అనుకున్నాడు. గిరీంద్రుడు ధనికుడని అత డెరుగడు. మరి అలాంటివాని భార్యచేతుల కెట్టి ఆభరణాలూ లేకపోవటానికి కారణం అతని కెంత ఆలోచించినా తోచనేలేదు.

ఆవాళ సాయంత్రం శేఖర్ గణ గణ క్రిందికి దిగుతున్నాడు. అప్పుడే లలిత పైకి మెట్లెక్కుతున్నది. ఆమె ఒక ప్రక్కగా గోడకానుకొని నిలబడింది. శేఖర్ దగ్గరకు రాగా సంకోచంగానే మెల్లగా "నీతో ఒకమాటచెప్పాలి" అన్నది.

శేఖర్ ఒక్క క్షణం ఆగి విస్మయంగా "ఎవరికో? నాతోనా?" అన్నాడు.

లలిత "అవును నీతోనే" అంది.

"నువ్వు నాతో చెప్పేదేమిటి?"అని శేఖర్ పూర్వాం కంటె విసురుగా మెట్లు దిగిపోయాడు.

లలిత స్తబ్ధురాలై కొంచెంసేపు అక్కడే నిలబడివుండి చిన్న నిట్టూర్పువదలి నెమ్మదిగా వెళ్ళిపోయింది.

మరునాడు శేఖర్ బయటి గదిలో కూర్చుని ఆనాటి పత్రిక చదువుకుంటున్నాడు. చదువుతూనే ఆశ్చర్యంగా

తలెత్తి చూస్తే గిరీంద్రుడు అతనివద్దకు వస్తున్నాడు. గిరీంద్రుడు శేఖర్ కి నమస్కారంచేసి ఒక కుర్చీ లాగుకొని దగ్గరగా కూర్చున్నాడు. శేఖర్ కూడ వందనంచేసి పత్రిక నొక ప్రక్కన పెట్టి ప్రశ్నార్థకంగా చూడసాగాడు. ఇద్దరికి చూపుల పరిచయమేగాని మాట్లాడుకోవి ఎరుగరు. అందుకోసం యిద్దరిలో ఎవరూ ఆసక్తి చూపలేదు.

గిరీంద్రుడు ముందుగానే వచ్చిన వ్యవహారం విషయం ఎత్తాడు. "ఒక ముఖ్యమైన పనికోసం మీకు శ్రమ కల్గించటానికి వచ్చాను. మా అత్తగారివుద్దేశ్యం విన్నారుగా. తమ యింటిని ఆమె మీకే అమ్మాలనుకుంటున్నారు. ఇదేదో త్వరగా తేలిపోతే వారి నెలలోనే ముంగేరు వెళ్ళిపోవాలని నా ద్వారా మీకు కబురుపంపారు"

గిరీంద్రుని చూడగానే శేఖర్ హృదయంలో తుపాను రేగినట్లయింది. అతని కాతనిమాట లేమాత్రం రుచించలేదు. ముఖంలో అప్రసన్న భావం ప్రతిబింబించింది. "అది నిజమే గాని, ఇప్పుడు అన్నయ్యే కుటుంబ యజమాని. మీరు ఆయనతోనే చెప్పండి" అన్నాడు.

గిరీంద్రుడు నవ్వుతూ అన్నాడు. "అది మాకు తెలుసు. కాని వారితో మీరు చెపితేనే మేలు."

"మీరు చెప్పినా అవుతుంది. ఇప్పుడు వారి సంరక్షకులు మీరేగా" అన్నాడు శేఖరుడు.

"నేను చెప్పడం అవసరమైతే అలాగే చెపుతాను. మీరు కొంచెం శ్రద్ధవహించితే పని సులభంగా జరిగిపోతుందని నిన్న సోదరి అన్నది" అన్నాడు గిరీంద్రుడు.

ఇంతవరకు శేఖరుడు బాలీసు నానుకొని మాట్లాడు తున్నవాడల్లా నిటారుగా కూర్చుని "ఎవరూ అన్నది?" అనడిగాడు.

"లలితా సోదరి చెప్పిన- "

గిరీంద్రుని మాట పూర్తిగా వినకపూర్వమే శేఖరుడు హతబుద్ధి అయ్యాడు. ఇంక గిరీంద్రుడు చెప్పినమాట ఒక్కటీ అతనికి వినబడలేదు. కాస్సేపు విహ్వాలదృష్టితో గిరీంద్రుని వంక చూస్తూ వుండి "నన్ను క్షమించు గిరీంద్రబాబూ! లలితతో మీ వివాహం కాలేదూ? అని అడిగాడు.

గిరీంద్రుడు నాలుక కరచుకొని "లేదండీ, వారియింట్లో వారినందర్నీ మీ రెరుగుదురుగా; కాళితో నా- "

"కాని మొదట మాటలు అలా జరగలేదే?"

గిరీంద్రుడు లలితద్వారా అంతా వినేవున్నాడు. శేఖరునితో యిలా చెప్పాడు "అవును, అలాగని మాటలుజరుగనిమాట నిజమే. గురుచరణ బాబు చనిపోతూ వేరేసంబంధం చేసుకోవద్దని నన్ను కోరారు. నేను మాటయిచ్చాను. వారు మరణించినతర్వాత సోదరి తనకు అదివరకే పెళ్ళిఅయి పోయిందనీ, భర్త జీవించివున్నాడనీ, ఈ సంగతులు ఎవరికీ తెలియకపోయినా యథార్థమనీ చెప్పింది. ఇది ఇతరులెవరూ విశ్వసించకపోవాచ్చుకాని, నే నామె చెప్పినదేదీ నమ్మకుండా వుండలేను. అదీగాక స్త్రీకి ఒకసారి పెళ్ళి అయితే మళ్ళీ వివాహం జరగనుగదా- అరె, యిదేమిటి?"

శేఖరుని రెండుకళ్ళనిండా నీరు క్రమ్మింది. గిరీంద్రుని యెదుటే అశ్రుధార ప్రవహించసాగింది. కాని అతని కీ ధ్యాసే

లేదు. పురుషునిముందు పురుషు డీవిధంగా బలహీనతను వెల్లడి కానివ్వడం ఎంత లజ్జాకరమో అతనికి తోచనేలేదు.

గిరీంద్రుడు హఠాత్తుగా అతనివంక చూస్తున్నాడు. అతని మనసులో అదివరకే అనుమానంవుంది. ఇప్పు డతడు లలితభర్త ఎవరో గ్రహించాడు! శేఖరుడు కళ్ళు తుడుచు కొని గద్గదికంగా "కాని మీరు లలితను ప్రేమిస్తున్నారు గదూ?" అన్నాడు.

గిరీంద్రుని మొహంలోకి ఏదో అజ్ఞాత వేదనాఛాయ వచ్చిపడింది. కాని మరుక్షణంలోనే అతను మందహాసంచేసి మెల్లమెల్లగా చెప్పసాగాడు—"ఈ మాటకు జవాబివ్వడం అనవసరం. ఎంత గాఢస్నేహంవున్నా తెలిసివుండికూడ ఎవరూ పరస్త్రీని వివాహమాడరు. సరే, పోనీండి. గొప్ప వారివిషయంలో ఈవిధంగా చర్చించడం నాకు యిష్టం లేదు" అని చిరునవ్వు నవ్వుతూ లేచి నిలబడి "సరే" వెళ్తు న్నాను! మరొకనాడు కలుసుకుంటానులెండి" అని నమస్క రించి వెళ్ళిపోయాడు.

గిరీంద్రుడంటే శేఖరుకు మొదట్నుంచీఏవగింపే. అది ఈమధ్య ఘోరద్వేషంగా మారిందికూడాను. కాని యివాళ అతడు వెళ్ళిపోయిన తర్వాత శేఖర్ లేచి శిరస్సును నేల కానించి ఆ అపరిచితబ్రాహ్మ యువకునికి పదే పదే నమస్క రించసాగాడు. మనిషి గప్‌చిప్‌గా ఎంత గొప్ప స్వార్థత్యాగం చేయగలడో అతడు తనజీవితంలో మొదటిసారిగా ఇవాళే చూచాడు.

మధ్యాహ్నం భువనేశ్వరి తనగదిలో క్రింద కూర్చుని లలిత సహాయంతో క్రొత్త బట్టలను సర్దించుతోంది. శేఖరుడు లోపలికివచ్చి తల్లిపక్కమీద కూర్చున్నాడు. అత డివాళ లలితను చూచి కలవరపడి పారిపోలేదు.

"ఏమిటిరా అబ్బాయ్?" అనడిగింది తల్లి.

శేఖర్ జవాబివ్వకుండానే మౌనంగా కూర్చుని బట్టలు మౌతకలుగా పేర్చడం చూస్తున్నాడు, కాస్సేపటికి "ఏమిటమ్మా ఇదంతాను?" అన్నాడు.

"తెప్పించిన బట్టలలో ఎవరి కేవేవి ఇవ్వాలో అన్నీ లెక్కపెట్టి చూస్తున్నారా అబ్బాయ్! ఇంకా తెప్పించాల్సి వచ్చేటట్లుంది. కాదటే అమ్మాయ్?"

లలిత మెడాడించి సమర్థించింది.

శేఖరుడు నవ్వుముఖంతో "మరి, నేను పెళ్ళిచేసుకోక పోతేనో అమ్మా?" అన్నాడు.

భువనేశ్వరి నవ్వింది. "నువ్వాదీ చెయ్యగలవు. నీలో అలాంటిగుణాల కేమీ లోటులేదు" అన్నది.

శేఖరుడు నవ్వి "బహుశా అలాగే జరుగుతుందమ్మా!" అన్నాడు.

తల్లి గంభీరవదనంతో "ఏమిటిరా ఈపిచ్చిమాటలు! మళ్ళీ అలాంటిమాటలు నోటిపైకి రానివ్వకు" అన్నది.

"ఇన్నాళ్ళనుంచీ నోటిపైకి రానివ్వలేదుగాని, ఇంత చెప్పకపోతే మహాపాతకం చుట్టుకుంటుంది అమ్మా!"

భువనేశ్వరి ఏమీ అర్థంచేసుకోలేక అనిశ్చితంగా కుమారునివంక చూడసాగింది.

శేఖరుడు చెప్పాడు—"నువ్వు నీ యీ కొడుకు అపరాధాల నెన్నిటినో క్షమించుతూవచ్చావు. ఈఅపరాధాన్ని కూడ క్షమించాలి అమ్మా, నేను నిజంగానే యీ పెళ్ళి చేసుకోలేను."

కుమారునిమాటలు విని, ముఖంలోని భావం చూచి భువనేశ్వరి వుద్విగ్నురాలయింది కాని ఆ భావాన్ని అణచుకొని "సరే. చేసుకోనద్దులే, నువ్విక్కణ్నుంచి వెళ్ళిపో శేఖర్. నన్ను విసిగించమాకు నేను చాలా పనులు చూచుకోవాలి" అన్నది.

శేఖర్ మరొకసారి నవ్వటానికిప్రయత్నించి "లేదమ్మా నీతో నిజమే చెపుతున్నాను. ఈ పెళ్ళి జరుగదు" అన్నాడు.

"ఎందుకని? ఇదేమన్నా పిల్లలఆట అనుకున్నావా?"

"ఆటకాదు కాబట్టే చెపుతున్నానమ్మా."

భువనేశ్వరి ఈసారి గాభరాపడింది. మండిపడుతూ "ఏమిటి? ఏం జరిగింది? సంగతేమిటో నాతో విడమర్చి చెప్పరా. ఈ గడబిడమాటలు నాకేమీ బావుండవురా అబ్బాయ్!" అన్నది.

"మరొకనాడు చెపుతానులే అమ్మా" అన్నాడు శేఖర్ మృదుకంఠంతో,

"ఎప్పుడో చెపుతావా?"అంటూ ఆమె బట్టలపొతకను అవతలికిత్రోస్తూ "అయితే నన్నివాళే కాశీకి పంపించెయ్యి ఇలాంటి సంసారంలో నేను ఒక్క పూటైనా వుండలేను" అన్నది.

శేఖర్ తలవంచుకొని కూర్చునివున్నాడు. భువనేశ్వరి

మరింత కలవరపడి "లలితకూడ నాతో వస్తానంటున్నది. దీని కేమైనా ఏర్పాటుచేయగలిగితే—"

ఈ పర్యాయం శేఖర్ తలెత్తి నవ్వి అన్నాడు. "నువ్వు వెంటతీసుకెళ్తావా? ఇంకెవరితో ఏర్పాటుచేస్తావు అమ్మా? నీ ఆజ్ఞకుమించి ఆమెకు ఇంకేముంటుంది?"

కొడుకుముఖంలో నవ్వు చూచి తల్లికి లోలోపల కొంత ఆశ కల్గింది. లలితవంక చూస్తూ అన్నది "విన్నావా అమ్మాయ్! వీని మాటలు విన్నావుగదూ! నా కిష్టమైన చోటుకు నిన్ను తీసుకెళ్ళవచ్చునసే అబ్బాయి వుద్దేశ్యం. ఈమె మేనత్తని అడగనక్కర్లేదూ?"

లలిత మాట్లాడలేదు. శేఖరుని వాగ్ధోరణినిబట్టి ఆమె కంతా అయోమయంగా వుంది.

"ఆమెతో చెప్పాలనుకుంటే చెప్పు, అది నీ యిష్టం. కాని నువ్వేమిచేస్తే అదే జరుగుతుందని నాకూ తెలుసు. నువ్వెవర్ని తీసుకెళ్లాలనుకుంటున్నావో ఆమెకూ తెలుసు. ఈమె నీ కోడలమ్మా?" అని శేఖర్ తుదకు చెప్పివేసి తల వంచుకున్నాడు.

భువనేశ్వరి ఆశ్చర్యంతో డంగైపోయింది. తల్లిముందు కొడుక్కీ ఏమి టీ పరిహాసం? అతనివంక తేరిచూస్తూ "ఏమన్నావ్? ఇది నా కేమవుతుందీ?" అన్నది తల్లి.

శేఖర్ మొహం పైకెత్తలేకపోయాడు. కానిమెల్లగా జవాబిచ్చాడు—"చెప్పానుగా అమ్మా, ఇవాళగాదు, నాలు గేండ్లకుపైగా అయిపోయింది. నువ్వు నిజంగానే ఆమెకి అత్తవు. ఇంక నేను చెప్పలేనమ్మా. ఆమెనే అడుగు చెప్పు

తుంది" అని లలితవంక చూచేసరికి ఆమె తల్లికి ప్రణామం చేయడానికి సిద్ధమవుతోంది. అతను లేచి ఆమె ప్రక్కన నుంచున్నాడు. ఇద్దరూ ఒకేసారి తల్లి పాదాలపై శిరస్సు లుంచి ప్రణామంచేశారు. తర్వాత శేఖర్ మెదలకుండా బయటికి వెళ్ళిపోయాడు.

భువనేశ్వరి కళ్ళనుండి ఆనందాశ్రువులు రాలసాగినవి. ఆమె లలితను ఎంతగానో ప్రేమించుతున్నది. పెట్టె తెరచి తన ఆభరణాలన్నీ తీసి ఆమెకు అలంకరించుతూ ఒకటొకటిగా జరిగినవన్నీ తెలుసుకున్నది. అంతా విన్నతర్వాత "ఇందువల్ల నా గిరీంద్రుని వివాహం కాళితో జరిగింది?" అన్నది.

లలిత చెప్పింది "అవును అమ్మా! గిరీంద్రబాబు వంటి మనిషి ప్రపంచంలో వున్నాడో లేడో తెలియదు. నేను ఆయనతో విప్పిచెప్పగానే, నిజంగానే నాకు వివాహం అయిపోయిందనీ, అంగీకరించడం అంగీకరించకపోవడం నా భర్త యిచ్ఛాధీనమనీ, ఆయన వున్నారనీ నమ్మాడు."

భువనేశ్వరి లలితనొసలుపై చెయ్యివేసి "అవునే అమ్మాయ్! నే నాశీర్వదించుతున్నాను. జన్మజన్మాలూ దీర్ఘాయుస్సు కలిగివుండు. నువ్విక్కడే వుండవే అమ్మాయ్, పెళ్ళికూతురు మారిందని అవినాశ్‌తో చెప్పొస్తాను" అని ఆమె నవ్వుతూ పెద్దకొడుకుగదివేపు వెళ్ళిపోయింది.

# బిందుగారబ్బాయి

[శరత్ బాబు]

అనువాదం:

"విద్యానాథ్"

శరత్ గ్రంథమాల, విజయవాడ.

# బిందుగారబ్బాయి

యాదవముఖర్జీ మాధవముఖర్జీ సహోదరులు కారు. సవతిబిడ్డలు. ఆ సంగతి వాళ్ళూ మరిచిపోయారు. లోకులూ మరిచిపోయారు. పెదవాడైన యాదవుడు ఎన్నో కష్టాలు పడి తమ్ముణ్ణి 'లా' ప్యాసుచేయించాడు. అలాగే ఎన్నోవిధాల ప్రయత్నించి ఒక శ్రీమంతుని ఏకైక పుత్రికయగు బిందువాసిని మరదల్నిగా ఇంటికి తెచ్చుకోవటంలో కృతకృత్యుడయినాడు. బిందువాసిని అతిలోకసౌందర్యవతి. అసామాన్యమైన అంత సౌందర్యంతోపాటు పదివేలరూపాయల నగదును పసుపుకుంకుముగా తెచ్చుకొని ఆమె తొలిసారి కాపురానికి వచ్చిన రోజున ఆ యింటి పెద్దకోడలు—అన్నపూర్ణ కళ్ళవెంట ఆనందాశ్రువులు స్రవించాయి. ఇంట్లో అత్తగారుకాని, ఆడబిడ్డలుకాని ఇంకెవరూ లేరు. అన్నపూర్ణే యింటికి యజమానిని. ఆమె ఈ చిన్నకోడలు ముఖం ఎత్తిపట్టుకొని, యిరుగు పొరుగు అమ్మలక్కలందరితోనూ సగర్వంగా "యింటికి కోడల్ని తెచ్చుకుంటే యిలాంటి కోడల్ని తెచ్చుకోవాలి. అచ్చగా లక్ష్మీప్రతిమే" అని చెప్పుకుంది. కాని రెండురోజుల్లోనే ఆ భ్రాంతి వదలిపోయింది. చిన్నకోడలు ఎంత అందమూ డబ్బూ వెంట తెచ్చుకుందో దానికి నాలుగురెట్లు అహంకారాన్ని, అభిమానాన్ని కూడా తెచ్చుకుందని రెండురోజుల్లోనే స్పష్టంగా తేలిపోయింది. ఒకరోజున పెద్ద

కోడలు భర్తను చాటుగా పిలిచి "ఏమండీ! అందాన్ని. మాటను చూసి యింటికి తెచ్చుకున్నారు, కాని ఈవిడ ఎక్కడో త్రాచుపాముండోయి" అని చెప్పింది.

యాదవుడు ఆమాట నమ్మలేదు. తలపంకిస్తూ "ఆఁ. అలాగా!" అని రెండుసార్లు అని కచేరీకి వెళ్ళిపోయాడు.

యాదవుడు చాలా నెమ్మదైన స్వభావం కలవాడు. జమీందారీ కచేరీలో ఉద్యోగం. ఇంటికివచ్చాక దేవతార్చన చూస్తూ ఉండేవాడు. మాధవుడు అన్నగారికన్న పదిపన్నెం డేళ్లు చిన్న. లా ప్యాసై ఇటీవలనే ప్రాక్టీసు ప్రారంభించాడు.

అతడు వచ్చి 'వదినగారూ! అన్నగారికి డబ్బే ప్రధానం లాగుందే! రెండురోజులు వోపికపడితే నేనూ నెలకు ఇంతని సంపాదించగలను.' అన్నాడు.

అన్నపూర్ణ విని మాట్లాడకుండా ఊరుకుంది.

అదీగాక మరో ఆపద వచ్చిపడింది చిన్నకోడల్ని ఎవరూ ఆజ్ఞపెట్టడానికి వీల్లేదు. ఆమెకు ఎంత భయంకరమైన 'ఫిట్స్' వస్తాయంటే— ఆ స్థితిలో ఆమెకనుక చూస్తే ఇంట్లో వాళ్ళంతా హడలెత్తిపోవాల్సిందే. అప్పుడిహ పోయిడాక్టర్ని పిలుచుకు రావడంతప్ప గత్యంతరంవుండదు. అంచేత కోరికోరి ఈ సంబంధం చేసుకోవటం చాలా పొరపాటే అయిందన్న సంగతి అందరి మనస్సులకూ తోచింది. యాదవుడు ఒక్కడు ఆశ వదలుకోలేదు. అతడు అందరూ అనుకొన్నదానికి విరుద్ధంగా 'కాదర్రా కాదు. మీరు రెండురోజులు పోయాక చూడండి, మా తల్లి రూపంలో కేవలం జగద్ధాత్రి. అంత

సౌందర్యమూ నిష్ఫలమై పోవాల్సిందే! అలా ఎన్నటికీకాదు' అని అంటూవుండేవాడు.

ఒకరోజున ఏదో మాటపట్టింపు వచ్చి బిందువాసిని ముఖంమాడ్చుకుని మెదలకుండాకూర్చోటం చూసేసరికి అన్నపూర్ణకు భయంతో పైప్రాణాలు పైన ఎగిరిపోయాయి. చప్పున ఆమె కేమి తోచిందో, ఇంట్లోకి పరుగెత్తుకొనిపోయి తన ఏణ్ణర్ధంపిల్లవాణ్ణి—నిద్దరోతున్నవాణ్ణి—అమూల్యా చరణుడ్ని లాక్కువచ్చి బిందువొడిలో పడేసి పారిపోయింది.

అమూల్యుడు కలతనిద్దర మెళుకువరావటంతో బిగ్గరగా ఏడవటం మొదలెట్టాడు.

బిందు తన సర్వశక్తినీ వినియోగించుకొని తెప్పరిల్లి, మూర్ఛనుంచి తనను రక్షించుకుని కుర్రవాణ్ని చంకనెత్తుకుని గదిలోకి వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ చాటుననుంచుని యిదంతా చూస్తూనే ఉంది. ఆమె ఫిట్సుకు తాను ఇలాంటి అమోఘమైన మందును కనిపెట్టగలిగినందుకు ఉబ్బితబ్బిబ్బుఅయింది.

సంసారభారమంతా అన్నపూర్ణమీదనే ఉండటంవల్ల ఆమె కుర్రవాడికి సరియైన పోషణ చేయలేకపోతోంది. విశేషించి పగలల్లా పనులుచేసుకుని ఉండటంవల్ల రాత్రిళ్లు కాసేపు నిద్దరోకపోతే ఆమెకు జబ్బుచేస్తుంది. అంచేత ఈ పిల్లవాడి పోషణభారం బిందువాసిని వహించింది.

ఇలా ఒకనెల గడిచిపోయాక ఒకరోజున ప్రొద్దున్నే కుర్రవాణ్ని చంకనెత్తుకొని వంటఇంట్లోకివచ్చి, "అక్కయ్యా! అమూల్యుడికి పాలు ఏవీ?" అని అడిగింది బిందు.

అన్నపూర్ణ గబగబా చేతిలోపని అక్కడే వదిలివేసి, భయభయంతో, "ఒక్కనిమిషం ఓపికపట్టు చెల్లీ! వెచ్చచేసి తీసుకువస్తాను" అన్నది.

బిందు ఇంట్లోకి వచ్చిందగ్గర్నుంచీ పాలు కాగబెట్టక పోవటంచూసి మండిపడుతోంది. తీక్ష్ణకంఠంతో "నేను నిన్న కూడా చెప్పాను మీకు ఎనిమిది అయేసరికి పాలుకాచి సిద్ధంగాఉంచాలని. ఇప్పుడు తొమ్మిదికూడా అయింది. ఈపని మీకంత కష్టమనిపిస్తే పోనీ వెంటనే చెప్పెయ్యకూడదూ! నేను మరో ఉపాయ మేదో చూసుకునేదాన్నిగా? ఆఁ, ఏమమ్మా వంటలక్కా! ఆమాత్రం ఆలోచన నీకు లేక పోయిందా?ఇంటిలోవాళ్ళ పిండాకూటికి రెండునిమిషా లాలస్యమయితే అవుతుంది. యేం?" అన్నది.

వంటలక్క మెదలకుండా వూరుకుంది. "నీలాగా పిల్లాడికి బొట్టూ కాటుకా పెట్టుకుంటూ కూర్చోటమే అయితే మాకూ గుర్తుండేదే! అయినా ఒక్కనిమిషం ఓపికపట్టరాదుటమ్మా చిన్నావిడా!" అన్నది అన్నపూర్ణ.

"ఇంక ఎప్పుడైనాసరే అమూల్యుడి పాలల్లో నువ్వు చెయ్యిపెట్టావంటే ఒట్టే నామీద. నేను వాడిపాలవిషయం ఇహముం దెప్పుడైనా నీతోచెప్పినా నీమీద ఒట్టే"

ఇలాఅని బిందువాసిని, చంకలోవున్న పిల్లాడిని చటుక్కున క్రింద కూలేసి, పాలగిన్నె తీసుకువచ్చి కుంపటిమీద పెట్టింది. హఠాత్తుగా ఆమె ఇలా చెయ్యటంతో వాడు కంగారుపడి ఏడవడం మొదలుపెట్టాడు. బిందు వాడిని బుగ్గలు మెలేసి, 'నోరుముయ్ గాడిదా! నోరుముయ్! ఏడ్చావంటే

చంపేస్తాను' అంది. బిందు ఇలా చెయ్యటం చూసి, ఇంట్లో దాసీది కదమ్ పరుగెత్తుకుంటూ వచ్చి, కుర్రాణ్ణి చంకనేసుకో బోయింది. బిందు దాన్ని 'ఫో, నాయెదుట నుంచోకుండా, దూరంగా ఫో' అని గదమాయించింది.

అది ఇంక ముందుకు రాలేకపోయింది. భయంతో ముడుచుకుపోయి ఒక ప్రక్క నిలబడింది.

బిందు ఇంక ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా ఏడుస్తున్న పిల్లవాడిని మళ్ళీ చంకనెత్తుకుని కుంపటి విసురుతూ కూర్చుంది.

అన్నపూర్ణ ఇదంతా చూస్తూ నిశ్చలంగా నుంచుని ఉంది. ఒక్క క్షణమయింక బిందు పాలుతీసుకుని వెళ్ళిపోయాక ఆవిడ వంటలక్క నుద్దేశించి 'విన్నావమ్మా ఆవిడ మాటలు. పిల్లవాడిని నువ్వు చూసుకో అని మాటవరసకు—నవ్వులాటకు నేనొకరోజున అంటే, ఆ బలంతో ఇవ్వాళ నామీద ఎంత ఒట్టుపెట్టిందో చూశావా?'' అంది.

ఎలాఅయితేనేం—ఇలా అన్నపూర్ణ కొడుకు బిందు వాసిని చేతిలో పెరుగుతున్నాడు. దాని ఫలితం ఏమంటే అమూల్యుడు పినతల్లిని 'అమ్మా' అని పిలవటం, అమ్మను 'అక్కా' అని పిలవటం నేర్చుకున్నాడు.

## 2

ఇది జరిగి నాలుగేళ్ళు గడిచాయి. అమూల్యుడికి ఎంతో వైభవంగా అక్షరాభ్యాస మహోత్సవం చేశారు. ఆ మర్నాడు అన్నపూర్ణ వంటఇంటిలో ఏదో పనిమీద వుండగా బిందు

వాసిని బైటనుంచుని "అక్కయ్యా! అమూల్యుడు నమస్కరించటానికి వచ్చాడు, ఒక్కసారి ఇలారా!" అనిపిలిచింది.

అన్నపూర్ణ వంటింట్లోంచిబయటకువచ్చి అమూల్యుడి వేషం అదీ చూసి ఆశ్చర్యపోయింది. కళ్ళకు కాటుక, మెళ్లో బంగారపుగొలుసు, నడినెత్తిన జుట్టుముడి, పసుపువచ్చని కట్టుబట్ట, ఒకచేతిలో తాటితో వ్రేలాడదీసిన మట్టెసిరాబుడ్డి చంకలో తాటాకులతో అల్లిన చిన్నచదర. ఇదీవాడి వేషం.

"అక్కయ్యకు నమస్కారంచెయ్యి నాయనా!" అంది బిందువాసిని.

అమూల్యుడు తల్లికి నమస్కరించాడు.

వాడికాళ్ళకు బూటూ మేజోళ్ళూ లేవు. లాగూ, చొక్కా, కోటులాంటి విదేశీదుస్తుల్లేవు. అన్నపూర్ణ అపురూపమైన ఈ అలంకరణచూసి, నవ్వుతూ, "ఇవన్నీ నీకు ఎలా తెలిశాయమ్మా చెల్లీ! పిల్లవాడు బళ్ళోకి వెడుతున్నాడల్లేఉందే!" అన్నది.

బిందు నవ్వుముఖంతో "ఊఁ, గంగాపండితుడిబళ్లోకి పంపుతున్నా. వాడిజీవితం సార్థకంకావాలని ఈనాడాశీర్వదించు అక్కా!" అంది.

నౌకర్నిపిలిచి "భైరవ్! అబ్బాయిని ఎవరూ కొట్టకుండా చెయ్యకుండా కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండమని మాష్టారుతో నేను చెప్పాననిచెప్పు. అక్కా! ఈ అయిదు రూపాయలూ తీసుకుని తినుబండారాలేవైనా తెప్పించి కదమ్ చేతికిచ్చి బళ్లోకి పంపించు అని ఆమె ఎంతో ప్రేమగావాడిని ముద్దెట్టుకుని బళ్లోకి తీసుకొని వెళ్లిపోయింది.

అన్నపూర్ణకు కళ్ళనీళ్ళుతిరిగాయి. ఆమె వంటలక్కతో "పిల్లవాడంటే ఎంత ఆపేక్షో చూశావా, కన్నకడుపు కాక పోయినా? కన్నకడుపేఅయితే ఇంకా ఏమేమిచేసేదో?" అంది.

"అందుకనే భగవంతుడు ఇవ్వలేదు కాబోలు! పద్దెని మిదేళ్ళు, ఇరవైయేళ్ళు వచ్చినా-"

వంటలక్కమాట ఇంకా పూర్తికాలేదు. ఇంతలోకే బిందు మళ్లీతిరిగివచ్చి "అక్కా! బావగారితో చెప్పి మన ఇంటికెదురుగానే ఒక బడి పెట్టించకూడదూ! ఖర్చంతా నేను పెట్టుకుంటాను" అంది.

అన్నపూర్ణనవ్వి,"ఇంకా రెండడుగులు వెళ్లాడో లేదో ఈలోపునే నీవుద్దేశం మారిపోయిందా? పోనీ నువ్వుకూడా, వెళ్ళరాదూ, పోయి బళ్ళోనే కూర్చుందువుగాని" అంది.

బిందు తెల్లపోయి, 'ఉద్దేశం మారటంకాదు అక్కా! కాని, ఏమయినా పిల్లవాడు ఎదురుగాఉండటం, ఎక్కడో చాటున ఉండటం ఒకటవుతుందా? వాళ్ళంతా అల్లరిపిల్లలు. పాడు,వీడ్ని పసివాడ్ని చేసిఒకవేళ పట్టుకుకొడతారేమో"అంది

"కొట్టనీ, పిల్లలు కొట్టుకుంటూనేఉంటారుసహజంగా, అదీగాక అందరిపిల్లలూ ఒకటేనమ్మా! వాళ్ళ తలిదండ్రులు వాళ్ళనందర్నీ బళ్ళోకి పంపగలగగా లేంది, నువ్వుమాత్రం నీ పిల్లాడ్ని యెందుకు పంపలేవు?" అన్నది అన్నపూర్ణ.

ఇతర్నులి అలా సాటువతీసురావటం బిందుక సుతా రాం ఇష్టంఉండదు. అందుచేతమనస్సులో కొంచెం కోపగించు

కుని 'మీమాటలతీరే వేరు అక్కా! చూడు. ఎవరైనా కలంపుల్లతో వాడికంటో పొడిస్తే'-అంది.

అన్నపూర్ణ ఆమె మనస్సులోని భావాన్ని గమనించి, నవ్వుతూ-'అయితే డాక్టరుగారికి చూపించూ! కాని—నీకు నిజం చెబుతున్నా, నేను ఏడురాత్రుళ్ళూ, ఏడుపగళ్ళూ, కూర్చుని ఆలోచించినా కలంపెట్టి కంట్లోపొడుస్తారేమోఅన్న సంగతి నామనస్సుకు తట్టదు. అంతమందిపిల్లలు చదువుకుంటు న్నారుకదా! ఎవర్నీ ఎవరూ అలాపొడవగా నేనెక్కడా విన లేదు' అంది.

"నువ్వు వినకపోయినంతమాత్రానఇలాంటివి ఎక్కడా జరగకూడదా? దైవాద్యా జరిగేవాటిని ఎవరు చెప్పగలరు? సరే పోనీ నువ్వు ఒకసారి చెప్పిచూడరాదూ? తర్వాత యే మయితే అదవుతుంది.'

అన్నపూర్ణ గంభీరంగా 'ఏమయేదీ చూస్తూనే ఉన్నాగా! నువ్వు ఒకసారి పట్టుపట్టాక ఇక దాన్ని విడవడ మంటూ ఉండాయేం? కాని నేను ఇలాంటి విపరీతపు కోరికలు కోరలేను. నువ్వు వారితో మాట్లాడుతావుగా! నువ్వే అడగరాదూ!' అంది.

ఈసారి బిందుకి కోపంవచ్చింది. 'అడుగుతాను. రోజూ ఇంతదూరం నా బిడ్డను పంపలేను. ఇది ఎవరికయినా బాగున్నాసరే బాగుండకపోయినాసరే. దీనివల్ల వాడికిచదువు రానీ-రాకపోనీ. ఆ తినుబండారాలు అన్నీ అక్కడకు తీసుకు వెళ్ళమని నీతో చెప్పలేదు కేకదమ్! ఇంకా చూస్తూ అలాగే నుంచున్నావా?" అంది.

అని, కోపంవచ్చినప్పుడు 'యజమానురాలు' అని అంటూ ఉంటుంది.

అన్నపూర్ణ మండిపోయి, 'వెళ్ళి చెప్పరాదూ! ఆయన నా తల తీసేస్తారాయేం! వారూఅంతే-ఏమిటమ్మా! నువ్వు చెప్పేది ఏమిటమ్మా! మంచిదేతల్లీ! అంటూ మొదలెడతారు. అదృష్టవంతుల్ని ఎందర్నో చూశాను నేను-కాని నీ అంత అదృష్టవంతురాల్ని ఎక్కడాచూడలేదు. ఏం నోచుకుపుట్టావో కాని,నీ పేరు చెబితే చాలు ఇంటిలో అందరికీ హడలే'అంది.

బిందుకు కోపమయితేవచ్చింది.కాని, అన్నపూర్ణధోరణికి నవ్వుతూ 'ఏదీ? నువ్వు భయపడుతున్నట్లులేదే! అన్నది.

భయపడకపోవడమేమిటి? నీ రణచండీరూపంచూస్తే చాలు గుండెలోరక్తం నీరుకారనివాళ్ళంటూ ఇంతవరకు పుట్టలేదు. కాని అంతకోపం మంచిదికాదు చెల్లీ! నువ్వేం చిన్నపిల్లవా యింకా? ఈపాటికి పిల్లలుపుడితే నలుగురైదుగురు బిడ్డలతల్లివి కావలసినదానివి. అసలు నిన్ననవలసినపని ఏముందిలే. ముసలాయన చనువిచ్చి నెత్తినెక్కించుకొని పాడు చేశారు' అంది అన్నపూర్ణ.

"ఏం నోచుకొని పుట్టావో అన్నావే నువ్వు, ఆ మాట ఒప్పుకుంటానమ్మా అక్కా! డబ్బు-ఐశ్వర్యం - ఆదరం-ఆహ్లాదం అందరికీలభిస్తాయి. అదేం పెద్దవిశేషంకాదు. కాని ఇలాంటి దేవుడులాంటి బావగారు లభించటానికిమాత్రం ఎన్ని జన్మలలోనో ఎంతో తపస్సుచేసుకుని ఉండాలి. నాఅదృష్టానికి నువ్వు అసూయపడి ఏంచేస్తావమ్మా అక్కా! కాని చను

విచ్చి పాడుచేసింది వారుకాదు. అలా చనువిచ్చి పాడుచేసిన వారెవరైనా ఉన్నారంటే నువ్వే!" అంది.

అన్నపూర్ణ చేతులు జాడిస్తూ "నేనా? ఆమాట నువ్వే అనాలి, ఇంకెవరూ అనరు నాది బహుకఠినమైనఆజ్ఞ. కాని ఏం చెయ్యను? నా అదృష్టం మంచిదికాదు. నేనంటే ఎవరూ భయపడరు. దాసీలూ, నౌకర్లూకూడా వాళ్ళే యజమానులైనట్టూ, నేనేదో దాసీదాన్ని అయినట్లు నాతో ఎదుట పడే పోట్లాడుతారు. అది నేనుకాబట్టి సహిస్తున్నా. ఇంకెవరన్నా అయితేనా?-" అంది.

తీరూ తెన్నూ లేని ఆమెమాటలకు బిందు కిలకిలా నవ్వేసింది. "అక్కా! నువ్వు సత్యయుగంనాటి మనిషివమ్మా! ఈ యుగంలో ఎందుకు వచ్చి పుట్టావ్? ఏం, నాతో మాత్రం ఎవరూ పోట్లాడటంలేదా" అంటూ ఎదురుగావచ్చి ఆమె మెడకు చేతులు రెండూ పెనవైచి 'ఏదీ, ఒక్కకథ చెప్పవూ" అంది.

అన్నపూర్ణ కోపంతో "వెళ్ళు. ఊహుం. తప్పుకుందూ!" అంది.

కదం పరుగెత్తుకుంటూవచ్చి "అమ్మగారూ! అమూల్యధనం కత్తిపీటని చెయిచేసుకుని ఏడుస్తున్నాడు" అని చెప్పింది.

బిందు వెంటనే ఆమె మెడ వదిలేసి లేచి నిలబడి, కత్తిపీట ఎక్కడిది? మీరంతా ఏంచేస్తున్నారు? అంది.

"నేను ఆ యింటిలో పక్కలేస్తున్నాను అమ్మగారూ! ఎప్పుడు పెద్దమ్మగారిగదిలోకి వెళ్ళాడో నాకు తెలియనే తెలియదు-"

'ఊఁ. సరేలే. వెళ్లు. వెళ్ళు' అంటూ బిందు అక్కడినుంచి వెళ్ళిపోయింది. వెళ్ళి అమూల్యుడ్ని వేలికి తడిగుడ్డ చుట్టి వాడిని ఎత్తుకొని మళ్ళా చక్కావచ్చి, "సరేకాని, నీకు ఎన్నిసార్లు చెప్పానమ్మా అక్కా? పిల్లాజెల్లా ఉన్నయింటిలో కత్తిపీటలూ అవీ కొంచెం జాగ్రత్తగా ఉంచాలనీ 'అంది.

అన్నపూర్ణకు మరింత కోపంవచ్చి, "నువ్వుమాట్లాడే మాటలకు తలాతోకా లేదమ్మా చెల్లీ! నీ కొడుకు గదిలోకి వచ్చి చెయ్యి తెగ్గోసుకుంటాడని చెప్పి కత్తిపీటలూ అవీ ఇనప్పెట్టెలో పెట్టి దాచుకోమంటావా?" అంది.

"వద్దులే. రేపటినుంచీ వాడిని తాడుతో కట్టేస్తానులే. అలాఅయితే ఇంకెక్కడికీ రాకుండా ఉంటాడు' అంటూ బిందు అక్కడినుంచి వెళ్ళిపోయింది.

"విన్నావా కదమ్! ఆవిడ జబర్దస్తీ మాటలు! కత్తిపీటలు ఎవరన్నా పెట్టెలలో దాచుకుంటారా?" అంది.

కదమ్ ఏమో అనబోయి మళ్ళీ చటుక్కున ఆగిపోయింది.

బిందు తిరిగివచ్చి "ఇదిగో ఇలా మీరు మాటిమాటికీ దాసీవాళ్ళను, నౌకర్లనూ మధ్యవర్తులుగా తీసుకువచ్చారంటే నిజం చెబుతున్నా. పిల్లాడిని తీసుకొని నేను నాపుట్టింటికి వెళ్ళిపోతా" అన్నది.

"వెళ్ళరాదూ, వెళ్లు. కాని చచ్చినాసరే నేను మళ్ళీ నిన్ను తీసుకురమ్మన్నమాట ఎత్తను. ఆ సంగతిమాత్రం గురుంచుకో" అంది అన్నపూర్ణ.

"నేను రానేరానుగా" అంటూ బిందుముఖం చిట్లించుకుని వెళ్ళిపోయింది. రెండుగంటలు పోయాక అన్నపూర్ణ అడుగులుచప్పుడు చేసుకుంటూ బిందువాసిని గదిలోకి వచ్చింది. గదిలో ఒకమూల టేబిల్ ముందు కూర్చుని మాధవుడు ఏవో కాగితాలు చూచుకుంటున్నాడు. బిందు పిల్లవాణ్ని పెట్టుకుని మంచంమీద పడుకుని కథ చెప్తోంది వాడికి. 'అన్నం తిందువుగాని రా' అంది అన్నపూర్ణ.

"నాకు ఆకలిలేదు" అన్నది బిందు.

అమూల్యుడు చటుక్కున పినతల్లి మెడ కావిలించుకుని "మా అమ్మ తినదు, నువ్వు వెళ్ళు" అన్నాడు.

"నువ్వు ఊరుకో" అని వాణ్ని గదమాయించి,

"వీడే అన్ని అనర్థాలకూ మూలం. అంత గారాబం చేస్తున్నావ్. చివరకుకాని తెలియదులే. అక్క అన్నమాట నిజమే అయిందని అప్పుడు ఏడుస్తావు" అన్నది అన్నపూర్ణ.

బిందు అనమని అమూల్యుడి చెవిలో ఊదింది. అమూల్యుడు బిగ్గరగా "నువ్వు వెళ్ళిపో అక్కా! అమ్మ నాకు కథచెబుతోంది" అన్నాడు.

అన్నపూర్ణ గద్దిస్తూ "మేలుకోరినదానివయితే లేచి రా ఇహ. లేకపోతే రేపు ప్రొద్దున్నే మిమ్మల్ని ఇద్దరినీ ఇంటిలోంచి వెళ్ళకొట్టకపోతే నా పేరు అన్నపూర్ణ కాదు' అని ఎలావచ్చిందో అలాగే అడుగులు చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయింది.

"ఇవాళ మళ్ళీ ఏం జరిగింది!" అని అడిగాడు మాధవుడు.

"అక్కకు కోపంవస్తే ఏంజరుగుతుందో అదే. ఇవాళ జరిగిన తప్పు అల్లా — ఇది పిల్లవాడు తిరిగే ఇల్లాయె, కత్తిపీట అనే జాగ్రత్తగా ఉంచాలి" అన్నాను నేను. దానికింత కాండ జరిగింది" అన్నది బిందు.

"ఇంక ఆట్టే గడబిడ చెయ్యాక వెళ్ళు. ఆవిడ ఎలా అడుగులు చప్పుడు చేసుకుంటూ వెళ్లిందో చూచావుగా! అన్నయ్య ఇప్పుడే వచ్చేస్తాడు ఇంక" అన్నాడు మాధవుడు.

బిందు అమూల్యుణ్ని చంక చేత్తుకుని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

# 3

ఇద్దరు బిడ్డలు ఒకతల్లిని ఆశ్రయించుకుని ఎలా పెరుగుతారో, అలాగే ఇద్దరు తల్లులు ఈ పిల్లవాణ్ని ఆశ్రయించుకుని మరో ఆరేళ్ళు గడిపారు. అమూల్యుడు ఇప్పుడు పెద్దవాడైనాడు. వాడు హైస్కూలులో రెండవతరగతిచదువుతున్నాడిప్పుడు. ఇంట్లో ప్రైవేట్ మేష్టర్ని పెట్టారు. ఆయన ప్రొద్దున్నే వచ్చి పాఠం చెప్పిపోయాక అమూల్యుడు ఆడుకోటానికి బైటకి వెళ్ళాడు. ఇవాళ ఆదివారం. అంచేత స్కూలు లేదు.

అన్నపూర్ణ గదిలోకి వచ్చి, "ఏం చెయ్యమంటావో చెప్పవమ్మా చెల్లీ!" అంది.

బిందు తనగదిలో ఉన్న బీరువాలోని గుడ్డలన్నీ క్రింద పడేసి వాడికి తగిన దుస్తులు ఏరుతోంది. వాడు పినతండ్రితో కలసి, ఆయన క్లయింట్ ఇంటికి విందుకు వెళ్లాలి ఇవాళ. బిందు ముఖం పైకెత్తకుండానే 'దేని విషయం అక్కా?' అంది

ఆవిడస్వభావం ప్రసన్నంగా లేదు, అన్నపూర్ణ ఆ రక రకాల దుస్తులను చూసి, తెల్లబోయింది. అంతేకాని ఆమె ముఖంలోని భావాన్ని గమనించలేదు. కాస్సేపు అలాగే మెదలకుండా చూస్తూ ఊరుకుని, ఇవన్నీ అమూల్యుడి దుస్తులేనా?" అని అడిగింది.

"ఊఁ' అన్నది బిందువాసిని.

"ఎంతడబ్బు నువ్వు అనవసరంగా వెచ్చిస్తున్నావ్! వీటిలో ఒకదానికయ్యేఖర్చుతో బీదవాళ్ళ పిల్లవాడికయితే ఏడాది సరిపడ్డ దుస్తులొస్తాయి' అంది.

బిందుకు చిరాకేసింది. కాని సహజమైన ధోరణిలోనే "బీదవాళ్ళకూ—భాగ్యవంతులకూ కొంచెంవ్యత్యాసం ఎటూ ఉండితీరుతుంది. అందుకోసమని విచారపడితే ఏంలాభం అక్కా?" అంది.

'ఉంటే ఉందిలే, కాని నువ్వు ప్రతిపనిలోనూ కొంచెం దుబారా చేస్తావు!

బిందు ముఖంపైకెత్తి "ఏం చెప్పాలని వచ్చావో ఆ మాట చెప్పరాదూ? నాకు తీరిక లేదిప్పుడు" అంది.

"నీకు తీరికంటూ ఎప్పుడుఉందిలే అసలు!" అంటూ కోపగించుకుని వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

భైరవుడు అమూల్యుణ్ని తీసుకురావటానికని వెళ్లాడు. ఒక గంటసేపు వెతికి వెతికి చివరకు ఎలా అయితేనేం వాణ్ణి పట్టుకుని వచ్చాడు.

'ఎక్కడున్నావ్ ఇంతసేపటినుంచీ!'అని అడిగిందిబిందు.

అమూల్యుడు మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"ఆఫీసులో పిల్లలతో కలిసి అక్కడ బిళ్ళంగోడు,ఆడుతున్నాడు" అని చెప్పాడు భైరవుడు.

ఆ ఆట అంటే బిందుకు అమితభయం. అంచేత ఆఆట ఆడవద్దని ఎన్నోసార్లు చెప్పింది. "బిళ్ళంగోడుఆట వద్దనలేదూ నిన్ను?" అని అడిగింది.

అమూల్యుడు భయంతో నల్లబడిపోయాడు. "నేను నుంచుని వుంటే వాళ్ళే వచ్చి బలవంతాన నన్ను లాక్కెళ్ళారు" అన్నాడు.

"బలవంతపెట్టారా నిన్ను? సరే, ఇప్పుడు వెళ్ళాల్సిన చోటికి వెళ్ళిరా. తర్వాత చూద్దాం" అంటూ వాడికి దుస్తులు వేయసాగింది.

రెండు నెలలక్రితమే అమూల్యుడికి ఉపనయనం అయింది. వాడు గోడితలమీద జరీటోపీ పెట్టుకోటానికి ససేమిరా ఇష్టపడేవాడు కాడు. కాని బిందు విడిచిపెట్టేరకం కాదు. ఆమె బలవంతాన టోపీ పెట్టింది. జరీటోపీ గోడిగుండు మీద గీసుకుపోవటంతో వాడు ఏడవటం మొదలెట్టాడు. మాధవుడు ఇంటిలోకి వస్తూనే "ఇంకెంత ఆలస్యం!" అని అడిగాడు.

మరుక్షణంలోనే అమూల్యుడికేసి చూసి, నవ్వుతూ "నహో! మథురలోని శ్రీకృష్ణులవారు విచ్చేశారు"అన్నాడు.

అమూల్యుడు సిగ్గుతో ఆ టోపీతీసి గిరవాటేసి, పోయి మంచంమీద బోర్లగా పడుకున్నాడు.

బిందుకు కోపం వచ్చింది. "ఒక మూల పసివాడు ఏడుస్తూంటే పైగా మీరు–" అంది. మాధవుడు గంభీరంగా "ఏడవకులే అమూల్యా! పిచ్చివాడంటే లోకులు నన్ను అంటారుగాని, నీకేం? రా నువ్వు" అన్నాడు.

సరిగ్గా ఈసంగతే ఇంతకుముందు ఒకసారి వచ్చింది. అందుకు బిందుకు చాలాకోపంవచ్చింది. ఆమాటే ఇప్పుడు మళ్లీ రావటంతో మరింత మండిపోయి "నేను చేసినవన్నీ పిచ్చిపనులు, అంతేకదూ!– అంటూ లేచివచ్చి అమూల్యుణ్ని లాక్కునివచ్చి చేతిలోని విసనకర్రతో రెండుదెబ్బలంటించి అదివరకు తాను తొడిగిన విలువైన ముఖమల్ లాగూ, కోటు ఊడదీయటం మొదలెట్టింది.

మాధవుడు భయంతో బైటకు పరుగెత్తుకెళ్ళి "బిందుకేదో భూతం ఆవేశించినట్లుంది. మీరొకసారి అలా వెళ్ళండి వదినా!" అని చెప్పాడు.

అన్నపూర్ణ గదిలోకి వెళ్ళేసరికి బిందు వాడి దుస్తులన్నీ ఊడతీసి, ఏదో మామూలుపంచ కట్టపెట్టింది. అమూల్యుడు భయంతో వెలవెలపోతూ నుంచున్నాడు.

"బాగా నేడున్నాయిగా! ఊడదీసి పారేశావేం చెల్లీ? అన్నది అన్నపూర్ణ.

బిందు అమూల్యుణ్ని వదిలి, చటుక్కున గళవస్త్రయై చేతులు జోడించి, "నీకాళ్ళమీద పడతాగాని, నువ్వొక్కసారి ఇక్కడినుంచి వెళ్ళిపోవమ్మా తల్లీ! మీ అందరి మధ్యవర్తిత్వంవల్ల వచ్చే బాధలతో పిల్లవాడు ఉక్కిరిబిక్కిరయి పోతున్నాడు" అన్నది.

అన్నపూర్ణకు నోటమాటరాక ఎలాఉన్నది అలాగే నుంచుండిపోయింది.

బిందు అమూల్యుణ్ని చెవిపట్టుకొని గదిలోకి లాక్కుని వచ్చి నుంచోపెట్టి, "నువ్వు మంచివాడివి కానందుకు తగిన శాస్తి అనుభవించు. ఇవాళల్లా ఈ గదిలోపడిఉండాల్సిందే జైలులోపడ్డట్టు. అక్కా! బైటికి వచ్చేసేయ్. నేను తలుపులు బిగిస్తాను." అంటూ బయటికి వచ్చి గొళ్ళెంపెట్టింది.

అప్పటికి ఒంటిగంటయింది. అన్నపూర్ణ ఇంక ఉండ బట్టలేక వచ్చి "చెల్లీ! నువ్వు నిజంగా అమూల్యుడికి అన్నం పెట్టవా ఇవాళ? వాడికోసమని ఇంటిలో అందరూ ఉపోషం ఉండాల్సిందేనా?" అని అడిగింది.

"ఇంటిలోవాళ్ళ ఇష్టం అది" అని జవాబిచ్చిందిబిందు.

"అదేంమాటమ్మా చెల్లీ! ఇంట్లోవున్నది ఒక్కగాఒక్క పిల్లడాయె. వాడు ఉపోషంఉంటే. పోనీ మనందరిసంగతి వదిలెయ్. నౌకర్లూ దాసీలు మాత్రం ఎలా తినగలరో చెప్పు"

బిందుమొండితనంగా 'అదిఅంతా నాకుతెలియ' దంది.

తర్కిస్తూకూర్చుంటే ఇక లాభంలేదని అన్నపూర్ణ గ్రహించింది. "నేను చెబుతున్నానుకదా! అక్కమాటత్రోసి పారెయ్యకు. వాణ్ణి ఇవాళకు క్షమించు. అదీగాక పైత్యం ఎక్కువై వాడికి జబ్బుగనుకచేస్తే నువ్వేగా అనుభవించేది!" అన్నది అన్నపూర్ణ.

పొద్దుపోవటంచూసి, బిందు స్వయంగానే కొంచెం మొత్తబడుతూవచ్చింది. కదమ్మను కేకేసి, "వెళ్ళు, వెళ్ళి వాణ్ని

తీసుకురా. కాని మీకు ఇప్పుడే చెబుతున్నాను అక్కా—ఇహముందు ఎప్పుడైనా నసరే నామాటకు మాట రెట్టించారంటే మాత్రం బావుండదు" అంది.

ఆరోజుకు గందరగోళం అక్కడితో ఆగిపోయింది.

తమ్ముడికి ప్రాక్టీసు ఎక్కువవటం మొదలెట్టినతర్వాత యాదవుడు ఉద్యోగం వదిలేసి, తమ ఆస్తిపాస్తులు చూసుకోవటం మొదలెట్టాడు. మరదలుదగ్గిర ఉన్నపదివేలూ వడ్డీతో ఇంచుమించు రెట్టింపుఅయినాయి ఇప్పుడు. ఆ డబ్బులో కొంతా, మాధవుడిసంపాదనలోకొంతభాగమూ పెట్టి అతడు ఊరిబయట ఒక చక్కని పెద్దమేడ కట్టిస్తున్నాడు. అది మొదలుపెట్టి దాదాపు ఏడాది కావచ్చింది. పదిరోజుల క్రితమే పూర్తి అయింది. మహానవమి వెళ్లాక మంచిరోజు చూసుకుని అందరూ వెళ్ళి అందులో ప్రవేశించాలని అనుకున్నారు. యాదవు డొకనాడు భోజనంముందు కూర్చుని మరదలితో "నీయిల్లు తయారైందమ్మా! ఒకపూట వెళ్ళి చూసిరా, ఇంకేమయినా కురదలా ఉందేమో!" అన్నాడు.

బిందుకు వెయ్యిపనులున్నా అన్నిటినీ వదిలేసి, బావగారు భోజనంచేసేటప్పుడు తలుపుచాటునకూర్చోటం మొదటి నుంచీ అలవాటు. బావగారంటే ఆమెకు దేవుడిమీదఉన్నంత భక్తి—అందరికీ ఉంది ఆయనంటే అంతభక్తి. "ఇంకేమీ చేయవలసిందిలేదు" అన్నది బిందు.

యాదవుడు నవ్వుతూ చూడకుండానే చెప్పేస్తున్నావా తల్లీ! సరే, బాగుంది. కాని మరోసంగతి. నా ఉద్దేశం

శం ఏమిటంటే మనబంధువుల నందర్నీ ఆహ్వానించి-ఇంచి రోజున మనమందరం గృహప్రవేశమై గృహదేవతలను పూజించాలని ఉంది. ఏమంటావమ్మా నువ్వు?" అన్నాడు.

బిందు మెల్లిగా "అక్కయ్యతో చెప్తాను. ఆవిడ ఎలా అంటే అలాచేద్దాం" అన్నది.

"అలాగే చెప్పు. కాని మాసంసారానికి నువ్వేనమ్మా లక్ష్మివి. నీయిష్టప్రకారమే జరగాలి ఏదిజరిగినా" అన్నాడు యాదవుడు.

అన్నపూర్ణ దగ్గరలోనే కూర్చునిఉంది.ఆమె నవ్వుతూ "అయినా మీ లక్ష్మి కొంచెం శాంతిస్తేనేఏమైనా జరిగేది!" అంది.

"శాంతమేమిటి?మాతల్లిసాక్షాత్తూ జగద్ధాత్రి.వరాలూ ఇవ్వగలదు, అవసరమైతే కత్తిపట్టగలదు."

"అదే నేనుకోరేది. మాతల్లివచ్చినప్పటినుంచీ సంసారంలో కష్టమనేమాట లేదు" అన్నాడు యాదవుడు.

"మీరన్నమాట నిజమే. ఆవిడ రాకముందునాటిరోజులు తలుచుకుంటే ఇప్పటికీ భయంవేస్తుంది"అన్నది అన్నపూర్ణ.

బిందు సిగ్గుపడి ఆమాటలను అణచిపెట్టి, "మీరు అందర్నీ పిలిపించండి. మనది చాలా పెద్దయిల్లు. ఎవరికీఏమీ ఇబ్బంది ఉండదు. ఇష్టమయితే వచ్చి రెండేసినెలలు ఉన్నా ఉండొచ్చు" అంది.

"అలాగేనమ్మా. రేపే వాళ్ళందరూ రావటానికి తగిన ఏర్పాట్లుచేస్తాను" అన్నాడు.

# 4

వీరికి వేలువిడిచిన చెల్లెలు ఎలోకేసి స్థితిగతులు అంత బాగా లేవు. యాదవుడు వాళ్ళకు తరచుగా డబ్బుపంపుతూ చేస్తూ ఉండేవాడు. ఆమె కొడుకు నరేంద్రుణ్ణి ఇక్కడే ఉంచి చదువు చెప్పించాలని తన అభిప్రాయమని యాదవుడు కొన్నాళ్ళనుంచీ ఉత్తరాలు రాస్తున్నాడు. ఈ సందర్భంలో ఆమె కొడుకుని వెంట పెట్టుకొని ఉత్తరపాడానుంచి వచ్చింది. ఆమెభర్త ప్రియనాథుడు– అక్కడ ఏంపని చేస్తాడో ఎవరికీ యేమీ తెలియదు. రెండురోజుల క్రితం ఆయనా వచ్చాడు. నరేంద్రుడికి పదిహారు పదిహేడేళ్ళుంటాయి అతడు వెడల్పంచు ధోవతులు కడతాడు. రోజుకు పదిసార్లు తల దువ్వుతాడు. ఇవాళ ప్రొద్దుకూకాక అందరు వంటఇంటి వరండాలో కూర్చున్నారు. ఎలోకేసి తన కొడుకు యొక్క అసాధారణమైన రూపాన్ని గురించీ, తెలివితేటలను గురించీ చెబుతోంది.

"నువ్వు ఎన్నో క్లాసు చదువుతున్నావ్?" అని అడిగింది బిందు.

ఘోస్తుఫారం – రాయల్ రీడరు, గ్రామరు, జాగ్రఫీ, ఎరిథ్ మెటిక్, ఇంకా ఎన్నో డెసిమల్–ఒెసిమల్ అవన్నీ నీకు తెలియవులే అత్తా!" అన్నాడు నరేంద్రుడు.

ఎలోకేసి సగర్వంగా ఒకసారి కొడుకుముఖం కేసిచూసి, బిందుతో "అవన్నీ ఒకటీ–అరాపుస్తకాలా? పుస్తకాలగుట్ట అనుకో. రేపు నీ పుస్తకాలన్నీ పెట్టెలోంచితీసి మీ అత్తలకు ఒకసారి చూపించు నాయనా!" అంది.

నరేన్ తలతిప్పుతూ "ఓ! తప్పకుండా చూపిస్తాను" అన్నాడు.

"ఇంకా ఆక్లాసు ప్యాసవలేదా?" అంది బిందు.

"ఎందుకవడమ్మా! అవుతాడు. ఇన్నాళ్ళనుంచీ ఒకటే అన్నమాటేమిటి? ఇంకా నాలుగు క్లాసులు ప్యాసయేనాడు. ఎటొచ్చీ ఆ పాడుమేష్టర్ల మూలంగా కావటంలేదు. వాళ్ళు సర్వనాశనమైపోను-పిల్లడ్నివా మొదటినుంచీ విషపుచూపుల తోనే చూస్తున్నారు. ఎంచేత అలా చూస్తున్నారో అది వాళ్ళకే తెలియాలి. వాళ్లేమన్నా పైక్లాసులోనికి రానిస్తేనా? రానివ్వందే! పగపట్టి వాళ్ళు ఏటా ఒకే క్లాసులో కూలేసి ఉంచుతున్నారు" అంది ఎలోకేసి.

బిందు విస్మితురాలై "అలా జరగదే" అంది.

జరుగుతోంటే ఇంకా జరగకపోవడ మేమిటి? మేష్టర్లందరూ ఏకమై లంచాలు కావాలంటున్నారు. మేము బీద వాళ్ళమాయె. లంచానికికూడా డబ్బు ఎక్కడనుంచి తీసుకు వచ్చి పోయగలం చెప్పు?" అన్నది ఎలోకేసి.

బిందు మెదలకుండా ఊరుకుంది. అన్నపూర్ణ మనస్సులో దుఃఖపడి, "ఇలా పైకివచ్చేవాళ్ళని వెనక్కిలాగటం ఎక్కడైనాఉందా? అది మంచిపనేనా? కాని నాకు ఇక్కడ అలాంటి బాధలేవిలేవు మా అమూల్యుడు ఏటేటా పైక్లాసులు పట్టుకొస్తాడు యింటికి. కాని ఎప్పుడూ లంచాలూగించాలూ ఏమీ ఇవ్వనవసరంలేదు" అన్నది.

ఈసమయంలో అమూల్యుడు ఎక్కడనుండో పరుగెత్తుకువచ్చి తనపినతల్లి ఒళ్ళోకిపోయి కూచున్నాడు. రాగానే

ఆమె మెడకు చేతులు వేసి చెవులో "రేపు ఆదివారం అమ్మా! ఇవాళ మేష్టార్ని వెళ్ళిపొమ్మని చెప్పవూ?" అని అడిగాడు.

బిందు నవ్వుతూ "వీణ్ణి చూశారా వదినా! వీడికి కబుర్లు ఉంటే చాలు. ఇంక అక్కడనుంచి లేవనే లేవడు. కదమ్! నువ్వు వెళ్ళి అమూల్యుడు ఇవాళ పాఠానికి రాడని పంతులు గారితో చెప్పు" అన్నది.

నరేన్ ఆశ్చర్యపోతూ "అదేమిటిరా అమూల్య! అంత పెద్దవాడివి, ఇంకా పోయి ఆడవాళ్ళ ఒళ్ళో కూర్చుంటున్నావా?" అన్నాడు.

బిందు నవ్వుతూ? "ఇదిఒక్కటేనా?–ఇప్పటికీ రాత్రిళ్లు–"

అమూల్యుడు కంగారుపడుతూ పినతల్లినోటికి చెయ్యి అడ్డుపెట్టి "చెప్పొద్దు అమ్మా! చెప్పొద్దు" అన్నాడు.

బిందు చెప్పలేదు. కాని అన్నపూర్ణ చెప్పేసింది. "ఇప్పటికీ రాత్రిళ్ళు పింతల్లి ప్రక్కలో పడుకుంటాడు."

"ఊరికే పడుకోవటమేనా? రాత్రి తెల్లవార్లూ కప్పలాగా కరుచుకు పడుకుంటాడు" అన్నది బిందు

"అమూల్యుడు సిగ్గుతో తలతీసుకెళ్ళి పింతల్లివక్షంలో దాచుకున్నాడు.

"ఛీ ఛీ, అదేమిటిరా! నువ్వు ఇంగ్లీషు చదువుతున్నావా?"" అన్నాడు నరేంద్రుడు.

"చదవకేం? ఇస్కూలులో చదివేది ఇంగ్లీషేగా?" అన్నది అన్నపూర్ణ.

"ఇన్, ఇంగ్లీష్ చదువుతున్నావా? ఏదీ, ఇంజన్‌కు స్పెల్లింగ్ చెప్పమను, చూద్దాం" అన్నాడు నరేన్.

"అవన్నీ కష్టమైనమాటలు. చిన్నపిల్లలేం చెప్పగలరు?" అన్నది. ఎలోకేశి.

"అమూల్యుడేదీ ఎందుకు చెప్పలేదు?" అన్నది అన్నపూర్ణ.

కాని అమూల్యుడు మాత్రం ఏమయినా నోరు తెరవలేదు.

బిందు అమూల్యుడ్ని ఒకసారి వక్షానికి హత్తుకుని, "మీరంతాకలిసి వాణ్ని సిగ్గుపడేట్లు చేస్తే వాడెలా చెపుతాడూ స్పెల్లింగూ?" అన్నది.

తర్వాత ఎలోకేసి కేసి చూసి, "మావాడు వచ్చేసంవత్సరం ప్యాసవుతాడనీ, ఇరవైరూపాయలు స్కాలర్‌షిప్ వస్తుందనీ మేష్టరుగారు చెప్పారు. ఆ డబ్బు అంతా దాచుకుని, పినతండ్రిలాగా వాడూ ఒకగుర్రాన్ని కొనుక్కుంటాడు" అంది.

ఆమాట నిజమే అయినా పరిహాసంగా తీసుకుని అందరూ నవ్వేశారు.

ఎలోకేసి బిందుకేసి తిరిగి "మా నరేంద్రుడు కేవలం చదువుసంధ్యలలోనే కాదు—వాడు నాటకాలలో యాక్టుచేశాడంటే చూసేవాళ్ళకళ్లు నీళ్ళుపెట్టుకోకుండా ఉండలేరు. సీత వేషంవేసి నువ్వుచెప్పే పోర్షన్ ఒకసారి మీ అత్తలకు వినిపించునాయనా!" అంది.

నరేన్ వెంటనే మోకాళ్ళమీదకూర్చుని, చేతులు రెండూ జోడించి, బిగ్గరగా అనునాసిక స్వరంతో "హా ప్రాణే

శ్వాగా! ఏ చెడుఘడియలో మీదాసిని" అంటూ ప్రారంభించాడు.

బిందు గాబరాపడుతూ "ఆగనోయ్! ఆగు, ఆగు. పైన బావగారున్నారు" అంది.

నరేన్ ఉలిక్కిపడి మెదలకుండా ఊరుకున్నాడు.

అన్నపూర్ణ విన్నంతవరకే సుగుణాలై "వింటేవింటారులే. భగవత్కథలివి. మంచిమాటలేగా చెల్లీ!" అన్నది.

బిందు కొంచెంవిసుక్కొని "ఆ కథలన్నీ మీరువింటే వినండి. మేంవెళ్ళిపోతాం" అంది.

"సరే, ఉండండిమీరు. నేను సావిత్రమ్మపాట్ట చెబుతాను" అన్నాడు నరేన్.

"వద్దు" అన్నది బిందువాసిని.

ఆ కంఠస్వరం వినేసరికి అప్పటికి చైతన్యం వచ్చింది అన్నపూర్ణకు.వ్యవహారం చాలాదూరం వెళ్ళిందనీ అంతటితో ఆగదనీ గ్రహించిం దామె. ఎలోకేసికి క్రొత్త. ఆమెకు లోపలి సంగతులు తెలియవు.

"సరే, ఇప్పుడుకాదులే. మగవాళ్ళు ఇంటిలో లేనప్పుడు మధ్యాహ్నంపూట ఎప్పుడయినా చెబుదువుగానిలే ఆ పాట్ట. సంగీతమ్మూ, అదీ మావాడేమయినా తక్కువనేర్చుకున్నాడా? దమయంతి ఏడుస్తూ పాడేపాటఉందే-అది ఒకసారి పాడు నాయనా! మీ అత్తలు విన్నారంటే యింక విడిచిపెట్టరు" అంది

"ఇప్పుడే పాడుతా" అన్నాడు నరేన్.

కోపంతో బిందుకు ఒళ్ళుమండిపోతోంది. ఆమె ఏమీ మాట్లాడ లేదు.

అన్నపూర్ణ ఆదరాబాదరా "వద్దు, వద్దు. సంగీతం గింగీతం ఇప్పుడేమీ వద్దులే" అంది.

"సరే, సంగీతం నేను అమూల్యుడికి నేర్పుతాలే, నాకు మద్దెలవాయించటం కూడా తెలుసు. ఆ యిత్తడి బిందె ఇలా ఇయ్. ఎన్ని కష్టమైన వరసలు వాయించి చూపెడ తానో" అన్నాడు నరేన్.

బిందు అమూల్యుడ్ని లేచి వెళ్ళమని సైగచేస్తూ 'వెళ్ళు అమూల్య! నీ గదిలోకి పోయి చదువుకో" అంది.

అమూల్యుడు ముగ్ధుడై వింటున్నాడు. వాడికి లేవ టానికి బుద్ధిపుట్టటంలేదు. మెల్లిగా "ఇంకా కాస్సేపు కూర్చుంటే ఏం అమ్మా?" అన్నాడు.

బిందు యింక ఏమీ మాట్లాడకుండా అమూల్యుడ్ని వెంటబెట్టుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది. ఈవిడ చటుక్కున యిలా ఎందుకయిపోయిందో అన్నపూర్ణ గ్రహించింది. అంతేకాక సాహచర్యదోషంవల్ల అమూల్యుడు పాడైపోతాడనీ, ఆ భయంతో నరేంద్రుడు యిక్కడఉండి చదువుకోటం బిందుకు యిష్టంఉండదనీకూడా గ్రహించి అన్నపూర్ణ ఉద్విగ్నురాలయింది. "నాయనా! నరేన్! మీచిన్నత్త ముందర నీ నాటకాలూ యాక్టింగూ సంగతి మరెత్తకు. ఆవిడ కొంచెం కోపిష్టి—ఇలాంటివి ఆవిడకు నచ్చవు" అంది.

ఎంతో కేసి ఆశ్చర్యపోతూ, చిన్నానికకు ఇ నేమి నచ్చ... యేం? అందుకనేనా అలా లేచి వెళ్ళిపోయింది? అన్నది.

"అయియుండొచ్చు. మరో సంగతి నాయనా! నీకింకేమో నీ చదువేమో అదే చూచుకో నాయనా! మా అమ్మగారి కష్టాలన్నీ పోయేందుకు ప్రయత్నించు. నువ్వు అమూల్యుడితో అంతచనువుగా కలిసి మెలిసి తిరగకు నాయనా! వాడు చిన్న పిల్లాడు. నీకంటె చాలాచిన్నకూడా" అంది అన్నపూర్ణ.

ఈమాటలు ఎలోకేసికి నచ్చలేదు. "అదినిజమే. వీడు పేదపిల్లవాడు. పేదరికానికి తగినట్లుగా ఉండటమే మంచిది. అయినా మాటవచ్చిందికనుక చెబుతున్నానమ్మా వదినా! మీ అమూల్యుడు పసిగుడ్డాను. మా నరేన్ ముసలివాడూనా? ఏడాదో ఆర్నెల్లో చిన్న అయినా పెద్దఅయినా అదో ఇదా? వాడుమాత్రం గొప్పవాళ్ళపిల్లన్ని ఎక్కడా చూడలేదను కున్నారా? ఇక్కడికి వచ్చే చూస్తున్నాడనుకున్నారా, వాళ్ళ నాటకంకంపెనీలో ఎంతమంది రాజాలపిల్లలున్నారో తెలుసా?" అంది.

అన్నపూర్ణ తెల్లబోయి "కాదు వదినా! అదికాదు నేనన్నమాట. నే ననేది ఏమిటంటే. "

"ఇంకా చెప్పేదేమిటి వదినగారూ! మేము ఎంత వెర్రి వాళ్ళమయినా ఈమాటనుకూడా తెలుసుకోలేనంత వెర్రి వాళ్ళమా? అయినా అన్నయ్య నరేంద్రుడు ఇక్కడే చదువు కుంటాడు రమ్మని ఉత్తరం రాస్తే వచ్చాం కాని, మేము అక్కడ గడవకవచ్చామా?" అన్నది ఎలోకేసి.

అన్నపూర్ణ సిగ్గుతో చచ్చిపోతుంది. "నేను అలాఅన లేదని ఆ అంతర్యామికే తెలుసు వదినగారూ! నేను అన్న

దేమంటే శ్రద్ధగా చదువుకుని మీ అమ్మను సుఖపెట్టు నాయనా అని—అంతే'-

"సరిసరి. వెళ్ళరా నరేన్! వెళ్ళి నువ్వు బైట ఆడుకో. గొప్పవాళ్ళ పిల్లలతో కలిసిమెలిసి తిరగకు" అంటూ, ఎలో కేసి కుర్రవాణ్ని ఒక్క తోపుతోసి, తానూ వెళ్ళిపోయింది అక్కడ నుంచి.

అన్నపూర్ణ తుపానులా రివ్వున బిందుగదిలోకి వచ్చి ఏడుస్తూ! ఆఁ నీకోసమని మా చుట్టరికాన్ని తుంచుకోవాల్సిందేనా ఏం? అక్కడనుంచి ఎందుకు లేచివచ్చేశావో చెప్పు అంది.

బిందు అతిసహజధోరణిలో "ఎందుకు త్రెంచివేసుకోవడం అక్కా! చుట్టపక్కాల నందర్నీ పెట్టుకుని సుఖంగా ఉండండి మీరంతా. పిల్లాణ్ని తీసుకుని నేనే వెళ్ళిపోతాను ఇక్కడనుంచి" అంది.

"ఎక్కడకి వెళ్ళిపోతావో చెప్పు చూతాం?"

"వెళ్ళేరోజున నేను ఎక్కడికి వెళ్ళేదీ చెప్పే వెడతాను, మరేం బెంగపడక్కర్లేదు" అంది బిందు.

"నలుగురిలోనూ తలెత్తుకోకుండా చేయందే నువ్వు విడిచిపెట్టవని తెలుసు నాకు. ఈవిడ వచ్చినప్పటినుంచీ చూస్తున్నా-ఒక్కతీరున నా ఎముకలు కొరుక్కుతింటోంది" అని బైటికివెళ్ళిపోతూ మాధవుడురావడం చూసి, 'కాదయ్యా మరిదీ! మీరు మరోయింట్లోకి వెళ్ళి ఉన్నానసరే. లేదా ఈ విణ్ణి పంపించివేసినాసరే. నే నింకఉండలేను. లేకపోతే, నేను స్పష్టంగా చెబుతున్నాను" అని మండిపడి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

మాధవుడు ఆశ్చర్యపోయి భార్యను పిలిచి "ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"నాకు తెలియదు. యజమానురాలి హుకుం అయింది గా! మమ్మల్ని వెళ్ళగొట్టండి" అన్నది బిందు.

మాధవుడింకేమీ మాట్లాడలేదు. టేబిల్ మీద ఉన్న పత్రిక చేత పుచ్చుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు.

## 5

ఎలోకేసి పైకి అమాయకురాలిగా కన్పిస్తుందికాని, ఆమె అలాంటిది అనుకోవటం పొరపాటు. నిస్సంతానవతి అయిన బిందు భాగ్యవంతురాలని తెలుసుకోగానే ఆమెదృష్టి బిందుమీదికి మళ్ళింది. రోజూ రాత్రిళ్లు భర్త ప్రియ నాథ్‌ను ఒకసారైనా 'మీ మూలంగానే నాకు సర్వమూ పోయింది. అనవసరంగా మీ దగ్గర పడి ఉండకుండా నేను ఇక్కడే ఉన్నట్లయితే నే నీపాటికి రాజమాతనైపోయే దాన్ని. బంగారుబొమ్మలాంటి మన పిలవాణ్ని వదిలివేసి, ఆ దయ్యంలాంటి కుర్రాణ్ని ఆమె. ' అంటూ దీర్ఘంగా నిట్టూర్చి, ఆ నిట్టూర్పుతో దయ్యంలాంటి కుర్రాడి పరమా యుర్దాయాన్ని ఎగరగొట్టేసి, 'బీదవాళ్ళకు భగవంతుడే ఉన్నాడు' అంటూ ముగించి మెదలకుండా పడుకునేది. ప్రియ నాథుడు కూడా తన అమాయకత్వానికి తనలో తాను పశ్చాత్తాపపడుతూ నిద్రపోయేవాడు. ఈ దంపతుల జీవితం ఇలా గడిచిపోతోంది. ఎలోకేసికి బిందుమీద ప్రేమ ఆనాటి కానాటికి ప్రవాహంలా పొరుకుపోతోంది.

ఇవాళ మధ్యాహ్నం ఆమెవచ్చి, 'ఇలా మేఘాల లాంటి జుట్టును ఎప్పుడూ ఒకనాడైనా దువ్వుకుని జడవేసు కున్నట్లు కనబడలేదే! ఇవాళ జమీందారుగారి పిల్లలు ఆడు కోటానికి వస్తారట! రా. తలదువ్వుతాను.'అన్నది ఎలోకేశి.

వద్దులెండి వదినా! నేను తలమీద చెంగుఉంచుకో లేను. కుర్రాడు పెద్దవాడయినాడు.చూచిపోతాడు'అందిబిందు.

ఆవిడ తెల్లబోయింది. "అదేమిటమ్మా వదినా! కుర్రాడు పెద్దవాడయినాడని పుణ్యస్త్రీలు తలదువ్వుకోవటం మానుతారా? మా నరేంద్రనాథుడు-వాడి శత్రువుల మొహం మండిపోను—ఆర్నెల్లో, ఏడాదో పెద్దేఅనుకో-అలాఅని నేను తలదువ్వుకోవటం మానుకున్నానా?" అంది.

"మీరెందుకు మానుకోవటం వదినా! నరేంద్రుడు మొదటినుంచీ చూస్తూనే ఉన్నాడుగనుక అతడిసంగతి వేరు. కాని అమూల్యుడు హఠాత్తుగా నేను తలదువ్వుకుని చుట్ట చుట్టుకోవటం చూశాడంటే తెల్లబోతాడు. ఏదైనా గడబిడ చేస్తాడేమో! ఛీ! ఛీ! నాకెంతో సిగ్గేస్తుంది." అన్నది బిందు.

అన్నపూర్ణ అటుకేసివెళుతున్నదల్లా బిందుకేసి చూచి చటుక్కున ఇటువచ్చి, "నీ కళ్ళల్లో నీళ్ళు నిలిచాయేమమ్మా ఇలా రా, ఒళ్ళు ఎలాఉందో చుస్తాను" అన్నది.

ఎలోకేసిముందు ఆవిడ ఇలాఅనటంతో బిందు చాలా సిగ్గుపడి, "రోజు రోజూ నా ఒళ్లు ఎలాఉందో చూడాలా? నేనేం పసిపాపనా? ఏదైనా సుస్తీచేస్తే నాకు తెలియదూ?'అంది

"ఉహూం, కాదులే. ముసలిదాని వేళే. దగ్గరకు రా, భాద్రపద-ఆశ్వయుజమాసాలు. రోజులుచూస్తే బాగాలేవు" అన్నది అన్నపూర్ణ.

"నేను రాను. నాకేమీ లేదని, బాగానే ఉన్నానని చెబుతూంటే ఒకప్రక్క మళ్ళీ ఎందుకేమిటి దగ్గరకురావటం" అన్నది బిందు.

"నాకళ్ళు కప్పాలని చూడకు"అని అన్నపూర్ణ సందిగ్ధ దృష్టితో చూస్తూనే వెళ్ళిపోయింది.

"పెద్దావిడ చేష్టలో-మాటల్లో కొంచం పటాటోపం ఉందనుకుంటాను" అంది ఎలోకేసి.

బిందు ఒక్కక్షణం ఆగి! "అలాంటి పటాటోపం కొంచెమో గొప్పో అందరి దగ్గరా ఉంటుంది వదినా!" అన్నది. ఆ మాటతో ఎలోకేసి మెదలకుండా ఊరుకుంది.

అన్నపూర్ణ ఏదో తీసుకుని అటుకేసి వెడుతోంది. బిందు ఆమెను పిలుస్తూ "అక్కా! అక్కా! మాట, మాట! తల దువ్వించుకుంటారా కొంచం?" అని అడిగింది.

అన్నపూర్ణ వెనక్కితిరిగి నిలబడింది. ఒక్కక్షణం నిశ్శబ్దంగా చూస్తూ నిలబడి జరిగినదంతా గ్రహించి, ఎలోకేశితో 'నేను ఎన్నిసార్లు చెప్పానండీ వదినా? ఆవిడకు చెప్పటం వృథా. అంత జుట్టు ఏనాడూ దువ్వుకుని చుట్టచుట్టుకోదు. అన్ని నగలూ, అన్ని చీరలూ ఉన్నాయన్న మాటేగాని, ఏనాడు పెట్టుకోదు. కట్టుకోదు. అంత అద్దం ఏనాడూ చూచుకోదు ఆవిడదంతా సృష్టిలో ఎక్కడా లేనివిచిత్రమైనబుద్ధి. కుర్రాడూ అంతే, ఆమెకు ప్రతి. ఆరోజున అమూల్యుడు నాతో ఏమన్నాడో

విన్నావా చెల్లీ! బట్టలుకట్టుకుంటే ఏమిటివస్తుంది? మాఅమ్మకు అన్నీ ఉన్నాయి. ఎప్పుడైనా కట్టుకుంటుందాఅన్నాడు' అన్నది.

బిందు సగర్వంగా తలయెత్తి నవ్వుతూ "చూడక్కా! కుర్రాణ్ణి పదుగురితోపాటు పెద్దవాడిని చెయ్యాలంటే తల్లికి అలాంటి బుద్ధివుండటం అవసరం కాదూ! అంతదాకా బ్రతికుంటే అప్పుడు లోకమంతా యీమె 'అమ్మాయిడి తల్లి' అని చెప్పుకోవటం చూడగలవు అని అంటూఉండగానే ఆమెకళ్ళు జలజలలాడాయి.

అన్నపూర్ణ అదిగమనించి వాత్సల్యంతో—"అందుకనే యీ తల్లికొడుకులవిషయంలో మేమేమీ కల్పించుకుని రావటంలేదు. భగవంతుడు నీకోరిక నెరవేర్చాలి. కాని వీడు పెద్దవాడౌతాడు. అంతగొప్పవాడౌతాడు అనే ఆశ మేము అంతగా పెట్టుకోలేదు" అన్నది.

బిందు పెటచెంగుతో కన్నీళ్ళు తుడుకుని, "నేను ఈ ఒక్కఆశతోనే బ్రతుకుతున్నాను అక్కా!" అన్నది. ఆమె శరీరం యావత్తు గగుర్పొడిచింది అందుకు ఆమె సిగ్గుపడి బవనంతాన నవ్వు తెచ్చుకుని, "కాదు అక్కా! నా ఆశకు ఎక్కడయినా విఘ్నంవస్తుందని తోస్తే నాకు పిచ్చెక్కిపోతుంది" అన్నది.

అన్నపూర్ణ స్తబ్ధులాగా అలాగే నుంచుంది. ఆమెకు తోటికోడలి మనస్సు తెలియనిదికాదు కాని, ఆమె ఆకాంక్షల ఉగ్రమైన ప్రతిబింబం ఎన్నడూ ఆమె మనస్సుకు ఇంత స్పష్టంగాకల్పించలేదు. బిందు తన కొడుకు విషయమై

యక్షిణిలా ఎందుకు అంత హెచ్చరికకలిగిఉంటుందో ఆమె కివాళ తెలిసివచ్చింది. తనపుత్రుని సర్వశ్రేయోభిలాషియైన ఆమెముఖం చూసేసరికి అనిర్వచనీయమైన శ్రద్ధామాధుర్యా లతో ఆ మాతృహృదయం పరిపూర్ణమయింది. పైకి ఉబికి వస్తున్న అశ్రువులను దాచుకోవటానికి అన్నపూర్ణ ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

ఎలాగో కేసి 'అలాగేలే వదినా! ఇవాళకు—'

బిందు ఆదరాబాదరా ఆమాటకు అడ్డువచ్చి, "ఆఁ వదినా! ఇవ్వాళ అక్కయ్యకు తలదువ్వి చుట్టచుట్టండి. ఆమె తలదువ్వుకోగా నే నీ యింటికి వచ్చినప్పటినుంచీ ఎన్నడూ చూడలేదు" అంటూ ముఖం ప్రక్కకుత్రిప్పుకుని నవ్వుకుని వెళ్ళిపోయింది.

అయిదారు రోజులుపోయాక ఒకనాడు ప్రొద్దున్నే ఇంటి మంగలి యాదవుడికి క్షౌరంచేసి, పైనుంచి క్రిందకు వస్తున్నాడు. అమూల్యుడు వాడిదారికి అడ్డంవచ్చి, 'ఒరేయ్ కైలాస్! నరేన్‌దాకుమల్లే జుట్టు కత్తిరించగలవా నాకు?' అని అడిగాడు.

కైలాసుడు ఆశ్చర్యపోతూ 'అదెలాగేమిటి అబ్బాయిగారూ?' అని అడిగాడు.

అమూల్యుడు తన నెత్తిమీద చెయ్యిపెట్టి చూపుతూ చూడు, ఇక్కడ ముప్పాతిక, ఇక్కడ అందులో సగం, ఇక్కడకూడా సగమే, ఇక్కడ ఒకవీసం — ఇక్కడ పూర్తి—క త్తిరించగలవా అలా?' అని అడిగాడు.

కైలాసుడు నవ్వుతూ "నేనుకాదుగదా నా బాబ్బు దిగివచ్చినా కత్తిరించలేడు" అన్నాడు.

అమూల్యుడు అంతటితో వదిలిపెట్టలేదు. వాడికి ధైర్యంచెబుతూ "అదేం పెద్దకష్టంకాదురా కైలాస్! ఇక్కడ మువ్వాతికా–ఇక్కడ సరిగ్గా అందులో సగమూ–"

కైలాసుడు ఎలాగో అలాతప్పించుకోవాలని ఉపాయం పన్ని 'ఇవాళ ఏంవారమో తెలుసా అబ్బాయిగారు! మీ పిన్నిగారి హుకుం అవందే నేను చేయలేను" అన్నాడు.

'సరే, ఆగు, నేను చెప్పివస్తాను' అని అడుగు ముందుకువేసి మళ్ళీ వెనక్కివచ్చి, 'సరేకాని,నీగొడుగు ఒక సారి యిలా ఇయ్యి. లేకపోతే పారిపోతావ్" అంటూ బల వంతాన ఆ గొడుగు లాక్కొని పరుగెత్తుకు వెళ్ళాడు.తుపాను లాగా రివ్వున గదిలోదూరి "అమ్మా,ఒకసారి ఇలారావాలి చప్పున" అన్నాడు.

బిందు అప్పుడే స్నానంచేసి, జపంచేసుకుంటోంది. ఆమె గడబిడపడుతూ "ఒరేయ్! నన్ను తాకవద్దురా తాక వద్దు. జపంచేసుకుంటున్నా" అంది.

"జపం తర్వాత చేసుకోవచ్చులే అమ్మా! ఒకసారి బైటకివచ్చి వాడితో చెప్పివెళ్ళు. లేకపోతే కత్తిరించనంటు న్నాడు. వాడు నిలబడి ఉన్నాడు"

బిందు ఆశ్చర్యపోయింది. అమూల్యుడు మంగలి ముందర కూర్చోటం అంటే ఎప్పుడూ మారాంచేసేవాడు. యివాళ తనంతటతాను ఎందుకు క్షౌరంచేయించుకుంటా ననుకున్నాడో తెలియక ఆమె బైటికి రాగానే "చాలా

కష్టమైన పురమాయింపు చేశారు అమ్మగారు! నరేన్ బాబుకుమల్లే ముప్పాతికా, పాతికా, వీసం—అరవీసం చొప్పున రకరకాలుగా కత్తిరించాలట! అది నావల్ల అవుతుందా" అన్నాడు కైలాసుడు. "తప్పకుండాఅవుతుంది. సరే, నుంచో నేను నరేన్ బాబును పిలుచుకువస్తాను"అంటూ అమూల్యుడు పరుగెత్తాడు. నరేన్ ఇంట్లోలేడు. కాస్సేపు అక్కడక్కడ వెతికి మళ్ళీవచ్చి, "అతడు లేడింట్లో, పోనీలే లేకపోతేఅమ్మా, నువ్వు ఇక్కడనుంచుని చూపించు—సరిగ్గాచూస్తూ ఉండాలి సుమా! ఇక్కడ ముప్పాతిక—ఇక్కడ పాతిక, ఇక్కడ వీసం. ఇక్కడ ఇంకా బాగాపొట్టిగా కత్తిరించాలి" అన్నాడు. వాడి తొందరచూసి బిందు నవ్వుతూ "నేను జపంచేసుకోవాలిరా" అంది.

"జపం తర్వాత చేసుకోవచ్చులే. లేకపోతే తాకుతా చెపుతున్నా;"

తప్పనిసరిఅయి బిందు నుంచోవాల్సివచ్చింది.

నాపితుడు కత్తెరవెయ్యటం మొదలెట్టాడు. బిందు కనుసైగచేసేసరికి వాడు తల అంతా సమానంగా కత్తెర వేశాడు. అమూల్యుడు తలమీదచెయ్యిపెట్టుకొని చూసుకుని చక్కగాఉం దిప్పుడు అంటూ గంతులేసుకుంటూ వెళ్ళి పోయాడు.

మంగలి, కత్తి పొదిలోపెట్టుకుంటూ "కాని అమ్మ గారూ! రేపు ఇక నేను ఈ యింటికి రావటం కష్టంసుమండీ" అన్నాడు.

వంటావిడ వడ్డించి కేకలేసోంది. బిందు వంటయింటో

ఒక ప్రక్క కూర్చుని పాలు చల్లారబోస్తూ విన్నది. అమూల్యుడి పినతండ్రి తలదువ్వుకునే బ్రష్ కోసమని ఇల్లంతా వెదకుతూ తిరుగుతూ "ఎక్కడుంది బ్రష్!" అని అరుస్తున్నాడు. "ఏం బాగా లేదమ్మా! అంతా ఖరాబు చేసేశాడు. రేపువాణ్ని చంపేస్తాను" అన్నాడు. బిందు ఇంక నవ్వాపుకోలేకపోయింది. అమూల్యుడు పినతల్లి వీపుమీద చరుస్తూ ఉక్రోషంతో ఏడుస్తూ 'నువ్వేంగుడ్డిదానివా? కళ్లు కన్పించలేదూ?' అన్నాడు.

అన్నపూర్ణ ఆయేడుపు విని గదిలోకి వచ్చి, అంతా విని "ఇంతేకదా? రేపు మళ్ళీ సరిగ్గా కత్తెర వేయించుకోవచ్చులే" అన్నది.

అమూల్యుడు మరింతకోపంతో "మూడు కణుపుల పొడుగుజుట్టు ఎలావస్తుంది? ఇక్కడ జుట్టుఏదీ అసలు!" అన్నాడు. అన్నపూర్ణ వాణ్ణి సముదాయించాలని "మూడు కణుపులు లేకపోతేపోనీ, రెండుకణుపులు పొడుగో కణుపు పొడుగో ఉంటే చాలదా అంది.

'ఏడిసినట్లుంటుంది. రెండుకణుపుల పొడుగుకూడా ఒక పావనేనా? నరేన్ దాని అడిగిచూడరాదూ? మూడుకణుపులబారు ఉండాలంటాడు'. ఆరోజున అమూల్యుడు సరిగ్గా అన్నం తినలేదు. అన్నం కలుపుకుని అటూఇటూతోసి పారేసి లేచిపోయాడు.

"నీపిల్లాడికి అలా జుట్టుపెంచుకోవాలని ఎలా బుద్ధి పుట్టిందీ?" అని అడిగింది అన్నపూర్ణ బిందును ఆమెకు జాలి

బిందు నవ్వింది. కాని మరుక్షణంలోనే గాంభీర్యం తెచ్చుకుని. ఒక్కనిట్టూర్పువిడిచి, "ఇదేదో స్వల్పవిషయంగా త్రోసేసి, నవ్వేస్తున్నాం నిజమేకాని. భయంతో నాగుండె గుబగుబలాడి పోతోంది. అక్కా! అన్నిఅలవాట్లు ఇలాగే ప్రారంభమయేది" అన్నది.

అన్నపూర్ణ ఇంక మాట్లాడలేకపోయింది.

దుర్గాపూజలు వచ్చాయి. ఆవీధినిఉన్న జమీందారు గారి ఇంట్లో పూజాఉత్సవాలు మాంచి వైభవంగా జరుగుతున్నాయి. నరేంద్రుడు రెండురోజులనించీ ఆఉత్సవాల్లో మునిగి తేలుతున్నాడు. సప్తమినాటిరాత్రి అమూల్యుడువచ్చి "అమ్మా! అక్కడనాటకం చూడ్డానికి పోదామా? నరేన్‌దా చెప్పాడుమూడింటిదగ్గర్నుంచీ ప్రారంభమవుతుంది!"అన్నాడు

"ఇప్పటినుంచీ పోయి మంచులోపడికూర్చుంటావా? అలాకాదు. రేపు మీబాబాయ్‌తోకూడా వెడుదువుగానిలే. మంచిచోటు దొరుకుతుంది కూర్చోటానికి" అన్నది బిందు.

"అఁ ఇప్పుడేపంపించు. బాబాయి వెళ్ళడేమోఅసలు. వెళ్ళిన ఎన్నిగంటలకు వెడతాడో!" అంటూ ఏడవటం మొదలెట్టాడు.

"మూడూ—నాలుగింటికి నాటకం మొదలయితే నౌకర్ని ఇచ్చిపంపుతాలే" అన్నది బిందు.

అమూల్యుడికి కోపంవచ్చి మంచం మీదికిపోయి, గోడవైపుకు మొహంపెట్టి పడుకున్నాడు,

బిందువాడ్ని ఇటుత్రిప్పబోయింది. కాని అమూల్యుడు

చెయ్యి లాక్కుని బిగతీసుకుని పడుకున్నాడు. తర్వాత కొంత సేపటికి బహుశా అందరూ నిద్రపోయేవుంటారు. బైట గోడ గడియారం అమూల్యుడి కలతనిద్రను మేల్కొలిపింది. వాడు చెవులు నిక్కించుకుని గంటలు లెక్కపెట్టడం మొదలెట్టాడు, ఒకటి రెండు మూడు—— నాలుగు వాడు హడావిడిగా లేచి, కూర్చుని, బిందును గట్టిగా కుదిలించి లేపి, లే, లేఅమ్మా! మూడు-నాలుగు కూడా అయిపోయింది" అన్నాడు. గడియారం ఇంకా గంటలు కొడుతూనేవుంది అయిదు ఆరు ఏడు ఎనిమిది. 'ఎనిమిది కూడా అయి పోయింది. ఇంకా యెప్పుడూ వెళ్ళేది?' అంటూ అమూల్యుడు ఏడుపు మొదలెట్టాడు.

బైటగడియారం అప్పటికి ఇంకా గంటలు కొడుతూనే ఉంది. తొమ్మిది-పది-పదకొండు-పన్నెండు కొట్టిఆగింది అమూల్యుడు తనపొరపాటు తెలుసుకుని, తెల్లబోయి మెదల కుండా పడుకున్నాడు, గదిలో అటుపక్క మంచంమీద మాధవుడు పడుకుని ఉన్నాడు. అమూల్యుడి గందరగోళంతో అతడికికూడా మెళుకువ వచ్చింది.

మాధవుడు బిగ్గరగా నవ్వుతూ "ఏంజరిగిందిరా! అమూల్యా?" అని అడిగాడు. అమూల్యుడు సిగ్గుతో బదులు చెప్పలేదు. బిందునవ్వుతూ "నన్ను ఎంతహూరం హూనంచేసి లేపాడోచూశారా? ఇల్లూవాకిలీ తగలబడి పోతున్నా ఎవరూ అంతయిదిగా లేపరు" అన్నది. అమూల్యుడు మెదలకుండా పడుకోవటం చూసేసరికి ఆమెకు జాలి

వేసింది. 'సరే. వెళ్ళరా. కాని ఎవరితోనూ పోట్లాడను మాత్రం పోట్లాడకేం!' అంది.

తర్వాత ్రవుణ్ని పిలిచి లాంతరుఇచ్చి పంపించింది బిందు. ఆ వీథినాటకం చూసి మర్నాడు పదిగంటలకు ఉషాంగిపోతూ వచ్చాడు అమూల్యుడు. వచ్చి పింతండ్రి కనపడగానే 'ఏదీ? మీరు రాలేదేం?' అని అడిగాడు.

'ఎలా ఉందిరా నాటకం?' అని అడిగింది బిందు.

" భలేబాగుంది అమ్మా! బాబాయోయ్! ఇవాళ సాయంత్రం భలే డ్యాన్సు ఉంది. కలకత్తానుంచి ఇద్దరు ఆడ వాళ్ళొచ్చారు. నరేన్‌దా చూపించాడు వాళ్ళను. అచ్చగా అమ్మలాగా నేఉన్నారు. భలే బాగున్నారులే. వాళ్ళుచేస్తారు డ్యాన్సు. నాన్నతో కూడా చెప్పా డ్యాన్సుఉందని" అన్నాడు.

'మంచిపనిచేశావ్' అంటూ మాధవుడు పకపక నవ్వాడు.

కోపంతో బిందుముఖంఎర్రగాకంది గడ్డఅయికంది.

'గుణాలకోతి మీ మేనల్లుడిమాటలు విన్నారా?' అని అమూల్యుడితో 'నువ్వుఇంకఅక్కడికి ఒక్కసారికూడా వెళ్ళ టానికి వీల్లేదు. గాడిదా!ఎవ్రా చెప్పింది నాకుమల్లేఉన్నారని నరేంద్రుడేనా?' అని అన్నది.

అమూల్యుడు భయపడుతూ 'ఊఁ. అతడే చూపిం చాడు' అన్నాడు.

'ఏడీ నరేంద్రుడు? సరే, ఇంటికిరానీ' అంది బిందు.

మాధవుడు నవ్వునాపుకుని, 'ఎక్కడో పిచ్చిదానివి నువ్వు. అన్నయ్య అంతావిన్నాడు. కాని ఇంక ఆట్టెగడబిడి

చెయ్యాకు" అన్నాడు. అంచేత బిందువాసిని ఆమాటను కడుపులోనే పెట్టుకుని కోపంతో కుమిలిపోసాగింది.

సాయంకాలం కాకముందే అమూల్యుడువచ్చి అన్నపూర్ణను చుట్టేసి "అక్కా! వాళ్ళపూజాగృహంలో డ్యాన్సు చూడటానికి వెడతా. మళ్ళీఇప్పుడేవస్తానులే" అన్నాడు.

అన్నపూర్ణ ఏదోపనిమీదవుండి "వెళ్లు మీ అమ్మను అడుగు పో" అంది.

"కాదులేఅక్కా! ఇక్కడున్నట్లువస్తాగా! నువ్వుచెప్పు నేను వెడుతున్నా" అని అమూల్యుడు మొండికేశాడు.

"వద్దురా వద్దు. ఆవిడ కోపిష్టిమనిషి. వెళ్ళి ఆవిడ్నే అడుగు" అన్నది. అన్నపూర్ణ.

అమూల్యుడు ఏడుస్తూ ఆమెచీరపట్టుకుని జీరాడుతూ "నువ్వు చెప్పరాదూ అమ్మతో. నేను నరేన్‌దాతో వెడుతున్నా. మళ్ళీ ఇప్పుడేవస్తా" అన్నాడు.

"వాడితో వెళ్ళాలంటే ."

అమూల్యుడు మాట పూర్తిచేసేదాక ఉండకుండానే ఒక్కగెంతుతో ఇంట్లోంచి బైటపడ్డాడు.

ఒకగంట పోయాక బిందు అమూల్యుడ్ని వెతుకుతున్న సంగతి అన్నపూర్ణ చెవినిబడింది. అయినా ఆమె మెదలకుండా ఊరుకుంది. ఆమె వెతకటం క్రమశః ఎక్కువయింది. అప్పుడు అన్నపూర్ణబైటికివచ్చి, "ఏదో నాట్యంటగా! నరేంద్రుడితో కూడా వెళ్ళాడు చూట్టానికి. ఇప్పుడేవస్తాడులే. నుఠేం భయం లేదు" అన్నది. బిందు దగ్గరకువచ్చి "ఎవరువెళ్ళమన్నారు నువ్వేనా?" అని అడిగింది.

అమూల్యుడు ఎవరిసమ్మతీ తీసుకోకుండానే వెళ్ళాడనటానికి అన్నపూర్ణ భయపడి "ఇప్పుడేవస్తాడులే" అనిమాత్రం అన్నది.

బిందుముఖం నల్లగా చేసుకుని వెళ్ళిపోయింది. మరో క్షణంలో అమూల్యుడు ఇంటికితిరిగివచ్చి పింతల్లి పిలుస్తూన్నదనివిని వాడితండ్రిమంచంమీదకు పోయి ఒక ప్రక్కకుబదిగి పడుకున్నాడు.

దీపంముందు కూర్చుని, చత్వారంజోడు పెట్టుకుని భాగవతం చదువుకుంటున్నాడు. ఆయనముఖంఎత్తి "ఏమిటిరా అమూల్యా!" అని అడిగాడు.

అమూల్యుడు జవాబు చెప్పలేదు.

కదంవచ్చి "మీ పిన్నమ్మగారు పిలుస్తున్నారురండి" అని చెప్పింది.

అమూల్యుడు తండ్రి ఒళ్ళోకి జరిగి, "నువ్వు నన్ను పంపించి నదువుగాని రానాన్నా" అన్నాడు.

యాదవుడు విస్మితుడై "నేను పంపించిరానా? ఏం జరిగిందే కదమ్!" అని అడిగాడు.

అది జరిగిన సంగతి యావత్తూ చెప్పేసింది.

ఈవిషయాన్ని పురస్కరించుకుని తప్పకుండా కలహం రేగుతుందని యాదవుడు గ్రహించాడు. ఒకావిడ వద్దుఅంది. ఒకావిడవెళ్ళమంది. అంచేత యాదవుడు అమూల్యుడ్ని వెంటబెట్టుకుని మరదలి గది దగ్గరకువెళ్ళి "వీడ్ని ఈసారికి క్షమించు అమ్మా! ఇంకెప్పుడూ ఇలా చెయ్యనంటున్నాడు" అన్నాడు గుమ్మంబైట నుంచుని.

ఆరాత్రి తోడికోడళ్ళిద్దరూ భోజనంముందు కూర్చున్నారు. బిందు అన్నపూర్ణతో "నేను నీమీద కోపపడటం లేదమ్మా అక్కా! కాని ఇంకనేను ఇక్కడ ఉండటం అసంభవం. ఉన్నామంటే అమూల్యుడు పూర్తిగా పాడై పోతాడు. పోనీ నేను వాణ్ణి నాటకానికి వెళ్ళవద్దురా అని చెప్పకపోతే అప్పటి సంగతివేరు. కాని నేను వద్దని చెప్పినా వాడికింత దుస్సాహసం ఎలా కలిగిందా అనేదే ఆలోచిస్తున్నాను నేను. పైగా ఆపాడుబుద్ధి చూడు. నాదగ్గరకు రాకుండా నీదగ్గరకు వచ్చాడు. ఇంటికి రాగానే నేనుపిలుస్తున్నానని తెలిసి వెళ్ళి తండ్రిని వెంట పెట్టుకునివచ్చాడు. కాదు అక్కా! ఇదివరకుదాకా ఈబుద్ధులు లేవు వీడికి - నేను కలకత్తా వెళ్ళి అక్కడఓఇల్లు అద్దెకు తీసుకునిఉంటాను. అద యినానయనే కాని ఒక్కబిడ్డ - వాడు పాడైపోతూంటే వాణ్ణి పెట్టుకుని జీవితం అంతా కుళ్ళుతూ కూర్చోలేను నేను' అన్నది.

అన్నపూర్ణఉద్విగ్నురాలై "మీరు వెళ్ళిపోతే నేను మాత్రం ఒక్కతెనూ ఎలా ఉండగలను చెప్పు?" అన్నది.

బిందు కాస్సేపుఊరుకుని, "అది నీకు తెలియాలి. నేను చెయ్యదలచుకుందేదో చెప్పివేశాను. ఆ నరేన్ ఒట్టి పాడుపిల్లాడు" అంది.

"ఏం? ఏంచేశాడునరేన్. మరోమాట, వీళ్ళిద్దరూ అన్నదమ్ములే అయితే ఏంచేసేదానివి మరి?" అన్నది. అన్నపూర్ణ.

"అలా అయితే ఇవాళ నౌకరుచేత కాళ్ళూ చేతులు కట్టించేసి జలగలనుపట్టించి ఇంటిలోంచి వెళ్ళగొట్టేదానిని. అదీకాక ఈ "అయితే" 'గియితే'లతో పెట్టుకొంటే పనులుసాగవమ్మా అక్కా? - వాళ్ళను పంపించెయ్యినువ్వు" అన్నది బిందు.

అన్నపూర్ణకు మనస్సులో కోపంవచ్చింది. 'పంపటం పంపకపోవటం నాచేతిలోఉందమ్మా చెల్లీ? వాళ్ళను ఎవరు రప్పించారో-వారితోనే చెప్పవెళ్ళి. వృథాగా నన్నుమాత్రం నిందించవద్దు అన్నది.

'ఈసంగతులన్నీ బావగారితో ఎలాచెప్పేది?'

'అన్నిసంగతులూ ఎలాచెబుతున్నానో, ఇదీ అలాగే చెప్పు.'

బిందు వెండికంచం ముందుకుతోసేసి, 'నన్ను వెర్రి బాగులదాన్ని చెయ్యకమ్మా! నాకు ఇరవై యేడు-ఇరవై యెనిమిదేళ్లు నిండుతున్నాయి. ఇంట్లోనాకర్ల విషయ మన్నా కాదు. ఆత్మీయులైన బంధువులసంగతిఇది - నువ్వు ఉండగానే నీసంగతులన్నీ బావగారితో చెప్పబోతే వారికి కోపంరాదూ?' అన్నది.

'కోపం తప్పకుండా వస్తుంది. కాని నేనుచెప్పానంటే ఇంక నాముఖంచూడరు. వెయ్యిచెప్పినా మనమే పరాయి వాళ్ళం - వాళ్ళు అన్నాచెల్లెలు. ఆసంగతి ఆలోచించవు ఎంచేత? అదీగాక నేను ముసలిదాన్నాయె. ఈ చిన్న విష యాన్ని పుచ్చుకుని గంతులేస్తే లోకులు నాకు పిచ్చెక్కింది అని అనుకోరూ?'

బిందు ఆ కంచాన్ని ఇంకొంచెం ఎడంగా త్రోసేసి, మూతిముడుచుకు కూర్చుంది.

ఆవిడ కేవలం బానగారిభయంతో అలా కూర్చుంది అని అన్నపూర్ణ గ్రహించింది. 'అలా చెయ్యి ముడుచుకుని కూర్చున్నావేం? అన్నంకంచం ఏంఅపరాధం చేసింది?' అని అడిగింది.

బిందు హఠాత్తుగా నిట్టూర్చి 'నేను తినటం అయిపోయింది' అంది.

అన్నపూర్ణ ఆమెభావాన్ని గమనించి ఇంకబలవంతం చెయ్యటానికి సాహసించలేకపోయింది. బిందు పడుకోటానికి వెళ్ళి తనపక్కమీద అమూల్యుడు లేకపోవటంచూసి, మళ్ళీ వెనక్కితిరిగివచ్చి "ఏడీ? వాడెక్కడికివెళ్ళాడు." అని అడిగింది.

"ఇవాళ నాపక్కమీదకువచ్చి పడుకున్నాడల్లేఉంది. తీసుకువచ్చి ఇస్తానుండు" అన్నది అన్నపూర్ణ.

"వద్దులే, వద్దులే, పడుకోనీ" అంటూ మొహంనలుపు చేసుకుని వెళ్ళిపోయింది బిందు.

అర్ధరాత్రి బిందు కలతనిద్ర అన్నపూర్ణ పిలుపుతో మెళుకువ వచ్చింది.

"ఏమిటి అక్కా?"

అన్నపూర్ణ గది బైటనుంచి "తలుపుతీసి నీ పిల్లాణ్ణి నువ్వు తీసుకు వెళ్ళమ్మా చెల్లీ! ఇంతదిప్పకాయతనమైతే నేను కాదు-నాయబ్బకూడా సహించలేడు" అంది.

బిందు తలుపులు తీయగానే, అన్నపూర్ణ పిల్లాణ్ణి లోపలకు తీసుకువచ్చి "నేను ఇలాంటి బడుద్ధాయిలను చాలా

"వాడు స్కూల్‌కు వెళ్లాడనే అనుకుంటున్నావా అక్కా? ఒక్కనాటికి వెళ్ళడు. ఎక్కడో దాక్కొని ఉంటాడు. తీరా బయలుదేరేసరికి వచ్చి సిద్ధమవుతాడు" అన్నది బిందు.

సరిగ్గా అంతే జరిగింది. వాడు ఎక్కడో దాక్కొన్నాడు బిందు అన్నపూర్ణకు పాదాభివందనం చేసి, మేనాలో ఎక్కబోతుండగా వచ్చి ఆమె కొంగుపట్టుకొని నుంచున్నాడు. తోడికోడళ్ళిద్దరూ నవ్వుకున్నారు.

"వెళ్ళిపోయేముందు వాణ్ణి కొట్టి ఏడిపించకు. తీసుకు వెళ్ళు" అన్నది అన్నపూర్ణ.

'తీసుకవెడతాలే. కాని అక్కడ నన్ను ఒక్క అడుగు కదలనిస్తాడా ఏమన్నానా? నానా అగచాట్లూ పెడతాడు నన్ను' అన్నది బిందు.

'నువ్వు అలా తయారుచేస్తి వాడ్ని మరి! అలా చెయ్యక ఏంచేస్తాడు. అమూల్యా! ఈ రెణ్ణాళ్లూ పోనీ నాదగ్గర ఉండరాదు ట్రా!' అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు తలతిప్పుతూ 'ఉహుం. ఉహుం. నేను నీదగ్గర ఉండనులే' అంటూ వెళ్లి మేనాలో కూర్చున్నాడు.

# 6

బిందు పుట్టింటినుంచి వచ్చాక పదిరోజులు గడిచాయి. ఒకనాడు మధ్యాహ్నం అన్నపూర్ణ బిందుగదిలోకి వస్తూ 'చెల్లీ!' అని పిలిచింది.

బిందు మైలబట్టలగుట్ట ముందవేసుకుని స్తబ్ధంగా కూర్చునిఉంది!

"చాకలిది వచ్చిందా యేం?" అని అడిగిందిఅన్నపూర్ణ.

బిందు మాట్లాడలేదు, అన్నపూర్ణ ఈసారి ఆమె ముఖవైఖరి గమనించి భయపడింది. ఆతుర్దాగా "ఏంజరిగిం దేమిటి?" అని అడిగింది.

బిందు వేలితో కాల్చిపారేసిన సిగరెట్ పీకలు చూపుతూ అమూల్యుడి జేబుల్లోంచిబయటపడ్డాయిఇవిఅన్నది.

అన్నపూర్ణ నిశ్చేష్టురాలై అలాగేనుంచుండిపోయింది.

బిందు చటుక్కున ఏడుస్తూ "నీకాళ్లమీద పడతాను అక్కా! వాళ్ళను పంపించెయ్యి, లేదా పోనీ మమ్మల్నైనా ఎక్కడికన్నా పంపించు" అన్నది.

అన్నపూర్ణ జవాబు చెప్పలేకపోయింది. ఇంకాసేపు నిశ్శబ్దంగా నుంచుని అక్కడనుంచి వెళ్ళిపోయింది.

సాయంకాలం నాలుగింటికి అమూల్యుడు స్కూల్ నుంచి వచ్చి, కొంచెం టిఫిన్ తిని ఆడుకోటానికి వెళ్ళాడు. బిందు ఒక్కమాట కూడా మాట్లాడలేదు. భైరవుడు వచ్చి, 'నరేన్ బాబు తనవల్ల తప్పేమీ లేకపోయినా చెంపకాయ కొట్టా' డని ఫిర్యాదు చేశాడు.

బిందు విసుక్కుంటూ "అక్కగారితో చెప్పుకో, పో" అంది.

మాధవుడు కోర్టునుంచి తిరిగివచ్చి, గుడ్డలు మార్చు కుంటూ భార్యతో కొద్దిగా సరసమాడబోయి ఆవిడ

గద్దించేసరికి మెదలకుండా ఊరుకున్నాడు. ఎవరికీ తెలియకుండా ఇంట్లో ఏతుపాను చిహ్నాలు బలపడుతున్నాయో అది ఒక్క అన్నపూర్ణకే తెలుసు. ఆమె ఆదుర్దాగా ఇల్లంతా అలగతిరుగుతూ చివరకు బిందు ఏకాంతంగా ఉండటం కని పెట్టి దగ్గరకు వెళ్లి చేతులు రెండూ పట్టుకుని, బ్రతిమాలుతూ 'నెయ్యి అన్నా వాడు నీకొడుకే. ఈసారికి క్షమించు. లేదా చాటుగా పిలిచి నాలుగుచివాట్లు పెట్టు' అన్నది.

"వాడు నాకొడుకేంకాదు. ఈసంగతి నాకూ తెలుసు నీకూ తెలుసు. అనవసరంగా మాటకుమాట అనుకోవటం దేనికమ్మా అక్కా!" అన్నది బిందు.

"నేనుకాదు. నువ్వేవాడితల్లివి-నేను నీకు ఇచ్చెయ్య లేదూ?"

"చిన్నప్పుడంటే పెంచాను. ఇప్పుడు పెద్దవాడయ్యాడు నీపిల్లవాణ్ని నువ్వే తీసుకో. నాకు ఈ బెడద తప్పించు" అంటూ బిందు వెళ్ళిపోయింది.

రాత్రి అమూల్యుడు ఏడుస్తూ అన్నపూర్ణదగ్గర పడుకోటానికి వెళ్ళాడు.

అన్నపూర్ణ సంగతంతా గ్రహించి 'ఇక్కడవెందుకు? వెళ్లు ఇక్కడనుంచి వెళ్ళవేం చెబుతూంటే' అనివిసుక్కుంది.

అమూల్యుడు వెనక్కితిరిగివచ్చి చూసేసరికితండ్రినిద్ర పోతున్నాడు. వాడింకేమీ మాట్లాడకుండా మెగా వెళ్ళి పోయాడు అక్కడనుంచి.

ప్రొద్దున్నేకదం చెంబులు, గిన్నెలు తోమటానికివంట యింటిదగ్గిరకువచ్చి చూసింది. ఆవసారాలోఒకమూల కట్టెల

మీదపడి నిద్రపోతున్నాడు అమూల్యుడు. అది పసిగెత్తుకు పోయి బిందును తీసుకువచ్చింది. అన్నపూర్ణకుకూడా మెళు కువ వచ్చి లేచివచ్చి ఒకప్రక్కన నుంచుంది.

బిందు తీవ్రంగా "రాత్రి యజమానురాలుగారు వెళ్ళ కొట్టింది కాబోలు! వాడుంటే ఆమె నిద్రకు భంగంవస్తుంది. అంతేకాదూ?" అన్నది.

కుర్రాడిస్థితి చూసేసరికి దుఃఖంతో బాధతో అన్న పూర్ణకూ కళ్ళనీళ్ళపర్యంతంఅయింది. కాని బిందు తీక్షణం గా ఈసడించటంతో ఆవిడకు కోపం మండిపోయింది. "నీతప్పు ఇతరులనెత్తిన వేసి నద్దుతేనేకాని బ్రతకలేవు నువ్వు" అన్నది.

బిందు కుర్రాణ్ణి ఎత్తుకుని చూచేసరికి వాడిఒళ్ళు వేడిగా ఉంది. జ్వరంవచ్చింది. "రాత్రంతా కార్తికమాసపు మంచులో పడుకుంటే జ్వరంరాక ఏంచేస్తుంది? ఇప్పుడైనా తగ్గితే బ్రతికిపోతాను" అంది.

అన్నపూర్ణ ఆదుర్దాగా ముందుకువంగి "జ్వరం తగి లిందా? ఏదీ చూడనీ!" అన్నది.

బిందు ఆమె చేతిని గట్టిగా తోసివారేసి "నువ్వేమీ చూడాల్సిన అవసరంలేదులే" అంటూ నిద్రపోతున్న కుర్రాణ్ని బుజానవేసుకుని, అన్నపూర్ణ కేసి ఒక విషదృష్టిని వరపి తన గదిలోకి వెళ్ళిపోయింది.

అయిదారు రోజులకు అమూల్యుడికి జ్వరం తగ్గి పోయింది. కాని తోడికోడలి అపరాధాన్ని మాత్రం బిందు క్షమించలేదు. ఆరోజులగాయితు ఆవిడతో సరిగ్గా మాట్లాడటంకూడా మానేసింది.

అన్నపూర్ణ మనస్సులో అంతా గ్రహించింది. కాని తానూ పాషాణంగానే ఉండిపోయింది. అందరిదృష్టికీ తప్పంతా తనమీద కనపడేటట్లుచేసిన ఈ అన్యాయాన్ని ఆమె మరచిపోలేదు. ఆమె ఒకరోజున ఎలోకేసితో ఏదో మాట్లాడుతూ "వాడికి జ్వరం పింతల్లిమూలంగానే వచ్చింది. కాని అదృష్టం మంచిది కనుక ఇంకా బ్రతికాడు' అన్నది.

ఈమాట బిందువాసినిదగ్గర ఊదటానికి ఎలోకేసిని ఏమాత్రం ఆలస్యం చెయ్యలేదు. బిందు శ్రద్ధగావిన్నది. కాని పైకిమాత్రం ఏమీఅనలేదు. ఆమె విన్నసంగతికూడా ఎలోకేసికితప్ప ఇంకెవరికీ తెలియదు. బిందుతోడికోడలితో మాటలాడటం పూర్తిగామానేసింది. ఈమధ్య కొన్నాళ్ళనుంచీ ఇక్కడి సామానులన్నీ క్రొత్తయింటిలోకి చేరవేస్తున్నారు. రేపు ఉదయమే అందరూ అక్కడికివెళ్ళటం. యాదవుడుపిల్లలను పెట్టుకుని అవతలగదిలో ఉన్నాడు. మాధవుడు కోర్టుపనిమీద ఎక్కడికోవెళ్ళాడు. అతడూలేడు. ఈమధ్యలో ఆ యింటిలో ఒక విషమ సంఘటన జరిగింది. సాయంకాలం పాఠం చెప్పడానికి పంతులువచ్చాడు. బిందు మనస్సులో ఉద్దేశమేమో, ఆయన్ని పిలిచి, 'రేపటినుంచీ ఆగదిలోకి వెళ్ళి చెప్పండిపాఠం' అని చెప్పింది.

'చిత్తం'అని పంతులు వెళ్ళి పోబోతూంటే బిందుమళ్ళీ 'ఖాశిష్యుడి చదువుఎలా వుందిప్పుడు?' అని అడిగింది.

'చదువులో ఎప్పుడూ చురుగ్గానే ఉంటాడు. ప్రతిసారీ ఫస్టు వాడేగా!" అన్నాడు మేష్టరు.

"అవచ్చు. ఇటీవల వాడుసిగరెట్లు కాల్చటం నేర్చాడు,

మేష్టరు విస్మితుడై 'సిగరెట్లు కాల్చటం నేర్చుకున్నాడా?' అని మళ్ళీ 'కుర్రవాళ్ళంతా ఒకర్నిచూసి ఒకరు నేర్చుకుంటారు ఇలాంటివి' అన్నాడు.

'ఎవర్ని చూసి నేర్చుకున్నాడంటారు?'

మేష్టరు మెదలకుండా ఊరుకున్నాడు. 'వాళ్ళ నాన్నగారితో చెప్పండి ఆసంగతి అన్నది' బిందు.

మేష్టరుగారు తలఊపుతూ 'ఈ సంగతి చూడరాదూ? అయిదారు రోజులక్రితం జరిగిన సంగతి. స్కూలుకు వెళ్ళే దారిలో ఒక ఒరియా తోటమాలి తోటలో చేరి మామిడి పిందెలు, కొమ్మలు విరచి వాడ్నిపట్టుకుని తన్ని పంపాడట కొంతమందికుర్రాళ్లు 'అన్నాడు.

బిందు శ్వాసబిగబట్టి ఊఁ, తర్వాత? అని అడిగింది.

'ఆ ఒరియా-మాలి హెడ్ మాష్టరుగారిదగ్గిర కెళ్ళి మొత్తుకుంటే ఆయన కుర్రాళ్ళకు పదిరూపాయల జరిమానా వేసి, వాడ్ని శాంతపరచి పంపాడు.'

బిందు నమ్మలేకపోయింది. 'వారిలో మా అమూల్యుడుకూడా ఉన్నాడా? వాడికిడబ్బు ఎక్కడనుంచివచ్చింది?'

'అది నాకు తెలియదు. కాని వాడుకూడా ఉన్నాడు. ఈయింటిలోఉండే నరేంద్రుడుకూడాఉన్నాడు. ఇంకా నలుగు రయిదుగురు అల్లరికుర్రాళ్లుకూడా ఉన్నారు. ఈసంగతి నేను హెడ్ మాష్టరుగారు చెపితే విన్నాను.'

'అయితే జరిమానా డబ్బంతా వసూలుచేశారా?'

'చిత్తం చేశారనే విన్నాను.'

'సరే, మీరు వెళ్ళండి' అని బిందుఅక్కడేచతికిలబడింది

'నాకు తెలియకుండా డబ్బుఇచ్చేసాహసం ఈయింట్లో ఎవరికి ఉంది?' అన్న మాటమాత్రం ఆమె నోటినుంచి అస్పష్టంగా వెలువడింది. ఒకవైపున తన- మనస్సంతా చికాకుగాఉంది. ఆపైన అక్కగారితో మాటల్లేకపోవటం-దానికితోడు ఇప్పుడీ సంగతి తెలియటంతో బిందుకు హితాహితజ్ఞానం పూర్తిగా లోపించిపోయింది.

ఆమెలేచి వంటింటిలోకివెళ్ళింది. అన్నపూర్ణ రాత్రి వంటకు కూరతరుగుతోంది. ఆవిడ తలయెత్తి మేఘావృతమై ఉన్న బిందుముఖంకేసి చూసింది.

'అక్కా! ఈమధ్య అమూల్యుడికి ఏమైనా డబ్బు ఇచ్చావా?' అని అడిగింది బిందు.

అన్నపూర్ణ ఇదే భయపడుతోంది. ఆమెకంఠం బిగుసుకుపోయింది. మృదువుగా 'ఎవరుచెప్పారు?' అని అడిగింది.

'ఎవరుచెప్పారుఅన్నది ముఖ్యంకాదు .వాడు ఎవర్ని అడిగితీసుకున్నాడు? నువ్వుమాత్రం ఏమనిఇచ్చావు? అన్నదే ముఖ్యం!'అన్నది బిందు. అన్నపూర్ణనిశ్చేష్టురాలై కూర్చుంది.

'నేను వాడ్ని అదుపులోపెట్టటం నీకిష్టంలేదు.కనుకనే ఈసంగతి నాదగ్గర దాచావు. అమూల్యుడు ఏంచేసినా పెద్దవాళ్ళదగ్గర అబద్ధాలుమాత్రం చెప్పడు. నీకుఅన్నిసంగతులూ తెలిసే ఇచ్చావుకదూ?' అంది.

అన్నపూర్ణ మెల్లిగా 'నిజమే, కాని ఈ ఒక్కసారికి వాడ్ని క్షమించు చెల్లీ! నేను క్షమార్పణకోరుతున్నాను' అన్నది.

బిందు హృదయం దహించుకుపోతోంది. 'ఈ ఒక్క

సారా! నేటినుంచి ఎప్పటికీ క్షమిస్తున్నాను. ఇంక నోరెత్తి మాట్లాడను. నా డీలా నా కళ్ళయెదుట కొంచెం కొంచెం చెడిపోతూఉంటే సహించలేను నేను .అంతకన్న ఏకంగా చెడేదేమిటో ఒక్కసారే చెడిపోనీ, కాని ఎంతధైర్యం! నీది' అన్నది.

ఆ చివరిమాట అన్నపూర్ణ హృదయానికి బాణంలా గుచ్చుకుంది. అయినా ఆమె మాట్లాడకుండా అలాగే కూర్చుంది కాని బిందు వాగుతున్నకొద్దీ ఆమె కోపం క్రమశః ఎక్కిపోసాగింది. బిందు మళ్ళీ బిగ్గరగా అరుస్తూ 'అన్ని విషయంలలో నువ్వేమీ ఎరగనిదానిలా ఉండి ఈ సారికి క్షమించు. ఈసారికి క్షమించు అంటావ్. ఈ తప్పంతా అసలు వాడిది కాదు, నీదే. నిన్ను నేను క్షమించను' అన్నది.

ఇంటిలో నౌకర్లూ దాసీలూ ఈ అరుపులు చాటున నుంచుని వింటున్నారు.

అన్నపూర్ణ ఇంక సహించలేకపోయింది. 'ఏం చేస్తా వేమిటి? కంఠానికి ఉరిపోస్తావా?' అన్నది.

నిప్పులలో నెయ్యిపడ్డట్టయింది.బిందు తుపాకీ మందు లాగా భగ్గుమని "అదే నీకు తగిన శిక్ష" అన్నది.

"నా బిడ్డకు నేను రెండురూపాయ లిచ్చుకున్నాను. ఇదేనా నేనుచేసిన మహాపరాధం?"

ఒకమాట కదిలిస్తే మరొకమాట వచ్చిపడింది. బిందు అసలుమాట మరిచిపోయి, "అదిమాత్రం ఎందు కివ్వాలి? ఇలాపాడుచేయటానికి ఎక్కడనుంచి వస్తుంది డబ్బు?"అంది.

"నువ్వుమాత్రం పాడుచెయ్యడంలేదూ?" అన్నది అన్నపూర్ణ.

'నాడబ్బు నేను పాడుచేసుకుంటా. నువ్వెవరి డబ్బు పాడుచేస్తున్నావో కాస్త చెబుదూ?"

అన్నపూర్ణకు ఈమాటతో అతిభయంకరమైన కోపం వచ్చింది. ఆమె పేదయింటినుంచి వచ్చిన ఆడబడుచు. బిందు అదేఎత్తిపొడిచిందని అనుకున్నది. లేచినిలబడి "నువ్వు భాగ్యవంతులయింటి పిల్లవయితే అవొచ్చు. కాని అంతమాత్రాన ఇంకెవరూ తనపిల్లలకు రెండురూపాయ లిచ్చుకోలేరనే అహంకారంమాత్రం చూపించకు"అన్నది.

"నా కా అహంకారంలేదు. కాని ఒక్కపైసాఇచ్చినా నువ్వు ఎవరిపైస ఇస్తున్నావో కాస్త ఆలోచించి చూచుకో"

"ఎవరిడబ్బుఇస్తున్నానా?నీకు నోటికి ఎంతమాటవస్తే అంతమాట అనేస్తావా? ఫో. నాయెదుటనుంచి దూరంగా ఫో,ముందు"అని అరిచింది అన్నపూర్ణ.

"దూరంగానా?. ఈరాత్రి తెల్లవారగానే పోతాను. కాని ఎవరిడబ్బు ఖర్చుపెడుతున్నదీ అదిమాత్రం తెలుసుకోలేకపోతున్నావు నువ్వు. ఎవరి సంపాదనమీద తింటున్నావో, కట్టుకుంటున్నావో అదీ తెలియదా?"

ఈమాట చప్పున అనేసి బిందు నిశ్చేష్టురాలయింది.

అన్నపూర్ణముఖం వెలవెలపోయింది. ఆమె ఒకక్షణం రెప్పవాల్చకుండా బిందువాసినిముఖంకేసి చూసి, నీభర్త సంపాదనమీదనే తింటున్నాం, కట్టుకుంటున్నాం. నేనునీక్రింద దాసిని, ఆయన నీనౌకరు.ఇదేగా నీమనస్సులో ఉన్నమాట.

మరి ఈమాట ఇన్నాళ్ళనుంచీ చెప్పావుకాదేం?' అన్నది.

అన్నపూర్ణకు పెదవులు మాటిమాటికీ వణకసాగి నాయి. ఆమె పళ్ళతో పెదవిని నొక్కిపట్టి ఒక్క నిమిషం నిశ్చలంగా నుంచుని, "తమ్ముణ్ణి చదివించేటప్పుడు జోడు పంచెలు ఒక్కసారి కొనుక్కోలేక ఆయన గడిపినరోజుల్లో నువ్వెక్కడున్నావమ్మా! ఇల్లు తగలబడిపోతే చెట్టుక్రింద ఒకపూట ఇంత ఉండకేసుకుని తింటూ పూర్వులు సంపా యించిన ఈ యిల్లు నిలబెట్టినరోజుల్లో ఎక్కడున్నావమ్మా చెల్లీ నువ్వు?" అన్నది.

ఈమాటలు అంటూంటే ఆమెకళ్ళు కాల్వలుకట్ట సాగాయి. పైటచెంగుతో ఆమె కన్నీళ్ళుతుడుచుకుని "నీమన స్సులోమాటకనుక వారికి తెలిసిఉంటే వారు ఇలా నల్ల మందువేసుకుని జోగుతూ హుక్కాపీలుస్తూ విశ్రాంతిగా రోజులుగడిపేవారు కారు. అలాంటి స్వభావంకాదు వారిది. ఆ సంగతి నీభర్తకూ తెలుసు. పైనవున్న దేవతలకూ తెలుసు. ఇవాళ నన్ను అడ్డంపెట్టుకుని వారిని అవమానపరుస్తావా?" అన్నది.

భర్తమీది అభిమానంతో అన్నపూర్ణ హృదయం పొంగి పొర్లిపోసాగింది. నువ్విలా నీమనస్సులోనిమాట బైట పెట్టటం మంచిదే అయింది. భర్తను అవమానపరచి నందుకు సతీదేవి ఆత్మహత్యచేసుకుంది. నేను శపథంచేస్తు న్నాను. ఇంతకన్న పరాయిచోట వంటచేసుకునైనా తింటాం కాని, ఇంక నీడబ్బుమాత్రం తిసం. నువ్వెంతపనిచేశావ్? వారిని అవమానపరిచావ్!" అన్నది.

సరిగ్గా ఆసమయానికే యాదవుడు ప్రాంగణంలోకివచ్చి భార్యను కేకేశాడు.

భర్త పిలుపుతో అభిమానక్షుబ్ధమైన ఆమెహృదయం ఉప్పెనవచ్చిన సముద్రంలాగా 'ఉవ్వెత్తున లేచింది. ఆమె రివ్వున బైటికి వచ్చి, 'ఛీ ఛీ! పెళ్ళాంబిడ్డల్ని పోషించలేని వారికి ఉరిపోసుకోటానికి ఎక్కడా చారెడు త్రాడుఅయినా దొరకలేదా?' అన్నది.

యాదవుడు స్తబ్ధుడై 'ఏంజరిగిందేమిటి?' అన్నాడు.

"ఏంజరిగిందా? ఏమీలేదు. నేను ఆవిడ దాసీననీ, మీరు ఆవిడ నౌకరనీ మీమరదలు స్పష్టంగా చెప్పేసింది ఇవాళ" అన్నది అన్నపూర్ణ.

గదిలో బిందువాసిని నాలికకొరుక్కుని, చెవుల్లో వేళ్లుపెట్టుకుని కూర్చుంది.

అన్నపూర్ణ ఏడుస్తూ "ఎవరికైనాబిక్కొకటేఇచ్చేందు కయినా అధికారం లేదూ నాకు? మీరు బ్రతికిఉండగానే ఇలాంటిమాట పడాల్సివచ్చింది నేను. ఇవాళ నేను ముందరే ఒట్టు వేసుకుంటున్నాను. వాళ్ళఅన్నం మనం తిన్నట్లయితే మన పిల్లవాడిమీద ఒట్టే!' అన్నది.

వేళ్లుపెట్టుకున్న బిందు చెవుల్లో ఈమాటలు అస్పష్టంగా దూరాయ్. "ఎంతఒట్టువేశావ్ అక్కా!"అని అస్పష్టంగా అంటూనేఆమె పన్నెండుసంవత్సరాలకు మళ్ళీ ఇవాళ అక్కడే విరుచుకుపడి మూర్ఛపోయింది.

# 7

కొత్త ఇంటిలోకి యొచ్చినప్పుడూ, అన్నపూర్ణా, అమూల్యుడూ తప్ప అందరూ వెళ్ళారు. బైట ఊళ్ళనుంచి బిందు పినతల్లి, పినతల్లి కూతురూ ఆవిడపిల్లలూ, పుట్టింటిదగ్గర్నుంచి తల్లీ తండ్రీ వాళ్ళ నౌకర్లు అందరూ వచ్చారు. ఇల్లు కిటకిటలాడిపోతోంది. ఈ ఇంటిలోకి వచ్చేరోజున బిందు మనస్సు అంత బాగాలేదు. కాని మర్నాటినుంచీ ఆమె ఆ వైఖరి పూర్తిగా మారిపోయింది. కోపం తగ్గిపోగానే అన్నపూర్ణ వస్తుంది అనడంలో బిందుకు లేశమాత్రమయినా సంశయం లేదు. ఇక్కడ గృహదేవతల పూజలూ అవీ చేసి సమారాధన చెయ్యాలి. బిందు ఆ ప్రయత్నాలలో మునిగి తేలుతూ ఉంది.

"అమ్మాయీ! నీ కొడుకు కన్పించడేమే?" అని అడిగాడు బిందు తండ్రి.

"వాడు ఆయింట్లో ఉన్నాడు" అని బిందు ముక్తసరిగా చెప్పింది జవాబు.

"నీ తోటికోడలికి రావటానికి ఇంకా వీలు చిక్కలేదా యేం?" అని అడిగింది తల్లి.

"లేదు"

"అందరూ వస్తే ఆయింట్లో ఉండేదిమాత్రం ఎవరులే. పూర్వులు సంపాయించిన ఇంటిని అలా తాళం పెట్టి ఉంచటం కూడా మంచిదికాదు" అన్నది తల్లి మళ్ళీ.

బిందు మాట్లాడకుండా ఏదో పనిమీద వెళ్ళిపోయింది.

యాదవుడు రోజూ సాయంత్రం ఒకసారివచ్చి బైట అరుగుమీదకూర్చుని, అందరికబుర్లూఅడిగి తెలుసుకుని వెళ్ళి పోతూ ఉండేవాడు. కాని లోపలికిమాత్రం వచ్చేవాడుకాడు. గృహప్రాజకు క్రితంనాటిరాత్రి ఆయన లోపలికివచ్చి ఎలోకేసినిపిలిచి అన్ని సంగతులూ అడిగి తెలుసుకుంటూంటే బిందు చాటుగా నుంచుని విన్నది. బిందు మొదటినుంచీ తండ్రిదగ్గర కన్న ఎక్కువగా బావగారి ఆదరాన్ని పొందకలిగింది. ఎంత వాత్సల్యంగా పిలిచేవాడు! 'అమ్మా!' తల్లీ!' అని పిలవటమే తప్ప ఆయన మరొకవిధంగా పిలిచియెరుగడు. తోడికోడలితో పోట్లాడినప్పుడల్లా ఈబావగారితో పోయి చెప్పాకుంటే ఆయన తనమాటను ఒక్కమాటనుకూడా తోసిపుచ్చలేదు. ఉపేక్ష చెయ్యలేదు. ఇవాళ ఆయనముందు అపరిమితమైన సిగ్గుతో కంఠంబిగుసుకుపోయింది. యాదవుడు వెళ్ళిపోయాడు. బిందు చాటుగా తనగదిలోకిపోయి, నోట్లో గుడ్డకుక్కుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. బిగ్గరగా ఏడిస్తేచుటూ మనుష్యులే నాయె. ఎవరవ్నా వినిపోతారేమో!

మర్నాడు ప్రొద్దున్నే బిందు భర్తనుపిలిచి "ప్రొద్దెక్కుతోంది. పురోహితుడు కనిపెట్టుకుని కూర్చున్నాడు. బావగారు ఇంకా రాలేదు" అన్నది.

మాధవుడు విస్మితుడై "ఆయన ఎందుకు?' అని అడిగాడు.

బిందు అంతకన్న విస్మయాన్ని ప్రకటిస్తూ "ఆయన ఎందుకా? వారుకాకపోతే ఇదంతా ఎవరు చేస్తారు?"అన్నది.

"నేను లేకపోతే బావ ప్రియబాబు ఉన్నాడు. అన్న గారు రారు ఇక్కడికి"

బిందు కోపంతో "రారు అనగానే సరిపోతుందా? ఆయన ఉండగా ఇవన్నీ చేసేందుకు అధికారం ఎవరికి ఉంది? కాదు, కాదు. అలా జరగటానికి వీల్లేదు. వారినితప్ప ఇంకె వర్నీ ఏమీ చెయ్యనీయను నేను" అన్నది.

"అయితే ఈ పనులన్నీ ఆపించు. ఆయన ఇంట్లోలేరు. ఎక్కడికో పనిమీద వెళ్ళారు" అన్నాడు మాధవుడు.

"ఇదంతా అక్కగారి పన్నాగం. దాన్నిబట్టిచూస్తే ఆవిడకూడా రాదల్లేఉంది" అని బిందు ఏడుస్తూ వెళ్ళి పోయింది. ఈ పూజలు-పునస్కారాలూ ఈ సంతర్పణలూ భోజనాలూ, ఈ ఏర్పాట్లన్నీ బిందుకు ఆ క్షణంలో వృథా అనిపించాయి. ఆమెకు ప్రొద్దున్నుంచీ ఇవాళ ఇదే ఆలోచన. బావగారొస్తారు. అక్కగారొస్తుంది. అమూల్యుడు వస్తాడు- అని, ఇన్నాళ్ళనుంచీ ఈ ఒక్కరోజుమీదనే ఆశపెట్టుకుని ఎంతనిశ్చింతగా ఉంటూవచ్చిందో అది ఆమెకుతప్ప ఇంకెవరికీ తెలియదు. భర్తచెప్పిన ఆ ఒక్కమాటతో అదంతా మరీ మరీచికలాగా అంతర్ధానమైపోయి, ఈ ఉత్సవానికైపడ్డ వృథా శ్రమయంతత్తూ ఆమెకు గుండెలమీద కుంపటిలా తోచింది.

ఎల్లోకేసి వచ్చి "భాండారంతాళాలు ఒకసారి ఇలా ఇయ్యి వదినా! వంటవాళ్ళు లడ్డూలు తీసుకొచ్చారు" అన్నది.

అక్కడెక్కడయినా పెట్టనుంచుగూ? తర్వాత చూసు కోవచ్చు" అన్నది బిందు.

"ఎక్కడ పెట్టమనేది వదినా! కాకులూ అవీ పాడు చేస్తాయి"

"చేస్తే చేశాయి లెద్దూ" అంటూ బిందు అక్కడనుంచి వెళ్ళిపోయింది.

పింతల్లి వచ్చి, 'ఆఁ, బిందూ! ఇవాళ ఎంత మయిదా కావాలో కాస్త చూపించివెళ్ళు' అని అడిగింది.

"ఎంత మైదా పడుతుందో అది నాకేం తెలుసు? మీరంతా గృహిణులేగా, మీకు తెలియదూ!" అన్నదిబిందు.

పింతల్లి తెల్లబోయి, "వినండి ఆ మాటలు. ఇవాళఎంత మంది భోజనానికి వస్తారో అది నాకేం తెలుస్తుందే!" అన్నది.

బిందు కోపంతో "అయితే వెళ్ళి వారిని అడుగు. దానికంతకూ మా అక్క ఉండాల్సింది. అమూల్యధనం వడుగుకు మూడురోజులు ఊళ్ళోవాళ్ళంతా వచ్చారు భోజనాలకు. ఆమె ఒక్కసారైనా "ఆపని చూడు చెల్లీ!" ఈపని చెయ్యి చెల్లీ!" అని అనలేదు. ఈ ఇంట్లోవాళ్ళంతా ఆవిడ గోటికి పోలరు" అంటూ అక్కడినుంచి మరోగదిలోకి వెళ్ళిపోయింది. కదమ్ వచ్చి 'అమ్మగారూ! అయ్యగారు చెప్పారు-పూజా వస్త్రాలూ అవీ ' దానిమాట పూర్తి కాకమునుపే 'మీరంతా నన్ను వేధించుకు తినండర్రా! ఫో, నాయెదుట నుంచి' అని యెగిరిపడింది.

కదమ్ గాభరాపడి అక్కడనుంచి పారిపోయింది.

కాస్సేపయ్యాక మాధవుడు వచ్చి కొన్నిసార్లు పిలిచి, పిలిచి, చివరకు 'ఓయ్! వినపడటంలేదా?' అన్నాడు.

బిందు దగ్గరకు వచ్చి ఝంకరిస్తూ "వినపడటంలేదు. ఇంక నావల్లకాదు, కాదు. ఇంక సరా!" అంది.

మాధవుడు తెల్లబోయి చూస్తూ ఊరుకున్నాడు.

"ఏంచేస్తారేమిటి? నా కంఠానికి ఉరిపోస్తారా? పోనీ పొమ్మ్యండి' అంటూ ఏడుస్తూ అక్కడినుంచి గబగబా వెళ్ళి పోయింది బిందు. ప్రొద్దు ఎక్కిపోతోంది ఒకప్రక్క.

బిందు పనిలేకపోయినా హడావిడిగా ఆగదీ ఈగదీ ఇల్లంతా అలగంతిరుగుతూ ఎనుటవాళ్ళని తప్పులెంచటం ప్రారంభించింది. ఎవళ్ళో ఆదరాబాదరా దారో పెట్టాను గిన్నెలూఅవీ. బిందు వాటిని మెల్లాలోకి పోయిపడేటట్లు తన్ని పనులు ఎలా చెయ్యాలో వాళ్లకు పాఠంచెప్పింది. ఎవరో తడిగుడ్డలారేస్తే అవి యెగిరివచ్చి తనకు తగిలేసరికి వాటిని ముక్కలు ముక్కలుగా చింపేసి, గుడ్డలు ఎక్కడ ఎలా ఆరవేసుకోవాలో బోధించింది. ఆమెకు ఎవరు ఎదురు పడ్డా భయంతో ప్రక్కకు తప్పుకోటం మొదలెట్టారు.

పాపం పురోహితుడు లోపలికివచ్చి "ప్రొద్దెక్కి పోతూంది. ఇంకా ఎక్కడా పూజకు ఏర్పాట్లుచేస్తున్నట్లు కన్పడదే..." అన్నాడు.

బిందు చాటుగా నిలబడి కటువుగా ఇచ్చింది జవాబు. "కార్యకరామతులపట్ల కొంచెం ప్రొటుపోక ఏమవుతుంది!" అంటూ కాలికి అడ్డంవచ్చిన మరోబిందె తన్నేసి మరోగది లోకి పోయి నిర్జీవురాలిగా పడుకుంది. పదినిమిషాలు పోయాక ఆమె చెవికి హఠాత్తుగా పరిచితమైన కంఠస్వరం వినపడి,

ఆమె ఆదరాబాదరా లేచివచ్చి తలుపుచాటునుంచి మెడ చాచి చూసింది. అన్నపూర్ణ వచ్చి మెల్లాలో నిలబడిఉంది.

అభిమానంతో దుఃఖంతో బిందు ఏడ్చిఏడ్చి, కళ్ళు తుడుచుకుని చప్పుడుచేసుకుంటూ ఎదురుగావచ్చి, పైటచెంగు మెడకుచుట్టుకుని చేతులు జోడించి, "పదిపదకొండుకావచ్చింది ఇంకా ఎంత శత్రుత్వంపెట్టుకుంటావమ్మా అక్కా? నేనువిషం తాగటంవల్ల నీకోరిక నెరవేరేటట్లయితే పోనీ అలాగేపుచ్చు కుంటాను. ఇంటికి వెళ్ళి ఒకగిన్నెడు పంపుదువుగాని లే" అంటూ తాళాలగుత్తిగలగలలాడిస్తూ ధడేలునఆమెకాళ్ళముందుపడేసి తన గదిలోకి పోయి నేలమీదపడి పొర్లుతూ ఏడ్వసాగింది.

అన్నపూర్ణ నిశ్శబ్దంగా తాళాలగుత్తి తీసుకుని తలుపు తీసి భాండారగృహంలో ప్రవేశించింది.

అపరాహ్ణంవేళ భోజనాలూ అవీ అయిపోయి, వచ్చే పోయే జనసమ్మర్దం తగ్గింది. అప్పటికీ ఇంకా బిందు ఎందు కోసమో నిమిత్తంలేకుండా కాలుకాలిన పిల్లిలాగా ఇల్లంతా తిరుగుతూనే ఉంది.

"అమూల్యబాబు స్కూల్లోలేరు" అని చెప్పాడు భైరవుడు వచ్చి.

బిందు వాడిమీద నిప్పులుకురిపిస్తూ చూసి, "దౌర్భాగ్యుడా! పిల్లలు రాత్రిదాకా స్కూల్లో కూర్చుంటారను కున్నావురా? కొత్తగావచ్చావా యేం నువ్వు? ఆయింటిలోకి వెళ్ళి ఒకసారిచూసి రాలేకపోయావా?" అన్నది.

"ఆయన ఇంటిలోకూడాలేరు"

అయితే వాడెక్కడో ఏ వెధవలతోనో కలిసి బిళ్ళంగోడు ఆడుతూ ఉంటాడు. ఇంక ఇప్పుడు వాడికి భయమేముంది! ఈసారి వాడికి ఆ ఆటలో ఒక కన్ను పోతే ఇంటావిడ కోరిక నెరవేరుతుంది. అప్పుడు పదిచేతులతో కడుపునిండా తింటుంది. పో, ఎక్కడున్నాడో వెతికి తీసుకురా!' అన్నది.

అన్నపూర్ణ భాండారగృహం ముందు కూర్చుని, ఎవరితోనో మాట్లాడుతోంది. బిందు అన్న ఈ తీక్ష్ణమైన మాటలు ఆమె చెవినిపడ్డాయి.

ఇంకోగంట పోయాక భైరవుడువచ్చి 'అమూల్యబాబు ఇంటిలోనేఉన్నారు. కాని రాలేదు' అని చెప్పాడు. బిందు ఈ మాటలు నమ్మలేదు.

"రాకపోవటమేమిటిరా! నేను చెప్పానని చెప్పావా?"

భైరవుడు తలఊగిస్తూ 'ఆఁ, అలా చెప్పినా రానన్నారండీ!' అన్నాడు.

బిందు ఒక్కనిమిషం మెదలకుండా ఊరుకుని, 'వాడి తప్పేముందీ? తల్లి ఎంతో కొడుకూ అంతే! పోలికలు రాకుండా ఎలాపోతాయి? నేను ఇక ఇలాంటి తల్లి కొడుకుల ముఖం చూస్తే ఒట్టు' అన్నది.

రాత్రి చాలా ప్రొద్దుపోయాక అన్నపూర్ణ ఇంటికి వెళ్లాలని బయలుదేరింది ఆవిడ్ని పంపించి రావటానికి మాధవుడు వచ్చి నిలబడ్డాడు. బిందు గబగబా దగ్గరకువచ్చి భర్త నుద్దేశించి, భయంకరమైన కంఠస్వరంతో "పంపించిరావటానికయితే వెడుతున్నావు. కాని ఆవిడ ఇంతవరకు పచ్చిమంచినీళ్ళయినా త్రాగలేదని తెలుసా?" అన్నది.

"అది నీకు తెలియవలసిన సంగతికాని నాకు కాదు. చేసిన ప్రయత్నం అంతా వృధాఅయిపోవటం చూసి, నేనే వెళ్ళి పిలుచుకునివచ్చాను. ఇప్పుడూ నేనే పంపించిరావటానికి వెడుతున్నాను" అన్నాడు మాధవుడు.

'భేష్. బాగుంది. అయితే మీరూ ఆపక్షమేనన్నమాట" అన్నది బిందు.

మాధవుడు ఆమాటకు జవాబుచెప్పకుండా "పదండి, వదినా! ఇంకా ఆలస్యంచేయకండి" అన్నాడు.

"లోకులంటారే జ్ఞాతిశత్రుత్వం అని, అదే ఇది. నోటికి వచ్చినట్లల్లా ఒకటికి పది కల్పించి చెబితేనూ – మాటమాట్లాడితే ఒట్లు వేసుకుంటేనూ సరా? నాలుగు రాత్రిళ్ళూ నాలుగు పగళ్ళూ పిల్లవాడిమొహం కనబడనీయలేదు. భగవంతుడిది చూడకపోడు" అంటూ నోటికి చెంగు అడ్డంపెట్టుకుని ఏడుపు ఆపుకుని వంటింటిలోకి వచ్చి మూర్ఛపోయింది బిందు. అక్కడితో గందరగోళం బయలుదేరింది.

అన్నపూర్ణ, యాదవుడు ఇద్దరూ విన్నారు. యిది అన్నపూర్ణ వెనక్కితిరిగి నిలబడి "అదేమిటో చూచిరానీ" అన్నది.

"చూడక్కరలేదులెండి, పదండి" అన్నాడుమాధవుడు.

ఈ తోడికోడళ్ళకలహం ఇప్పటివరకూ గోప్యంగానే ఉంటూ వచ్చింది, కాని ఇప్పుడు బైటపడింది. మర్నాడు ఇంటిలో ఆడవాళ్ళంతా ఒక్కచోట కూర్చుని ఉండగా ఎలోకేసి "తోడికోడళ్ళిద్దరూ పోట్లాడుకున్నారుసరే, కుర్రాడికేం? వాడు ఒకసారి రాకూడదూ? చిన్నవదిన అన్నమాట అబద్ధం కాదు. తల్లిలాగానే కొడుకూను. పోలిక ఎక్కడికి పోతుంది!

నేనూ చాలామందిపిల్లల్ని చూశాను. కాని ఇలాంటి విశ్వాస ఘాతకుణ్ని ఎక్కడా చూడలేదు" అన్నది.

బిందు విసుగ్గా ఆమె కేసి ఒకసారిచూసి "సిగ్గుతో అప హ్యాంతో రెప్పలు వాల్చుకుంది ఎలో కేసి మళ్ళీ "నీకు పిల్ల లంటే ఎంతో ఆపేక్షగా చిన్నవదినా! మా నరేంద్రనాథుణ్ని తీసుకో——వాణ్ని చంపు, నరుకు. అయినా ఎదురు జవాబు చెప్పేవాడుకాడు నా పిల్లాడు. అలాంటి పిల్లలు నా కడుపునే పుట్టారు అసలు" అన్నది.

బిందు మాట్లాడక ఊరుకుంది. దీనికి బిందుతల్లి జవాబు చెప్పింది. ఈమె వయసు చెల్లిన ఆమె. జమీందారింటి ఆడపడుచు జమీందారింటికోడలు. బోలెడంత ప్రపంచాను భవంకల మనిషి. ఆమె నవ్వుతూ "అదేం మాటర్రా! అమూ ల్యుడు దాని రక్తమాంసాలతో కలిసిపోయాడు. వద్దువద్దు. దాన్ని అలా అతలాకుతలం చేయకండి.బిందూ! మీపోట్లాట మహా ఉంటే నాలుగురోజులుంటుందేమోనే తల్లీ! అంత మాత్రానికే నీబిడ్డ నీకు పరాయివాడైతాడుటే!" అన్న దావిడ.

బిందు జలజలలాడుతున్న కళ్ళతో తల్లికేసి చూసి, మొదలకుండా కూర్చుంది సాయంకాలం కదంను పిలిచి, "సరే కాని, కదమ్,నువ్వూఉన్నావుగా అప్పుడు. నువ్వే చెప్పు.ఆవిడ ఒట్టుపెట్టుకోవాల్సినంత పెద్దతప్పు నావల్ల ఏమున్నదే?" అని అడిగింది.

బిందు తనని ఈవిషయమై ఆలోచన అడగడానికి పిలి చిందంటే కదమ్ చప్పున నమ్మలేకపోయింది. అది ఆతిసంతో

చంతో పరానంగా ఊరుకుంది. అయినా బిందు మళ్ళీ "కాదు కాదు, ఎన్ని చెప్పినా మీరంతా వయస్సులో పెద్దవాళ్ళు, మీరు రెండుమాటలు చెబితే నేను వినాల్సిందే. నువ్వే చెప్పు పోనీ! అంతదోషం నావల్ల ఏముందీ?" అన్నది.

"లేదమ్మగారూ! తప్పేమిటి అసలు?" అన్నది కదమ్ తలఊగిస్తూ.

"అయితే వెళ్ళరాదూ ఆయింటికి ఒకసారి! వెళ్ళి ఈ రెండుమాటలు ఝమాయించి అడిగి రారాదూ: దీనికి నీకు భయమెందుకు?" అన్నది బిందు.

కదమ్ ధైర్యం తెచ్చుకుని, "భయం ఏమీ లేదు అమ్మగారూ! కాని పోట్లాటలూ తగాదాలు పెంచుకుంటే ఏం లాభం? అయిందేమో అయిపోయిందిగా!" అన్నది.

"కాదు, కాదు. కదమ్! నీకు తెలియదు — నిజం చెప్పెయ్యటం మంచిది. లేకపోతే తప్పంతా నాదేననీ ఆమె దేమీ లేదనీ అనుకుంటారు. నిన్ను ఇంటిలోంచి వెళ్ళగొడతాననీ అలాగనీ ఇలాగనీ ఆవిడమాత్రం అనలేదూ? దానికి నేను కోపం తెచ్చుకున్నానా? చాటుగా ఎందుకు ఇవ్వాలి డబ్బు వాడికి? నాతో మాటమాత్రం ఎందుకు చెప్పకూడదూ?" అన్నది బిందు.

"సరే, రేపు వెడతానండి, ఇవాళ ప్రొద్దుపోకిందిగా?" అన్నది కదమ్.

బిందు అప్రసన్నురాలై "అప్పుడే ఎక్కడ ప్రొద్దుపోకిందే—నువ్వేదో పెద్దపెద్ద మాటలు అంటున్నావు.

ఒరేయ్ భైరవ్, హీంబూను పిలవరా ఒకసారి. కదమ్‌తో కూడా సాయం వెళ్ళివస్తాడు" అన్నది.

"హీంబూచేత అయ్యగారు దీపాలు బాగుచేయిస్తున్నా రండీ!" అన్నాడు భైరవుడు.

"ఛీ నాముఖం మీదనే చెబుతావేం సమాధానం?" అన్నది బిందు గ్రుడ్లురిమి.

భైరవుడు ఆమెకళ్ళయెదుట నుంచోకుండా పరు గెత్తాడు. కదమ్‌ను పంపాక బిందు ఆగదిలోకి ఈగదిలోకి రెండుసార్లు తిరిగి చివరకు వంటింటిలోకి వచ్చింది. వంటావిడ ఒక్కతె కూర్చుని వంటచేస్తోంది. బిందు ఒకప్రక్కనకూర్చుని "ఏమమ్మా! నువ్వే సాక్ష్యం నాకు. నిజంచెప్పు. ఎవరిదోషం ఎక్కువది?" అని అడిగింది.

వంటలక్కకు సంగతేమిటో బోధపడలేదు.

"ఏమిటమ్మా?" అని అడిగింది.

"అదే. ఆనాడు జరిగినసంగతి. ఏమన్నాను నేను. "అక్కా! ఈమధ్య ఎప్పుడైనా అమూల్యుడికి డబ్బిచ్చావా అనిమాత్రం అడిగాను. పిల్లలచేతికి అప్పుడప్పుడు డబ్బుఇస్తూ ఉంటారని ఎవరికి తెలియనిసంగతి? "అమూల్యుడు ఏడ్చి రాగాలెట్టాడు. ఇచ్చాను" అంటే సరిపోయేదిగా! ఈభాగ్యానికి ఇన్నిమాటలెందుకువస్తాయి?—ఈఒట్లూ .. శపథాలూ ఎందుకువస్తాయి? ఈభాగ్యానికి ఇంతపెద్దఒట్టా? వంశాంకురం ఒక్కడూ వాడు. వాడిమీదనా ఒట్టుపెట్టుకోవటం? నేను చెబుతున్నానుగా నీకు. ఈ జన్మలో ఆవిడ మొహాం చూడను.

నేనింక శత్రువుకేసి అయినా కళ్ళెత్తి చూస్తాను కాని ఆవిడ ముఖంకేసి కన్నెత్తి చూడను" అన్నది.

వంటావిడ వస్తుతః ఎక్కువ మాట్లాడే స్వభావం కలది కాదు. ఆవిడకు ఏం చెప్పాలో తోచక మెదలకుండా ఊరుకుంది. బిందు కళ్ళు రెండూ నీళ్ళకుండలయినాయి. చటుక్కున కళ్ళు తుడుచుకుని గద్గదకంఠంతో 'కోపంవస్తే ఒట్లు ఎవరూ పెట్టుకోరమ్మా! అలా అని ఇక్కడికి వచ్చి కూడా పచ్చిమంచినీళ్ళయినా త్రాగలేదు. కుర్రాణ్ణిఅయినా ఇక్కడికి రానీయలేదు. ఇవన్నీ పెద్దవాళ్ళు చేయాల్సిన పను లేనా? ఎన్ని చెప్పినా చిన్నదాన్నే నేను. బుద్ధికికూడా చిన్న దాన్నే. ఒకవేళ ఆవిడ కూతుర్నే అయితే నేను, అప్పుడేం చేసేది? నేనుమాత్రం ఆవిడపేరు ఇంకెప్పుడైనా ఎత్తుతానను కున్నావా! చూస్తారుగా మీరు" అన్నది.

వంటలక్క అప్పటికీ మాటాడకుండానే ఊరుకుంది. "ఒట్టుపెట్టుకోవటం తెలిసింది ఆవిడకేనా? నాకుమాత్రం చేతకాదూ ఆపాటి? రేపు అక్కడికి వెళ్ళి ఒకగిన్నెడు విషం కనుక పంపకపోయావంటే నువ్వు పెట్టిన ఒట్టే నేనూ పెడుతున్నానంటా. ఏమవుతుందీ అప్పుడు? ఈ రెండురోజులూ ఊరుకుంటా నేను. తర్వాత వెళ్ళి ఈ ఒట్టు అయినా పెట్టేస్తా లేదా నేనే విషంతాగి ఆవిడ చంపించిందని పుకారుపుట్టిస్తా. చూస్తా అప్పుడు నలుగురూ ఆవిడ్ని ఛీ అంటారో—నన్ను ఛీ అంటారో. ఆవిడ లొంగుతుందో లొంగదో చూస్తా" అన్నది.

వంటలక్క భయపడి, మృదువుగా "అదేమిటమ్మా!

ఛీ! అలాంటిమాటలు తలచనేకూడదు. విరోధాలున్నాతగా బొలుగా స్వాన్ఠంగా ఉంటాయా? ఆపెడా నిన్నువిడిచిపెట్టి ఉండలేదు అమూల్యుడూ విడిచిపెట్టి ఉండలేడు. ఈ నాలుగు రోజులూ ఎలాఉండగలిగాడా అన్నదే ఆలోచిస్తున్నానేను" అన్నది.

బిందు తొందరపడుతూ "అలాచెప్పా అమ్మా! తప్పకుండా ఆవిడ వాడ్నికొట్టి కోదండంవేసి భయపెట్టి ఉంటుంది. ఒక్కరాత్రికూడా నేను దగ్గరలేందే పడుకోలేనువాడు. ఇప్పటికి అయినుపగళ్ళూ నాలుగురాత్రులూ గడిచాయి. ఇంకా ఆవిడమొహం చూడాల్సిన అవసరముందా? చెప్పానుగా! శత్రువుముఖమైనా చూస్తాగాని ఆవిడమొహం ఇంక ఈ జన్మలో చూడనని" అన్నది.

వంటలక్క తన మణికట్టుదగ్గర నల్లటిమచ్చ చూపిస్తూ "ఇలా చూడమ్మా! ఇక్కడ నలుపు ఇంకా అలాగేఉంది. ఆరాత్రి మీకు మూర్ఛవచ్చి పడిపోయారు. మీకు ఎరుగను ఈసంగతులన్నీ. అమూల్య ధనం పరుగెత్తుకుని వచ్చి మీ మీదపడి ఒకటే ఏడుపు. అతడు ఎప్పుడూ చూడలేదుగా మూర్ఛరావటం. అమ్మ చచ్చిపోయిందంటాడు. మీ ముఖం మీద నీళ్ళు కొట్టనివ్వలేదు. విసనకర్రతో విసరనీయలేదు. నేను ఇవతలికి లాగుదామని వెళ్లాను. నన్ను కొరికాడు. పెద్దమ్మగారు లాక్కురాబోతే ఆవిణ్ణిగిల్లి, రక్కి, గుడ్డలన్నీ చించేశాడు, మీకు ఉపచారాలు చేయటానికి బదులు అందరూ అతడ్ని సముదాయించాల్సి వచ్చింది. చివరకు

అయిదారుగురు కలిసి పట్టుకుని లాక్కువచ్చారు మీ దగ్గిర నుంచి'' అన్నది.

బిందు రెప్పవాల్చకుండా ఆవిడ చెబుతున్న మాటలు గుటక వేస్తున్నట్లు చూస్తూకూర్చుంది. తర్వాత పెద్దనిట్టూర్పు విడిచి, మెల్లిగా తనగదిలోకిపోయి, తలుపులు వేసుకుని పడుకుంది.

నాలుగయిదు రోజులుపోయాక బిందు తల్లి వాళ్ళూ వెళ్ళటానికి ముందురోజున బిందు మూర్ఛవచ్చి పడిపోయి తేరుకున్నాక ఒక్కతే పడుకుని ఉంది. కదమ్ మాత్రం విసనకర్రతో విసురుతూ కూర్చుంది. ఇంకెవరూ లేరు. బిందు దాన్ని కాస్తదగ్గరగా రమ్మని సైగచేసి, "కదమ్, అక్కగారు వచ్చిందటే?" అని అడిగింది.

"లేదమ్మా! మేము ఇంతమందిమి ఉండగా ఆవిడ కెందుకు శ్రమయివ్వటం?" అన్నది కదం.

బిందు ఒక్కనిమిషం ఆగి, ఇదే మీలోఉన్న దోషం కదం! అన్నిపనులూ మీ తెలివితేటలతో సాగిపోతాయి అనుకుంటారు. ఇలాగే మీరంతా కలిసి ఎప్పుడో నన్ను చంపేసేట్లున్నారు. ఆపూజనాడుకూడా మీరంతా ఇంతమంది ఉన్నారు. ఏంచెయ్యగలిగారు ఆవిడ ఈయింట్లో అడుగుపెట్టనంతవరకు? మీరెక్కడ! ఆవిడఎక్కడే! మీరు ఇంటిల్లిపాదీ ఆవిడగోరుకు పోలరే'' అన్నది.

బిందుతల్లి గదిలోకి వచ్చి "అమ్మాయీ! అల్లుడు ఇష్టపడ్డాడు. నువ్వు మాతోపాటు కొన్నాళ్లు ఉండి వద్దువు గాని బయలుదేరు'' అన్నది.

బిందు తల్లి ముఖం కేసిచూస్తూ ఊరుకుని, "నేను రావటం రాకపోవటం వారియిష్టంమీద ఆధారపడివుందా అమ్మా? వారు వెళ్ళమనగానే వచ్చేస్తానా? నా శత్రువు అనుమతి లేనిదే నే నెలా వస్తానూ?" అన్నది.

తల్లి ఆ మాటల్లోని తాత్పర్యం గ్రహించి 'నీ తోటి కోడలిసంగతేగా నువ్వు అనేదీ? ఇంక ఆవిడపలుకుంకావల్సిన అవసరంలేదు. మీరు వేర్లుపడి విడిగా వచ్చేశారుగా ! ఇంక ఆవిడ ఆజ్ఞ ఎందుకు? అన్నది.

బిందు తల ఊగిస్తూ 'ఊహూ', అలా వీల్లేదు. ఆవిడ బ్రతికి ఉన్నంతవరకూ ఎక్కడఉన్నాసరే సర్వమూ ఆవిడే. ఏమయినాకానీ అమ్మా! ఆవిడ ఆజ్ఞకానిదే, నేను ఇల్లు విడిచిపెట్టి రాలేను అలాఅయితే బావగారి మనస్సుకు కష్టంతోస్తుంది' అన్నది.

ఎలోకేసి అప్పుడే ఎక్కడినుంచో వచ్చి, 'నేను చెబు తానుకాని, నువ్వు వెళ్లు' అన్నది.

బిందు ఆమాటలకు జవాబు చెప్పలేదు .'మంచిదే. పోనీ ఎవర్నయినా పంపి ఆవిడఅనుజ్ఞతీసుకోరాదూ?'అన్నది తల్లి.

బిందు ఆశ్చర్యపోతూ 'మనిషినిపంపా? అదిచెయ్యటం అసలు బావుండదు. నాకు ఆవిడమనస్సు తెలుసు. పైకి 'వెళ్లు అని మాత్రం అంటుంది.మనస్సులో కోపం పెంచుకుంటుంది. లేదా బావగారితో నాలుగు కల్పించి చెప్పినా చెబుతుంది. కాదు అమ్మా!మీరు వెళ్ళండి.నాకు రావటం కుదరదు'అన్నది.
తల్లి ఇంక అట్టేబలవంతం చెయ్యలేదు. వెళ్ళిపోయింది.ఇప్పుడిహ బావురుమంటూఉన్న ఇంతయిల్లూ తనను మింగటానికి నోరు

తెరచుకున్నట్లు కన్పించసాగింది బిందుకు క్రిందిగదుల్లో ఎంతో కేసి ఉంటోంది. రెండో అంతస్తులో తనకి ప్రత్యేకంగా ఉన్న గది తప్ప మిగతా ఇల్లంతా బావురుమంటోంది. ఆవిడ ఒట్టి పోయిన మనస్సుతో ఇల్లంతా తిరిగి తిరిగి చివరకు మూడో అంతస్తులోని గదిలోకి వచ్చింది. ఎప్పుడో భవిష్యత్తులో తన కొడుకూ కోడలికోసమని ఇప్పుడే ప్రత్యేకంగా ఈ గది కట్టించింది. ఆగదిలోకి వచ్చేసరికి ఎంతప్రయత్నించినా కళ్ళనీళ్లు ఆపుకోలేకపోయిందామె. క్రిందికి దిగినస్తూంటే మధ్యలో మాధవుడు కన్పించాడు. "ఏమండీ, ఇలా అయితే ఎలామరి? అని అడిగింది భర్తను.

మాధవుడికి ఏమిటో అర్థంకాక "ఎవరి సంగతి?" అని అడిగాడు.

బిందు ఇంక జవాబు చెప్పలేకపోయింది. హఠాత్తుగా దీర్ఘంగా నిట్టూర్చి "ఏం లేదు, ఏం లేదు. మీరు వెళ్ళండి. అదేం కాదు" అన్నది.

మర్నాడుదయం మాధవుడు బైటగదిలో కూర్చుని ఏదో పనిచేసుకుంటున్నాడు. అకస్మాత్తుగా బిందు గదిలోకి వచ్చి ఏడుపు ఆపుకున్న గొంతుతో "వారు నౌకరీచేస్తున్నారుటగా?" అన్నది.

మాధవుడు కళ్లు పైకి ఎత్తకుండానే "ఊఁ" అన్నాడు.

'ఊఁఏమిటి? ఇది నౌకరీచేసేవయస్సేనా వారికి?'

మాధవుడలాగే కాగితాలుచూసుకుంటూ 'నౌకరీ ఎవరైనా వయస్సునుబట్టి చేస్తారా? అభావంతో చేస్తారు నౌకరీ' అన్నాడు.

"వారికి అభావంమాత్రం ఎందుకు రావాలి? మేమంతే పరాయివాళ్ళం. పోట్లాడుకున్నాం. మీరిద్దరు అన్నదమ్ములేగా"

'సవతిబిడ్డలం—జ్ఞాతులం'

బిందు స్తంభితురాలై మెల్లిగా "మీరు బ్రతికిఉండగా వారిని ఈ వయస్సులో నౌకరీచేయనిస్తారా?" అన్నది.

మాధవు ఓసారి తలమెత్తి భార్యకేసి చూసి, సహజ శాంతమైన కంఠస్వరంతో 'ఎందుకు చేయనీయను? లోకంలో ఎవరిఅదృష్టంకొద్దీ వాళ్లు అనుభవిస్తూఉంటారు. దానికి ప్రత్యక్ష ప్రమాణం నేను. మానాన్నా, అమ్మా ఎప్పుడుపోయారో నేను ఎరగను. మేము చాలా బీదవాళ్ళమని మా వదిననోటి మీదుగా విన్నాను. కాని, ఎప్పుడూ నేను కష్టాన్ని ఎరగను. శుభ్రమైన చక్కని బట్టలు నాకు ఎలావచ్చేవో, కాలేజీజీతం ఎలావచ్చేదో, పుస్తకాలకు డబ్బు ఎలా వచ్చేదో, లాడ్జికి అద్దె ఎలావచ్చేదో అదంతా ఇప్పటికీ తెలియదు నాకు. తర్వాత ప్లీడర్ని అయ్యాకకూడా తక్కువగా సంపాయించటం లేదు నేను. ఈలోపుగా ఎక్కడినుంచో నువ్వు ఇంకోరాసి డబ్బు తీసుకుని వచ్చావు. ఈ మేడకూడా తయారయిందిప్పుడు. ఇహ మా అన్నయ్యను చూడు. మొదలకుండా మొదటినుంచీ ఎముకలు విరిగేట్టు కష్టపడుతున్నాడు. చిరిగిపోయినవీ—అతుకులు వేసినవీ గుడ్డలు కట్టుకుంటాడు. చలికాలంలో కూడా ఆయన ఒంటెని నే నెప్పుడూ చొక్కాచూసి యెరుగను.

'ఒక్కపూట గుప్పెడు మెతుకులు తిని కాలక్షేపంచేసేవాడు - నా కోసమనే. అవన్నీ నాకు జ్ఞాపకం ఉండవు. ఉండవలసిన అవసరమూ లేదు. ఈమధ్య కొద్దిరోజులు మాత్రం

సుఖంగా విశ్రాంతిగా రోజులు వెళ్ళబుచ్చినందుకు భగవం తుడు ఇప్పుడు దానికి వడ్డీతోసహా గుంజుకుంటున్నాడు" అని చటుక్కున అతడు ముఖం ప్రక్కకుతిప్పుకుని, ఏదోముఖ్యమైన కాగితం వెతుక్కోవటం మొదలెట్టాడు.

బిందుకు నోటమాటరాలేదు. స్తబ్ధుఅయిపోయింది. ఈకొద్దిరోజులనుంచీ జరుగుతూవస్తున్న మాటల్లో చేష్టలలో నిగూఢంగా భర్తతిరస్కారం ఎంతఉన్నదీ, ఆమె ప్రతిరక్త బిందువుకూ తెలిసివచ్చింది ఇవాళ. ఆమె తలవంచుకుని నిల బడింది.

మాధవుడు కాగితాలువెతుక్కుంటూ తనలోతాను అనుకుంటున్నట్లుగా - "నౌకరీఅన్నా నౌకరీ! భలేనౌకరీ, రాధాపూర్‌కచేరికి రానుపోను ఇంచుమించు పదిమైళ్ళనడక, తెల్లవారుఝామున నాలుగుగంటలకు లేచి బయలుదేరితే,పగ లల్లా తిండిలేకుండా రాత్రికి వచ్చి రెండుమెతుకులు ఎంగిలి పడటం—జీతం పన్నెండురూపాయలు" అన్నాడు.

బిందు వణికిపోతూ "పగలల్లా నిరాహారమా? మొత్తం పన్నెండు రూపాయలా జీతం?అన్నది.

"ఆఁ, పన్నెండు రూపాయలు. వయస్సు మళ్ళిపోయె! ఆపైన నల్లమందు అలవాటు ఒకటుండె! కాసినిపాలైనా త్రాగటానికి లేవు. ఇన్నాళ్ళకయినా భగవంతుడు దయతలచి ఆయనకు ఈ సంసారంనుంచి విముక్తి కలిగించేట్లున్నాడు చూస్తే" అన్నాడు మాధవుడు.

బిందు కళ్ళనీళ్ళు బొటబొటా కారాయి. ఆమె ఎన్నడూ చేయనిపని ఇవాళ చేసింది. వంగి భర్తపాదాలు

పట్టుకుని ఏడుస్తూ 'మీ కాళ్లు పట్టుకుంటున్నాను. ఏదో ఉపాయం చూడండి. అసలే జబ్బువంటిమనిషి. ఇలా అయితే రెన్నాళ్ళయినా బ్రతకదు వాసు' అన్నది.

మాధవుడు తన కన్నీళ్లు ఎలాగో తుడుచుకుని, 'నేనేం ఉపాయం చూడను! వదినగారు మనవి గుప్పెడు బియ్యమయినా తీసుకోదు. ఆయన ఏమీ చెయ్యకపోతే మరి వాళ్ళ సంసారం మాత్రం ఎలాగడిచేది?' అన్నాడు.

బిందు రుద్ధస్వరంతో 'అది నాకు తెలియదు. మీరు నాపాలిటి దైవం. వారు మీకన్న యెక్కువవాడునాకు. ఛీ,ఛీ, ఆమాట పెదవిమీదికే రానీయకూడదు' అన్నది ఆమాట ఏమిటో బిందు చెప్పలేకపోయింది.

'సరేమంచిది. కనీసం నువ్వు వదినగారి దగ్గరకైనా వెళ్ళు. ఆవిడకు కోపంపోయి ప్రసన్నురాలయ్యేటట్లుగా చెయ్యి. అస్తమానమూ నా కాళ్ళు పట్టుకు కూర్చున్నంత మాత్రాన లాభమేమీ లేదు' అన్నాడు మాధవుడు.

బిందు తక్షణం కాళ్లువిడిచిపెట్టి లేచి 'కాళ్లుపట్టుకునేఅభ్యాసం నాకులేదు. ఆవిడ ఆరాత్రి మంచినీళ్ళయినా ఎందుకు త్రాగలేదో, మీకు అన్ని సంగతులూ తెలిసి ఉండికూడా శత్రువులాగా ఎందుకు మెదలకుండా ఊరుకున్నారో నాకు యిప్పుడు తెలుస్తోంది. నాతప్పును ఎక్కువ చేయడానికేగా మీరప్పుడు మాట్లాడకుండా ఊరుకున్నదీ?' అన్నది.

మాధవుడు తన కాగితాల మీదకు దృష్టి పోనిచ్చి 'కాదు. ఆవిడ నేను మా అన్నగారి దగిర నేర్చుకున్నా. ఇలా

ఊరుకుండగానే దాటిపోయేట్లుగా ఈశ్వరుడు కరుణించాలి నన్ను' అన్నాడు.

బిందు యింకేమీ మాట్లాడలేదు. లేచి తనగదిలోకి వెళ్ళిపోయి పడుకుంది.

మాధవుడు అక్కడినుంచి ఇంక లేవబోతుండగా బిందు మళ్ళీ వచ్చింది గదిలోకి. ఆమెకళ్ళు రెండూ మంకెనపువ్వుల్లా ఎర్రగా ఉన్నాయి.

మాధవుడికి జాలికలిగింది. 'ఆవిడదగ్గరకు వెళ్లు ఒకసారి. ఆవిడసంగతి తెలుసుగా. నువ్వు ఒకసారివెళ్ళి నుంచుంటే చాలు, అన్నీ చక్కబడతాయి' అన్నాడు.

బిందు అతి కరుణస్వరంతో 'మీరు వెళ్ళండి—అబ్బాయి మీద ఒట్టు వేసుకుంటున్నా నేను' అన్నది.

మాధవుడు ఆమె మనస్సులోని భావాన్ని గ్రహించి ఉడుకెత్తి 'నువ్వు వెయ్యి ఒట్లు పెట్టుకున్నా నేను అన్నయ్య దగ్గరకు వెళ్ళి చెప్పలేను. ఆయన స్వయంగా అడగందే నేను పోయి చెప్పేటంత సాహసం నాకంతం కత్తిరించినా రాదు నాకు' అన్నాడు. అప్పటికీ బిందు కదల్లేదు.

'నువ్వు వెళ్ళలేవా?' అని అడిగాడు మాధవుడు.

బిందు జవాబు చెప్పలేదు. తలవంచుకుని మెల్లిగా వెళ్ళిపోయింది.

## 8

ఆ మేడ ముందునుంచే స్కూలుకు వెళ్ళేదారి. మొదట్లో కొన్నాళ్ళు అమూల్యుడు గొడుగు ముఖానికిఅడ్డం

ఆ ఎర్రరంగు గొడుగు ఈదారిన వెళ్ళటంలేదు. చూసి చూసి బిందుకు కళ్ళు చిల్లులుపడిపోతున్నాయి. అయినా ఆమె ఆ మేడ మెట్లగది చాటుననుంచుని అలాగే చూస్తూఉంది. ప్రొద్దున తొమ్మిది పదిగంటలప్పుడు ఎన్నోరకాల గొడుగులు వేసుకుని ఎంతోమంది పిల్లలు ఆదారినే వెళ్ళేవాళ్ళు. స్కూలువిడిచి పెట్టగానే మళ్ళీ ఎంతోమంది పిల్లలు ఆదారినే ఇళ్ళకు తిరిగి పోతూ ఉండేవాళ్ళు. కాని ఆనడక, ఆగొడుగు బిందు కంట పడలేదు. ఆమె చీకటి పడబోయేముందు కళ్ళు తుడుచుకుంటూ క్రిందికి దిగివచ్చి నరేంద్రుణ్ణి చాటుకుపిలిచి, 'ఆఁ నరేన్? స్కూలుకు వెళ్ళేదారి ఇదేగా? అయితే మరి వాడు ఈదారిని నచ్చినట్లు కనబడడేం?' అని అడిగింది.

నరేన్ మెదలకుండా ఊరుకున్నాడు.

'ఏమోయ్! మీరిద్దరూ చక్కగా కబుర్లు చెప్పుకుంటూ వస్తూపోతూఉంటే బావుంటుంది కదూ!' అన్నది బిందు.

నరేన్‌కు అమూల్యుడంటే నిజానికి ఆపేక్ష. 'వాడు సిగ్గుతో ఇటు రావటం లేదమ్మా అత్తా! అదంతా ఎక్కడి నుంచో చుట్టుతిరిగి వస్తున్నాడు' అని మెల్లిగా చెప్పాడు నరేన్.

బిందు అతికష్టంమీద నవ్వు తెచ్చుకుని, 'వాడికి సిగ్గెందుకోయ్! ఆహాఁ నువ్వు చెప్పుపోనీ. వాణ్ణి ఇటే వస్తూ ఉండమని .'అన్నది.

నరేన్ తలఊగిస్తూ 'ఎప్పటికీరాడు అత్తా! ఎందుకు రాడో తెలుసా!' అన్నాడు.

బిందు ఉత్సుకతతో 'ఎందుకని?' అని అడిగింది.

'నీకు కోపం రాదుకదా!'

'ఊహూఁ.'

"వాళ్ళయింటికి కబురుచేసి కనుక్కోవుకదా!"

"ఊహూఁ:

"మాఅమ్మతో అయినాసరే చెప్పవుకదా!"

బిందు అధీరురాలై "ఊహూఁ, చెప్పు. నేనెవర్నీ ఏమీ అడగనులే" అన్నది.

"మూస్టో మేష్టారు అమూల్యుడి చెవులు బాగా మెలేశాడు" అన్నాడు నరేన్.

ఒక్కనిమిషం బిందు భగ్గుమని "ఎందుకు మెలేశాడు! వాడిబంటిమీద చెయ్యివెయ్యటానికి వీల్లేదని మొదట్లో చెప్ప లేదూ నేను!" అన్నది.

నరేన్ చేతులు త్రిప్పుతూ "ఆయనతప్పు ఏముందమ్మా అత్తా! ఆయన క్రొత్తవాడు. మన నౌకరు హీంబూగాడు న్నాడే—వీడు ఒత్తి తప్పుడు ముండాకొడుకు. వాడొచ్చి మాఅమ్మతో చెప్పాడు. ఆవిడమాత్రం తక్కువ వను కున్నావా మహామ్మారి! ఆవిడ మూస్టో మాష్టారికి కబురు చేసింది. ఆయన ఈ అసరా చూసుకుని చెవులు మెలేశాడు. ఎలామెలేశాడో తెలుసా! ఇలా. బిందు చటుక్కున అతణ్ని ఆపి, హీంబూ యేమని చెప్పాడు? అని అడిగింది. యేంచెప్పాడో తెలుసా అత్తా? హీంబూ టిఫిన్ వేళకు నాకు యిక్కడినుంచి టిఫిన్ తీసుకువస్తాడుగా! అమూల్యుడు పరుగెత్తుకునివచ్చి "ఆ టిఫిన్ ఏమిటో చూపించు నరేన్దా?"

అని అడిగాడు. మా అమ్మ అమూల్యుడి దృష్టికి తగలనివ్వను అని ముందే చెప్పి పంపింది.'

"అమూల్యుడికి ఎవరూ టిఫిన్ తీసుకురారూ?"

నరేన్ ఒకసారి నుదురుమీద కొట్టుకుని, "ఎక్కడి నుంచివస్తుంది అత్తా! వాళ్ళు బీదవాళ్ళాయె. వాడు జేబునిండా మరమరాలో అటుకులో పోసుకుని తెచ్చుకుని, అందరూ టిఫిన్ తీసుకునే సమయంలో ఆ చెట్లచాటుకు ఎక్కడకో పోయి తింటూ ఉంటాడు" అన్నాడు.

బిందు దృష్టికి ఈమేడా ఇల్లూ ప్రపంచం యావత్తు ఊగిపోతున్నట్లు తోచింది. ఆమె అక్కడే చతికిలపడిపోయి, "నరేన్! ఇంక నువ్వు వెళ్ళు" అన్నది.

ఆరాత్రి పిలువగా పిలువగా బిందు అన్నం ముందు వచ్చి కూర్చుందికాని, ఒక్క ముద్దకూడా నోట్లో పెట్టుకోలేక పోయింది. చివరకు సుస్తీగా ఉన్నదన్న వంకతో లేచి వెళ్ళి పోయింది. మర్నాడుకూడా ఉపవాసంతో పడివుంది. ఎవ్వరితో ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. ఎంత ఆలోచించినా ఒక్క ఉపాయంకూడా తోచలేదు. తాను మాట్లాడితే తనతప్పు యింకెంత పెద్దదవుతుందో అని ఆమెకు భయం వేయసాగింది. మధ్యాహ్నం భర్త భోజనం చేసే టప్పుడు అలవాటు ప్రకారం దగ్గరకువెళ్ళి పరధ్యానంగా చూస్తూ కూర్చుంది. నిన్నటినుంచి ఆహారపదార్థాలకేసి ఆమె సరిగ్గా చూడనుకూడా చూడలేకపోతోంది. రాత్రి గదిలో దీపం వెలుగుతోంది. మాధవుడు కళ్ళుమూసుకుని మొదల

కుండా కూర్చునివున్నాడు. బిందువచ్చి కాళ్ళదగ్గరకూర్చుంది. మాధవు డది చూసి "ఏమిటది?" అని అడిగాడు.

బిందు తలవంచుకుని భర్తకాలివేళ్ళు కదిలించడం మొదలెట్టింది.

మాధవుడు భార్యమనస్సులోని ఉద్దేశాన్ని గమనించి మెత్తబడి 'నేను అంతా గ్రహించాను బిందూ! కాని నా దగ్గిరయేడిస్తే ఏంలాభం? ఆవిడదగ్గరకువెళ్ళు' అన్నాడు.

బిందు నిజంగా ఏడుస్తోంది. 'మీరు వెళ్ళండి' అన్నది.

'నేను వెళ్ళి నీసంగతి చెబితే అన్నయ్య వినడూ?'

బిందు ఆ మాటకు జవాబు చెప్పకుండా 'నాదే తప్పు అయిందని ఒప్పుకుంటున్నానునేను. నేను క్షమాపణ కోరుకుంటున్నానని మీరువెళ్ళి చెప్పండి' అన్నది.

'నావల్లకాదు' అని మాధవుడు ఒత్తిగిలిపడుకున్నాడు.

బిందు ఇంకాస్సేపు ఆశతో అలాగే కూర్చుంది. కాని మాధవుడు ఇంకేమీ మాట్లాడక పోయేసరికి ఇంక మెల్లిగా లేచి వెళ్ళిపోయింది. భర్తప్రవర్తన కఠినమైన తిరస్కారం ఆమె హృదయంలో ఆమడదూరంగల పర్వతంలాగా ఈ మూలనుంచి ఆమూలవరకూ వ్యాపించిపోయింది. తనను అందరూ పరిత్యజించారని ఆమె ఇవాళ స్పష్టంగా తెలుసుకుంది.

మర్నాడు ప్రొద్దున్నే యాదవుడు మరదల్ని పంపటానికి అనుమతిస్తూ ఒక చీటీరాసి పంపాడు. ఆవిడ తండ్రికి చాలా జబ్బుగావుందిట! వెంటనే బయలుదేరాలి. బిందు

కన్నీళ్ళతో వెళ్ళి బండిలో కూర్చుంది. వంటావిడ బండిదగ్గ రకు వెళ్ళి "నాన్నగారికి కులాసా చిక్కగానే వెంటనే వచ్చే సెయ్యండి అమ్మా!" అన్నది.

బిందు బండిదిగి ఆమెకు నమస్కరించ బోయేసరికి ఆవిడ సంకోచంతో ప్రక్కకు తప్పుకుంది.

బిందు ఇలా సమ్రంగా వినయంగా ఉండగా ఎన్నడూ ఎవ్వరూ చూసి ఎరుగరు. ఆమె నమస్కరించి, 'వద్దుఅమ్మా వద్దు. ఏమయినా నువ్వు బ్రాహ్మణ స్త్రీవి. వయస్సుకు పెద్ద దానివి. ఇంక మళ్ళీ తిరిగిరాకుండా ఉండాలని, ఇదే నా ఆఖరి ప్రయాణం అయ్యేట్లు ఆశీర్వదించు' అన్నది.

ఆవిడ ఆమాటలకు ఏమీ సమాధానం చెప్పలేక పోయింది. ముడతలుపడి, కళావిహీనమై వున్న బిందుముఖం కేసి చూసి కళ్ళు ఒత్తుకుంది.

ఎలో కేసి అక్కడేవుంది. ఆమె ఖంగ్ మనేట్లు 'అదేం మాట చిన్నవదినా! లోకంలో ఎవరి తల్లిదండ్రులకూ సుస్తీ చెయ్యటంలేదూ!' అని అన్నది.

బిందు మాట్లాడలేదు. ముఖం ప్రక్కకు త్రిప్పుకుని కళ్ళు తుడుచుకుంది. కొంచెంసేపాగి "మీకు నమస్కారం వదినగారూ! వెడుతూన్నా నేను" అన్నది.

"వెళ్ళు వదినా వెళ్ళు! నేను ఉంటానుగా ఇంట్లో. అన్నీ నేను చక్కబెట్టుకుంటానులే" అన్నది ఎలోకేశి.

బిందు ఇంకమాట్లాడలేదు. కోచ్ మాన్ బండిబయలు దేరతీశాడు.

అన్నపూర్ణ వంటావిడ చెప్పగా ఈసంగతివిని మెదల కుండా ఊరుకుంది. ఇంతకుముందెప్పుడూ బిందుఅమూల్యుడ్ని విడిచిపెట్టి పుట్టింటికి వెళ్ళి యెరుగదు. ఇప్పుడు నెల్లాళ్ళ నుంచీ అసలు వాడ్ని చూడనేలేదు. ఆమె దుఃఖం అన్నపూర్ణ తెలుసుకుంది.

రాత్రి అమూల్యుడు తండ్రిదగ్గర పడుకుని మెల్లిగా ఏవో కబుర్లు చెబుతున్నాడు.

అన్నపూర్ణ దీపంముందుకూర్చుని బొంతకుట్టుకుంటున్న దల్లా దీర్ఘంగా నిట్టూర్చి, 'వెళ్ళేముందు ఇదే నాచివరి ప్రయాణంకావాలని కోరుకున్నదట! మా తల్లిని చల్లగా మళ్ళీ యింటికి వచ్చేట్లు చెయ్యాలి దుర్గాభవానీ! అని అనుకో సాగింది.

యాదవుడు ఈ మాటలువిని, లేచికూర్చుని, "నువ్వు మొదటినుంచీ చేసినవన్నీ మంచిపనులు కావు. మాతల్లిని అసలు మీరెవ్వరూ అర్థంచేసుకోలేదు" అన్నాడు.

"ఆమె అయినా "అక్కా!" అంటూ ఒక్కసారి రాకూడదూ! పిల్లాణ్ణి తాను బలవంతంగా తీసుకెళ్ళినా తీసుకు వెళ్ళగలదు. పోనీ అలాగయినా చేయకపోయిందా! ఆరోజున పగలల్లా చాకిరీచేసి ఇంటికి వస్తూంటే ఎంతెంతేసి మాటలు అన్నదీ!" అన్నది అన్నపూర్ణ.

"మా అమ్మ సంగతి తెలిసింది నాకు ఒక్కడికే. కాని ఈమాత్రం దాన్ని క్షమించలేకపోతే నీకు ఎందుకు వచ్చిన పెద్దరికం చెప్పు. నువ్వూ అంతే. మాధూ అంతే. మీరిదరూ

కట్టకట్టుకుని మాతల్లిప్రాణాలు కొరికేశావు' అన్నాడు యాదవుడు.

అన్నపూర్ణ కళ్ళవెంట బొట బొట కన్నీళ్లు జారాయి.

"నాన్నా! అమ్మ రానని ఎందుకు చెప్పిందీ?" అని అడిగాడు అమూల్యుడు.

అన్నపూర్ణ కళ్లుతుడుచుకుని "మీఅమ్మ దగ్గిరకు 'వెడతావ్రుట్రా?"అని అడిగింది.

అమూల్యుడు తల త్రిప్పుతూ "వెళ్ళను" అన్నాడు.

'వెళ్ళకపోవటమేమిట్రా? మీ అమ్మ మీ తాతగారి ఇంటికి వెళ్ళింది.నువ్వుకూడా వెళ్ళు రేపు" అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు మెదలకుండా ఊరుకున్నాడు.

"వెడతావ్రుట్రా?" అని అడిగాడు యాదవుడు.అమూల్యుడు దిండులో తలదాచుకుని "ఊహూఁ."అన్నాడు.

రాత్రి ఇంకా ప్రొద్దుండగానే యాదవుడు కచేరికివెళ్ళటానికి ప్రయాణమవుతూండేవాడు.అయిదారు రోజులు గడిచాక ఒకరోజున తెల్లవారుఝామున లేచికూర్చుని పరధ్యానంగా హుక్కాపీలుస్తున్నాడు.

"మీకు వేళ అవటంలేదూ?. .."అన్నది అన్నపూర్ణ.

యాదవుడు ఆదరాబాదరా హుక్కాగొట్టం అక్కడ పడేసి, "ఇవాళ నామనస్సేమీ బావుండలేదు. రాత్రి మా అమ్మవచ్చి ఈ తలుపుచాటున నుంచున్నట్లు కన్పించింది.తల్లీ! దుర్గాభవానీ!" అనుకుంటూ ఆయన వెళ్లిపోయాడు.

ప్రొద్దున్నే అన్నపూర్ణ వంటయింట్లో పని చేస్తు కుంటోంది పరధ్యానంగా. ఆయింటి నౌకరు వచ్చి, "నిన్న రాత్రి బాబుగారు "ఫరాన్‌డాంగా వెళ్లారు. అమ్మగారికి చాలాజబ్బుగా ఉన్నదిట!" అని చెప్పాడు. భర్త అన్న మాటలు జ్ఞాపకంవచ్చి ఆమెగుండె కంపించిపోయింది. "ఏం జబ్బురా?" అని అడిగింది.

"అది తెలియదు అమ్మా! మధ్యమధ్య మైకంకమ్ముతూ ఉంటుందనీ, పెద్దజబ్బేననీ విన్నానమ్మా" అన్నాడు.

చీకటిపడ్డాక యాదవుడింటికివచ్చి, ఈ సంగతి విని కళ్ళ నీళ్ళుపెట్టుకుని, "ఎంతకోరికపడి బంగారపుబొమ్మను ఇంటికి తెచ్చుకున్నాను! అలా గంగలో వదిలెయ్యాల్సిందేనా! నేను ఇప్పుడే వెడుతున్నా" అన్నాడు.

దుఃఖంతో మనోవ్యాధితో అన్నపూర్ణకు గుండె బ్రద్దలయిపోతుంది. అమూల్యుడుమీదకంటె ఆవిడకు బిందు మీదనే ఎక్కువ ఆపేక్ష అనుకుంటాను. కన్నీళ్ళు తుడుచుకుని భర్తను కాళ్ళు కడుక్కోమని బలవంతాన సంధ్యవార్చుకోటానికి కూర్చోపెట్టి చీకట్లో వరండాలోకివచ్చి కూర్చుంది. మరోక్షణానికే బైట మాధవుడిగొంతు వినబడ్డది. అన్నపూర్ణ బలవంతాన గుండెబిగబట్టుకుని, రెండు చెవుల్లో వేళ్ళుపెట్టుకుని రాయిలాగా కూర్చుంది.

మాధవుడు వంటయిల్లు చీకటిగా ఉండటంచూసి, ఇటువైపువచ్చి చీకటిలోఉన్న అన్నపూర్ణను చూసి, ఎండి

పోయిన గొంతుకతో "వదినా! మీరు వినేఉంటారను కుంటాను" అన్నాడు.

అన్నపూర్ణ ముఖంపైకి ఎత్త లేకపోయింది. "అబ్బాయి అమూల్యుడు వెళ్ళటం అవసరం ఒకసారి. చివరి ఘడియలు దగ్గిరకు వచ్చాయనుకుంటాను" అన్నాడు.

అన్నపూర్ణ బోర్లగాపడిపోయి బావురుమన్నది. యందవుడు ఆగదిలోంచి పిచ్చివాడిలా పరుగెత్తుకువచ్చి, "అలా జరగను మధూ! నేను చెబుతున్నా. జరుగదు. నేను తెలిసి కాని, తెలియక కాని ఎవర్నీ దుఃఖపెట్టి యెరుగను. ఈ వయస్సులో భగవంతుడు ఇంతశిక్ష ఒక్కనాటికి విధించడు" అన్నాడు.

మాధవుడు మెదలకుండా ఊరుకున్నాడు.

"నాకు అన్ని సంగతులూ స్పష్టంగా విడమర్చి చెప్పు. నేను వెళ్ళి మాఅమ్మను తీసుకువస్తాను. నువ్వు ఏమీగాభరా పడవద్దు మాధూ! బండి వెంటతీసుకు వచ్చావా?" అన్నాడు యాదవుడు.

"నేను గాభరాపడటంలేదన్నయ్యా! మీరే కొంచెం అదోలా కంగారు పడుతున్నారు"దన్నాడు మాధూ.

"ఏమీ లేదు. నువ్వు లేచిరా!" అని భార్యతో అని, "అమూల్యా రారా!"అన్నాడు యాదవుడు.

మాధవుడుఅడ్డువచ్చి, "తెల్లవారనీయండి అన్నయ్యా" అన్నాడు.

"కాదులే, అలాంటిదేమీ లేదు. నువ్వు ఖంగారు పడకురా మాధూ! బండి పిలువు. లేకపోతే నేను నడిచి వెడతా"

మాధవుడింకేమీ బదులు చెప్పకుండా బండి పిలిచాడు. నలుగురూ ఎక్కి కూర్చున్నారు.

"తర్వాత?" అని అడిగాడు యాదవుడు.

"నేను అక్కడ లేను-సరిగ్గా ఏం జరిగిందో తెలియదు. కాని నేను విన్నదేమిటంటే, నాలుగు రోజులు విపరీతంగా జర్వం వచ్చి, ఆ జర్వంలో మూర్ఛలు రావటం ప్రారంభమైనాయట? దానిమీద ఎవ్వరూ కాస్త మందుకాని, కాసినిపాలు కాని త్రాగించలేక పోయారు. ఏం జరిగిందో సరిగ్గా తెలియదు కాని, బ్రతుకుతుందనే ఆశమాత్రం లేదు" అన్నాడు మాధవుడు.

యాదవుడు గట్టిగా "ఆశ నూటికి నూరు పాళ్ళూ ఉంది. మా అమ్మ బ్రతుకుతుంది. భగవంతుడు ఈ శేషవయస్సులో నానోట అబద్ధం పలికించడురా మాధూ! నే నింతవరకు ఎన్నడూ అబద్ధం పలికి యెరుగను" అన్నాడు.

మాధవుడు చటుక్కున వంగి అన్నగారి పాదాలు కళ్ళకద్దుకుని మెదలకుండా కూర్చున్నాడు.

కొన్నాళ్ళనుంచీ బిందు ఉపవాసాలుచేస్తూ శరీరాన్ని క్షీణింపచేసుకుంటూ వచ్చింది. ఆ సంగతి ఎవరికీ తెలియదు. పుట్టింటికి రాగానే జ్వరం వచ్చింది. రెండోరోజున రెండుమూడు సార్లు ఫిట్స్ వచ్చాయి. చివరిసారి వచ్చిన ఫిట్ - చాలాసేపటి వరకు స్పృహ వచ్చిందికాదు. ఎంతోసేపు ఎన్నో ప్రయత్నాలు

చేసినమీాదట తెలివయితే వచ్చింది. కాని నాడి బాగా నీర సించిపోయింది. ఈసంగతి కబురుఅందగానే మాధవుడు వచ్చాడు. ఆమె భర్త పాదాలకు నమస్కరించింది. కాని పళ్లు మాత్రం అలాగే కరుచుకుని కూర్చుంది. నందసాన్లు బ్రతిమా లినా ఒక్కచుక్కపాలయినా త్రాగిందికాదు.

మాధవుడిహ నిరాశచేసుకుని 'ఆత్మహత్యచేసుకోవటం దేనికి?' అని అడిగాడు.

మూసుకునిఉన్న బిందు కనుకొలకుల్లోంచి, అశ్రుబిందు వులు రాలాయి. కొంచెంసేపయాక మెల్లిగా 'నాసర్వస్వమూ అమూల్యుడిదే. రెండువేలుమాత్రం నరేంద్రుడికిచ్చి, అతణ్ని చదివించండి. అతడికి నాఅమూల్యుడంటే ఆపేక్ష" అన్నది.

మాధవుడు పళ్ళతో పెదవులు బిగించుకుని ఏడుపు ఆపుకున్నాడు.

బిందు సైగచేసి భర్తను ఇంకొంచెం దగ్గిరగా పిలిచి "నాడుతప్ప ఇంకెవరూ నాకు కర్మచెయ్యటానికి వీల్లేదు" అని చెప్పింది రహస్యంగా.

మాధవుడు ఆదెబ్బకుకూడా తట్టుకుని చెవిలో "ఎవరి నయినాచూడాలనిఉందా?" అని అడిగాడు.

బిందు తలత్రిప్పుతూ "ఊహుఁ. లేదులెండి" అన్నది.

బిందుతల్లి మరోసారివచ్చి మందు త్రాగించటానికి ప్రయత్నించింది. కాని బిందుమాత్రం అలాగే పళ్ళు గట్టిగా బిగించింది.

మాధవుడు లేచి, "అలా వీల్లేదు బిందూ! మా మాట వినవు నువ్వు. కాని నువ్వు ఎవరిమాటనయితే త్రోసిపుచ్చ లేవో వారిని తీసుకురావటానికి వెడుతున్నాను నేను. కాని నా ఈ ఒక్క మాటమాత్రం నిలబెట్టు. నేను తిరిగివచ్చేంత వరకూ మాత్రం ఇలాఉండు" అంటూ మాధవుడు బైటికి వచ్చి కన్నీళ్ళు తుడుచుకున్నాడు. ఆరోజు రాత్రి బిందు ప్రశాంతంగా నిద్రపోయింది.

అప్పుడేసూర్యోదయమవుతోంది. మాధవుడు లోపలికి వచ్చి, దీపం ఆర్పేసి, కిటికీతలుపులు తెరవగానే బిందు కళ్ళు తెరచి, ఆప్రభాత స్నిగ్ధకాంతిలో ఎదురుగాఉన్న భర్తముఖం చూసి నవ్వుతూ "ఎప్పుడు వచ్చారు?" అని అడిగింది.

"ఇప్పుడేవచ్చాను. అన్నయ్య పిచ్చివానిలాగా భయంకరంగా ఏడుస్తున్నారు."

"ఆసంగతి తెలుసునాకు. కొంచెం వారిపాదధూళి తీసుకువచ్చారా?" అని అడిగింది మెల్లిగా బిందు.

"ఆయన బైటకూర్చుని హుక్కా త్రాగుతున్నారు. వదిన మొహంకడుక్కుంటోంది. అమూల్యుడు బండిలో నిద్ర పోయాడు. పైకితీసుకు వెళ్ళి పడుకోబెట్టాను. లేవతీసుకుని రానా?" బిందు కాస్సేపు నిశ్చలంగా ఊరుకుని "వద్దు నిద్ర పోనీయండి" అని మెల్లిగా అటుప్రక్కకు ఒత్తిగిలి పడుకుంది.

అన్నపూర్ణ గదిలోకివచ్చి తలాపిదిక్కునివచ్చికూర్చుని తలనిమురగానే బిందు ఉలిక్కిపడింది. అన్నపూర్ణ ఒక్క నిమిషం తననుతాను సంబాళించుకుని, 'మందు త్రాగక పోవటం ఎందుకని చెల్లీ? చావాలనా?' అని అడిగింది.

బిందు మాట్లాడలేదు. అన్నపూర్ణ ఆమె చెవిదగ్గర ముఖంపెట్టి "నాగుండె బద్దలయిపోతోంది. తెలుసానీకు"? అని అన్నది.

బిందుకూడా అలాగే మెల్లిగా "తెలుసు అక్కా!" అన్నది.

"అయితే ముఖం ఇటుత్రిప్పు. నీ బావగారు నిన్ను తీసుకువెళ్ళటానికి స్వయంగావచ్చారు.నీకొడుకు ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు. నామాటవిను. ముఖం ఇటు త్రిప్పు"అన్నది అన్నపూర్ణ.

బిందు అప్పటికీ ముఖం త్రిప్పలేదు. తలఊగిస్తూ "కాదు, అక్కా! ముందు. "

"నేను అడుగు తున్నానుగా చెల్లీ! అడుగుతున్నా, ఈ ఒక్కసారిమాత్రం ఇంటికి తిరిగిరా" అన్నది అన్నపూర్ణ.

ఇలా అంటూ ఉండగానే యాదవుడు గుమ్మందగ్గిరకు వచ్చాడు. అన్నపూర్ణ బిందు తలమీదికి చెంగుసర్దింది.యాద వుడు ఒక్కక్షణం తన వాత్సల్యానికంతకీ పాత్రురాలైన మరదల్ని ఆపాదమస్తకం పరిశీలించి గుడ్లనీరు గుడ్ల క్రుక్కుకుని, "ఇంటికి పోదాంరా అమ్మా! నేను తీసుకువెళ్ళటానికని వచ్చాను" అన్నాడు.

విశీర్ణమై వివర్ణమైయున్న యాదవుని ముఖంకేసి చూసేసరికి, అక్కడఉన్నవాళ్ళందరికీ కళ్ళనీళ్ళొచ్చాయి.యాదవుడు మరోనిమిషం ఆగి,"ఒకప్పుడునువ్వు ఇంతదానివై ఉన్నప్పుడు, అప్పుడు నేనేవచ్చి మాసంసారానికి లక్ష్మినిగా నిన్ను తీసుకు వెళ్లాను. మళ్ళీ ఇలా రావల్సివస్తుందనిఅనుకోలేదు నేను.

కనుక విను అమ్మా! ఎప్పుడైతే వచ్చానో అప్పుడిహానిన్ను వెంట పెట్టుకుని అయినా వెళ్ళాలి. లేదా ఇంక అటుముఖం పెట్టకుండా నయినా ఉండాలి నేను. యెప్పుడూ అబద్ధం ఆడనని నీకు తెలుసుకదా అమ్మా!" అన్నాడు.

యాదవుడు బైటికి వెళ్లాడు. బిందు ముఖం ఇటు త్రిప్పి "ఇయ్యిఅక్కా! త్రాగటానికి ఏమిస్తావో ఇయ్యి. తినటానికి ఏంపెడతావో పెట్టు. అమూల్యుణ్ణి నాదగ్గిర పడుకోబెట్టి మీరందరూ బైటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. ఇంక భయం లేదు—నేను చావను" అన్నది.



# కాశీనాథ్

[ శరత్ బాబు ]

అనువాదం:
గద్దె లింగయ్య.

శరత్ గ్రంథమాల, విజయవాడ.

# కాశీనాథ్

తెల్లవారుజామున నాల్గుగంటలకే లేచి కాలకృత్యాలు నిర్వర్తించుకొని, స్నానంచేసి జప తపాలు పూర్తిచేసికొని, పిలకముడివేసి కాశీనాథ్ పండిత ధనంజయ భట్టాచార్యుల వారి వరండాలో కూర్చొని వేదాంత శాస్త్ర సూత్రాలూ, భాష్యాలు వల్లించడం ప్రారంభిస్తే ఇక అతను బయట ప్రపంచ మేమరచిపోయేవాడు. దీర్ఘకాయుడు, ఎత్తయిన లలాటము గల కాశీనాథవంద్యోపాధ్యాయుడు వేదాంత శాస్త్రమనే మహారణ్య మధ్యంలో జొరబడ్డాడంటే పూర్తిగా దానిలోనే మునిగిపోయేవాడు. ఈ స్థితిలో అతనిని చూచినవాళ్ళు అందరూ తలకొకరకంగా అనుకొంటూండేవాళ్లు. ఒకళ్ళు కాశీనాథ్ తన తండ్రివలెనే గొప్ప విద్వాంసు డవుతాడంటే, మరొకళ్ళు ఈ అతి చదువువల్ల తండ్రివలెనే పిచ్చివాడు గాడుగదా యని సందేహం వెలిబుచ్చుతూండేవాళ్లు. ఇతడు పిచ్చివాడవుతాడని సందేహించేవాళ్ళలో కాశీనాథ్ మేన మామకూడ ఒకడు. అప్పుడప్పు డాయన "అబ్బాయీ! నీవు బీదవాడివి. ఇంతఇదిగా చదివి నువ్వు చేసేదేమున్నది? చదివినంత వరకు చాల్లే. ఇప్పుడు చదివినదాంతోనే పిడికెడు మెతుకులు, గుడ్డలు తేలికగానే దొరుకుతాయి. ఇంతా చదివి ఆఖరికి మీతండ్రిగారివలెనే నీవుగూడ ఇంట్లో ఏమూలో కూర్చొని గొణుగుతుంటావా? ఇక అప్పుడు ఉన్న ఆశకూడ పోతుంది" అనేవాడు.

మామగారి ఈ ఉపదేశాలు కాశీనాథ్ కు ఒక చెవిలో గుండా ప్రవేశించి రెండవదాని ద్వారా ఎగిరిపోతూండేవి.

పిచ్చివాడవుతాడనే సందేహంకొద్దీ మామగారు గద్దిస్తుండేవారు. మేనత్త ఇంట్లో పనులేమీ చేయడం లేదని చీవాట్లుపెడుతుండేది. వ్యాకరణం,సాహిత్యాల్లోనుంచే కాశీనాథ్ పుట్టుకొచ్చాడని, అతని మామనుకొడుకు ఎగతాళి చేస్తూండేవాడు, కాని కాశీనాథ్ యీ మాటలన్నింటిని ధైర్యంతో సహిస్తుండేవాడు. లేకపోతే వాటన్నిటి అంతరార్థాలేమిటాఅని బుర్ర బద్దలుకొట్టుకోకుండాఅసలువాటినిగురించి ఆలోచించేవాడేకాదు.

వీటన్నిటివల్ల ఫలితం శూన్యం కాగా అతను రోజూ చేస్తూండే పనులే యథాతథంగా నిర్వహిస్తుండేవాడు.ఒక్కొక్కప్పుడు సాయంకాలం మైదానంలో తన ఇష్టమొచ్చిన చోట్లకు షికారువెళ్ళితే, మరొకప్పుడు నదిఒడ్డునవున్న పెద్ద రావిచెట్టుకింద కూర్చొని అస్తమిస్తున్న సూర్యుని అరుణకాంతి ఆకాశంలో క్రమక్రమంగా ఎలా లీనమైపోతూంటుందో వీక్షిస్తూండేవాడు. ఇంకొకప్పుడు ఆ గ్రామ జమీందారుగారింటికి వెళ్ళి శివాలయంలో జరిగే శివార్చనను తదేకదృష్టితో చూస్తూండేవాడు. మరొకసారి ఎక్కడికీ పోకుండా మామగారి చండీమండపంలో చీకటిలోనే ఒకమూల కంబళిపరచుకొని నిశ్శబ్దంగా కూర్చొనేవాడు.

ప్రపంచంలో అతనికి మరొకపనిగాని, ఉద్దేశ్యంగాని, కోరికగాని లేదాఅన్నట్లుండేవాడు. పన్నెండుసంవత్సరాల ప్రాయంలోనే తండ్రిగతించాడు. ఈ ఆరుసంవత్సరాలు తన మామగారియింట్లో యీ విధంగానే గడిపాడు. ఇప్పుడేం చేస్తు

న్నాడు? తరువాత ఏంచెయ్యాలి? ఇంతకు ముం దేంచేశాడు? ఇప్పుడేమి చెయ్యాల్సిన అవసరమున్నది.? ఇంకేంచెయ్యాలి? అనే ఆలోచనే అతని కెప్పుడూ కలిగేదికాదు. తనుఎల్లప్పుడూ ఇలాగే మామగారియింటిలో రెండుపూటలా కలో-గంజో తాగుతూ, చీవాట్లుతింటూ, ఇంకెక్కడికీ వెళ్ళ నవసరం లేకుండా, ఏమీ చెయ్యనక్కరలేకుండా గడపటమే నన్న ట్లుండేవాడు. చీకటిలో నిశ్శబ్దంగా వుండే ఆ పంచ ఎల్లప్పుడు తన అధికారంలోనే వుంటుందని, దాని నింకెవరూ ఆక్రమించ రని, తన నక్కడనుండి ఇంకొకచోటుకు పొమ్మనరనీ తలు స్తున్నట్లుండేవాడు. ఆపేటలోని ఏ పెద్ద మనిషయినా దయగా అతన్ని పిలిచి-'కాశీనాథ్, ఎవ్వరికీ గడవలేదు, నీకూ గడ వదు చేతనైనంతవరకేదైనా పనిచేయి' అని సలహా ఇచ్చి నప్పుడు, దీనికి కాశీనాథ్ ఏమీ జవాబివ్వకుండా మనస్సులో మాత్రం 'ఏం చేస్తున్నాను? నే నేం చెయ్యాలి' అని ఆలో చిస్తుండేవాడు. యిలానే రోజులుగడిచిపోతున్నాయి.

## 2

ఆ గ్రామ జమీందారుగారి పేరు ప్రియనాథ ముఖో పాధ్యాయులు. ప్రియనాథబాబు అగ్రకులజులు, గొప్ప ధన వంతులూను. కుల గౌరవాల్ని కాపాడుకోవడానికి అంత కులీ నుడూ, యోగ్యుడైన వరుడెవ్వడూ దొరకక పోయేటప్పటికి జమీందారుగారికి యీ వంశ గౌరవాచారాలంటేనే ఒళ్ళు మండసాగింది. యీ విషయాన్ని గురించి భార్యతో ఆలో

ప్రియబాబు గ్రహించి నవ్వుతూ 'తమతో పనున్నది. పదండి లోపలికి వెళ్లి కూర్చుందాము' అన్నాడు.

"అలాగే. రండి .కాని-"

"కాని గీని ఏమీలేదు-పదండి, కొంచెం లోపల కూర్చుందాం.. అన్ని విషయాలూ చెబుతాను."

ఇద్దరూ చండీమండపంవద్దకు వెళ్ళి కూర్చున్నారు."మీ మేనల్లుడు ఏడీ"? అని అడిగాడు ప్రియనాథబాబు.

"ఇంకెక్కడ ఉంటాడు, భట్టాచార్యులవారి పాఠశాలలో చదువుకుంటూంటాడు!"

"కొంచెం అతన్ని పిలిపించండి."

"ఇప్పుడే పిలిపిస్తాను. ఏదైనా అవసరమైనపనివున్నదా అండీ?"

"అవును. అవసరమైనపనే."

ఆ అయోగ్యుడైన కాశీనాథ్‌తో ఇంతగొప్ప జమిందారుగారికంత అవసరమైన పనేమిటో మధుసూదనునికి కొంచెం కూడ అర్థంకాలేదు. పైగా భయపడుతూ "అతనేమైనా అపరాధం చేశాడా యేం" అన్నాడు.

"అపరాధం ఏముంటుంది.?"

"మరి?"

ప్రియబాబు నవ్వి యిలా అన్నాడు-"నేనా పిల్లవాణ్ని నా అల్లుణ్నిగా చేసుకోడానికి నిశ్చయించుకున్నాను. ఈవిధంగా మీరు నాకు వియ్యంకులయ్యారు" అని బిగ్గరగా నవ్వసాగాడు. ఏమాలోచించి ఆయనకు నవ్వు వచ్చిందో ఆ విషయం మధుసూదనుడు తెలిసికోగల్గియున్నట్లయితే బహుశా

ఆయన ఇక మాట్లాడివుండేవాడుకాడు. ఆశ్చర్యంతో కళ్ళు విప్పార్చి ప్రియబాబువంక చూస్తూ చివరికిలా అన్నాడు—

"ఎవర్ని కాశీనాథ్‌నా?"

"అవును."

"ఎందుకు?"

"ఇంత గొప్ప కులీనుడు నాకెక్కడ వెతికినా కనబడనేలేదు. తమ కిందువల్ల ఏమీ ఇబ్బందిలేదుగదా!"

"ఇబ్బందా? ఎంతమాత్రం లేదు. ఇది నాకు పరమ సంతోషకరమైన విషయం. కాని వాడు పిచ్చివాడే!"

"పిచ్చివాడా? ఎలా? నే నెప్పుడూ వినలేదే?"

"వానితండ్రి పిచ్చివాడు."

కాశీనాథ్‌తండ్రిని ప్రియబాబు బాగా ఎరుగును. అంతే కాక ఆయన్ను చాలమంది పిచ్చివాడని అంటూండడంకూడ తెలుసు. ప్రియబాబు కొంచెంసేపు ఆలోచించి "పిల్లవాని పేరేమిటి?" అని అడిగాడు.

"కాశీనాథ వంద్యోపాధ్యాయ."

"అతన్ని పిలిపించండి. ఒకసారి చూద్దాం"

మధుసూదనుడు అతన్ని పిలవటానికి పంపాడు. పిలవటానికి పోయినవాడాయన చిన్నకొడుకే. అతను వెళ్ళి—"కాశీ అన్నయ్యా!" అని పిలిచాడు. అతను తలెత్తి చూచి 'ఏమిటి విషయం' అని ప్రశ్నించాడు.

"నాన్నగారు నిన్ను పిలుస్తున్నారు."

"ఎందుకు?"

"నా కేమీ తెలియదు. మనఊరి జమీందారుగారు వచ్చారు. ఆయన నిన్ను పిలిపించారు."

కాశీనాథ్ నెమ్మదిగా పుస్తకం మూసివేసి లేచి వచ్చాడు. వాళ్ళవద్దకు వెళ్ళి కూర్చోగానే ప్రియబాబతన్ని ఒక్కసారి ఆపాదమస్తకం తేరిపార చూచి 'కాశీనాథ్! ఎక్కడున్నావు?' అని ప్రశ్నించారు.

"భట్టాచార్యులవారి పాఠశాలలో చదువుకుంటున్నాను."

"వ్యాకరణం చదివావా నువ్వు?"

కాశీనాథ్ తల ఊపుతూ చదివానని జవాబిచ్చాడు

"సాహిత్యం చదివావా?"

"మామూలుగా చదివానండి."

"ఇప్పుడేం చదువుతున్నావు?"

"వేదాంత శాస్త్రం"

"సరే, వెళ్ళి చదువుకో" అని ప్రియబాబు అన్నారు.

కాశీనాథ్ వెళ్ళిపోయాడు. తన్నెందుకు పిలిచారో ఎందుకు వెళ్ళిపొమ్మన్నారో కాశీనాథ్ కేమీ అర్థమవలేదు. పాఠశాలకు వచ్చి మళ్ళా పుస్తకం తెరిచి కూర్చున్నాడు. అతను వెళ్లిపోయిన తరువాత ప్రియబాబు "తమరా పిచ్చివాణ్ని గురించి ఏమిటో చెబుతున్నారు?" అని మధుసూదనునితో అన్నాడు.

"కాదు. అంత పిచ్చివాడేమీకాదు. కాని మొత్తానికి అదోతరహా విచిత్రవ్యక్తి. ఇందువల్లే కొంతమంది వాడిని పిచ్చివాడంటూంటారు." అని మధుసూదనుడన్నాడు.

"ఎందుకని?"

ఎప్పుడూ పుస్తకం పుచ్చుకొని కూర్చుంటాడు లేక పోతే తన ఇష్టమొచ్చినచోట్ల తిరుగుతుంటాడు. ఏపనిలోను, ఏ విషయంలోకాని జోక్యం కల్పించుకోడు. ఏదో విచిత్రంగా ప్రవర్తిస్తూంటాడు.''

''ఇంకేమైనా చేస్తాడా!''

''ఇలానే ఇంట్లో చీకట్లో ఒకమూల మౌనంగా గంటలకొద్దీ కూర్చుండిపోతాడు.''

ప్రియబాబు నవ్వుతూ ''ఇంకేమయినా?'' అన్నారు,

ఈ నవ్వుకి అర్థం కొద్దికొద్దిగా గ్రహించిన మధుసూదనుడు ఇంకేమీ లేదన్నాడు.

''మీ ఇంట్లోవారితో సంప్రదించి రండి. వారు యిష్ట పడేటట్లయితే ఈ నెలలోనే వివాహం చేసివేద్దాం.''

ఇంటిలోనికి వెళ్ళి మధుసూదనుడు తనభార్యతో విష యమంతా చెప్పాడు. ఇదివిని త్రుళ్ళిపడి, ఆమె ఆశ్చర్యా న్నుంచి తేరుకొని ''కాశీనాథ్‌కి ప్రియబాబు కుమార్తెతో వివాహమా? నువ్వు పిచ్చివాడివి కాలేదుగదా!''

''ఇందులో పిచ్చివాణ్ని కావలసినఅవసరమేమున్నది?''

''లేకపోతే మరేమిటిది?''

''కాశీనాథ్ ఎంత కులీనుని బిడ్డో ఆలోచించావా?''

మధుసూదనునిభార్య ఉచ్ఛరిస్తూ ''ఏం? మన హరికి యివ్వరా'' అని అడిగింది.

అలా ఎప్పుడూ జరగజాలదని యిద్దరూ యెరుగుదురు. మధుసూదనుడు ఒక నిట్టూర్పు విడిచి నీ అభిప్రాయమేమిటని ప్రశ్నించాడు.

"నా అభిప్రాయమేమిటి, నాబొంద! పెండ్లిచేసెయ్యండి" ఇలా అంటూంటే ఆమె కంఠం గాద్గదికమైంది.

మధుసూదనుడు బయటికి వచ్చి దొంగనవ్వు నవ్వుతూ "మా ఆవిడ ఆనందానికి అంతులేదు. ఆమె సంతోషంతో ఉబ్బి తబిబ్బులై పోతూంది" అన్నాడు - "ఆమె కాశీకి తల్లిలాంటిది గదా! కాశీకి రెండేళ్ళయినా నిండక మునుపే నా చెల్లెలు చనిపోయింది. అప్పటినుండి ఒకవిధంగా ఈమె వాణ్ణి పెంచి ఇంత పెద్దవాణ్ని చేసింది. తరువాత మా బావగారు చనిపోయినదగ్గరనుండి ఇక్కడే వుంటున్నాడు."

"నా కన్ని విషయాలూ తెలుసు. ఇవ్వాళే అన్నీ నిశ్చయం చేసుకొందాం" అని ప్రియబాబు అన్నాడు

"నిశ్చయంచేసుకునేదేమున్నది? తమకు వీలుగా ఉనప్పుడే నేను వచ్చి ఆశీర్వదిస్తాను"

"అలాకాదు, నేను కులీనతను గురించి గౌరవలాంఛనాలను గురించీ అడుగుతున్నాను."

"ఆవిషయంలో నేను నిశ్చయించేదేమున్నది! - తమ ఇష్టప్రకారమే జరుగుతుంది. అయినప్పటికీ మీ కాబోయే అల్లుని మేనత్తతో - ఒక విధంగా ఆమెతల్లిలాంటిదనుకోండి- కొంచెం సంప్రదిస్తే బాగుంటుందేమో ననుకొంటాను."

"అవునవును, తప్పకుండాను. నేను చెప్పేదికూడాఅదే."

ఆ తరువాత పిల్లవాని మేనత్త అభిప్రాయం కూడ కనుక్కొని, పిల్లవాని సంరక్షకురాలైన ఆమె రొక్కం వెయ్యి రూపాయలు పుచ్చుకోకుండా పిల్లవాడి పెళ్ళిచేయజాలనంటే ప్రియబాబూ అందుకు సమ్మతించారు.

# 3

మొదట్లో ఎలాజరిగివున్నప్పటికీ, నియమానుసారంగా శాశ్వతంగా తా నా ఇంటిఇల్లరికపు అల్లుడినయ్యాననే విషయం స్పష్టపడేటప్పటికి కాశీనాథ్‌కు మానసికంగా ఏ మాత్రమూ సుఖంలేకుండాపోయింది. ఇప్పుడుతను తన ఇష్టమొచ్చినచోటుకి పోలేడు, ఇష్టమొచ్చినచోట వుండలేడు. అన్నిటినుండి అతను వేరుచేయబడ్డాడా అనిపిస్తోంది. అతను పోవాలనుకున్నచోటుకి మామగారి అనుజ్ఞ దొరకదు. ఒకవేళ అది లభించిందంటే అత్తగారు—"ఏమిటి! నా అల్లుడు ఫలానావాళ్ళింటికి వెళ్ళడమా?" అంటుంది. దానితో పాపం కాశీనాథ్ మొహం వేలాడవేసికోవాల్సివస్తుంది. ఇలా ఎందుకు జరిగింది? తా నీ విధంగా ఎందుకు వుంచబడ్డాడు? తన్ను ఇలాఉంచడంలో వాళ్ళఅభిప్రాయమేమిటి?—ఈవిషయాలేమీ అతనికి అర్థమయ్యేవికావు. అప్పుడప్పుడు అతను "నేనేం మామూలు మనిషినాయేం? ఇక్కడికీ అక్కడికీ మాటిమాటికీ తిరగడానికి?" అని సమాధానపడుతూండేవాడు. కాని అతని హృదయం మాత్రం సుఖం శాంతీ లేదని రోదిస్తూండేది. మొదట తను కంటకారణ్యంలో గుర్నురుతూండేవాడినసీ, కాని ఇప్పుడు బంగారుపంజరంలో బంధింపబడ్డాననీ, గ్రహించసాగాడు. మొదట్లో అతడు అంతు, హద్దులు లేని విశాల సముద్రంలో స్వేచ్ఛగా ఈదులాడుతూండేవాడు. కాని ఇప్పుడతను నాల్గువైపులాబంధింపబడిన పుష్కరిణిలో విడిచిపెట్టబడ్డాడు. సముద్ర తరంగాలలో యీదులాడుతూ సుఖశాంతులనుభవించేవాడనికాదు; అక్కడ అతను ఆఅలల

త్రోనూ, తుపానుతోను సంఘర్షణ పడేవాడు. కాని ఈనిర్మల సరోవరం అంతకంటే బాధాకరం అనిపించసాగింది. అప్పు డప్పుడు అతనికి తన నెవరో వేశి నీళ్ళగుండంలో పడత్రోశారా అనిపించేది. అంతా వాళ్ళల్లోవాళ్ళు గూడుపుఠానీ చేసి అతని శరీరం కొనివేశారా అన్నట్లు, ఇప్పు డది తనది కాదన్నట్లు అనిపిస్తూంటుంది. అతని తలమీద ఇప్పుడు వెన కటి పిలకలేదు. మెడలో ఆ తులసిమాల లేదు. చెప్పులులేని కాళ్ళు కావు. అర్ధనగ్నశరీరమూ కాదు. ధనంజయ భట్టా చార్యులవారి ఆ పాఠశాల, నదిఒడ్డునవుండే ఆ రావిచెట్టు, చండీమంటపంలోని ఆ చీకటిచోటు—ఏమీ లేవు.

ఇప్పు డతను నూతన జన్మయెత్తి క్రిందటి జన్మలోని నాటి నన్నింటినీ విసర్జించాడాయన్నట్లుండేది. లేకపోతే అతని శరీరము, మనసూ రెండూ పరస్పర ఘర్షణపడి వేరుబడి వుండాలి. సాయంత్రం కాగానే అతని మనస్సు ఆ నదిఒడ్డున వుండే రావిచెట్టుక్రిందకో పొలాల్లో తిరుగుతుండే రైతుల మధ్యకో పరుగుతీస్తే; అతని దేహం విలువగల దుస్తులుధరించి కోచీమీద కూర్చొని షికారుకు వెళుతూండేది. మనస్సులో అంగవస్త్రం ధరించి నదిలోదూకి ఈదులాడాలనిపించితే, అప్పు డతని దేహం చౌకీమీద కూర్చొని నౌకరద్వారా సబ్బు నూనెలతో జలకమాడించి తుడవబడుతూండేది. ఈ విధంగా ఒకే కాశీనాథుడు ఎల్లప్పుడూ రెండేసిపనులు చేస్తూం డేవాడు. అయినా అతని ఏపనీ సర్వాంగసుందరంగా పూర్తి అయ్యేదికాదు.

చాలారోజు లిట్లే గడిచిపోయాయి. అత్తవారింటికి

వచ్చి పన్నెండుమాసాలు దాటిపోయింది. మొదట్లో కొద్ది మాసాలు కొత్తదనంవల్లా, క్రొత్తమోజులోనూ ఏమంత కష్టమనిపించలేదు. తన స్థితిగతుల మంచిచెడ్డలు ఆలోచించడానికే అవకాశం దొరకలేదు. కాని క్రొత్తదనంపోయి మోజు తగ్గేటప్పటికి రోజు రోజుకూ ఎండిపోసాగాడు, ఇతరులెవరైనా ఈ విషయాన్ని గ్రహించినా గ్రహించకపోయినా కమల మాత్రం తెలిసికొన్నది. ఆమెకళ్ళు భర్తస్థితినిగమనించాయి. ఒకరోజున ఆమె "మీరిలా రోజురోజుకూ ఎండిపోతున్నారే" మని ప్రశ్నించింది.

"ఎవరన్నారు?"

"నాకళ్ళే చెబుతున్నాయి."

"తప్పుచెబుతున్నాయి."

కమల విడిచిపెట్టలేదు. "నాతో సంగతేమిటో చెప్పరా?" అన్నది.

"ఏమీలేందే నే నేం చెప్పను?"

"తప్పకుండా ఏదో వున్నది"

"లేదంటే?"

"లేకపోనటమేమిటి? నా మనస్సు కంతా తెలుసు."

కాశీనాథ్ ముఖం త్రిప్పుకొని "నువు నన్ను మహా విసిగించేస్తున్నావు. నే నిక్కడనుంచి పోతున్నాన్లే" అన్నాడు.

కాశీనాథ్ నిజంగానే పోబోయేసరికి కమల చెయ్యి పట్టుకొని దుఃఖంతో "వెళ్ళకండి. నే నికముందెప్పుడూ ఏవిషయమూ అడగను" అన్నది.

కాశీనాథ్ ఒక క్షణం కూర్చున్నాడు, కాని మరుక్షణమే లేచి వెళ్ళిపోయాడు. అయితే ఈ పర్యాయం కమల

అతన్ని కూర్చోమనలేదు. భర్త ఈ విధంగా వెళ్ళిపోయే టప్పటికి కామె ముఖం దిండులో దాచుకుని ఏడ్వసాగింది.

కాశీనాథ్ బయటకువెళ్ళి తన నెవరూ చూడటం లేదని నిశ్చయించుకొని నెమ్మది నెమ్మదిగా గేటుదాటి రోడ్డుమీదకువచ్చేశాడు. కొంతదూరం వెళ్ళినతర్వాత తన వెనుక నౌకరుకూడా వస్తూండటం చూశాడు. కాశీనాథ్ విసుక్కొని వెనుకకు తిరిగి "నీ వెక్కడికిపోతున్నా"వని అడిగాడు.

అతను నమస్కరించి "బాబుగారివెంట" అని సమాధానమిచ్చాడు.

"నావెంట రావాల్సినఅవసరం లేదులే తిరిగి వెళ్ళు".

"సాయంత్రంవేళ ఒంటరిగానే తిరుగుతారా బాబుగారూ?"

కాశీనాథ్ మరేమీ మాట్లాడకుండా నడవసాగాడు. పాపం నౌకరేం చేస్తాడు? వాని కేమీ పాలుపోలేదు.కొంచెం సేపు అలానే నిలబడి బుద్ధి నుపయోగించి వెంటే వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు. కాశీనాథ్ వాని ధ్యాస లేకుండానే పోయి పోయి ఆఖరికి మేనమామగారింటికి చేరుకొన్నాడు. లోపలికివెళ్ళి నిరుద్దేశంగానే వరండాలో కూర్చున్నాడు. చాలసేపయ్యాక హరిబాబు షికారుకు బయలుదేరి బయటకు వస్తూ అతన్ని చూచాడు. కాని అప్పటికే మసకగా చీకటిపడటంవల్ల గుర్తించలేక దగ్గరకు వచ్చి "ఎవరూ?" అన్నాడు.

కాశీనాథ్ 'నేనే' నని జవాబిచ్చాడు.

హరిబాబు అత్యంత ఆశ్చర్యపడి 'ఆఁ! చిన్న జమీందారుగారా? ఇక్కడికి వచ్చారేమిటి?' అన్నాడు.

కాశీనాథ్ మౌనంవహించాడు. అప్పుడు హరిబాబు బిగ్గరగా కేకలేస్తూ "అమ్మా, రండి, ఇటు చూడండి. చిన్న జమీందారుగారు వస్తే కూర్చోడానికి పీటకూడా ఎవ్వరూ వెయ్యనేలేదు!" అన్నాడు.

హరిబాబుతల్లి పరుగెత్తుకుంటూ వచ్చింది. "మా అదృష్టం! ఈ పేదఅత్త జ్ఞాపకంవచ్చిందా, నాయనా? "అంది

కాశీనాథ్ ఇప్పుడుకూడా ఏమీ మాట్లాడలా. అత్త తనకుమార్తె బిందువాసినిని పిలుస్తూ 'బిందూ!త్వరగా రా అమ్మా. చూడు, మీ కాశీబావ వచ్చాడు. కూర్చోడాని కేదైనా తీసుకురా, ఇంతలో నేను జపతపాలు ముగించుకు వస్తాను" అన్నది.

బిందువాసిని మధుసూదన భట్టాచార్యులవారి చిన్న కూతురు పెద్దకుటుంబములో గృహిణి కావడంవల్ల తరుచుగా పుట్టింటికి రాలేకపోతోంది. ఇప్పటికి ఆమెవచ్చి నెలరోజులైనా ఇంతవరకూ కాశీబావను చూడనేలేదు. కాశీబావ అంటే ఆమె కెంతో ప్రేమ. అందుకనే బావపేరు వినగానే పరుగెత్తుకొచ్చింది. వచ్చిచూస్తే ఎక్కడా ఎవరూ కనబడలేదు.ఎవరో చీకట్లో వరండాలో మాత్రం కూర్చొన్నారు. ఆమె కాశీబావ నింతకు ముందెప్పుడూ యిలా చూడలేదు. కాశీబావ ఇప్పుడు గొప్పవారిఅల్లుడు.'బాబు'గా రయ్యాడు.ఇలాఅనుకొనేటప్పటికి ఆమెకు నవ్వొచ్చింది. కాని, దగ్గరకు వెళ్ళి చీకట్లో బావ చిక్కిపోయిన విచారవదనాన్ని చూచేటప్పటికి ఆమె చిరునవ్వ

మాయమైంది. కాశీనాథునిముఖ మెప్పుడూ విచారంగావుండ టం ఎవరూ ఇంతకుముందెప్పుడూ చూడలేదు. ముఖ్యంగా బిందు అసలే చూడలేదు. ఇంట్లోవాళ్ళందరిలోకీ ఆమె ఒక్క త్తె మాత్రమే కాశీబావఅంటే కొంతవరకు అర్థంచేసుకున్నది. ఆమె దగ్గరకువచ్చి వీపుమీద చెయ్యివేసి నిముకుతూ స్నేహ పూర్వకగాద్గదికస్వరంతో 'కాశీబావా! ఇక్కడ ఒంటరిగా కూర్చున్నావేం?పద, లోపలికివెళ్ళికూర్చో' అన్నది. కాశీనాథ్ మాట్లాడకుండాలేచివెళ్ళి లోపలమంచంమీదకూర్చున్నాడు.

"బావా! నేనిక్కడికివచ్చి ఇన్నాళ్ళయినా ఒక్క సారీ చూడటానికి రాలేదేం?" అన్నది బిందు.

"రాలేకపోయి. నమ్మాయ్!"

"ఏం? ఎందుకు రాలేకపోయావు?"

కాశీనాథ్ కొంచెం తటపటాయించి 'రానివ్వడంలేదు' అన్నాడు.

"రానివ్వడంలేదా? ఏం, ఎందుకని?"

కాశీనాథ్ అన్యమనస్కుడై 'ఊరకనే, మామూలు గానే' అన్నాడు.

"నువ్వు పోవాలనుకున్నచోటికి నిన్ను పోనివ్వరా?" బిందు యెంతో బాధపడుతూ అన్నది.

"లేదు, పోనివ్వరు. నే నెక్కడికైనా వెళ్తే మామ గారికి అగౌరవం!"

ఈమాటలవల్ల బావమనస్సు బాధపడుతుందని బిందు గ్రహించింది. మాటలధోరణి మారుస్తూ - 'బావా! అక్క నెప్పుడూ చూపించనేలేదే!' అన్నది.

కాశీనాథ్ మాట్లాడలా.

బిందు మళ్ళీ "ఎలాంటి పిల్లేమిటి?" అన్నది.

"మంచిదే."

"అయితే నే నొకరోజునవచ్చి చూచివచ్చేదా?" కాశీనాథ్ తలెత్తి బిందుముఖం కేసి ఒకసారి తేరిపార చూచి నవ్వుతూ "చూచిరా" అన్నాడు.

ఇంతలో బయట బండీవచ్చినచప్పుడైంది. "నీ బండి వచ్చినట్లుంది" అన్నది బిందు.

"అలానే అనిపిస్తుంది! ఎప్పుడొస్తావు?" అని అడిగాడు వెళ్తూ.

"ఎక్కడికి?"

"అక్కను చూడటానికి."

బిందు చిరునవ్వునవ్వుతూ "నీ కవకాశంవున్నప్పుడు వచ్చి తీసు కెళ్ళు" అన్నది.

"రేపు రానా?"

"తప్పకుండారా."

మరునాడు కాశీనాథ్ స్వయంగా బండితీసుకువచ్చాడు. బిందు వెళ్ళబోయేసమయానికి ఎక్కడినుండో హరిబాబు వచ్చాడు. వస్తూనే వాకిట్లో బండినిచూచి కాశీనాథ్ వచ్చి వుంటాడనుకొన్నాడు. లోపలికిరాగానే తల్లితో "అమ్మా! బిందు ఎక్కడకి వెళ్ళుతోందే?" అనడిగాడు. తల్లి అక్కను చూడడానికని జవాబిచ్చింది.

"ఏ అక్కను? జమీందారుగారి కూతురునా!"

తల్లి జవాబివ్వక మెదలకుండా వూరుకుంది.

హరి వెంటనే గంభీరంగా ముఖంపెట్టి "బిందు అక్కడికి వెళ్ళేటట్లయితే బ్రతికున్నంతవరకూ దాని మొహం చూడను" అన్నాడు.

తల్లి ఆశ్చర్యపడి-"అదేమిటిరా? అక్కనుచూడటానికి వెడితే తప్పా?" అంది.

"తప్పులు గిప్పులు తెలియచెప్పడానికి నాకేం తీరిక లేదు. బిందు నామాట వినకపోతే ఇంకీ ఇంట్లో అడుగు పెట్టడానికి వీల్లేదు, అంతే."

హరిస్వభావం బిందుకు బాగా తెలుసు. ఆమె మాట్లాడకుండా వేసుకొన్న బట్టలు విడిచేసింది. కాశీనాథ్ నిలబడి ఇదంతా చూస్తూనేవున్నాడు. కాని ఏంచేస్తాడు? ముఖం వ్రేలాడవేసికొని బాడి ఎక్కాడు.

"ఏం మీ అమ్మాయి రాలేదా?" అని సాయంత్రం కమల వచ్చి అడిగింది.

కాశీనాథ్ విచారంగా-'వాళ్ళు పంపలేదు' అన్నాడు.

"ఎందుకని?"

"ఏమో! బహుశ ఇక్కడికి పంపడం నామర్దా అనుకున్నారేమో!"

ఈమాట కమలహృదయంలో శూలంలా నాటుకుంది.

## 4

కమల జమీందారు ప్రియనాథబాబుగారి ఏకైక పుత్రిక. ఆయన మొదట్లో ఇంకా రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. కాని, వాళ్ళవల్ల సంతానమేమీ కలగలేదు. మొదటిభార్య లిద్దరూ చనిపోయినతరువాత మనోవేదనతో

వృద్ధాప్యంలో వివాహం చేసుకొన్నాడు. ఈ వివాహఫలితమే ఈ ఏకైక పుత్రికారత్నం. సంతానం లేనివాళ్ళకు సంతానం కలిగేటట్లయితే పుత్రికా పుత్రుల్లో భేదమేమీ గోచరించదు. కనుకనే ఈ ఇంట్లో కమల యజమానికి యజమానిగాను, యజమానురాలికి యజమానురాలిగానూ ఉంటూ వచ్చింది. ఇంటిల్లిపాది ఆమెమాటకు ఎందుకు చెప్పటానికిగాని, ఆమె అభీష్టానికి విరుద్ధంగా పనిచేయటానికిగాని ఎవరికీ సాహస ముండదు. కమల శ్రీమంతురాలు, విద్యావతి రూపవతి, గుణవతీకూడాను. ఆమె ఏకాధిపత్యానికి ఎదురులేదు. కాని ఆమె తన భర్తను మాత్రం ఏవిధంగానూ కైవశం చేసుకోలేక పోయింది.

ఆమె కోపగించింది; దుఃఖం వెలిబుచ్చింది; అభిమానం ప్రదర్శించింది; సేవచేసింది. భర్తను వశపరచుకోవడానికి చేతనయినన్నివిధాలా ప్రయత్నించి చూచింది. కాని ఏవిధంగానూ భర్తహృదయాన్ని జయించలేకపోయింది. జయించటం మాట అటుంచి అతనివద్దకే చేరలేకపోయింది. ఒక బీదవ్యక్తి ఎంత ఉన్నతహృదయంతో ఆమెకు భర్తగాలభించాడో ఆమె ఏవిధంగానూ నిర్ణయించుకోలేకపోయింది. కమల రెండు పూటలా 'భగవంతుడా! ఆయన మనస్సులాంటి మనస్సును నాకూ ప్రసాదించు' అని ప్రార్థిస్తుండేది. ఒకొక్కప్పుడామెకు 'అసలాయనకు మనస్సనేదే లేదు. ఇందువల్లే దానిని నేను పొందలేకపోతున్నా' ననిపించేది. కమలకు తన భర్త ఒక జటిలసమస్యగా పరిణమించాడు. రోజులు గడుస్తున్న కొద్దీ ఆ రహస్యాన్ని భేదించడంమాట అలావుంచి జటిలత్వం

మరింత పెంపొందసాగింది. అప్పుడప్పుడామెకు తనకు లభ్యమైనంత పతిప్రేమ మరెవరికీ లభించివుండదనిపించేది. కాని, మరొకప్పుడు ఇంత నిరాదరణ, ఉపేక్షకూడ ఇంకే స్త్రీకూడ పొందియుండదని అనుకుంటుండేది. అయినప్పటికీ కమలకు అలానే రోజులు గడుస్తున్నాయి. ఇక గడవనిదల్లా ఒక్క కాశీనాధ్ కే. అతనిమనస్సు పుస్తకాలమీద లగ్నమయ్యేది కాదు. నిశ్శబ్దంగా కూర్చున్నా ఆనందంగా వుండేదికాదు. సరస వినోద సంభాషణల్లోకూడ అతని కేమీ సంతోషం కలుగుటలేదు. అతని బలిష్ఠ శరీరం శుష్కించిపోసాగింది. అతని ఎర్రటిశరీరం నల్లగా మారింది. భర్త ఈవిధంగా రోజు రోజుకూ చిక్కిపోవటంచూచి, కమల తలమోదుకుంది. మొదట్లో ఆమె భర్త నీ విషయంలో ఏమీ అడగకూడదని ప్రతిజ్ఞ చేసుకొన్నది. కాని ఆమె తన ప్రతిజ్ఞను నిలబెట్టుకో లేకపోయింది. ఒకనాడు భర్త రాగానే ఆమె అతని పాదములపై తలపెట్టి ఏడ్వసాగింది. కాశీనాధ్ గాబరాపడిఆమెను లేవదీయబోయాడు, కాని లేపలేకపోయాడు. "ఏమైంది? యేడుస్తున్నా వెందుకు?" అనడిగాడు.

కమల ఏమీ జవాబివ్వలేదు. చాల సేపటివరకూ ఏడుస్తూనేవుంది. తరువాత 'మీరు నన్ను పూర్తిగా ఒక్కసారిగా చంపివేయండి. ఇలా రోజురోజూ చిత్రవధ చేయకండి' అన్నది.

కాశీనాథ్ చాల ఆశ్చర్యపడి "యేమిటి అసలు విషయం? నే నేంచేశానో చెప్పు" అన్నాడు.

"మీ రేమీ ఎరుగరా?"

"యేమిటి? నా కేమీ తెలియదే?"

"ఇంకా మీ ఇష్టంవచ్చినట్లు చెయ్యండి. కాని నేను నిలబడడానికి కొంచెం స్థలం మాత్రం వుంచండి. నేనింకేమీ కోరను."

ఈసారి కాశీనాథ్ కమలను లేవనెత్తి, దగ్గర కూర్చో బెట్టుకొని అత్యంత ప్రేమతో - "జరిగినదేమిటో నాకు స్పష్టంగా చెప్పు?" అన్నాడు.

"మీరు రోజురోజుకు ఇలా ఎందుకవుతున్నారు?"

"ఏం నేను చిక్కిపోయానా?"

కమల కళ్ళమీద చెరగు కప్పుకొని యేడుస్తూ అలాగే తలూపి-'అవును, చిక్కిపోయారు' అన్నది.

"నాకూ తెలుసు ఈవిషయం, కాని నే నేం చెయ్యాను చెప్పు?"

కమల తలెత్తి-"మందు తీసుకోండి." అన్నది.

కాశీనాథ్ నవ్వుతూ 'మందువల్లలాభం లేద'న్నాడు.

"మరయితే యేం చెయ్యాలి"

"నాకు తెలియదు."

"మందువల్ల ప్రయోజనం లేకపోతే మరి దేని వల్ల లాభం? అదీ తెలియదా? అయితే నా అదృష్టాన్ని బూడిద పాలు చెయ్యదలచుకొన్నారా?"

కాశీనాథ్ సంస్కృతపాఠశాలలో చదువుకొన్న అమాయకుడు. సరళ స్వభావి. ప్రేమ వ్యవహారాల్లో బొత్తిగా అపరిచితుడు. ప్రణయ సంభాషణకూడ చేతకాదు. అయినప్పటికీ ఇప్పుడు స్వాభావికవాత్సల్యంతో పులకితుడై కమల

చేయిపట్టుకొని ఆమె కళ్ళుతుడుస్తూ—"ఇక్కడనాకు సుఖంగా లేదు. అందువల్లే బహుశ ఇలా అవుతున్నానేమో!" అన్నాడు.

"అలాంటప్పుడు ఇక్కడే వుండటమెందుకు?"

"ఉండక ఎక్కడికి పోను?"

"ఇక్కడతప్ప ఇంకెక్కడా చోటులేదా? ఎక్కడ ఆనందంగావుంటే అక్కడికే వెళ్ళి ఉండండి."

"అలా జరగదు."

"ఎందుకని జరగదు?"

"ఇక్కడవుండకపోతే మామగారికి బాగుంటుందా?"

"మరి మీ రీ విధంగా చిక్కి, శల్యమయిపోవడం బాగుంటుందా?"

"బాగాఉండదనుకో. ఉపాయమేముంది? మీ నాన్నగారు బీదవాణ్నిగా చూచి..."

కమల అతనినోటిమీద చెయ్యిపెట్టి ఇంకేమీ మాట్లాడనివ్వకుండా—"రామ, రామ! ఇలాంటి మాటలనకండి. నా కన్నివిషయాలు విప్పిచెప్పండి. నేనేదో ఒక ఉపాయాన్ని కనిపెడతాను" అన్నది.

కాశీనాథ్ ఆలోచించి—"అన్నివిషయాలూ నీకు విప్పి చెప్పలేను" అని కొంచెంసేపు ఊరుకుండి—"ఇదంతాచూస్తుంటే మనిద్దరివివాహం కాకపోయినట్లయితే బాగావుండేదేమో ననిపిస్తుంది!" అన్నాడు.

"ఎందుకని?"

"నువ్వే చెప్పు. నన్ను వివాహమాడి ఒక్కరోజైనా నువ్వు సుఖించావా? నాకు పేరిరుద్యానవహారాలు తెలియవు.

ప్రేమాదరాలు తెలియవు. అసలు వాస్తవంగా నా కేమీ తెలియనే తెలియదు. మరి ఈ వయస్సులో నీ కెన్ని కోరికలు, అభిలాషలు ఉన్నాయో వాటిలో ఒక్కటైనా నావల్ల తీరిందా? నేను నీ భర్తను కాక, భర్తఛాయనుమాత్రమే ననిపిస్తుంది.”

కమలకళ్ళనుండి కన్నీరు కారసాగింది. ఆమె అన్ని విషయాలూ అర్థంచేసికోలేకపోయింది. గాలిలేనిఇంట్లో బలవంతంగా బంధించివున్నట్లు ఇంతవరకు ఆమెహృదయంలో ఒకవిషయం బయటపడదామని యెంతగానో కొట్టుకుంటూంది. అతికష్టంమీద ఈసారి బయటికి వచ్చింది. వణుకుతున్నస్వరంతో కమల అడిగింది.

“ఏం మీరు నన్ను చూడలేరా?“

“ఈవిషయం ఇం కెప్పుడైనా చెబుతాను.”

“కాదు, ఇప్పుడే చెప్పండి. నన్ను వివాహమాడి మీ రేమీ సుఖపడలేదా?”

“ఏం తెలుస్తుంది? బహుశ లేదనుకొంటాను.”

“ఇం కెవరినైనా వివాహమాడితే సుఖించేవారేమో?”

“అదీ సరిగా చెప్పలేను”

ఇదివిని కమలకు మళ్లీమండినట్లనిపించింది. ఇంతలో బయటనుండి దాసీ వచ్చి “అమ్మాయిగారూ, అమ్మగారికి తీవ్రంగా జ్వరంవచ్చింది. ఆమె మిమ్మల్ని పిలుస్తున్నారు” అని చెప్పింది. కమల కళ్ళుతుడుచుకుంటూ బయటికి వెళ్ళిపోయింది.

# 5

కమలతల్లిజర్వం తగ్గనేలేదు. పదిహేనురోజులు తీసుకొని, ఆఖరికి అందరినీ ఏడిపించి, చనిపోయింది. పత్నీవియోగంవల్ల ప్రియబాబుకు చాలా బాధకలిగింది. ఈ వార్ధక్యంలో ఆయన ఇక తా నెన్నోరోజులు బ్రతకననుకొన్నాడు. ఇందువల్ల గృహనిర్వహణ భారమంతా కమలమీద పడింది. ప్రపంచంలో మనిషి తన సుఖదుఃఖాల్ని గురించేగాక ఇంకా అనేకం చేయాల్సివుంటుంది. వృద్ధజనకుడు రోజురోజుకూ పటుత్వం తప్పుతున్నకొద్దీ కమల ఎక్కువగా ఆయనవద్దే కూర్చోవలసి వస్తూంది. ఇక కాశీనాద్ విషయమా? అతను సరేసరి. "ఊరందరిదీ ఒకదారయితే ఉలిపికట్టె దొకదారి" అన్నట్టు,సందు దొరకగానే పుస్తకాలదస్త్రంతో గదిలో జొరబడి తలుపులు బిడాయించుకొనేవాడు. చదవడం విసుగెత్తితే బయట తిరిగి వస్తూండేవాడు. ఒకొక్కప్పుడు రెండుమూడురోజుల వరకూ ఇంటికే వచ్చేవాడుకాదు. ఎక్కడ ఉంటాడో, మరెక్కడ నిద్రించేవాడో ఎవ్వరికీ తెలిసేదికాదు. ఇదంతా చూచి కమల ఒకవిధంగా హతాశురాలైంది. యువతి ఐనప్పటికీ ఆమె ఇంకా బాలికే! పతియందు ప్రేమ, స్వామిభక్తి ఆమె ఇంకా పూర్తిగా నేర్చుకోలేదు. నేర్చుకుంటూండగానే విఘ్నం కలిగింది. అదీ భర్తవల్లేకనుక ఆమె దోషమేమున్నది! నేర్చుకొన్నదికాస్తా నెమ్మది నెమ్మదిగా మరచిపోసాగింది. ఆమె హృదయమనే ఒరెపిడిరాయిమీద పడిన బంగారుగీట్లు ఇంకా మెరిసేముందే, బాహ్యసౌందర్యం ఇంకా లోపల ప్రతిబింబించకపూర్వమే నిర్లక్ష్యం, అజాగ్రత్తలవల్ల అవి క్రమశః

క్షీణించిపోసాగాయి. ఆఖరికి అనికాస్తా ఎప్పుడు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయిందో కూడ కమలకు పొత్తిగా తెలియదు. అప్పుడప్పుడామె ఒక శిథిలసౌధానివి నాలుగైదు యిటుకలు, రెండుమూడు కర్రముక్కలు, మరికొన్ని రాళ్ళు ఇటూఅటూ చిందరవందరగా పడివుండటం చూస్తుండేది. కాని వాటన్నిటినీ ప్రోగుచేసి, ఆ శిథిలభవనాన్ని మళ్ళీనిలబెట్టాలనే అభిలాషే కలిగేదికాదు. అసలామెలో అంత సామర్థ్యమూ లేదు. ఇక్కడ ఒకానొకప్పుడు ఒక రాజప్రాసాదం వుండేది. ఆనందోద్యానవనంకూడా వుండేది. స్వప్నమైకంలో అతను వచ్చాడు. కలకాస్తా పోగానే వెళ్ళిపోయాడు. ఆ స్వప్నాన్ని మళ్ళీ చూద్దామనైనా అతనికి కోరికలేదు. పోయినవాడు తిరిగి రానేలేదు.

ముసలితండ్రికి సేవచెయ్యటంలో, దాస-దాసీలను సంబాళించుకోవటంలోను కమల కొకవిధంగా రోజులుసుఖంగానే గడచిపోతున్నాయి. కాని ఒకరికి సుఖశాంతులులభించే పనిలోనే మరొకరికి లభించకపోవాచ్చు. కమల సుఖమనుకుంటున్నదే వృద్ధదాసీకి క్లేశాన్ని కలిగిస్తోంది. దాసీ తాను చూచీ, వినీ, కొన్నాళ్ళు గడచినతర్వాత ఆఖరికి ఒకరోజున ఏకాంతంగా ప్రియబాబుతో యిలా అంది—"చిన్నబాబుగారి స్థితి బాగాలేదు బాబుగారూ! ఒకప్పుడు ఇంట్లోవుంటే, మరొకప్పుడు వుండరు. ఎక్కడికి వెళ్తారో, ఎప్పుడేమిచేస్తుంటారో ఇంట్లో ఎవరికీ ఏమీ తెలియదు. అమ్మాయిగారితో మాట్లాడుతలన్నట్లే లేదు."

ప్రియబాబు తన ఆరోగ్యాన్ని గురించే ఎప్పుడూ దిగులుగా వుంటూండడంవల్ల ఆయన తక్కిన ఈ విషయాలు పట్టించుకోవటానికే వీలుపడేదికాదు. వృద్ధదాసివల్లే ఈ విషయాలు తెలుసుకోగల్గాడు. కమల రాగానే ఆయన అతివాత్సల్యంతో "నేను అడిగేదానికి సరిగా జవాబు యిస్తావా అమ్మా?" అని అడిగాడు. కమల ఒకసారి తండ్రి మొహంకేసి చూసి—"ఏ సంగతి నాన్నగారూ?" అన్నది.

"చూడమ్మా! నావద్ద సిగ్గెందుకు చెప్పు? కష్టసమయాల్లో తండ్రివద్ద ఏమీ దాచకూడదు. అన్ని విషయాలూ విప్పిచెప్పు, నేనే మీ మనస్పర్ధలు పోగొట్టి పోతాను."

కమల మౌనంగా వుండిపోయింది. ప్రియబాబు మళ్ళీ ఇలా అన్నాడు—"నువు సుఖంగా వుండాలనే యోగ్యుడిని వెదకి తెచ్చానుగదా! నువుతప్ప నాకింకెవరున్నారు చెప్పు? నువ్వే విచారంగా వుండటం చూస్తే నేను చనిపోయికూడ శాంతి పొందలేను" వృద్ధుని కళ్ళనుండి అశ్రువులు రాలసాగినయి. కమలస్థితీ అలాగే వున్నది. తండ్రి వాత్సల్యంతో కమల కన్నీరు తుడుస్తూ - "నాకు అన్నివిషయాలూస్పష్టంగా చెప్పవా అమ్మా?" అన్నాడు.

కాని కమలకి ఏం చెప్పాలో బోధపడలేదు. కాస్సేపు వూరుకొని "ఏనమ్మా! ఏమైనాకీచులాడుకున్నారా?" అన్నాడు

కమల తనలోతాను 'ఐక్యతంటూవుంటేగదా పోట్లాట' అనుకొని తలత్రిప్పుతూ పైకి 'లేదు' అన్నది.

"పోట్లాటకాకపోతే నువ్వతనికి నచ్చటంలేదా? సంగతేమిటి"

కమలకొకసారి "అవును. ఇదేసంగతి" అందామని పించింది గాని. అలా అనలేకపోయింది. భర్తకు తానునచ్చ డంలేదని చెప్పడానికి ఆమె హృదయం అంగీకరించలేదు. హృదయానికి దెబ్బతగిలినట్లయింది. ఆమె జవాబేమీ ఇవ్వ లేదు. ప్రియబాబు విచారవదనంతో నవ్వుతూ "లేక నీకే అతను నచ్చటంలేదా?" అన్నాడు. బహుశ తనకే యిష్టం లేదేమో అని కమలకు ఆలోచన కలిగింది. "కాని ఇదేమిటి? నాకు నాభర్తయందు యిష్టంలేదా?" అనుకొని కమల భయంతో వణకిపోయింది. ఆమె తన హృదయాంతరాళాన్ని శోధించ ప్రయత్నించింది. అక్కడి సంగీతం ఆగిపోయింది. కేవలం మధ్యమధ్య ఒకళ్ళిద్దరు సామాగ్రిని ప్రోవుచేసుకుపోవ డానికి వస్తూన్నట్లు కనపడ్డారు. వారి చేతుల్లోని వాయిద్యాల నుంచే అజాగ్రత్తగా వున్నప్పుడు యేదోస్వరంవినబడుతూంది. అప్పుడప్పుడు ఒకళిద్దరు నటకులు తొంగిచూచి పోతున్నారు. కమల యేడ్చి, కళ్ళమీద చెరగు కప్పుకున్నది. ప్రియబాబు విహ్వలుడై "యేడ్వకమ్మా" అని సముదాయించజూచాడు.

"నాన్నగారూ! మనం ఎవ్వరికి యేమీకామా?"

ప్రియబాబు నెమ్మదిగా కుమార్తెను యెద కదుము కున్నాడు. మెల్లిగా అతి మృదువుగా ఇలా అన్నాడు. "ఛీ, ఛీ, ఇలా అనవచ్చా? నీవెవ్వరి కుమార్తెవో ఆమే నా సర్వస్వం. ఇప్పటికీ ఆమె రోజూ రాత్రిపూటవచ్చి, నా పాదాలవద్ద కూర్చుంటుంది. పగలు మీ భయంవల్లరాదు సాయంత్రం అవుతూంది. ఒకవేళ ఆమెవస్తే నీ ఈ మాటలు వినేటట్లయితే చాల దుఃఖపడుతుంది."

సాయంకాలమైంది. గదిలో చీకటి వ్యాపిస్తూంది. కమల త్రుళ్ళిపడి, గదిలో నాల్గువైపులా పరకాయించి చూచింది. ఎక్కడా ఎవ్వరూ లేకపోయేటప్పటి కామెకు కాస్త ధైర్యం వచ్చింది. బయటకు వచ్చేటప్పటికి ఆమె కాళ్ళు తేలిపోతున్నాయి. శరీరంలోని సగంరక్తం ఎవరైనా తీసివేసుకున్నారా అన్నంత దుర్బలంగావుంది. తన పనులన్నీ పూర్తిచేసి, ఆమె కాశీనాథ్ చాపమీద దీపంముందు పుస్తకం తెరచి కూర్చున్న గదిలోకివెళ్ళి కూర్చుంది. కాశీనాథ్ తలెత్తి చూస్తే కమల కూర్చొనివుంది. అతడాశ్చర్యపడి "నువ్వా!" అన్నాడు.

"అవును, నేనే"

"సరే. కూర్చో" అని చెప్పి కాశీనాథ్ తన చదువులో మునిగిపోయాడు. కమల చాలాసేపటివరకూ భర్త చదువుకోవటం చూస్తూ కూర్చున్నది. తరువాత ఆమె పుస్తకం మూసేసింది. కాశీనాథ్ తలెత్తి ఆశ్చర్యంతో "మూసేశావా?" అన్నాడు.

"రోజూ చదువుతూనేవుంటారుగా! ఒకనాడు చదవకపోతేయేం? కబుర్లు చెప్పుకుందాం"

"అందుకని పుస్తకం మూసేశావా?"

"కేవలం ఇందుకోసమనేగాదు. మీకు కోపమొచ్చి ఏదోఒకటి అంటారుగా, అందుకనేలెండి"

కాశీనాథుడు చిరునవ్వుతో ఇలా అన్నాడు—"ఎందుకు కోప్పడతాను కమలా! ఎన్నడయినా ఒక చిన్నమాటైనా అన్నానా? నువ్వే దగ్గరికి రావు, మాట్లాడవయ్యె. మరి చదువుకోకపోతే కాలమెట్లా గడుస్తుందో చెప్పు? మళ్ళీ చిరు

నవ్వి నవ్వుతూ "జ్వరం తగ్గుతోంది. రెండురోజులనుండి ఏమీ తినలేదు. కాని, నువ్వొక్కసారైనా యిటు కేసి తొంగిచూచావా?" అన్నాడు.

కమల తలెత్తిచూచింది. భర్తముఖం పూర్తిగా పీక్కుపోయినట్లుంది. తలమీద చెయ్యేసిచూసింది. చాలా వెచ్చగా వుంది. అప్పుడామె ఏడుస్తూ భర్తఒడిలో వాలిపోయింది. సిగ్గుతో ఆమెకు చచ్చిపోవాలనిపించింది. ఏడుస్తూనే ఇలా అంది—"నా తప్పులన్నీ మర్చిపోయి, నన్ను మళ్ళా మీ దాన్నిగా చేసుకోండి, మీ భారాన్నంతా నన్ను వహించ నివ్వండి"

"నేనంగీకరించినానువ్వు నాభారాన్ని మోయగలవా?"

"ఎందుకు వహించలేను?"

"చూస్తానుగా"

"నన్ను మీదానను గా చేసుకోండి"

"నే నేనాడో నాదాన్నిగా స్వీకరించాను. కాని నువ్వే నన్ను అర్థంచేసికోలేను, నువ్వెప్పుడైనా సరిగా అర్థం చేసికోగల్గు తావనుకోను"

కమల దీపపువెల్తురులో అతనిముఖాన్ని తనివితీర చూసింది. ఆముఖంలో బూడిదలో కప్పబడ్డ నిప్పుకణాలు, మైనంతో కప్పబడిన తేనె వున్నవనిపించింది. ఆవేశంతో 'న న్నిన్నాళ్ళూ ఎందుకు గుర్తింపనీయలేదు? ఇంతకాలం మిమ్ము మీరు దాచుకొని నన్నెందుకు బాధించారు?" అంటూ ఆనం దోద్వేగాలతో కమల భర్తను కౌగలించుకున్నది. కాశీనాథ్ కళ్ళనుండి అశ్రువులు రాలసాగాయి.

# 6

మరునాడు ప్రియబాబు కాశీనాథుని పిలిచి—'బాబూ! ఇంకా నే నెంతకాలం బ్రతుకుతాను! ఎప్పుడుపోతానో నాకే తెలియదు. నాకు మగపిల్లలెవరూ లేరుగదా! నాకున్న ఆస్తి పాస్తులన్నీ నీవే. నేను బ్రతికుండగా నాకళ్ళముందే అన్ని వ్యవహారాలూ చక్కబెట్టుకోవడం నేర్చుకో. లేకపోతే మిగిలే దేమీ వుండదు; అంతా మోసగించి కాజేస్తారు'అని చెప్పాడు.

కాశీనాథ్ తలవంచుకొని "ఏం చెయ్యమంటా"రని అడిగాడు.

ప్రియబాబు"ఇంకా చెప్పేదేముంది? రేపటినుంచే రోజూ ఉదయంపూట కచేరిలోకివెళ్ళి కూర్చుంటూండు" అన్నాడు.

"అలాగే" అని కాశీనాథ్ వెళ్ళిపోయాడు. ప్రియబాబు కుమార్తెను పిలిచి "అమ్మాయ్! నేను ముసలివాణ్నయ్యాను. ఇంక వ్యవహారాలేమీ చూడలేకుండావున్నాను. అందువల్ల కాశీనాథ్‌కి జమీందారీ వ్యవహారాలన్నీ ఒప్పగించాను. ముందుముందు ఏమీ ఇబ్బంది కలుగకుండా అప్పుడప్పుడూ సలహా చెబుతుంటాను" అన్నాడు.

కొన్నాళ్ళవరకు ప్రియబాబు కాశీనాథ్‌తోపాటు కచేరీకి వెళ్ళి జమీనా విషయాలు బోధించుతూండేవాడు. అతనుకూడ ఏదో ఒకపని తగిలినందుకు చాల సంతోషించాడు. ఇంట్లో లోలోపలే ప్రజ్వరిల్లుతున్న అగ్నిజ్వాల చాలరోజులకు నెమ్మది నెమ్మదిగా మందగించిపోసాగింది.

ఇప్పుడు కాశీనాథ్ నియమంగా నిత్యమూ జమీాన్యావహారాలన్నీ చూస్తున్నాడు. కమలకూడ నియమంగా ఇంటి వ్యవహారాలన్నీ చక్కబెడుతున్నది. ప్రియబాబు ప్రక్కమీాదె పడివుండేవాడు. ఈ విధంగా సంసారం కులాసాగా సాగిపోతోంది. కాని కొద్దిరోజుల్లోనే ప్రియబాబు ఆరోగ్యం పాడయి పోసాగింది. ఒకరోజున ఆయన కమలను పిలచి—"వీలునామా వ్రాయించాను." అని చెప్పి, దిండుక్రిందనుండి ఒక కాగితం తీసి చదవసాగాడు—'నేను నా స్థిరచరాస్థులన్నింటిలోనూ సగభాగం నాఅల్లుడు కాశీనాథ్‌కి, సగభాగం నాకుమార్తె కమలాదేవికి ఇస్తున్నాను—ఏ, అమ్మాయి! బాగావున్నదా?' అన్నాడు.

కమల ఏమీా జవాబివ్వకపోయేటప్పటికి ప్రియబాబుకు ఆశ్చర్యంకలిగింది. ఆయన-'ఏంవమ్మాయ్!నీకు నచ్చలేదా!' అన్నాడు. ప్రియబాబు ముఖ్యంగా కుమార్తెను సంతోషపెడదామనే ఇలా వ్రాయించాడు. ఆ స్తిమీాద కాశీనాథ్‌కు కూడా హక్కులిచ్చేటట్లయితే కమల చాలా సంతోషిస్తుందని ఆయన అభిప్రాయం. కాని కమల తన మనసులోని విషయాన్ని బైటకు చెప్పడానికి సిగ్గుపడుతూంది.ప్రియబాబు మళ్ళీ "ఏమైనా చెప్పాలనివుందా?" అని అడిగాడు.

కమల తలఊపుతూ "అవును" అన్నది"

"ఏమిటమ్మా అది?"

కమల నీళ్లునములుత్తూ ఆఖరికి. "ఆస్తి అంతా నా పేరనే వ్రాయండి" అన్నది.

"అదేమిటమ్మా?"

కమల తలవొంచుకుని అలాగే కూర్చుంది.

ప్రియబాబు బాగా లోకానుభవంకలవాడు. ఎన్నో విషయాలు తెలుసు. కమల మనస్సులోని విషయాన్ని ఇట్టే గ్రహించేశాడు. ఆయన ఒక్కొక్కటిగా అన్నివిషయాలూ లోతుగా పరిశీలించేకొద్దీ ఆయన శరీరం శిథిలమైపోతున్నట్లని పించింది. దిండునానుకొని కూర్చునివున్నవాడల్లా దానిమీదే తలబెట్టుకొని కళ్ళుమూసుకొని అలాగే పడుకున్నాడు.

చాలాసేపుమౌనంగావుండిప్రియబాబుఇలాఅన్నాడు- "నువ్వు నా ఏకైక సంతానానివి. నీ మనస్సును కష్టబెట్టా లనుకోను. ఆస్తిఅంతా నీకే ఇచ్చిపోతాను:కాని, ఇదేమంత మంచిపనిమాత్రం కాదు. నువు సుఖంగా ఉండాలని ఆశీర్వ దిస్తున్నాను. కాని ఈ విషయంలో నాకు సందేహమే. నా యీ దీర్ఘజీవితంలో అనేకం చూశాను,విన్నాను. స్వయంగా మూడుపెళ్ళిళ్ళు చేసుకొన్నానుకూడాను. ఇటువంటి ఉద్దే శ్యంతో ఏ స్త్రీకూడ ప్రపంచంలో సుఖపడలేదు" అని కొంచెంసేపు మౌనంగావుండి మరల. "చూడటానికీ,వింటా నికి బాగుంటుందనే నేను ఇద్దరిపేర చెరిసగం వ్రాయించాను. అతనూ నువ్వూ వేర్వేరు కాదని నాకు తెలుసు. అయితే ఇంతకీ నువ్వెందుకని అతనికి ఇవ్వొద్దంటున్నావో చెప్పమ్మా" అన్నాడు.

కమల గద్గదస్వరంతో "ఆస్తి దక్కితే ఇక నాముఖం కేసి చూడనే చూడరు" అన్నది.

"ఆస్తి లభించకపోతేనో?"

"నాకు లొంగివుంటారు"

ప్రియబాబు అన్నాడు "కాశీనాథునిస్వభావం నాకు తెలుసు. కాని నువ్వు అర్థంచేసుకోలేదు. అతను సరిగ్గా తన తండ్రివంటివాడే. ఒకవేళ అతను నిన్ను చూడజాలకపోయే టట్లయితే ఆస్తివచ్చినా చూడడు, ఆస్తి దక్కకపోయినా అందులో మార్పేమీ వుండదు. ఐనా ఈరకంగా భర్తను వశం చేసుకోగల్గుతారా! బలవంతంగా, దౌర్జన్యంద్వారా అడవి సింహాన్ని వశపర్చుకోవచ్చునే కాని, ఆ జబర్దస్తీ ఒక చిన్న పుష్పాన్నికూడ వికసింపచెయ్యలేదు సుమా!" అన్నాడు.

కొంచెంసేపు మౌనంగావున్నతరువాత మళ్ళీ—'నువు నీ కృషిలో కృతకృత్యవు అవ్వాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. కాని, ఇదిమాత్రం మంచిపద్ధతికాదు. అతను స్వయంగా నిన్ను స్వీకరించకపోయేటట్లయితే ఇంక నీకుఉండే దేమిటి? ఆ వున్నదానికి సగంఆస్తిచాలదూ? ఇంకోవిషయం. భర్తకు శరీరం, మనస్సు, ఆత్మ భౌతికంగా ఆధ్యాత్మికంగా సర్వం ఇవ్వబడుతుంది. అలా తన సర్వస్వం ఇవ్వబడేవారికి సగం ఆస్తి ఇవ్వకూడదా? కమలా! అలా చెయ్యవద్దమ్మా. అతని కెప్పుడైనా తెలిస్తే చాలా బాధపడతాడు సుమా!"

కమల ఏమీ జవాబివ్వలేదు. ప్రియబాబుకూడ హెచ్చరించనూలేదు. షుమారు అరగంటసేపు ఇద్దరూమౌనంగానే వుండిపోయారు. చీకటి పడుతూంది. దాసి దీపం వెలిగించి గదిలోపెట్టిపోయింది. కమలకూడ కళ్లుతుడుచుకొని తన పని మీాద వెళ్ళిపోయింది.

మరునాడు ప్రియబాబు వకీలును పిలిచి వీలునామా మార్చదలచుకున్నానని చెప్పాడు.

వకీలు "ఏమిటి మార్చాలనుకుంటున్నా"రని అడిగాడు.

'అల్లుని పేరు తగ్గించి ఆస్తి అంతా అమ్మాయి పేరనే వ్రాయాలనుకొంటున్నాను.'

"ఎందుకని?"

"ఈ ప్రశ్న అనవసరం. నేను చెప్పినట్లు వ్రాసెయ్యండి"

## 7

ప్రియబాబు మరణానంతరం శ్రాద్ధకర్మలు యథావిధిగా జరిగిన తరువాత వీలునామా చూసి కాశీనాథ్‌కి ఆశ్చర్యం గాని, దుఃఖంగాని కించిత్తయినా కలుగలేదు. ప్రపంచంలో రోజూ జరిగేదే, జరగవలసినదే జరిగింది—ఇందులో దుఃఖించడానికి, ఆశ్చర్యపడేందుకు ఏముంది? అయినా దివాను కాశీనాథ్‌తో ఏకాంతగా—"చినబాబుగారూ! పెద్దబాబుగారు వీలునామా యిలా వ్రాస్తారని నేను కలలోకూడా అనుకోలేదు. మొదట్లో ఒక వీలునామా వ్రాశారు. దాంట్లో మీకూ, అమ్మాయిగారికి సమానంగా ఇచ్చారు. దానెందుకు మార్చారో, ఎవరి సలహాతో వారిమనస్సు మారిపోయిందో తెలియడంలేదు" అన్నాడు.

కాశీనాథ్ చిరునవ్వు నవ్వుతూ 'తెలుసుకోవాల్సిన అవసరమేముంది యిందులో? ఎవరిఆస్తి వారికే దక్కింది. దానితో నాకేమిటి? మీ కెందుకు?" అన్నాడు.

దివాను నిర్వారపోయి 'అయినా, అయినాగానీ–' అన్నాడు.

'అయినా కిందులో వీల్లేదు. నిజానికి ఈ ఆస్థిమీద నాకే మధికారమున్నది? కాని ఆయనగారు నాకూ అర్ధభాగం యిచ్చి పోయినట్లయితేమట్టుకు ఆశ్చర్యపడవలసినచ్చేదే. ఇక నాకు సగమివ్వడం, ఆమె పూర్తిగా ఇవ్వడమంటారా, రెండూ ఒకటే. ఇందులో భేదమేమున్నది?'

దివాను మరీ నివ్వెరపోయాడు. గొణుగుతున్నట్లుగా-'కాదు, కాదు. భేదమేమీ లేదనుకోండి. నేను బాబుగారి విషయంచెబుతున్నానులెండి. వారి ఉద్దేశ్యం నాకు బాగా తెలుసు. ఇందువల్లేనే నీ మాట అన్నాను' అన్నాడు.

'ఆయన తమకర్తవ్యాన్ని నెరవేర్చారు. కొంచెమా లోచిస్తె స్త్రీకి భర్తతప్ప ఇంకేగతీ లేదు. కాని, భర్తకో అన్యమార్గంకూడా వుండటానికి వీలుంది. నేనా బీదవాణ్ణి. ఒక్కసారిగా ఇంత ఆస్థి లభించినట్లయితే దాని పరిణామం చెడుగా పరిణమించవచ్చునుకూడాను. బహుశ ఆ దృష్టితోనే నాకు వీలునామా మార్పించివుండవచ్చు.'

ముసలి దివాను యింతవరకు కాశీనాథుని వట్టి మూర్ఖ పండితుడనే అనుకుంటున్నాడు. ఇవ్వాళ అతని నోటినుండి ఇంత వివేకంతోకూడిన మాటలు విని, అతన్ని అభినందించకుండా ఉండలేకపోయాడు. ఈ విధంగా వృద్ధదివాను ఉత్తరోత్తరా కాశీనాథ్‌ని విజ్ఞతను బాగా గ్రహించగలిగాడు. కాని అటు కమలకుమాత్రం కాశీనాథుని అజ్ఞానమే కన్పించసాగింది. ఈయన ఎలాంటి మనిషబ్బా! అని రోజుకొక

వందసార్లయినా తనలో తాను అనుకొంటూండేది. కాని అత న్నామె అర్థంచేసుకోనేలేదు.

వేయిఉపాయాలూ, ప్రయత్నాలూ చేసినాకూడా ఈ రెండుకాళ్ళూ, రెండుచేతులూగల ఈ మనిషి దేనితో నిర్మింపబడ్డాడో! అనే సందేహానికి కమల ఏమీ నిశ్చయించు కోలేకపోయింది. అతను తన మనస్సును తన శరీరంలోనే వుంచుకొన్నాడా? లేక ఇంకెక్కడయినా తాకట్టు పెట్టాడా? ఒకటిమాత్రం చూస్తూనేవుంది. ప్రపంచంలో అందరిలాగే తన భర్తకూడా తిండితింటాడు; నిద్రిస్తాడు; జమీందారీ వ్యవహారాలు చూస్తాడు. ఇంటిపనులు చక్కబెట్టుతాడు. అన్నీ చేస్తాడు. అన్ని విషయాల్లోనూ అభిరుచివుంది. కాని, అన్నిటియందు ఉదాసీనంగాకూడా వుంటాడు. తన భర్తకు బాగావుండేదేమిటో, ఆయనకు దేనియం దెక్కువ ఇష్టమో కూడ ఆమె ఇంతవరకూ తెలుసుకోలేకపోయింది. కమల ఎప్పు డయినా జబ్బుపడితే రాత్రి తెల్లవార్లూ ఆమెప్రక్కనే కూర్చొని, రాత్రంతా మేల్కొనే వుంటాడు. అతని ముఖం మీాద విషాదచ్ఛాయ లలుముకొనేవి. హృదయంలోని వాత్సల్యము, ప్రేమ పొంగి, కట్టలు తెంచుకొని ప్రవహిస్తాయా అన్నట్లుండేది. తరువాత జబ్బు నయమై ఆమె కాస్త అటూ ఇటూ తిరుగ నారంభించగనే ఆమె ఎదురుపడినాకూడ కన్నెత్తి చూసేవాడు కాదు. తనపనిలో నిమగ్నుడయి తన ధ్యాసలో వుండి, వెళ్ళిపోతూండేవాడు. కమల అలిగి, రెండుమూడు రోజులవరకు మాట్లాడేదికాదు. కాని ప్రయో

జన మేమీ కనబడలా. కాశీనాథుడు ఆమెదగ్గరకు వచ్చినా వెంటనే తిరిగి వెళ్ళిపోయేవాడు. ఒక మాటా-పలుకూ లేదు. అనునయించటంగాని, విచారప్రదర్శన కాని. -ఏమీలేదు. కమలమాట్లాడిస్తేమాత్రం అతనూ పూర్వంలాగేచిరునవ్వుతో సంతోషంగా మాట్లాడేవాడు. అంతేగాని ఈ రెండురోజుల నుంచీ తన్నెందుకు పల్కరించలేదనిగాని, కోపానిక్కారణ మేమిటనిగాని అడిగేవాడు కాదు. కొన్నాళ్ళిలా జరిగేటప్ప టికి కమల స్వభావమే మారిపోయింది. 'మీరు నన్ను లక్ష్య పెట్టకపోతే, నేనూ మిమ్మల్ని లక్ష్యపెట్టకుండావుండడం తెలుసు నాకు. మీరు కాల్దన్ని వేస్తుంటే, మీ కాళ్ళు పట్టు కుని ప్రాకులాడేటంత వెర్రిగా నేనేం ప్రేమించటంలేదు లెండి అని భర్తకు తెలియజెయ్యాలన్నట్టుగా ప్రవర్తింపసాగింది.' భర్త యెదురుపడితే, మీమీద దయతలచి మిమ్మల్ని పతిగా స్వీకరించాను; అంతమాత్రాన నాప్రాణం మీ పాదాల చుట్టూ తిరుగాడుతుందనీ, మీరు కనబడగానే మధురమంద హాసంతో ప్రేమాలాపము సాగిస్తాననీ అనుకోవద్దు. నేను పనిలోవుండగా మీరు యెదుటికివచ్చినా మీవంకే చూడను సుమా' అన్నట్టు మొహం ప్రక్కకు తిప్పుకొని గంభీరంగా ఏదో పని వున్నట్టు వెళ్ళిపోతూండేది.

కమల ఎప్పుడైనా ఏ నౌకర్నో, దాసీనో చీవాట్లు పెడుతూండగా కాశీనాథుడు వినటం తటస్థించిఏమన్నా అన్నా ఆమె అతనిమాట లక్ష్యపెట్టకుండానె వాళ్ళను తీవ్రంగా తిట్టి

'నా నౌకర్లు, నా దాసీలు, నా ఇల్లు, నా ఇష్టంవచ్చినట్లు తిడ తాను. పిలవాపెట్టకుండా మీా మధ్యవర్తిత్వ మేమిటి?' అన్న ట్లుగా ప్రవర్తిస్తూండేది.

కాని ఇందువల్ల ఏం తృప్తి కలుగుతుంది? ఈ విధంగా ఆమె కోరిక నెరవేరుతుందా? కాశీనాథుని రవంతైనా నంచ గలిగినప్పుడే ఆమెకు తృప్తి. ఎవరు ఏం చేస్తున్నప్పటికి కాశీ నాథ్ మాత్రం తన ప్రశాంత గంభీరవదనంతో 'నేను నిశ్చ లంగానే ఉన్నానుసుమా. మేరుపర్వతశిఖరంవలె నన్ను లేశ మాత్రంకూడ కదపగలిగేశక్తి ఎవరికీలేదు. నీ ఇష్టమొచ్చి నట్లు కల్లోలాన్ని కలిగించు, తుపాను లేవదియ్యి, వృక్షాల్ని పెకలించిపారవెయ్యి; కాని నువ్వు నన్నేమీా చేయలేవుసుమా' అన్నట్లుండేవాడు.

కమలమాత్రం ప్రేమించడంలేదా? ప్రేమిస్తోనేవుంది. కాని అది గంభీర అనంతప్రేమకాదు. ఆమె ఒక గిరిగీసి 'మీారు దీన్నిదాటి బయటికి వెళ్ళొద్దు; వెళ్తేమాత్రం నేను ఒప్పుకోను. బహుశ అప్పుడు మిమ్ము ప్రేమించుతాను కాని మిమ్మల్ని గౌరవించను' అని చెప్పాలనుకొనేది.

ఒకరోజున ముసలిదాసీతో 'నాన్నగారునన్నొక జంతు వుకు అప్పగించా'రని ఏడ్చి మొరపెట్టుకున్నది.

"అదేమిటమ్మా!" అన్నది దాసి.

"ఏమని అడుగుతున్నావా యింకా? మీారంతా కలిసి నా కాళ్ళూచేతులూ కట్టి బావిలో పడవేయకపోయారూ?"

"అలా అనకూడదమ్మా!"

"ఎందు కనగూడదు? మీరు చేయగల్గినపనినే నే నొక్కసారి నోటితో అనగూడదా?"

"కాదు, కాదు. అలాకాదమ్మా! ఆయన చాలా మంచి వారు. అయితే కాస్త పిచ్చిలక్షణాలున్నాయి. తండ్రిగారిలో కూడ కొద్దిగా ఆ లక్షణాలే వుండేవట. అందుకనే చినబాబు గారిలో కూడ..."

"నోరుముయ్యి! పిచ్చి-గిచ్చి అని వాగకు. తండ్రిపిచ్చి వాడైతే కొడుకూ పిచ్చివాడడవడు. ఆయన పిచ్చివాడేమీ కాదు. బుద్ధిపూర్వకంగానే నన్నీవిధంగా బాధపెడుతున్నారు'

భర్త పిచ్చివాడనే విషయం ఒప్పుకోవడానికి ఆమెహృదయం చాలా బాధపడింది.

మూడు రోజులనుంచి కాశీనాథ్ అయిపు లేడు. అయినా రెండు రోజులవరకూ కమల బుద్ధిపూర్వకంగానే ఉపేక్షించి వూరుకున్నది. కాని మూడోనాడు గాబరాపడి 'ఇవాళ్టికి రెండురోజులనుండి బాబుగారు ఇంటికిరాకపోయినా మీరు కూడా ఏమీ కనుక్కున్నట్లేలేదు. మీరంతా ఎందుకున్నట్టు?' అని దర్వానుతో కచేరీలోకి కబురుచేసింది.

"బలేబాగుంది వ్యవహారం! ఎవరు ఎక్కడికి వెళ్తారో, వస్తారో ఇవన్నీ మేము చూస్తూకూర్చుంటామా" అనుకున్నాడు దర్వాను. తరువాత చిన్నబాబుగారు మూడువేల రూపాయిలు తీసుకొని వెళ్ళారనీ, ఎక్కడికి వెళ్ళారో తెలియదనీ షరాబు కబురుచేశాడు.

కమల కాస్సేపటివరకూ నెత్తిమీద చేతులుపెట్టుకొని అలాగే కూర్చున్నది. తరువాత తన తండ్రిగారి వకీలును పిలిపించి, "నా జమీా వ్యవహారాలు చూడటానికి యోగ్యుడైన ఒక మేనేజరును ఒక వారంలోపల కుదర్చండి. జీతమెంతైనా సరే" అని చెప్పింది.

# 8

కాశీనాథ్ కలకత్తాచేరి రోజంతా వర్షంలో తడుస్తూ మోకాలిబంటి నీటిలోనూ, బురదలోనూ నడిచి సాయంకాల మయ్యేసరికి ఎలాగో ఒక చిన్నగొందిలోని ఒక డాబాలోకి ప్రవేశించాడు. అతనిచేతిలో రెండుమందుసీసాలు, ఒకబిస్కట్ల డబ్బా, ఒకపెద్ద దానిమ్మపండూ ఇతరపళ్ళూ వున్నాయి.

ఆ యింట్లో ఒకగదిలో మంచంమీద ఒకరోగి పడుకొనివున్నాడు. తలవద్ద కూర్చున్న ఒకామె అతని నొసలు మీద చేత్తో నిమురుతూంది. కాశీనాథ్ లోపలికిరాగానే ఆమె—"కాశీబావా, ఇంతవర్షంలో తడుస్తూ ఎందుకొచ్చావు? కాస్సేపెక్కడయినా నిలబడకపోయ్యావ్రా?" అన్నది

"అదెలాగమ్మా? నేను ఆలస్యంచేస్తే కలిగేనష్టానికంటే తడిస్తే అధికం కలుగదులే"

బిందు ఆలోచించిచూస్తే కాశీబావ చెప్పినమాట అబద్ధం కాదనిపించింది. అందుకని ఇంకేమీ మాట్లాడకుండా వూరుకున్నది.

గత కొన్ని సంవత్సరాలుగా బిందు అనుభవించిన దుఃఖం ఆమెకే తెలుసు. మనం ఆమెను ఆమె పుట్టింటివద్దనే చూచాము. తరువాత మళ్ళీ చూడనేలేదు. ఇప్పు డామెను

గురించికూడ కొంత చెప్పాలి, ఆ రోజున జమీందారిగారి అమ్మాయిని చూద్దామనుకొని తయారైకూడ వెళ్ళడంపడక పోయిన మరునాడే ఆమె మామగారు - గోపాలబాబు పెద్ద జబ్బుపడ్డారని తెలిసి, వెంటనే అత్తవారింటికిరావలసివచ్చింది. ఆమెవచ్చి చూసేటప్పటికి ఆయన నిజంగానే చాలా జబ్బుగా వున్నారు. శాయశక్తులా చికిత్స చేయించారు కాని, ఆయన్ని బ్రతికించుకోలేకపోయారు; జబ్బు మరీ ఎక్కువయ్యాక గోపాలబాబు "ఒకసారి చిన్నకోడల్ని పిలుచుకురండి, ఆమె నొకసారి చూడాలనివుంది" అన్నాడు.

ఆ చిన్నకోడలు మన బిందువాసినే. రెండురోజులకు చనిపోతాడనగా గోపాలబాబు బిందుతో "అమ్మాయ్, ఈ తాళంచెవ్వి తీసికో, ఆ పెట్టెలో వున్నదంతా నీకేఇస్తున్నాను" అన్నాడు.

బిందు చెయ్యిజాచి దాన్ని తీసుకొన్నది. మిగతా కోడళ్లు "ముసలాడు చచ్చిపోతూ వున్నదంతా చిన్నకోడలికే ఇచ్చిపోయ." డనుకొన్నారు. మరో సంగతి, గోపాలబాబు జబ్బుస్థితిలోనే ఒకరోజున తన నలుగురు కొడుకుల్ని పిలిచి— 'చూడండి. మీలో మీకు ఐకమత్యంలేదు. మీ అమ్మ కూడ చనిపోయిందాయె. అందువల్ల నా అనంతరం మీ రంతా ఉమ్మడిగా వుండొద్దు. వ్యర్థంగా అనవసరపు తగాదా లాడుకొనేకంటే ముందే-ఇప్పుడున్న మంచితోనే - మర్యాదాగా వేరుపడండి. నేను మీకిచ్చిపోతున్న ఆస్తికి తోడుగా మరికొంత సంపాదించుకొంటూండేట్లయితే తేలిగ్గానే మీ అందరికీ గడచిపోతుంది" అని చెప్పాడు.

తండ్రి మరణానంతరం అన్నదమ్ములు నల్గురూ వేర్లుపడ్డారు. బిందుబిక రోజున ఆ పెట్టె తెరచిచూస్తే దాంట్లో ఒక 'రామాయణం' ఒక 'భారతం' మినహా ఇంకేమీ లేవు. ఆశ నిరాశగా పరిణమించినా బిందు స్వర్గస్తులైన మామ గారి దానాన్ని నెత్తిన పెట్టుకుంది. ఆమె అస్పష్టంగా. 'ఇది వారు వాత్సల్యంతో ఇచ్చినదానం, కనుక ఇవే మాకు రత్న మాణిక్యాలు!" అన్నది.

బిందుకు కొద్ది రోజులుమాత్రమే సుఖంగాగడిచాయి. కాని వెంటనే కష్టాలు ప్రారంభమయ్యాయి. ఆమె భర్త యోగేశబాబు జబ్బుపడ్డాడు. ఆమె తన ఆరోగ్యాన్నికూడా లెక్కచేయకుండా భర్తకు హృదయపూర్వకంగా సేవచేసింది. భూమి తాకట్టుపెట్టి చికిత్స చేయించింది. కాని ఏవిధంగానూ ఆయనకు నెమ్మదించలేదు. ఆ గ్రామంలోనేఇరుగుపొరుగు వాళ్లు కలకత్తా తీసుకెళ్లి చికిత్సచేయించమని సలహాఇచ్చారు! అప్పుడు బిందు తనదగ్గర ఇంకా మిగిలివున్న కాసిని నగలూ-నాణ్యాలూ అమ్మివేసి భర్తను కలకత్తా తీసుకువచ్చింది. ఇక్కడకూడ అనేకవిధాలైన చికిత్సలు చేయించింద. అందు. కోసం వున్న పొలంకాస్తా నెమ్మదినెమ్మదిగా తాకట్టుపాల యింది. కాని రోగం ఏమాత్రమూ తగ్గుముఖం పట్టనేలేదు. ధనాభావంచే మంచి వైద్యం చేయించడానిక్కూడా వీల్లే కుండావుంది. బిందు తన పెద్దబావగారికి స్థితిగతులన్నీ విన రంగా తెల్పింది. కానిఫలితమేమీకనపడలేదు.ఆయనజవాబే ఇవ్వలేదు. తరువాత మిగతా బావలిద్దరికీ వ్రాసింది. వారూ పెద్దన్నగారినే ఆదర్శంగాపెట్టుకొని మూర్తీభవించారు. ఇక

ఉపవాసాలైనా చెయ్యాలి, లేకపోతే విషంతినైనాచావాల్సిన స్థితివచ్చిందని తలచింది బిందు.

భార్య మొహంచూసే యోగేశబాబు అంతా గ్రహిస్తూండేవాడు. ఒకనాడు ఆయన బిందుని తన ప్రక్కనకూర్చోబెట్టుకొని, అత్యంతవాత్సల్యంతో చెయ్యిపట్టుకొని-'బిందూ! నన్ను మనవూరు తీసుకువెళ్ళు. చావకతప్పనప్పుడు అక్కడే చస్తాం. ఇక్కడచస్తే పారేసేవాళ్ళుకూడా దొరుకరు' అన్నాడు. బిందుకు ఇంక మరణమే గత్యంతర మనిపించింది. భర్తను స్వగ్రామానికి తీసుకువెళ్దామన్నా దారిలేనప్పుడు మరో వుపాయ మేమున్నది? కాని భర్త నీస్థితిలో విడిచిపెట్టి ఆమె ఎలా చావగలదు? మరి చావక తప్పనప్పుడు సిగ్గుపడిమాత్రం ఏం ప్రయోజనం? చాలాసేపు పూర్వాపరాలు ఆలోచించిన మీదట సిగ్గువిడచి, ఆమె కాశీనాథ్‌కు తన పరిస్థితినంతా వివరిస్తూ ఒక ఉత్తరం వ్రాసింది. అనంతరవిషయం మీకు తెలిసినదే.

వచ్చేటప్పుడు కాశీనాథ్ చాలినంతడబ్బుతీసుకొచ్చాడు. ఆ డబ్బుతో అతను పట్టణంలో పేరుమోసిన పెద్ద పెద్ద డాక్టర్లందరికి చూపించి కనుక్కుంటే, వారంతా ఏకకంఠంతో గాలిమార్పువల్లగాని రోగం తగ్గుముఖంపట్టి విశ్రాంతి చిక్కదని చెప్పారు. కాశీనాథ్ అందరినీ తీసికొని వైద్యనాథ్ చేరుకొన్నాడు. అక్కడ రెండుమాసాలుండి చూచేటప్పటికి అందరికీ ఈసారి యోగేశబాబు బ్రతికిపోయ్యాడనిపించింది. ఐనా అక్కడినుంచి బయలుదేరడానికి మరికొన్ని రోజులు వ్యవధి వుండటంవల్ల వాళ్ళనక్కడేవుంచి కాశీనాథ్ ఇంటికివచ్చేశాడు.

ఉదయాన్నే కమలచూసి 'ఎప్పుడు వచ్చా'రని అడిగింది.

"రాత్రి"

కమలతనపనిమీద వెళ్ళిపోయింది. కాశీనాథ్ బయటికి వచ్చి కచ్చేరీలోకి వెళ్ళాడు. చాలారోజులతర్వాత అకస్మాత్తుగా చిన్నబాబుగార్ని చూసేటప్పటికి గుమాస్తాలూ, పనివాళ్ళూ అంతా లేచి నుంచున్నారు. కేవలం ఒక్క సూటూ బాటూ ధరించిన యువకుడు మాత్రం తనపనిలో లీనమైయుండి లేచినిలబడలేదు. కుర్చీలో కూర్చునేవున్నాడు. ఒక ఆగంతుకుని చూచి అతనికితక్రింది ఉద్యోగులు చూపిన గౌరవం బహుశ ఆ కొత్తబాబు చూచివుండకపోవొచ్చు. కాశీనాథ్ స్వయంగానే ఒక 'ఈజీచైర్' లాక్కొని కూర్చున్నాడు. క్రొత్తగావచ్చిన మేనేజరుపేరు విజయకిశోరదాసు. కలకత్తాలో బి. ఏ. ప్యాసయ్యాడు. కాయ్యదక్షుడు. కాబట్టే వకీలు వినోదబాబు ఈయన్ను మేనేజరుగా నియమించాడు. మేనేజరు చాలాసేపటికి కాశీనాథ్ వైపు చూచి 'తమ రేదైనా పనిమీద వచ్చారా?' అని అడిగాడు.

"పనేమీలేదు. ఊరికే ఆఫీసుపనెలావుందో చూద్దామని వచ్చాను."

అప్పుడు దివానులేచి "వీరు మన బాబుగారి అల్లుడుగారు" అని చెప్పాడు.

అంతట విజయబాబు లేచి సగౌరవంగా మాట్లాడనారంభించాడు. ఇంతలో నౌకరువచ్చి 'అమ్మగారు మిమ్మల్నిపిలుస్తున్నా'రని చెప్పాడు.

విజయబాబు వెళ్ళిపోయినతర్వాత కాశీనాథ్ దివానుని 'ఆయనెవరు' అని అడిగాడు.

"క్రొత్త మేనేజరు"

"ఎవరు నియమించారు?"

"అమ్మాయిగారు"

"ఎందుకు?"

"బహుశ పనులు సరిగా జరుగుతూండడం లేదని కావచ్చు"

కాశీనాథ్ ఇంకేమీ అడగకుండానే లోపలికి వెళ్ళిపోయాడు. లోపల ఒకగదిలో పరదాముందు విజయబాబు నిలబడివున్నాడు. పర్దా వెనుకనుంచి ఎవరో మృదుకంఠంతో మాట్లాడుతున్నారు. వాళ్ళు ఎవరినిగురించి మాట్లాడుతున్నారో కాశీనాథ్ గ్రహించాడు. కాని ఏమీ జోక్యం కల్పించుకోకుండా, అటువైపు చూడకుండా తనదారిని తాను వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నంమళ్ళీకమలను కలుసుకోవటంతటస్థించింది.

కమల గంభీరంగా 'కులాసాగా వుందా?' అన్నది. కాశీనాథ్ కూడ అలాగే తలఊపుతూ "ఆ బాగానేవుంది" అన్నాడు.

కమల ఇంకేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయింది. నిలబడి మాట్లాడటానికిగాని, కబుర్లు చెప్పుకోవటానికిగాని ఆమెకిప్పుడు బొత్తిగా తీరికే లేకుండావుంది. లక్షపనులాయె. ముఖ్యంగా జమీా వ్యవహారాలు తానే స్వయంగా చూస్తూండడంవల్ల ఊపిరిపీల్చే తీరికకూడా లేకుండావుంది.

ఒకనాటి ఉదయాన కాశీనాథ్ మేనేజరుకు రమ్మని

కబురుచేశారు. మేనేజరు "ఇప్పుడు తీరికలేదు. అవకాశం చిక్కగానే వస్తా" నని నౌకరుతో జవాబుపంపాడు. అప్పుడు కాశీనాథ్ స్వయంగానే ఆఫీసుకువెళ్ళి మేనేజరును అవతలికి పిల్చి—"మీకు తీరికలేకపోవడంవల్ల నేనే వచ్చాను. ఇవాళ నాకు ఐదువందల రూపాయలు కావాలి. తీరిక కాగానే పైకి పంపండి" అన్నాడు.

"ఎందుకోసం ?"

"అది మీకు అనవసరం"

"అవును, అనవసరమని అంగీకరిస్తాను. కాని యజమాని అనుమతిలేనిదే నే నెలా ఇవ్వగలను?"

కాశీనాథ్ వ్యవహారం మారిపోయిందని గ్రహించాడు. "నేను చెబితే సరిపోదూ, మరొకరి అనుమతికూడ కావాలా ఏమిటి?" అన్నాడు.

విజయబాబు "అవును అవసరమే. ఎవరికిపడితేవాళ్ళకి డబ్బు యివ్వవద్దనిఆజ్ఞ" అన్నాడు గట్టిగా.

కాశీనాథ్ కనులనుకలుసుకొని "నువ్వుఆ క్రొత్తమనిషిని తీసివేసేయ్" అని చెప్పాడు.

"ఎవర్ని?"

"నీ క్రొత్త మేనేజరుగా వుంటున్నాడే, అతన్ని".

"ఎందుకని? అత నేం అపరాధంచేశాడు?"

"నాతో మర్యాదగా ప్రవర్తించలేదు."

"ఏంచేశాడు?"

"నేను కబురుచేస్తే స్వయంగా రాకుండా "ఇప్పుడు

తీరికలేదు. తీరికైనప్పుడు వస్తా'నని నాకరుతో కబురంపాడు."

కమల నవ్వుతూ, 'తీరికలేకపోయివుండవచ్చు తీరిక లేనిదే ఎలా వస్తాడు?" అన్నది.

కాశీనాథ్ భార్య ముఖంవంకచూస్తూ "సరే, తీరిక లేకపోవడంవల్లే రాలేదని ఒప్పుకుంటాను, కాని నేను స్వయంగా వెళ్ళి డబ్బు అడిగితే యజమానిఆజ్ఞలేనిదే ఇవ్వనంటాడా?' అన్నాడు.

కమల మరీ నవ్వుతూ "ఎంతడబ్బు అడిగారేమిటి?" అన్నది.

"ఐదు వందలు"

'ఇవ్వలేదా?'

"లేదు, నాకు డబ్బివ్వవద్దని నువ్వు చెప్పావా?"

'అవును, ఈ విధంగా డబ్బు పాడుచెయ్యడం నాకిష్టంలేదు."

కాశీనాథ్ కి—పాషాణంలాంటివాడైనప్పటికీ-మర్మాంతికమైన బాధకలిగింది. ఇలాంటి వ్యవహారంగాని, ఇట్టి మాటలుగాని ఇంతకుముందెప్పుడూ వినలేదు. అత్యంత దుఃఖితుడయి-"నాకు డబ్బివ్వడం పాడుచెయ్యడమా?" అన్నాడు.

"ఏరకంగానైతేనేం, ఖర్చుపెట్టడం, పాడుచేయడమే"

"అవసరానికి ఖర్చుపెట్టడం పాడుచెయ్యడంకాదే"

'ఏమిటా అవసరం?'

"ఒకరికి వ్వాలి"

"ఇవ్వాల్సిందే, కాని డబ్బెక్కడిది? మీ దగ్గరుంటే తీసుకెళ్ళి ఇవ్వండి; నేను వద్దనను"

కాశీనాథ్ ఊరుకున్నాడు. ఈ మాట లతనిచెవుల్లో అగ్నిశూలాల్లాగా దూరినవి. బయటకువచ్చేసి తన గడియారం, ఉంగరాలూ వగైరా అమ్మి, ఐదువందల రూపాయలూ బందుకు మనియార్డరుచేసి, క్రింద – "ఇక నన్ను అడగవద్దమ్మా! ఇంక నావద్ద ఏమీలేదు" అని వ్రాశాడు.

ఆనాటినుండి కాశీనాథ్ లోపలకిపోలేదు. కమలకూడ ఏమీ పట్టించుకోలేదు. ఈవిధంగానే కొన్నాళ్ళు గడచిపోయాయి. ఒకరోజున నౌకరువచ్చి ఒకబ్రాహ్మణుడుమాట్లాడాలంటున్నాడని చెప్పాడు.

మరుక్షణమే ఒక వృద్ధబ్రాహ్మణుడు చేతిలోజంధ్యం పట్టుకొని దగ్గరకువచ్చి నిలబడి – "తమరు మహానుభావులు. బ్రాహ్మణుని జీవనోపాధిని పోగొట్టకండి బాబూ" అని మొరపెట్టుకుంటూంటే కాశీనాథ్‌కు ఆశ్చర్యమేసింది.

కాశీనాథ్ భయపడుతూ – "ఏం జరిగిందో చెప్పండి" అన్నాడు.

"తమకు దేవుడు చాలా ఇచ్చాడు. కాని నాకాకొద్ది భూమీ తప్ప వేరే ఆధారంలేదు. అదికాస్తా లాక్కోకండి" అంటూ బ్రాహ్మణుడు ఏడ్వసాగాడు.

కాశీనాథ్ వ్యాకులచిత్తుడై బ్రాహ్మణుని చెయ్యిపట్టుకొని తనదగ్గర కూర్చోబెట్టుకొని విషయమంతా స్పష్టంగా అర్థమయ్యేటట్లు చెప్పమన్నాడు. బ్రాహ్మణుడు ఏడుస్తూ.

"తమరు ధర్మాత్ములు. క్షేత్రపాలభూమి నాదికాదని ఒక్కసారి చెప్పండి" అన్నాడు.

"అది తమదికాదని ఎవరన్నారు?"

"ఇంకెవరు? తమ క్రొత్త మేనేజరు విజయబాబుగారు- నామీంద దావా ఎందుకు వేశారు?"

"దావా వేశారా? నాకు తెలియదే?"

బ్రాహ్మణుడు సమన్లు చూపించి "వ్యాజ్యమేశారు. కనుక, నేనూ వదలిపెట్టేదిలేదు. తమర్నే సాక్ష్యం వేసుకొంటాను, నేను పేదవాణ్ణి. తమతో వ్యాజ్యమాడటంనాకుతగదు. అయినా ఏంచేస్తాను! బిచ్చగాడినయ్యే ముందు చేతనైనంత వరకూ ఎదిరించకుండా వదల్ను"

బ్రాహ్మణుడు కోపంతో లేచిపోతూంటే కాశీనాథ్ ఆయన్ని చెయ్యిపట్టుకుని కూర్చోబెట్టి - 'మీకు మేలుజరిగేటట్లే ప్రయత్నిస్తాను. తరువాత మీఇష్టంవచ్చినట్లుచేయండి" అన్నాడు.

కాశీనాథ్ బ్రాహ్మణుని పంపివేసినతరువాతవిజయబాబును పిలిచి — "ఆ భూమి మనది కాదుగదా! ఆ బ్రాహ్మణ్ణి అనవసరంగా ఎందుకు బాధించటం?" అని అడిగాడు.

"అమ్మగారి ఆజ్ఞ"

కాశీనాథు కోపంతో - "యజమానురాలు ఇతరుల దాన్ని కాజెయ్యమని నేర్పిందా?" అన్నాడు.

"అది మనభూమే"

"కాదు, మనదికాదు"

విజయబాబు కొంచెంసేపు మాట్లాడకుండాఊరుకొని-

'నేను నౌకరునుమాత్రమే, చెయ్యమన్నట్టే చేశాను. అలాగే చేస్తాను కూడాను' అన్నాడు.

ఈవిషయం కమలతో చెప్పడానికి కాశీనాఫ్ సిగ్గు పడ్డాడు. అయినా అతను కమలతో — 'ఆభూమి నీదికాదు. బ్రాహ్మణుని జీవనాధారం లాక్కోవద్దు' అనిచెప్పాడు.

"లాక్కుంటున్నానని ఎవరుచెప్పారు?"

"ఎవరైనా చెప్పనీ, ఆ భూమి నీదికాదు. విజయబాబుని ఈ తప్పుడువ్యాజ్యం ఎత్తివేసుకోమని చెప్పు."

కమల అయిష్టంగా— "విజయబాబు వ్యవహారదక్షత కలవాడు, ఆయనకు తనకర్తవ్యం తెలుసు. మీ రాయన పనిలో జోక్యంకల్పించుకోవాల్సిన అవసరంలేదు" అన్నది.

కొన్నిరోజులకు ఆ వ్యాజ్యం కోర్టులో విచారణకు వచ్చింది. కాశీనాఫ్ బోనులో నిలబడి— 'నేను స్వర్గస్థులైన నా మామ ప్రియబాబుగారున్నప్పటినుంచి జమీ వ్యవహారాలు చూస్తూన్నాను. వారి మరణానంతరంకూడ చాల రోజులవరకూ నేనే ఆవ్యవహారాలు చక్కబెడుతూండేవాణ్ణి. ఆ భూమి కమలాదేవిదికాదనిమాత్రంనాకు తెలుసుఅన్నాడు.

విజయబాబు కేసులోఓడిపోయి మొహంమాడ్చుకొని ఇంటికి తిరిగివచ్చాడు. ప్రతివాది రెండుచేతులూయెత్తి కాశీనాథుని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

## 9

పరదాముందు నిలిబడి విజయబాబు వ్యాజ్యాన్నిగురించి పూర్తివివరాలు తెలియజేసి ఆఖరుకు తన అభిప్రాయం

చెబుతూ—'చిన్నబాబుగారివల్లే మనంవ్యాజ్యంఓడిపోయాము' అన్నాడు. పరదా వెనుకనుంచి ఇది విని కమలపదింతల మనిషయ్యింది. చాలసేపటికి —'మీరు లోపలికిరండి. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి' అన్నది. విజయబాబు లోపలికి వెళ్ళాడు. చాలాసేపటివరకూ వారేదో మెల్ల మెల్లగా మాట్లాడుకొన్నారు. తరువాత విజయబాబు బయటికి వచ్చేశాడు.

చాలారోజుల కివాళ కమల కాశీనాథ్ భోంచేసేటప్పుడు దగ్గరకువచ్చి కూర్చుంది. ఇప్పుడామె ఇదివరకటివలె ఉగ్రమూర్తి కాలేదు, పూర్తిశాంతమూర్తి. కాస్సేపయ్యాక—'కుటుంబవిద్రోహి విభీషణునికారణంగా బంగారులంకభస్మీపటలమై పోయింది, తెలుసా?' అన్నది

అన్నంతింటూనే కాశీనాథ్—"తెలుసు'అన్నాడు.

"ఎందుకు తెలియదు; అతనూ ఇతరులమెతుకులవల్లేగా మనిషి అయింది!"

కాశీనాథుడు జవాబివ్వలేదు.

కమల కొంచెంసేపూరకుండి మళ్లీ "-అందుకనే మొదటి నుంచీ ఇతరులతిండితో పెరిగి పెద్దవాడైనవాడికీ— ఇప్పటికీ ఇతరులు పెట్టకపోతే లంకణాలువుండవలసివచ్చే మనిషికి సత్యమే చెప్పాలన్న నిక్కెందుకా, ఇంతఅహంకారం దేన్ని చూచుకొనా? అనే ఆలోచిస్తున్నాను" అన్నది.

కాశీనాథుడు మాట్లాడకుండా ఒక్కొక్క ముద్దే తింటున్నాడు.

"కసాయివాడుకూడ తాను తినబోయేదానిమెడ నరకటానికి సంకోచిస్తాడు."

"కమలా!"

"భార్యతిండిమీద బ్రతికేవాడికి ఇంత జోరు శోభించదు. రోజురోజుకూ నీవ్యవహారం చూస్తున్నకొద్దీ-బాగుండదనిగాని లేకపోతే? -"

కాశీనాథుడునవ్వుతూ-"ఇంట్లోనుండి వెళ్ళగొట్టేదానివికదూ?' అన్నాడు.

"అవును, అంతే"

సగంతిన్నపళ్ళాన్ని ప్రక్కకునెట్టేసి, కాశీనాథుడు కమలవంక తదేకదృష్టితోచూస్తూ-"కమలా! ఇంతకుముందు నీమీద ఎప్పుడూ కోపగించలేదు. నిన్నెన్నడూ దేన్ని గురించీ కటువైనమాటకూడ అనలేదు. ఇవ్వాళ నన్ను నువ్వన్నట్లుఇంతకుక్రిత మెవ్వరూఅనలేదుకూడాను. ఇవ్వాళ్టినుండి ఇకనుంచి నీతిండి నేనుతినను. దీనివల్లే నువ్వు సుఖపడగలిగినట్లైతే సుఖపడు!" అని కాశీనాథుడు లేచినిలబడ్డాడు. కమలకూడా లేచినిలబడి అహంకారంతో "మీరు నిజంగా నేమాటతప్పనివారైతే, వ్యక్తిత్వముంటే మీప్రతిజ్ఞనిలబెట్టుకోండి'' అన్నది.

"తప్పకుండా నిలబెట్టుకొంటాను. కాని ఇవ్వాళ నీవన్నమాటే నీకు చిరశత్రువుగా పరిణమిస్తుంది. నేను నిన్ను క్షమించాను. కాని, భగవంతుడు నిన్ను క్షమిస్తాడా!"

కమల మండిపడుతూ-'మీశాపం నన్నేమీ చెరుపలేదు" అన్నది.

"అట్లే జరుగుగాక! నేను నిన్ను శపించలేదని దేవుడికి తెలుసు. అయినా ధర్మమార్గానువర్తినివై సుఖంగా వుండాలని ఆశీర్వదిస్తున్నాను."

బయటికివచ్చి కాశీనాథుడు వ్యాకరణ, సాహిత్య, వేదాంత గ్రంథాలు. స్మృతులు-అన్నిటిని చించిపారవేశాడు. నౌకర్లనుపిల్చి తనకున్న సామానంతా అందరికీ పంచిపెట్టేశాడు. ఆరాత్రి గదితలుపుతట్టుతూ "కమలా!" అనిపిలిచాడు

కమల మేల్కొనేవున్నది కాని, మాట్లాడలేదు. గడియవేసివుండనందున కాశీనాథుడుతట్టగానే తెరచుకోవటంతో లోపలికి వెళ్ళాడు. కమల మంచంమీద కళ్ళుమూసుకుని పడుకొనివుంది. దగ్గరకూర్చొని, తలమీదచెయ్యివేసి నిమురుతూ మరొకసారి "కమలా!" అని పిలిచాడు. కాని కమల పలుకలేదు. 'వెళ్ళేటప్పుడు నిన్నాశీర్వదించి పోతున్నాను?" అని కాశీనాథుడు మెదలకుండా బయటికి వెళ్ళిపోయాడు.

కాశీనాథు వెళ్ళిపోయినతర్వాత కమల ప్రక్కమీద నుంచి లేచి, కిటికీవద్దకు వెళ్ళి కూర్చుంది. అలా కూర్చుని వుండగానే తెల్లవారిపోతుండడంచూసి, పోయి పక్కమీద పడుకున్నది. మెలకువ వచ్చేటప్పటికి చాలా ప్రొద్దెక్కింది. ఇల్లంతా గందరగోళంగావుంది. ఇంకా పూర్తిగా తెలివిరాక ముందే దాసి పరుగెత్తుకుంటూవచ్చి "కొంపమునిగింది అమ్మగారూ! చినబాబుగారిని ఎవరో ఖూనీచేశారు!"అని అరచింది.

సలసల కాగుతున్న నూనెకళాయి గుమ్మరిస్తే ఆనూనె పడినవా రెట్లు గిలగిల కొట్టుకుంటారో, కమలకూడా అలాగే

గిలగిల్లాడుతూ క్రిందికి దిగివచ్చి—"హత్యచేశారా?" అన్నది.

"అవును చంపేసారు" అని ఎవరో జవాబిచ్చారు.

అస్తవ్యస్తంగావున్న గుడ్డలతోనే కమల బయటగది లోకివచ్చి చూచేటప్పటికి నెత్తురులో మునిగిపోయి, అచేతనావస్థలో కాశీనాథ్ ఒకసోఫామీద పడివున్నాడు. శరీరమంతటా దుమ్ముతో, నెత్తురుమయమైవుంది. ముక్కు, నోరు, కళ్ళనుండి కారినరక్తం ఎక్కడికక్కడ గడ్డకట్టిపోయింది. కమల ఒక్క గావుకేకపెట్టి, స్పృహతప్పి పడిపోయింది.

"రాత్రి జమీందారుగారి అల్లుడు ఒంటరిగా వెళ్తూంటే ఎవరో హత్యచేశా"రని ఊరంతా ప్రాకిపోయింది.

రెండురోజులకు కాశీనాథ్‌కు స్పృహ వచ్చినతర్వాత "బాబూ! మిమ్మల్ని ఈవిధంగా కొట్టినదెవరో ఎరుగుదురా?" అని పోలీసు ఇన్‌స్పెక్టరు అడిగాడు.

కాశీనాథ్ చెయ్యిపైకిచూపిస్తూ— 'ఆయన' అన్నాడు.

"మీరు వాళ్ళని గుర్తించలేకపోయారా?" అనిఇన్‌స్పెక్టరు మళ్ళీఅడిగాడు.

"గుర్తించాను" కాశీనాథ్ అస్పష్టంగా అన్నాడు.

ఇన్‌స్పెక్టరు ఆదుర్దాగా "ఎవరువాళ్ళు?"అన్నాడు.

కాశీనాథ్ కొంచెంసేపు మౌనంగావుండి 'నేనే తప్పు చెప్పాను. వాళ్ళను నేను గుర్తించలేదు' అన్నాడు.

ఇన్‌స్పెక్టరు మరిరెండుమూడుప్రశ్నలు అడిగాడుకాని ప్రయోజనమేమీ కన్పించలేదు. కాశీనాథు మరోమాట చెప్పనేలేదు. మరునాడు గుమస్తానుపిలిచి 'వైద్యనాథ్‌లో

మా బిందువాసిని ఉన్నది. ఆమె నొకసారి చూడాలనివుంది. ఎవరినైనా పంపి, పిలిపించండి! అని చెప్పాడు.

మూడో నాటికి బిందువాసిని, ఆమె భర్త యోగేశ బాబు వచ్చారు. బిందు కాస్త గట్టిగుండెగలది. ఆమె కమలవలె అరవనూలేదు. మూర్ఛపోనూలేదు. కేవలం కన్నీళ్ళు తుడుచుకొంటూ గద్గదస్వరంతో 'ఎవరు బావా! ఇంతఘాతుకం చేసింది?' అన్నది.

"ఎలా తెలుస్తుంది?"

"ఎవరిమీదైనా అనుమానం వుందా?"

ఆవిషయం అడుగవద్దమ్మా !"

బిందు మాట్లాడకుండా కాశీనాథ్ మొహంకేసిచూస్తూ వుండిపోయింది.

కాశీనాథ్ ఇంత పెద్ద దెబ్బతిని, బ్రతుకజాలడని అందరికీ తెలుసు. మృత్యువుకూడ క్రమంగా సమీపించసాగింది. ఆ రాత్రి బాగా ప్రొద్దుపోయినతర్వాత జ్వరతీవ్రతలో కాశీనాథ్ కొట్టుకుంటూ—"ఏం కమలా! ఈ పనిచేసింది నువ్వు కాదుగదా?" అని ప్రలాపించాడు.

బిందు బావ మొహందగ్గర మొహంపెట్టి"ఏమిటిబావా నువ్వనేది?" అనడిగింది.

కాశీనాథ్ బిందును కమలేననుకొని, ఆమె మెడకు చేతులు పెనవేసి—"చచ్చిపోయినాకూడ నాకు శాంతివుండదు. కమలా! ఈపనినీవల్ల జరుగలేదనిఒక్కసారిచెప్పు, ఒక్కసారి?" అని దీనంగా అన్నాడు.

# 10

కమల అప్పుడప్పుడూ స్మృతివస్తూ మళ్ళీస్పృహ తప్పుతూ రెండుమూడురోజులవరకూ అలాగే పడివుంది. ఆమెగురించి డాక్టర్లక్కూడ చాలా సందేహంగావున్నది. వారు చెప్పిన ప్రకారం అందరూ అతి జాగ్రత్తగా ఆమెను కనిపెట్టుకొని వున్నారు. రెండురోజులనుంచీ ఎంతో జాగ్రత్తవహించి, సేవా శుశ్రూషలు చేస్తూండడంవల్ల ఆమె కివ్వాళ స్మృతి వచ్చించి. ఆమెను లేవదీసి కూర్చోబెట్టారు.

కళ్ళు తెరచి చూచేటప్పటికి ఒడిలో తన తలపెట్టుకొని కూర్చున్న అపరిచిత స్త్రీని చూచి 'మీరెవరు?'అని అడిగింది.

"నేను బిందును. నీ భర్త మరదల్ని" అంది అపరిచిత.

కమల చాలా సేపటివరకూ ఆమెముఖంవంక చూస్తూండి చివరకు చేసైగతో గదిలోవున్న వారినందరినీ బయటికి వెళ్ళ మన్నని చెప్పి, నెమ్మదిగా—'నే నిలా ఎంతసేపటినుండి పడివున్నాను అక్కా?' అన్నది.

"మొన్న ఉదయం మూర్ఛపోయావు అక్కా! అప్పట్నుంచీ నీకు స్పృహ రానేలేదు" అన్నది బిందు.

"మొన్ననా!" అని త్రుళ్ళిపడింది కమల. తరువాత తలవాంచుకొని స్తబ్ధురాలై కూర్చుండిపోయింది. చాలసేపటి వరకు ఆమె శరీరంలో ఎటువంటికదలికా లేకపోయేటప్పటికి బిందు ఆందోళనతో కమలకుడిచేతిని తనచేతిలోకితీసుకుంటూ "అక్కా!" అని పిలిచింది.

కమల తలెత్తకుండానే—'భయపడకు అక్కా, నాకక మూర్ఛరాదు' అన్నది.

ఆమె లోలోపలే స్పృహకల్గివుండేందుకు ప్రయత్నిస్తున్నదని బిందు గ్రహించింది. బిందు ఇంకేమీ మాట్లాడకుండా ధైర్యాల చిక్కబట్టుకొని కూర్చుంది. అలాగే మరి కొంతసేపువుండి కమల—'ఇలా రెండురోజులనుంచి నన్ను పట్టుకు కూర్చున్నావే, నాకు సేవ చెయ్యాలని ఎందుకనిపించింది నీకు అక్కా! నేనైతే ఇలా చెయ్యలేను' అన్నది.

బిందు ఆమెమాటల్ని సరిగా అర్థంచేసుకోలేకపోయింది. 'ఎందుకనిపించదు? నువ్వు పరాయిదానివా నాకు? మనకు పరిచయంలేకపోయినా కాశీబావ నాకెంతో నువ్వూ అంతేగా. బావకు సేవచేసినట్లే నీకూచేయడం నా ధర్మం. అక్కా! నీకు తెలియదుగాని, నే ఇక్కడికి వచ్చినతరువాత ఈ రెండు రోజులూ ఎలాగడిచాయో భగవంతుడికే తెలుసు. ఒకసారి బావగదిలోకి వెళ్ళితే, ఇంకొకసారి నీ గదిలోకి. బావదగ్గరకు వెళితే నీ కెలావున్నదోనని మనస్సు కొట్టుకుంటుంది. నీ దగ్గరకువస్తే బావకు ఎలా వుందోనని గాబరా కలుగుతుంది. ఇవ్వాళ సాయంత్రంనుండి బావస్థితి కొంచెం నయం. ఆయన సుఖంగా పడుకొనివుండటం చూసి, నీ దగ్గర కాస్త స్థిమితంగా కూచోగలిగాను. ఆ స్థితిలో బావ బ్రతుకుతాడని ఎవరికీ నమ్మకమే లేదు' అన్నది బిందు.

"బతికారా?" అని ఆత్రుతగా అడిగింది కమల.

"ఎందుకు బ్రతకరు? ఇంక భయపడనక్కరలేదని డాక్టరుగారు చెప్పారు. జ్వరంకూడా తగ్గిపోయింది" అన్నది బిందు.

కమలముఖంలో కాంతిరేఖ ఒక్కసారి తళుక్కున మెరిసి క్షణంలో మాయమై పీనుగుకళ వ్యాపించింది. ఒక్కసారి

నౌకర్లను నియోగించి తాము బయటనుండి మంచిచెడ్డలు కనుక్కోవటమే వీరి పద్ధతేమోనని తలచింది.

"సరేగాని అక్కా! బావకు స్మృతివచ్చాక నన్ను గురించి ఏమైనా అడిగారా?" అని అకస్మాత్తుగా ప్రశ్నించింది కమల.

"ఒకసారి అడిగారు" అని ఊరుకున్నది బిందు. కమల ఇంకేమీ ప్రశ్నించకుండా బిందే ఏమైనా చెబుతుందేమోనని ఆమెముఖంకేసి కుతూహలంతో చూడసాగింది.

"స్మృతివచ్చాక బావ నీవేననుకొని నామెళ్ళో చేతులు వేసి, ఒకసారి బిగ్గరగా—'చెప్పు కమలా! ఈ పని నువ్వు చెయ్యలేదుకద! చనిపోయినతర్వాతకూడా నాకు శాంతివుండదు; ఈ పని నీవల్ల జరుగలేదని చెప్పు" అన్నాడు అని చెప్పింది బిందు.

"తరువాత?" ఊపిరి బిగబట్టుతూ అడిగింది కమల.

"నాకు తెలియదు అక్కా! ఆయన అలా ఎందుకు అడిగారో" అన్నది బిందు.

"నాకు తెలుసు, ఆయన ఏం తెలుసుకోగోరుతున్నారో" అంటూ కమల ఒక్కసారిగా లేచి, తిన్నగా కూర్చున్నది.

బిందు కమలచెయ్యి పట్టుకొని "నువ్వా గదిలోకి పోవద్దు అక్కా!" అన్నది.

"ఏం? ఎందుకని వెళ్ళకూడదు?"

"నువు వెళ్తే హానికలుగవచ్చని డాక్టరుగారు వద్దన్నారు."

"నా హానిని నాకంటే డాక్టరుగారు అర్థంచేసికోలే నే నాయనదగ్గరకు వెళ్తున్నాను. నిద్ర మేల్కొన్న

"బావా, నువ్వు నన్నడిగిన ప్రశ్నకు జవాబిద్దామనే అక్కయ్య నీదగ్గరకు వచ్చింది" అన్నది బిందు.

కాశీనాథ్ పాలిపోయిన పెదవులపై చిరునవ్వు తొంగి చూచింది. 'ఇప్పుడింకెవ్వరూ ఏ జవాబు ఇవ్వనక్కరలేదు బిందూ! రెండురోజులనుండి మూర్ఛితురాలై వున్నప్పుడే నా ప్రశ్నకు జవాబులభించింది' అంటూ కాశీనాథ్ ఎడమచేతిపై ఆనుకొని లేచి కూర్చున్నాడు. కుడిచేత్తో కమలముఖాన్ని పైకెత్తడానికి ప్రయత్నిస్తూ 'కమలా!' అని సంబోధించాడు.

కమలమాటాడకుండా అదేవిధంగా అతని పాదముల మధ్య తలదాచుకొని పడివున్నది. ఆమె కళ్ళనుండి అశ్రుధార ప్రవహించుతూనే వున్నది.

"నువ్వు లేవవద్దు బావా! డాక్టరుగారు గట్టిగా చెప్పి వెళ్ళారు—'మళ్ళీఏదైనాజరిగితే...' బిందువ్యాకులస్వరంతో అన్నది.

"డాక్టరు ఏమైనా చెప్పనీ అమ్మాయ్! మీరికభయపడనక్కరలేదని నేను చెబుతున్నానుగా. నన్నీ క్లిష్టస్థితినుండి రక్షించారుమీరు" అన్నాడు కాశీనాథ్ చిరునవ్వునవ్వుతూ.

తరువాత కాశీనాథ్ కమల చెదరిన జుట్టును సరిచేస్తూ కాస్సేపటికి నిద్రపోయాడు.